జయింపలే యపుడు బ్రహ్మ శంకరుని బ్రార్థించి యతనిని నారాయణునికి భక్తుడుగాఁ జేసెను. అపుడు నారాయణుఁడు చెప్పెను— "ఎవఁడు నీకు భక్తుఁడో, వాఁడు నాకుఁగూడ భక్తుఁడు ఎవఁడు నిన్నెఱుఁగునో, వాఁడు నన్నుఁగూడ నెఱిగిననాఁడు నీకు నాకు నావంతయు భేదములేదు. నీ శూల ప్రహారచిహ్నము నావక్షస్థలమునందుఁ జిహ్నితమై యున్నది. కనుక నందఱు నన్ను శ్రీవత్సుఁడందురు; మఱియు నాహస్త చిహ్నము నీకంఠమున నంకితమైయున్నది. కాఁబట్టి యందఱు నిన్ను శ్రీకంఠుఁడందురు" ఈప్రకారము పాంచరాత్రమతమునుగూడ సౌతి శివవిష్ణువుల నైక్యము వైపునకు మ్రొగ్గునట్లు చేసెను.

సౌతి మహాభారతమున భీష్మపర్వము ( అధ్యాయము 23 ) నందు దేవీస్తుతికి నవకాశమిచ్చెను. యథార్థమున నీస్తుతి యిక్కడ లేకున్న బాగుండును. దీనికిఁ గారణమేనఁగా, యద్ధోత్సుకుఁడైన యర్జునునికి దుర్గాదేవి యుద్ధమునందు నీకు జయమగునని వరమిచ్చినపుడు తరువాత భగవద్గీతకుఁ బ్రసంగమే యుండదు అప్పుడర్జునుని మనసునందు "యద్వా జయేమ యదివా నోజయేయుః" అని శంకయే కలుగక యుండును. శ్రీకృష్ణుని యాజ్ఞవల్లనే యీదుర్గాస్తుతి యితరత్రకూడ నగపడుచున్నది, స్కందుని స్తుతిప్రశంసల భాగమును సౌతి వనపర్వమునమంచెను. ఈప్రకారముగా వేరువేరైన యుపాస్య దేవతలకు నొక గ్రంథమునందే విరోధరహితమైన స్థానముల నిచ్చి సౌతిసనాతనధర్మైక్యమునకుఁ బ్రశంసనీయమగుకార్యమును జేసెను. దీనితో పాటు భిన్నభిన్నములైన మతములను మోక్షమార్గములను గూడ నొకటిగాఁ జేయుటకు యత్నముపయుతము సౌతికిఁ జేయవలసి యుండెను. ఆ సమయమున భిన్నభిన్నోపాసనలతోఁగూడ భిన్నభిన్న తత్త్వజ్ఞానములకును బ్రచారమగుచుండెను. ఈవిషయములగుఱించి యేగ్రంథము లిపుడు ప్రమాణములుగా నెంచబడుచున్నవో యవి యాసమయమున లేకుండెను. ఈ విషయము మునుపుచర్చింపబడినది. ఆవిషయముల యుపదేశము మఱి యితరగ్రంథముల ద్వారా ముఖతఃచేయబడుచుండెననియు, వాటియందు బరస్పరవిరోధములు కూడ జాలవృద్ధినొంది యుండెననియు నిస్సందేహముగా జెప్పవచ్చును. సౌతి కీవిరోధమును నశింపజేయుట యావశ్యకమయ్యెను. ఈవిధముగా వేదాంతము, సాంఖ్యము, యోగము, పాంచరాత్రము, పాశుపతము, మొదలగు ననేకమతముల నేకము చేయుట

యతనికి నావశ్యకమయ్యెను. భగవద్గీత మూలభారతములోనిదా? లేక సౌతి వృద్ధిచేసినదా? యను ప్రశ్నమిచ్చట మిక్కిలి మహత్త్వముకలది. తుట్టతుదకు రెండు గ్రంథములలోనిది లేక భారతమహాభారతములలోనిది; ఇంతియేకాక, ఇద్దలు గ్రంథకారులది లేక వ్యాసవైశంపాయనులది యట్లే సౌతిది యనికూడ నవశ్య మెంచవలయునని సిద్ధించియున్నది. అయినను భగవద్గీతాసంబంధమైన ప్రశ్న మెటులనున్నది యటులనేయున్నది ఆలోచింపగా భగవద్గీత మూలభారతములోనిదే దానిని సౌతినుండి యేస్థానము నుండియు దీనికొనివచ్చి మహాభారతమునందుదూర్చి యుండలేదు. ఈ విషయము విస్తరించి తుదిని వివేచింపబడును. పాంచరాత్ర పాశుపతములు రెండిటియొక్క ప్రచారము గీతాసమయమునలేదు. ఆసమయమున వేదాంతము, సాంఖ్యము, యోగము, నీమూడుతత్త్వజ్ఞానములు ప్రసిద్ధములై యుండెను. వీనిదైక్యమునకు భగవద్గీత యత్నించియుండెను. ఆ ప్రయత్నమును సౌతి తన సమయమున నెక్కువగా రక్షించెను. పై రెండు క్రొత్తమతములలోని యభిప్రాయముల నతడు తన ప్రయత్నమునం గలిపి వైచెను. ఇందుకొఱకు సౌతి మహాభారతమున జాల నుపాఖ్యానములను, ప్రకరణములను జేర్చెను. మునుపుప్రసిద్ధములైన వేదాంతము, సాంఖ్యము, యోగము నీమూడుమతములయొక్క యావిష్కరణము లనువానియున్నతి ననుసరించి, యతడు తనగ్రంథమున జేసెను. ఇటువంటి ప్రయత్నమునకు మచ్చు 'అనుగీత'యై యున్నది. ఇది సౌతి నిర్మించిన క్రొత్తప్రకరణము. ఇది కాక సాంఖ్యము, యోగము, వేదాంతము నీ మూడుమతములలోని యభిప్రాయములనుసవిస్తరముగా బ్రతిపాదించు ననేకాధ్యాయములు ప్రతిచోట విశేషించి శాంతిపర్వమందు, నగుపడుచున్నవి. పూర్వోక్తాను సారముగాం బాంచరాత్రమున నారాయణీయోపాఖ్యానముతోంగలిపి యావిష్కరించెను. మహాభారతమునం బాశుపతమతమును సౌతి విస్తరించి ప్రకటింపకుండుట యాశ్చర్యకరముగానున్నది. ఈమతమాసమయమునం బ్రచలితమై యుండెననుటకు సందేహము లేదు. దానిని స్పష్టముగా నుచ్చరించికూడ నుండెను. సౌతి మహాభారతకాలమునం బ్రచలితములైన మతముల నీ ప్రకారముగాం జెప్పెను.

> సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా
> జ్ఞానాన్యేతాని రాజర్షే విద్ధి నానామతానివై ॥

ఉమాపతి ర్భూతపతిః శ్రీకంఠో బ్రహ్మణః సుతః
ఉక్తవా నిదమవ్యగ్రో జ్ఞానం పాశుపతం శివః
పాంచరాత్రస్య కృత్స్నస్య వేత్తాతు భగవాన్స్వయమ్॥
(శాంతి, అధ్యా. 349. 64-68)

ఈ ప్రకారముగాఁ బాశుపత పాంచరాత్రములను రెండు భిన్న మతములను మహాభారతమందు స్పష్టమైనరీతినుచ్చరించెను, కాని సౌతి తరువాత నివన్నియు నొక్క నారాయణునే యుపాసించుమార్గములని చెప్పెను.

సర్వేషుచ నృపశ్రేష్ఠ జ్ఞానేష్వేతేషు దృశ్యతే
యథాగమం యథాజ్ఞానం నిష్ఠా నారాయణః ప్రభుః॥

అనగా ఓనృపశ్రేష్ఠుఁడా, విచారింపగా నిన్నిభిన్నభిన్న పథము లున్నవి. అయినను నివియన్నిట నొకవిషయము సమానముగాఁ గనుపట్టుచున్నది. అదేయనగా నీమతము లన్నిటియందు నాగమజ్ఞానముల రెండిటిననుసరించి యేపరమగతి నిశ్చయింపబడ్డదో, యది ప్రభువగునారాయణుడే"

సాంఖ్యము, యోగములోనగు భిన్నభిన్న తత్త్వజ్ఞానములయందు నేవిరోధముండెనో, దానిని రూపుమాపి యీయన్నిమతములయందు సౌతి యొక్కమహాభారత మేకత్వము నెట్లు స్థాపించెనో, యీ విషయము నిచ్చట విస్తరించి చర్చింపవలసిన యావశ్యకత లేదు. ముందునకుఁబోయి యీ విషయము సవిస్తరముగా వర్ణింపఁబడును. సనాతనధర్మమునకు నింకను నావశ్యకములైన యంగములుకూడ నున్నవి; ఏవియనగా యజ్ఞము, యాగము, తీర్థము, ఉపవాసము, వ్రతము, దానము, మొదలగునవి. వీనినిగూడ విస్తరించి మహాభారతమునఁ బ్రతిచోట సౌతివర్ణించియుండెను. ఈవర్ణనవిశేషించి యనుశాసనపర్వమందు నగుపడుచున్నది హింసావిషయము యజ్ఞసంబంధమున మిక్కిలి మహత్త్వముకలది. సనాతనధర్మావలంబులయందు బౌద్ధులకు బూర్వమునుండియు, యజ్ఞములయందు బశువధముచేయదగునా? తగదా? యను విషయమున వాద ప్రతివాదములు జరుగుచుండెను. వైదిక మతాభిమానులు పశువధ మావశ్యకమని తలఁచుచుండిరి. సౌతి రెండు మతములను గౌరవించి మహాభారతమున వానికిస్థానమిచ్చెను. ఈవిషయమై యతండొక సంపూర్ణమైన యధ్యాయమేకలిపెను. యుధిష్ఠిరుని యశ్వమేధ యజ్ఞమును సంపూర్ణముగా వర్ణించినపుడు దానియందు జేయబడిన హింసయొక్కవర్ణన సర్వసాధారణముగాఁ గొంత యనిష్టముగ దోఁచియుండుననుట సంభవము.

"అనేక దేవతల నుద్దేశించి యనేక పశుపక్షులు స్తంభమునఁ గట్టఁబడెను; ఉత్కృష్టము ముఖ్యము నగునశ్వరత్నముగాక మూడువందలు పశువులు యజ్ఞస్తంభమునఁగట్టబడియుండెను" ఇత్యాదివర్ణన వినియహింసామతవాదులైన లోకులకు నేవకలిగియుండును. ఇందుముంగిసయొక్క కథ చెప్పఁబడియున్నది. దానియుద్దేశము హింసాయుక్తమైన యశ్వమేధమును నిందించుటయే. ఒకఋషిధాన్యపుగింజలుకొన్ని భోజనమునకు నేఱుకొనియుండెను. అవి యతిథియైన యొు విప్రునికిదానముచేసి తాను ప్రాణత్యాగముచేసెను. ముంగి చెప్పెను— "ఆ సక్తుప్రస్థుని యజ్ఞమున నా తల సువర్ణమయ్యెను. నా మిగిలినయంగము యధిష్ఠిరయజ్ఞమున సువర్ణమయమగునో కాదోయని యిపుడు తెలిసికొనుటకు నేనిచ్చటగూడ నిటుఁ దొర్లితిని." అని కాని దాని శరీరముబంగారపుదికాలేదు, కాబట్టి తుదిని యజ్ఞసమాప్తి సమయమున నయ్యది యజ్ఞమును నిందించెను. ఈ కథవలనఁ బ్రత్యక్షముగా యజ్ఞము హింసాయుక్తము కావలయునా లేక కాఁగూడదా యనుప్రశ్నము బయలుదేఱుచున్నది. వైశంపాయనుడు వసువుయొక్క శాపకథను వినిచెననియు, ఋషులహింసాయుక్తమైన యజ్ఞముయొక్క పక్షమునే స్వీకరించిరనియు, తరువాత వర్ణింపబడినది. (అ. 90) దీనితరువాత యధ్యాయమందు నగస్త్యుని యజ్ఞకథయున్నది. ఇందు, బీజములనుండియే యజ్ఞము జరుగుచుండెడి దనియు నింద్రుఁడు క్రోధమువలన వర్షములు కురియకుండ జేసినయపుడు, తనసామర్థ్యముచేత బీజములఁ బుట్టింతునని యగస్త్యుడు ప్రతినపట్టియుండెననియు జెప్పఁబడియున్నది. దీనిబట్టి పై నకులాఖ్యానాధ్యాయములు రెండును మూలభారతమునకు బిమ్మటివి యగునని స్పష్టమగుచున్నది. భారతకాలమున నహింసా పక్షమింత ప్రబలముగా లేదు. తరువాత క్రమముగా నీపక్షము ప్రబలము కానారంభించెను. అప్పుడీకథలు తయారై యుండెను. సౌతి వానిని దనమహాభారతమందు గలిపియుండును. ఈపక్షము బహుధా దక్షిణదిశది యైయుండును. ఎందుచేతననఁగా నగస్త్యుడు దక్షిణదిక్కునందలి ఋషియైయున్నాడు. కాని యీకథలవలనవైదికహింసయందునభిమానము గల పక్షమునకుఁ గ్రోధమువచ్చెను. ఇందుచేత సౌతి నకులము చేసిననింద క్రోధునకు శాప మున్న కారణమున నాస్వరూపమునఁ గ్రోధునిచేతఁ జేయఁబడినదని యంతిమాధ్యాయమునందుఁ జేర్చెను. సారాంశము, ఇందు రెండుపక్షముల వర్ణనయుఁ జేయబడినది. అయినను నిర్ణయమేమియు నగు

పడదు. సౌతి రెండు పక్షములకు నొడంబడిక చేయుటకై యత్నించెనని తెలియుచున్నది.

(2) కథాసంగ్రహము.

మహాభారతమును విస్తరించుటయందు సౌతియొక్క రెండవ యుద్దేశము కథలను సంగ్రహించుటగా నగుపడుచున్నది. అనేకులైన రాజుల యొక్కయు, ఋషుల యొక్కయు నేకథలు లోకులయందు లేక చిన్న గాథలయందు నిటునటు చిమ్మఁబడియుండెనో యవన్నిటి నేదేనొక స్థానమున సంగ్రహించుట యావశ్యకమైయుండెను. ఈకథలచేత సనాతన ధర్మమున కొకవిధమైన యుత్తేజనము ప్రాప్తింపఁగలదియైయుండెను. ఇదిగాక, ప్రాచీనములైన చారిత్రికవిషయముల నొకచోటఁ జేర్చి సనాతనధర్మావలంబులైన పూర్వులకు నభిమానమును బురికొల్పుటకూడ నావశ్యకమైయుండెను. భారతీయ కథావిషయమునఁ గూడఁ జాల భిన్నభిన్న విషయములు తరువాతఁ బ్రచలితములై యుండుననుట సంభవము. ఈ విషయముల నన్నిటి నొకచోఁ జేర్చి మహాభారతమునఁ బ్రచలితములైయున్న సమస్త కథలకు నొక పెద్ద భాండాగారముగాఁ జేయుటకు బ్రయత్నించెను. బౌద్ధులును జైనులును భారతఖండమునందుఁ బ్రాచీన ప్రసిద్ధ పురుషులయొక్క కథలను దమతమ ధర్మముయొక్క స్వరూపమునందుఁగలుపుటకు నే ప్రయత్నము చేసియుండిరో దానిని సౌతి తన మహాభారతకథలద్వారా చక్కగా వాటుంకపఱిచెను. ఈవిధముగా నేయాఖ్యానములను నేయుపాఖ్యానములను సౌతి మహాభారతమునఁ గలిపెనో వానినన్నిటిని వేర్వేఱుగా నెన్నికచేసి యిచ్చుటఁ జెప్పుట కఠినమైన కృత్యము, అవియన్నియుఁ గ్రొత్తగారచింపఁబడి యుండునని చెప్పఁజాలము. ఈ కథలన్నియుఁ బ్రాచీనములై యున్నవి. ఆ సమయము నందలి జనులు వాని నంతకుఁబూర్వమునుండియు, నెఱుఁగుదురు. అంతేకాక, రాష్ట్రీయభావముతోఁగూడ వానికి గాఢమైన సంబంధముండెను. కనుక మహాభారతమువంటి రాష్ట్రీయగ్రంథమునందు నయ్యవి సంగ్రహింపఁబడుట మిగుల నావశ్యకము. ఇటువంటికథలకుఁగొన్ని యుదాహరణములు క్రింద నీయఁబడుచున్నవి.

(1) షోడశ రాజీయోపాఖ్యానము ద్రోణపర్వమునన్నది. ఇది తెలిసిన ప్రాచీనాఖ్యానము, దీనియొక్క మూలస్వరూపము శతపథబ్రాహ్మణమున నగుపడుచున్నది. ఆర్యావర్తమునందు నశ్వమేధము చేసిన ప్రసిద్ధుల

పేరు లిందు నీయఁబడియున్నవి. ఉత్సాహాకరమైన వారి వర్ణనకూడ నిందుఁ జేయఁబడినది. ఈయాఖ్యానము మూలభారతమునందుఁగూడ నుండుననుట సంభవము కాని యిది పిమ్మట సౌతిచేత శతపథయిలనుండి కైకొని చేర్పఁబడియుండునని యధికమైన యూహ కలుగుచున్నది.

(2) రామాయణములోని సంపూర్ణకథ వనపర్వమునందు రామోపాఖ్యానమునను న్నది. నిస్సందేహముగా నిది సౌతిచేతఁ గలుపఁబడినది. ఎందు చేతననఁగా, ఇంత పెద్దయుపాఖ్యానము మూలభారతము నందుండుట సంభవముకాదు. ఈ యుపాఖ్యానమును జదివినయెడల నిందు నేదో మఱియొక ప్రసిద్ధగ్రంథముయొక్క సంక్షిప్తస్వరూప మీయఁబడెనని స్పష్టముగాఁ దెలియుచున్నది మహాభారతమున స్పష్టముగా వాల్మీకియొక్క యుచ్చారణ మఱియొకచోట నగుపడుచున్నది; కాని యది యే గ్రంథముయొక్క సంక్షిప్తస్వరూపమో యాగ్రంథము వర్తమాన వాల్మీకిరామాయణము కాదు, ఇఁక నేమంటే, దానికంటె మునుపటి దానియొక్క మూలస్వరూపమగు నని నిశ్చయ పూర్వకముగాఁ జెప్పఁబడఁగలదు. ఇందుల కొక్కింత కారణ మిందుఁ జెప్పఁగలము. వర్తమాన వాల్మీకి రామాయణముయొక్క సమయము క్రీస్తుశకమునకుఁ బూర్వము మొదటి శతాబ్దియనియు, మహాభారతముయొక్క సమయము శకమునకుఁ బూర్వము మూఁడవశతాబ్దియని యు మునుపు చెప్పియుంటిమి. ఇది గాక యీయుపాఖ్యానములోనున్న ప్రమాణములవల్లఁ గూడ నీ విషయము సిద్ధమగుచున్నది. కాలము గడచిన కొలఁది, యే కథాభాగమునందును నధికాధికములు నసంభవములు నగు పుక్కిటిపురాణములు ప్రవేశించుటకు మొదలిడునను విషయము లోకులందఱి యూహకును రాఁగలదు. కథాభాగమునం దలౌకిక చమత్కారములు తక్కువగా నుండుటయే యది ప్రాచీన మగుటకు సాధారణ ప్రమాణముగా నెంచవచ్చును. ఈ దృష్టివలనఁ జూచినయెడల రామోపాఖ్యానములోని కథాభాగమునందు వర్తమానరామాయణ కథాభాగము కంటె నలౌకిక చమత్కారములు తక్కువగా నున్నవి. ఉదాహరణము లేవియనఁగా:— (1) శ్రీరామచంద్రుని జన్మమునకు ఋష్యశృంగునిచేఁ జేయఁబడిన పుత్రేష్టియొక్క వర్ణన యా యుపాఖ్యానమునందు లేదు. (2) రావణునికిఁ గుబేరునికిఁగల సంబంధము మఱియొక రీతిగాఁ జెప్పఁబడినది. ఈయాఖ్యానమునందు దుందుభి యనెడు గంధర్వస్త్రీ మంథరయయ్యె నని చెప్పఁబడినది; కాని రామాయణమునం దీవిషయము

లేకుండుట యాశ్చర్యముగానున్నది, జటాయువుయొక్క కలయిక యందలి వర్ణన సరళము భిన్నమునగు శైలితోనున్నది. (3) శ్రీరామచంద్రుఁడు సముద్రతీరమున దర్భాసనముమీఁదఁ గూర్చుండి సముద్రుని ధ్యానించినపుడు, సముద్రునియొక్క కలయిక స్వప్నమునందుఁ గలిగెను, ప్రత్యక్షముగాఁ గాలేదు. (4) లక్ష్మణునికి శక్తి తగులుటయు, హనుమంతుఁడు ద్రోణగిరికిఁ జనుటయు నీయాఖ్యానమందుఁ జెప్పఁబడలేదు. (5) కుంభకర్ణుని లక్ష్మణుఁడు చంపెను. (6) ఇంద్రజిత్తుని గూడ నతఁడు చంపియున్నాఁడు, కాని, యాయింద్రజిత్తునియొక్క యదృశ్యమైన రథముమాట, అనఁగా రథప్రాప్తికొఱకుఁ గుంభియజ్ఞమునకుఁ జనినకథ యీ యాఖ్యానమున లేదు. ఇక్కడ నన్నిటికన్న నధికమైన మహత్త్వముగల విషయ మేమనఁగా రాముఁడు రావణుని బ్రహ్మాస్త్రముచేతఁ జంపెను; రావణుని మస్తకములు తెగి మాటిమాటికిఁ బుట్టుచుండెననియు, రావణుని గళమున నమృతకలశముండె ననియు, నిందు వర్ణింపఁబడలేదు. అగుఁగాక, ఇందుఁ గొలఁది విషయభేదము కలదు; కాని వనపర్వము లోని రామోపాఖ్యానము మూలభారతము లోనిదికాదు, దానినిసౌతి మూలవాల్మీకి రామాయణము నుండి కైకొనియె ననియే పై కథనమునకు, తాత్పర్యము.

(8) శల్యపర్వము నందున్న సరస్వత్యాఖ్యానము స్పష్టముగా సౌతికలిపినదే. ఆఖ్యానములోని వర్ణన యిట్లున్నది. భీమదుర్యోధను లిరువురు యుద్ధసన్నద్ధులైరి, భారతీయ యుద్ధముయొక్క యత్యంత మహత్త్వముగల యంతిమదృశ్య మారంభమగుచున్నది. ఇంతలో సరస్వతీ యాత్రనుండి మఱలి బలరాముఁడచ్చటికి వచ్చెను. గదాయుద్ధముయొక్కవర్ణన యొకవైపున దటస్థించియుండెను. అయినను జనమేజయుని ప్రశ్నముమీఁద వైశంపాయనుఁడు సరస్వతీనదియొక్క మహత్త్వమును, యాత్రను వర్ణింపనారంభించెను. దీనికిఁ గొలఁదిపాటి స్థానమిచ్చి యూరకొనలేదు. యుద్ధవర్ణనా సమయమునఁ జేయఁబడిన యీ విషయాంతరమునందు నించుమించుగా 19 అధ్యాయములు (35 నుండి 54 వఱకు) కలుపఁబడినవి. ఇందు రెండుమూఁడుపకథలుకూడ వచ్చియున్నవి. ఇచ్చట స్కందాభిషేకము తారకాసురయుద్ధమును వర్ణింపఁబడినవి. ఇందు సౌతిక సరస్వత్యుపాఖ్యాన మావశ్యకమైయుండు ననుట సంభవము. ఎందుచేత ననఁగా ఏ సరస్వతియొక్క మహిమము ప్రాచీనకాలము నుండియు భారతవర్షమునఁ జాలఁ బ్రసిద్ధికెక్కెనో దానియొక్క వర్ణన మహాభారత

మున నెక్కడనో యవశ్యముగాఁ గావలసియుండెను. కాని స్థానమును బ్రసంగమునుబట్టి చూచినచో నీయుపాఖ్యానము నిచ్చటఁ జేర్చుటవలన సౌతి కృతార్థుఁడుకాలేదు.

(4) విశ్వామిత్రుఁడు బ్రాహ్మణుఁడైన యాఖ్యానము.

(5) సౌతి మొదటఁ జేర్చిన పౌష్యాఖ్యానము, పౌలోమాఖ్యానము కూడ నిదేవిధముగానున్నవి. ఇవి మిగులఁ బ్రాచీనములైన పుక్కిటి పురాణములలోని విషయములు. వీనిని సంగ్రహించు దృష్టితో సౌతి తన గ్రంథమునఁ బ్రవేశపెట్టెను.

(6) నలదమయంతుల యాఖ్యాన మార్యులయొక్క పుక్కిటి పురాణములయందు నత్యంత మనోహరమైన యొక యాఖ్యానము. ఈ యాఖ్యానము మూలభారతములోనిది యైనదియు లేక కానిది యు నిశ్చయింపఁజాలము; దీనియొక్క దైర్ఘ్యమునందు ధ్యానముంచినచో, నిది మూలభారతములోనిది కాదని తోఁచుచున్నది. ఈ యాఖ్యానమునందు వర్ణితమైన కథయొక్క సౌందర్యమును మనోహరత్వమును సరసత్వమును గమనించితిమేని యది వ్యాసమహాకవి కృతమే యని చెప్పవలసియున్నది. ఈకథ మునుపు చిన్నదైయుండునని కూడఁ జెప్పుటకు శక్యముకాదు. ఇందు మర్యాద, శక్యత, సంబంధము వీనికి దూరమైన వర్ణన యేదియుఁ జూడఁబడదు. ఈదృష్టిచేత నీకథ మూలభారతములోనిది కావచ్చునని యే తోఁచుచున్నది. ఈస్థితియే సావిత్ర్యాఖ్యానమునకుఁ గలదు. ఈయత్యంత ప్రాచీనమైన యాఖ్యానము మూలభారతములోనిదై యుండును. ఇది యంతపెద్దదిగాఁ గూడ లేదు. నలదమయంతుల కథవలె నీకథ నయితము మోహకమును మిక్కిలి నీతిపోషకమునై యున్నది. ఈ రెండాఖ్యానములఁ గూర్చి యేమియు నిర్ణయముగాఁ జెప్పఁజాలము. ఈ రెండాఖ్యానములు రాష్ట్రీయము లనుటకు సందేహములేదు.

ఈ క్తవివేచనవలన భారతేతిహాసము కన్న వేఱుగా నేపుక్కిటి పురాణములు ప్రసిద్ధములై యుండెనో వానిని మహాభారతమునఁ గలుపుటకు సౌతి యత్నించె నని ప్రకటమగును. ఈవిధముగానే వ్యాసవైశంపాయనుల సమయము నొద్దలిడి సౌతిసమయము దనుక, భారతీయేతిహాసమును సంబంధించి యేపుక్కిటి పురాణములు ప్రబద్ధములై యుండెనో,

వానికిఁ గూడ నీ గ్రంథమున స్థానమిచ్చుట యావశ్యకమై యుండెను. ఈ కథ లన్నిటిని సౌతి యచ్చటచ్చటఁ గలిపి యుండెను. ఇవి యాధారముగాఁ జేసికొని యతఁడు తన గ్రంథమున భారతీయకథను రచించెను. ఇటువంటి కథ లేవియో యిపుడు విచారింపఁబడును. (1) ఆస్తీకుని కథ యిట్టిదే యథార్థమున నాగులు మనుష్యజాతివారే యయియుందురను విషయము ప్రతివివేచకుని ధ్యానమునకును రాఁగలదు; కాని కాలపరివర్తనమున లోకుల కల్పనలయందు నయ్యవి ప్రత్యక్షముగా నాగములు లేక సర్పములు అనునర్థము కలిగెను. పరీక్షిత్తుని జరిపిన తక్షకుఁ డొకమనుష్యుఁడై యుండును, జనమేజయుఁడు చేసిన సర్పసత్రమున నిజముగా సర్పముల యొక్క సత్రము కాదు, కాని నాగజాతిమనుష్యులను సంహరించుటకుఁ జేసిన ప్రయత్నమై యుండెను. కాని యెప్పు డొకమారు సర్పసంబంధము కల్పన వ్యాపించెనో, యప్పుడు దానిని త్యజించుట సంభవము కాదయ్యెను. కాఁబట్టి వర్తమానోపాఖ్యానము వలనఁ దక్షకుని, సురక్షితుఁడైన యితర నాగులను నాస్తీకుఁ డెట్లు రక్షించెనో, యీవిషయము దృష్టమగుచున్నది. అంశావతారవర్ణన కథయు నిటువంటిదే. ఈ యితిహాసము వలనఁ దెలియుచుండెను. అందఱు ప్రాచీనులయందును జారిత్రికమైన ప్రతివ్యక్తియు నేదో యొక దేవతయొక్క యవతారము లేక పుత్రుఁ డను కల్పన వ్యాపించియుండె నని గుర్తింపఁబడుచున్నది. ఈ కల్పన ననుసరించియే మహాభారతమందుఁగూడ భారతీయ వీరపురుషుల యొక్క యుత్పత్తి చెప్పఁబడినది. ఆదిపర్వమున 64, 66 అధ్యాయములు రెండిటియందున సౌతి ప్రసిద్ధాభిప్రాయముల ననుసరించి యంశావతారమును వర్ణించెను. మూలగ్రంథమునం దక్కడక్కడ దీనికి విరుద్ధముగాఁ గూడ కొన్ని యగపడుచున్నవి. దీనిఁబట్టి యీ యంశావతార కల్పన నూతనమని తెలియుచున్నది. (3) ద్రౌపది యైదుగురు పతులను వివాహమాడెనన్న కథయు నిటువంటిదే. దానిని సమర్థించుటకుఁ బ్రాచీనసమయమున వేలువేలు కథలు ప్రచలితములై యుండును. ఈకథ లన్నిటిని దన గ్రంథమునఁ జెప్పుట యావశ్యక మని సౌతికిఁ దోఁచియుండును. ఈపుక్కిటి పురాణము లన్నిటికిని ద్రౌపది స్వర్గలక్ష్మియొక్క యంశావతారమను కల్పనయే (4) దుర్యోధన విషయమునఁ గొన్ని చమత్కార కథలు వ్యాపించుట యసంభవము కాదు. చిత్రరథుఁడు దుర్యోధనుని బట్టుకొని తీసికొని పోయెను. ఈకథ [illegible] ... దుర్యోధనుఁడు విడుదలగా

వచ్చెనో, యపుడతఁడు ప్రాయోపవేశము గావింప నారంభించె ననియు, గృత్య యతనిఁ బాతాళలోకమునకుఁ గొనిపోయె ననియుఁ జేసిన కల్పన కొంచెము విలక్షణముగా నగపడుచున్నది. (వనపర్వము అధ్యా. 241 మఱియు 250.) (5) దుర్వాస ఋషి పాండవులను బాధపెట్టినట్లు ఉన్న కథ కూడ తరువాత రచింపఁబడినదే. మఱి దానికి సౌతి మహాభారతములో స్థానమిచ్చెను. (అధ్యా. 261) 6 "నేనీ యీపనిచేయుదును. ఈ రీతిగా చనిపోదును" అని యుద్ధసమయములో సేనాపతి మొదటనే చెప్పుట ఆశ్చర్యకరము గాఁదోఁచుచున్నది. ఈ విధముగా యుద్ధమునకు సంబంధించిన పరాక్రమవర్ణన అతియోక్తితో గూర్చఁబడినది. ఉదాహరణకు;—భీముఁడు ద్రోణుని రథమును ఏడుసార్లు ఎత్తి త్రోచివైచెను" అను కల్పన తరువాతనే చేయఁబడినదని తెలియుచున్నది. అర్జునుని రథమునకు సంబంధించిన కల్పనకూడ తరువాతనే చేయఁబడినది. "శ్రీకృష్ణుఁడు అర్జునుని దివ్యరథమునుండి క్రిందకు దిగగానే అది మండి భస్మమైపోయెను" అన్న పుక్కిటికథ నిజముగా చమత్కారకారియె. ఏలయనఁగా శ్రీకృష్ణుఁడు ప్రతిరోజు రథమునుండి దిగుచునే యున్నాఁడుగదా. ఇటువంటి చమత్కారము గల కథలు మహాభారతములో చాలగానున్నవి. "ఈ కథ లన్నిటికి మూలమేది మఱి సౌతికాలమునాటికి ఎటువంటి క్రొత్త కథలు వాడుకలో నున్నవి" అను సంగతిని నిర్ణయించుట కష్టము—

(3) జ్ఞాన సంగ్రహము.

మహాభారతములోని పుక్కిటి కథల సంగ్రహము వలెనే అన్ని విధములైన జ్ఞానముల సంగ్రహము కూడ ఈ గ్రంథములోఁ జేయుట సౌతి యొక్క యుద్దేశమైనట్లు స్పష్టముగాఁ గనఁబడుచున్నది. రాజనీతి, ధర్మశాస్త్రము, తత్త్వజ్ఞానము, భూగోళము, జ్యోతిషము మొదలగు శాస్త్ర విషయములు గూడ ఒకేచోట చేయవలెనను ఉద్దేశాలు అతనికి గలవనుటలో సందేహము లేదు. ఉదాహరణకు— భూగోళమునకు సంబంధించిన జ్ఞానము, భారతవర్షములోని వేఱువేఱు దేశములను గుఱించి నదులను గుఱించిన జ్ఞానము భీష్మపర్వము మొదట తెలుపఁబడినది. కౌరవులు పాండవులు ఈ భూమికై పోరాడుచున్నారని తెలిసినపుడు "ఈ భూమి ఎంత పెద్దది ఈ సమస్త భూలోక మెటువంటిది" అని ధృతరాష్ట్రుఁడు సంజయుని అడిగెను. నిజముగా ఈ ప్రశ్నయే విచిత్రమైనది. యుద్ధమునకు సంబంధించిన సంగతు

లను చర్చించక ధృతరాష్ట్రుఁడు వేఱే యింకొక సంగతులు తెలిసికొనఁ గోరుట ఆశ్చర్యకరముగాదా?

భూగోళమునకు సంబంధించిన జ్ఞానము ఎక్కడో అక్కడ తెలుపుట అవసరమని తలచి సౌతి దానిని ఇక్కడె కలిపెను. ఇక్కడ పూర్వాపరసంబంధము విడిపోయినది. పండ్రెండవ అధ్యాయము చివర ధృతరాష్ట్రుఁడు సంజయుడు పరస్పరము సంభాషించకొందురు. కాని తరువాతి అధ్యాయము మొదటనే సంజయుఁడు కంగారుపడుచు యుద్ధము నుండి మరలివచ్చి భీష్ముడు పడగొట్టఁబడిన సంగతి వినిపించినట్లు గలదు. కాని సంజయుఁడు యుద్ధభూమి కెప్పుడు వెళ్లెను అనుసంగతిజాడ ఏమియు లేదు. రెండవ యుదాహరణము "కచ్చిత్" అనునధ్యాయమునకు సంబంధించినది. యుధిష్ఠిరుఁడు సభలోఁ గూర్చుండియుండెను. అక్కడికి నారద మహాముని వచ్చి రాజ్యపు ఏర్పాటులను గుఱించి కొన్ని ప్రశ్నలు యుధిష్ఠిరుని నడిగెను. అవి యేవనఁగా— "నీవు సైనికులకు సరియైన సమయములో జీతము లిచ్చుచున్నావా లేదా? ప్రతిదినము ఉదయము లేచి రాజ్యము లో ఆదాయవ్యయములుచూచుచున్నావా లేదా? అని నారదుఁడు యుధిష్ఠిరుని పరీక్షించుచున్నట్లు ఈ ప్రశ్నలఁబట్టి తెలియుచున్నది. ఈ యధ్యాయములో ఉత్తమరాజ్యమునకు సంబంధించిన నియమము లన్నియు చాల మార్మికతతో ఒకేచోటఁ గూర్చఁబడియున్నవి. ఇట్లే జ్యోతిషమును గుఱించిన సంగతులు వనపర్వములోను శాంతిపర్వములోను చెప్పఁబడినవి. ఇక్కడ ఇటువంటి సంగతులు కేమీ ఆవశ్యకతయున్నట్లు చెప్పలేము. భీముఁడు హనుమంతుని గలిసికొన్నప్పుడు నాలుగు యుగములకు సంబంధించిన సంగతులను అడిగినపుడు హనుమంతుఁడు వానిని వర్ణించిచెప్పెను. సాంఖ్యయోగముల తత్త్వజ్ఞానముల మతములు ప్రతిచోట వర్ణింపఁబడినవి. ఇంకను విశేషముగా శాంతిపర్వములో విస్తారముగా మాటిమాటికి వర్ణింపఁబడెను. వక్తృత్వశాస్త్రమునకు (Rehitoric) సంబంధించిన తత్త్వములు [illegible] సంవాదములో చెప్పఁబడెను. అవి నిజముగా మనోరంజకమైనవి. న్యాయశాస్త్రమునకు సంబంధించిన కొన్ని నియమములు ఈ సంవాదములో [illegible]నవి. సారాంశము - సౌతి తన గ్రంథములో అనేక శాస్త్రముల విషయములను ఒకచోట [illegible]టకు ప్రయత్నము చేసెను

## (4) ధర్మమునకు నీతికి సంబంధించిన శిక్షణ

సౌతి మహాభారతములో సనాతన ధర్మమును పూర్తిగా తెలుపుటకు ప్రయత్నము చేసెను. ఎట్లనఁగా మేమిదివఱకే జెప్పితిమి. ఈ కారణము చేతనే మహాభారతము ఒక ధర్మశాస్త్రమో స్మృతియో యగునని అంగీకరించబడుచున్నది. ఇందులో అక్కడక్కడ సనాతన ధర్మములోని ముఖ్యతత్త్వములు చెప్పఁబడినవి. ఇవి విస్తారముగా అనుశాసన శాంతి పర్వములలో కనిపించును. ఇతరమగుచోట్లఁగూడ ఇవి చర్చింపబడెను. ఉదాహరణకు— ఆదిపర్వములో ఏ ఉత్తరయయాతికథ కలదో అది (అధ్యా. 86-93) తరువాత సౌతి కలిపెను. దీనిలోని పద్యములు పెద్ద వృత్తములును సమస్తమైన యాఖ్యానములును ముఖ్యకథతో సంబంధము గలవిగావు. కాని దీనిలో సనాతన ధర్మతత్త్వములు సంక్షేపముగను మార్మికరీతిగను వర్ణింపఁబడెను. కనుక నీ యాఖ్యానములు అభ్యసింపఁదగినవి. నీతితత్త్వములుగూడ అక్కడ బోధింపఁబడినవి. దీని కుదాహరణము విదురనీతి. ఉద్యోగపర్వము (అధ్యా. 32-39) లో విదురుని సంభాషణలు పూర్వాపర కథతో ఎక్కువ సంబంధము గలవిగాలేవు. అయినను విదురనీతిలోని యధ్యాయములు చాల మార్మికములై వ్యవహార చాతుర్యముతో నిండియున్నవి. సారాంశము, ధర్మమునకు నీతికి సంబంధించిన యుపదేశములు మాటిమాటికి చాలచోట్ల చేయఁబడినవి కనుక ఈ గ్రంథమునకు ఎక్కువ మహత్త్వము ప్రాప్తించినది.

## (5) కవిత్వము

మహాభారతము కేవలము ఇతిహాసమునకు ధర్మమునకు సంబంధించిన గ్రంథమేగాదు, అదియొక యుత్తమమహాకావ్యము సంస్కృతకవులందరు వ్యాసమహర్షికి ఆదికవి వాల్మీకికవితో సమానమైన స్థానమును ఇచ్చిన సంగతి ప్రసిద్ధమే, వ్యాసులవారి భారతములోని రసమయకవిత్వస్ఫూర్తిచే ప్రేరితుడై సౌతికూడ తనరచనాశక్తిని ప్రకటించుటకు చాలమంచి ప్రసంగములను సహాయముగాఁ దీసికొన్నాడు సృష్టివర్ణన యుద్ధవర్ణనలు కరుణారసప్రసంగములు ఇవే కవిత్వస్ఫూర్తిని వెల్లడించు ప్రధానవిషయములుగా నగుచుమండును. సౌతి మహాభారతములో చాల యెక్కువగా యుద్ధవర్ణనలు పెంచివైచెను, ఇవి పాఠకులకు ఎక్కువ విసుగుదల కలిగించునంతవఱకుఁ బోయినవి. సృష్టి సౌందర్యవర్ణనలనుగూడ

సౌతి అక్కడక్కడ ఎక్కువగాఁ బెంచివైచెను. విశేషముగా వనపర్వములో హిమాలయపర్వతమును గంధమాదనపర్వతమును గురించిన వర్ణనలు మనము గమనింపవలసినవై యున్నవి, శోకమును వర్ణించుటలో స్త్రీపర్వము తఱచుగా అంతయుగూడ సౌతిదే కావలయును. దివ్యదృష్టిని పొంది గాంధారి భారతయుద్ధములోని సమస్తభూమిని చూడఁగలిగినట్లును యుద్ధరంగములో జనిపోయినవీరుల భార్యలు తమతమ భర్తలశవములను ఒడిలోనుంచుకొని ఏడ్చుచున్నట్లును ఇందులోకవి వర్ణించియుంచెను, ఇట్టి చమత్కారపూర్వమైన వర్ణనలు కవికి శోభాదాయకములుకావు. గాంధారి నోటిచే ఇటువంటిశోకవర్ణనలు చేయించుట అయోగ్యముగాఁదోఁచున్నది పదునెనిమిదిరోజులవరకు యుద్ధము జరుగుచున్నపుడు ఇటునటు చెల్లాచెదరుగాపడియున్న వీరులశవములను గుర్తుపట్టఁగలుగుట కూడ సంభవమైనయది గాదు, భారతయుద్ధభూమితో సమానముగా కొన్ని హద్దులులేకుండ కొన్ని క్రోసులదూరమువఱకు వ్యాపించియుండునని మనముతలచినపుడు ఈదృశ్యమంతయు అసంభవమని చెప్పవలసివచ్చును. యుద్ధభూమిలోనికి స్త్రీలు వెళ్లుటకూడ అనుచితముగ తోచుచున్నది కావ్యాలంకారగ్రంథములలో ఉదాహరణగాఇచ్చిన "అయంస రశనోత్కర్షీ" అనుప్రసిద్ధ శ్లోకము కూడ ఈ స్త్రీపర్వములోనున్నదే. మఱియు ఆధునికకవుల అశ్లీల వర్ణనలకు సమానాగా నున్నదియిది. ఇదిమహాకవియైన వ్యాసునిదిగాదని సౌతిదే యయియుండునని స్పష్టముగాఁదోఁచుచున్నది, యుద్ధభూమిలో పడియున్న మృతశరీరములను హింస్రములైన పశువులు పక్షులు పీకిముక్కముక్కలు చేసినవి సుందరదృశ్యములుగ వర్ణింపఁదగియుండవు యుద్ధములో బాలవీరుఁడైన యభిమన్యుఁడు చనిపోయినపుడు వాలుకైదు [illegible] ఘనిముఖమెట్లు మనోహరమై వికసించియుండినట్లు [illegible] మఱియతనిభార్య బాలవనిత [illegible] హారాంకమెట్లువలగా [illegible] స్త్రీపర్వమును [illegible] సౌతి రచించెను. మఱియది ప్రయోజన [illegible] యనేక దృశ్యములతోను కల్పనలతోను నిండియున్నది. [illegible] కవిత్వదృష్టిలోఁ దక్కువ [illegible] విరాటపర్వములోని యనేకమనోహర [illegible] కాని స్త్రీపర్వములోవలెనే ఇందులోని [illegible] మానవస్వభావ దృష్టినిబట్టి యసంభవములుగానే తోఁచు [illegible] ఉదాహరణకు ఉత్తముఁడు ఒకపిఱికిపందగాను [illegible]

డు పరుగెత్తుచున్నపుడు అర్జునుఁడు వానిజుట్టుపట్టుకొని వానినివెనుకకు దీసికొనివచ్చెను, కాని ఆశ్చర్యమైన సంగతియేమనఁగా పిటికిరియైన ఆశాలకుఁడే ముందుఒకకవియై పంచపాండవుల పంచధనుస్సులను గుఱించి మిగులయాకర్షణగా వర్ణించును. ఈవర్ణనలోఁగొన్ని కూటశ్లోకములు గూడ నున్నవనువిషయముమీద ధ్యానముంచినచో ఈరచనయంతయు సౌతిదను విషయము స్పష్టముగా జెప్పవలసియున్నది, కూటశ్లోకముల నెవరురచించిరను సంగతి మనముఆలోచించవలసిన విషయము, కేవలము శబ్దాలంకారములతో తనకావ్యమును అలంకరింపఁజేయవలెనను ప్రవృత్తి తఅచుగా అత్యుత్తమ కవులలో వుండదనువిషయమును పై మనముధ్యాన ముంచినచో ఈకూటశ్లోకములు సౌతివై యుండునని చెప్పవలసియుండును, వ్యాసని మూలభారతములో అక్కడక్కడ శబ్దచమత్కారము కవిపించుచుట యసంభవము కాకపోవచ్చునుగాని ఈపరిణామముకొంత ఎక్కువ గానుండును. కర్ణపర్వములో 90 వ అధ్యాయము చివర శార్దూలవిక్రీడిత శ్లోకమొకటియున్నది. దానిలో గో శబ్దమును వేఱువేఱఅర్థములలో మాటిమాటికి ఉపయోగించి అదికూటశ్లోకముగాఁ గూర్చఁబడినది. ఇదైతే సౌతిదిగూడఁగాదు. శబ్దచిత్రములగల కావ్యరచనచేసిన యింకొక కవి ఈ శ్లోకమును తరువాత ఇక్కడ దూర్చిన నట్లుతోచుచున్నది. ఆలోచింపఁగా కూటశ్లోకముల సంఖ్య 8800 అన్నది గర్వోక్తితోను అతిశయోక్తితోను నిండినట్లు తోచుచున్నది అయినప్పటికిని మహాభారతములో ఇట్టి శ్లోకము కంతలోటులేదు. దీనిని గుఱించిన అంచనా ఈ క్రింది వివేచనవలనఁ జేయఁబడుచున్నది.

మహాభారతములో అక్కడక్కడ మిగులగూఢమైన లేక సరళముగా అర్థముకాక శ్రమగలిగించు నర్థముగల ఒకటిరెండు శబ్దములు ప్రయోగింపఁబడినవి, దీనివలన సరియైన యర్థమును తెలిసికొనుట కడ్డుకలుగుచున్నది. శాంతిపర్వమును చూచునపుడు కొన్నియధ్యాయములలోనే ఇట్టి శ్లోకములు మనకు కనుపటినవి. అవిఈ - క్రిందనీయఁబడుచున్నవి. శ్రద్ధగా చదువువారికి వీనివల్ల కొంతలాభము కలుగువని యాశగలదు.

1. చతుర్థోపనిషద్ధర్మః సాధారణఇతిస్మృతిః ।
తే సంసిద్ధైః సాధ్యతేనిత్యం బ్రాహ్మణై ర్నియతాత్మభిః (శాంతి 170 అధ్యా. శ్లో. 30)

2. శ్వేతానాం యతీనాంచాహ ఏకాంతగతి మవ్యయాం (శాంతిఅధ్యా 349)

3. సేవాశ్రితేన మనసావృత్తిహీనస్య శస్యతే ద్విజాతిహస్తాన్నిర్వర్త్యవతుతుల్యాత్పర స్పరాత్ (శాంతి అధ్యా 291)

4. యఃసహస్రాణ్యనేకాని పుంసామావృత్య దుర్దశః తిష్ఠత్యేకః సముద్రాంతే సమేగోప్తాస్తు నిత్యశః (శాంతి అధ్యా 1284)

5. గృహస్థానాంతు సర్వేషాం వినాశమభికాంక్షతాం నిధనంశోభనం తాతపులినేషు క్రియావతాం (శాంతి అధ్యా 297)

6. మాతాపుత్రః పితాభ్రాతా భార్యామిత్రం జనస్తథా। అష్టాపద పదస్థానే దక్షముద్రేవలక్ష్యతే (శాంతి అధ్యా 278)

ఈవిధముగా వేలువేలుచోట్ల అనేకశ్లోకములను చెప్పవచ్చును. ఇవే కాకుండ కొన్ని యాఖ్యానములలో పూర్ణశ్లోకములే కూటములుగా నున్నవి. ఉదాహరణకు సనత్సుజాతుని అఖ్యానముచూడదగినది. అక్కడక్కడనైతే పాఠకులను చక్రములోపడవేయు ఒకటి అర విలక్షణమైన పేర్లేదొరకును, ఎట్లనగా ఆశ్రమవాసపర్వములో "ఇయంస్వసారాజ చమూపతేశ్చ" వంటి శ్లోకములున్నవి. కొన్నిచోట్ల జ్యోతిషమునకు సంబంధించినవి అంకెలవిషయములోను గల ఉల్లేఖనములతో ఏదో కొంత కూటము తప్పకయుండును దానిని తెలిసికొనప్రయత్నముచేయుట అప్పుడప్పుడు వ్యర్థమైపోవును. మహాభారతకూటములు లేక గూడార్థముగల శ్లోకములసంఖ్య చాలగానుండునని మాఅంచనా, తరచుగా ప్రతియొక యధ్యాయములో ఇటువంటిచోటుల దొరకుచుండును. కొన్నికొన్ని చోట్లనైతే ఇటువంటి స్థానములసంఖ్య అధికము. మహాభారతములోని అధ్యాయములమొత్తముసంఖ్య 2000, ఇట్టిస్థితిలో కూటశ్లోకములసంఖ్య కొన్నివేలు కాగలదు. ఈకావ్యచమత్కృతి మూలము వ్యాసులవారిదై యుండుటయు మఱి సౌతి ఇంకను పెంచుటయు సంభవమైయున్నది. ఇందువల్ల సౌతి చిన్నతరగతి కవికాడని చెప్పవలసివచ్చుచున్నది. కూటశ్లోకములయొక్కయు కూటశబ్దములయొక్కయు ఇంకనుగొన్ని యుదాహరణములు నీక్రింద నీయబడుచున్నవి.

1. యత్రసా బదరీరమ్యా హ్రదోవైహాయసస్తథా। వైహాయసః (శాంతి 127-8) (మందాకిన్యాః) హ్రదః

2. నశంఖలిఖితాంవృత్తిం శక్యమాస్థాయజీవితుం।
శంఖే=లలాటస్థిని (శాంతి 120, 29)

3. నాసతోవిద్యతే రాజన్ సహ్యారణేషు గోపతిః
(శాంతి 135,126)

4. మాసాః పక్షాః షడృతవః తవః కల్పాః సంవత్సరాస్తథా।
(శాంతి 137, 21)

5. పృష్ఠతః శకటానీకం కళత్రంమధ్యతస్తథా (శాంతి 100,43)

6 స్కంధ దర్శనమాత్రాత్తు తిష్ఠేయుర్వా సమీపతః
(శాంతి 100,46)

7. పారావతకుళింగాక్షాః సర్వేశరాః ప్రమాథినః
(శాంతి 101, 7)

కుళింగోభూమి కూష్మాండే మతంగజభుజంగయోః. కుళింగః=సర్పః

8. విరమేచ్ఛుష్కవైరేభ్యః కంఠాయాసం చవర్జయేత్
కంఠాయాసం=ముఖరత్వం (శాంతి 103, 10)

9. స్వార్థమత్యంతసంతుష్టః క్రూరః కలత్రవాంతకః
(శాంతి 116-11)

కులజః ప్రాకృతో రాజ్ఞా స్వకులీనతయాసదా
(శాంతి 118, 4)

11. అకులీనస్తు పురుషః ప్రాకృతః సాధుసంశ్రయాత్
(శాంతి 118, 5)

12. తైక్ష్ణ్యంజిహ్మత్వమాదాల్భ్యం సత్యమార్జవమేవచ
(ఆదాల్భ్యం=అభయం) (శాంతి 20,25)

13. శ్లక్ష్ణాక్షరతనుః శ్రీమాన్భవేచ్ఛాస్త్రవిశారదః
(శాంతి 120,7)

14. లోకేచాయవ్యయౌ దృష్ట్వాబృహద్వృక్షమివాస్రవత్
(శాంతి 120,9)

15. శాంతిపర్వములో 120 అధ్యాయముపూర్తిగా కూటశ్లోకములతోనిండియున్నది.

16. కావ్యానివదతాం తేషాం సంయచ్ఛామివదామిచ
కావ్యాని శుక్రప్రోక్తాని నీతిశాస్త్రాణి (శాంతి 1243)

17. సతస్యసహజాతస్య సప్తమేంనవమీందశాం। ప్రాప్నువంతితతః
పంచనభవంతిగతాయుషః (శాంతి 231,28)

18. త్యజధర్మమధర్మంచ ఉభే సత్యానృతే త్యజ।
ఉభే సత్యానృతేత్యక్త్వాయేన త్యజసితంత్యజ (శాంతి 392,40)

19. విచార్యఖలు పశ్యామితత్సుఖం యత్రనిర్వృతిః
సుఖం=స్వర్గః (శాంతి 111, 32)

20. మనుష్యశాలావృకమప్రశస్తం జనాపవాదే సతతం నివిష్టం
మనుష్యశాలావృకం మనుష్యేషుశ్వా (శాంతి 114, 17)

21. అధ్వానంసోఽతిచక్రామ ఖచరః ఖేచరన్నివ
(శాంతి 325,19)

కవిత్వమును ప్రదర్శించు వేళలవేళల ప్రసంగములను సమావేశపఱచి ప్రతిచోట మహాభారతమును విస్తరింపఁజేసెననుటలో సందేహము లేదు స్త్రీ విరాటపర్వములలో ఈసంగతి స్పష్టముగాఁ గనిపించుచున్నది. ఇతరపర్వములలో గూడ అందులో విశేషించి యుద్ధపర్వములలో ఎట్టి ప్రసంగములను సమ్మేళనపఱచెనో అవియేమియు తక్కువవిగావు. సారాంశమిది (1) ధర్మమతములయైక్యము, (2) కథాసంగ్రహము (3) జ్ఞానసంగ్రహము (4) ధర్మమును నీతిని గూర్చినయుద్దేశము వీనితో భారతములో అనేకప్రసంగములను కలిపి చక్కనిరూపమునిచ్చి సనాతన ధర్మరక్షణకై దృఢముగా అత్యంతప్రశంసనీయమైన ప్రయత్నమునుచేసెను. కవిత్వప్రసంగమునుగూడ సాధించి ఆగ్రంథమును సర్వోత్తమకావ్యముగాఁ జేసెను. కాని దానితోపాటు సౌతికలిపిన వ్యాఖ్యానములవల్ల గ్రంథవిస్తరమైతే అయినదికాని వానివల్లమహాభారతమునకు కొన్నిఅంశములలో సుందరరూపమురాలేదు. పైఁగా కొన్నివిషయములలో దానికి అప్రాధాన్యముగూడవచ్చినది. ఇందువల్ల అప్రాధాన్యముపొందిన విషయములను విచారణచేయుట అవశ్యకము.

## (6) పునరుక్తి

అనేకప్రసంగములను చెప్పినవే చెప్పుటవలన గ్రంథము పెరిగినది ఏదైనవొకవిషయమును పాఠకులకు బోధింపవలసినప్పుడు చెప్పినదే మరల

మరల చెప్పఁబడుచుండును అపుడు ప్రశంసనీయముగానే యుండునుకాని అది ఇట్లుకానపుడు పునరుక్తిదోషము పాఠకులమనస్సులో బాధకలిగించుచుండును. ఇట్టిపునరుక్తి ఈగ్రంథములో తఱచుగా అన్నిచోట్లకనిపించును అక్కడక్కడ ఈపునరుక్తి గ్రంథమునకు అధికభాగము అయినపిమ్మట మధ్యలో కనిపించును. దీనికి అనేకోదాహరణము లివ్వవచ్చును ఆదిపర్వము లో ఆస్తీకునికథ రెండుసారులువచ్చినది, ఆరెండవసారి వర్ణించవలసి వచ్చినపుడు మొదటికంటె చాలఅధికాంశములో పెరిగిపోయినది. కాశ్యపతక్షకుల కథరెండుసార్లు చెప్పఁబడినది, వనపర్వములో తీర్థముల వర్ణన రెండుసార్లు వచ్చినది. వైశంపాయనుని సమయములో ఏతీర్థములజ్ఞానమున్నదో అంతకంటె ఇంకనెక్కువగా తీర్థములు సౌతి సమయములో ప్రసిద్ధములై యుండును. ఏలయనఁగా ఆసమయములో ఆర్యులఖ్యాతి దక్షిణమువైపు చాలఎక్కువగా వ్యాపించినది. ఈపునరుక్తి స్వరూపము తఱచుగానిది—పూర్వకథలను ఇంకఎక్కువ విస్తరింపజెప్పమని జనమేజయుఁడు ప్రార్థన చేయుచుండును దానిననుసరించి వైశంపాయనుఁడు ఆకథలనే వినిపించుచుండును. కానికొన్నిచోట్లనైతే ఈస్వరూపము కూడ కనిపింపదు. ఉదాహరణకు అభిమన్యునివధ ప్రసంగములో శోకమునుజల్లార్చుటకు ఊరడించుచు వ్యాసుఁడు యుధిష్ఠిరునికి షోడశరాజుల యాఖ్యానమును వినిపించెను. మఱిఆయాఖ్యానములనే కృష్ణుఁడు యుధిష్ఠిరునికి శాంతి 10 పర్వములో వర్ణించిచెప్పెను ఈస్థితిలో ఈపునరుక్తులు క్షమింపరానివి.

(6) అనుకరణములు

ఇంకొకదోషము అనుకరణము, ఏదైనమనోహర ప్రసంగమును జూచినపుడు "నేనుగూడ అందముగా ఆయితర ప్రసంగములను వర్ణించెదను" అని యితరకవులకు ప్రవృత్తికలుగుచునుండును, ఉదాహరణకు కాళిదాసుని సుందరమైన మేఘసందేశకావ్యము తరువాత ఇతరకవులు హంస పందేశము మొదలైనకొన్ని కావ్యములను రచించిరి. ఈవిధముగా అనుకరించుకోరికతో వ్యాసుఁడు వర్ణించిన భారతములోని కొన్నిప్రసంగములను సౌతి అనుకరించెను. దీనికిముఖ్యమైన యుదాహరణము వనపర్వము చివర కలిపిన యక్షప్రశ్నలనుగూర్చినకథ. సౌతి ఈకథారచనమ నహుష ప్రశ్నల (వనపర్వ 195 అధ్యా) పద్ధతిగా జేసెను. దానిలోగూడ యుధిష్ఠిరుని

వల్ల అతనిసోదరులు విడిపింపఁబడిన కథయున్నది. సౌతి యక్షప్రశ్నల కథను తరువాతఁగలిపినట్లు అనుమానించుటకు కొన్ని కారణములను మనముఇవ్వవచ్చును. మొదటికారణము అంతకుపూర్వపు మనుష్యులు ఎట్టి యవస్థపొందిరో సహదేవుడు అర్జునుడు భీముఁడు ప్రత్యక్షముగాఁజూచిరి యతుడేమో స్పష్టముగా జాగ్రత్తలనుచెప్పుచున్నాడుగదా, అయినను వారుకూడ ఆచెఱువులోని నీరుత్రాగి మరణించుట నిజముగా చాల యాశ్చర్యకరమైన సంగతిగాదా. రెండవకారణము—యక్షప్రశ్నలుగూడ * ప్రహేళికలతో సమానముగా చూడఁబడుచున్నవి. అవిమహాకవికి శోభాదాయకములుగావు - మూఁడవకారణము — ప్రశ్నోత్తరములచివర యక్షుఁడుయుధిష్టిరునితో "నీవు మీయజ్ఞాతవాస దినములను విరాటనగరములో గడపు" మనిచెప్పెను, ఇంతయైనపిదపఁగూడ తరువాతిపర్వము యొక్క ఆరంభములోఁ అజ్ఞాతవాసపుదినము ల గడపు సందర్భములో యుధిష్టిరునికిఁ జాలచింతగలిగినట్లు చెప్పుట. నాలుగవకారణము — యుధిష్టిరుఁడు బ్రాహ్మణులకందఱకు సెలవిచ్చిపంపి కేవలము ధౌమ్యుని మాత్రము తనదగ్గఱనంచుకొనినట్లు కథారంభములోఁ జెప్పఁబడెను

ఇట్లయినపిదపఁగూడ విరాటపర్వము మొదటిలో యుధిష్టిరునిదగ్గఱ బ్రాహ్మణు లందఱు ఉన్నారని చెప్పఁబడెను. సారాంశము — యక్షప్రశ్నోపాఖ్యానము మూలభారతములోలేదు అది సౌతిచేఁగలుపఁబడెను అనుకరణమునకు రెండవయుదాహరణము ఉద్యోగపర్వములో వర్ణింపబడిన విశ్వరూపదర్శనము. భగవద్గీతలోని విశ్వరూపదర్శనము. అదితగినచోటచూపఁబడినది. అదివ్యాసుని మూలభారతములోనిది కానిదానినమకరించుచు ఉద్యోగపర్వములో ఏవిశ్వరూపదర్శనమునకు స్థానమిచ్చెనో అది అప్రస్తుతముగా గనుపట్టుచున్నది. మఱి దానిప్రభావముదుర్యోధనుని మీదఁగాని ధృతరాష్ట్రుని మనస్సుమీదఁగాని ఏమాత్రము పడలేదు.

### భవిష్యకథనము

ముందుజరుగఁబోవు సంగతులను ముందుగా భవిష్యరూపముగాఁ జెప్పుటయు లేక వానికి సంబంధముగా మొదటనేకొన్ని సంగతులను జెప్పుట యిది గ్రంథకారులయొక్క సాధారణయుక్తియైనది. ఇటువంటి

* ప్రహేళికలు=గూఢార్థకములు

దుర్యోధనుఁడు శల్యుని సంతోషపఱచి తన పక్షమందు చేర్చు కొనెను. ఈ సంగతిని శల్యునివలన యుధిష్ఠిరుఁడు విని "కర్ణునికి అర్జునునికి యుద్ధము జరుగునపుడు ఎప్పుడైతే నీవు కర్ణునికి సారథిగా నుందువో అపుడు కర్ణుని తేజస్సు భగ్నమగునట్లు చేయు"మని విన్నవించెను. "నేను కర్ణునికి సారథ్యము చేయవలసి వచ్చినచో అట్లే కర్ణునికి ఉత్సాహభంగము చేయుదును. మీరపుడు అతనిఁ జంపవచ్చును" అని యప్పుడు శల్యుఁడు యుధిష్ఠిరునికి జవాబిచ్చెను. ఇట్టి సంగతుల కల్పన మొదటనె యెట్లు చేయ వీలగును. భీష్ముఁడు, ద్రోణుఁడును చనిపోయినపుడు కర్ణునికి, అర్జునునికి భయంకరమైన యుద్ధము జరుగును. అప్పుడుగదా కర్ణుఁడు శల్యుని సారథిగాఁ జేసికొనును. ఇంతేగాకుండా ఈ విధమైన విశ్వాస ఘాతుకము గాని మిత్రఘాతకముగాని చేయుట యుధిష్ఠిరునికిని శల్యునికి లజ్జాస్పద విషయముగదా! సారాంశమేమన, ఈ విధముగా ముందు జరగబోవు విషయములను సౌతిచెప్ప యత్నించుట యనుచితము. ఇదికాక ఇంకొక సంగతికూడఁ గలదు. దుర్యోధనుని పక్షములో శల్యుఁడు చేరుటకు కారణ మిది ఆ శల్యుఁడు 'అర్థస్య పురుషో దాసః' అను నీతి ననుసరించి దుర్యో ధనుని ఆశ్రయించెను. యుధిష్ఠిరుని పక్షములోఁ జేరుటకు వెళ్లుచుండఁగా మార్గమధ్యములో దుర్యోధనుఁడు అతనిని సంతుష్టపఱచి తన పక్షములోనికి దీసికొనెనను నీవర్ణన అసంబద్ధమైనది. తరువాత "కర్ణునికి తేజోభంగమైన ట్లును ఇందువలన అతఁడు చనిపోయినట్లును ఎక్కడను మనకు కనుపింపదు. ఈ తేజోభంగ కారణముగా కర్ణుని శౌర్యములో లోటు పర్పడినట్లు వర్ణన గ్రంథములో లేనేలేదు. పైఁగా దీనికిబదులు శల్యుఁడు తగిన సమయములో "నీ లక్ష్యము సరిగా లేనందువలన నీ బాణము తగుల్కొనుట లేదు. సరిగా శరమును సంధింపుము" అని సూచన చేయుచుండును. అనఁగా శల్యుఁడు మిత్రఘాతుకము చేయనట్లు కర్ణునకనిపించును. నిజమునకు సౌతి భవిష్య సంగతి చెప్పినట్లు యీ భాగమును అనవసరముగాఁ బెంచెను. ఇంతే గాక ఇంకను ఇట్టి ఉదాహరణములు ముందు ఇవ్వఁబడును. సారాంశ మేమనఁగా, అనేకమైన యసంబద్ధమైన లోకములో వాడుకలోనున్న కథలను సౌతి తరువాత కలిపెను.

## 9 కారణముల దిగ్దర్శనము

ఇంకొక దోషస్థానము కారణముల దిగ్దర్శనను. పూర్వకాలములో ప్రసిద్ధులైన పురుషులు ఎందు దోషములు ఎందుకు ఎట్లు చేసిరో దానిని గుఱించి కొన్ని కారణములను జెప్పుట అవసరమగుచున్నది. ఎట్లన, పాండవులైదుగురు ఒక్క ద్రౌపదినెట్లు పెండ్లి చేసికొన్నారో, భీముఁడు దుశ్శాసను రక్తమునెట్లు త్రాగెనో మొదలగు విషయములలో దోషములు చూపఁదగినవిగాఁ గనుపట్టుచున్నవి. మఱి వాని సంబంధము లోకానికిఁ గారణములు చెప్పుట మిగుల నావశ్యకమగుచున్నది. ఇట్టి సంఘటనల విషయములో కారణముల గుచ్చినట్టి పిట్టకథలను సౌతి మహాభారతములో చేర్చెను. స్వయముగా వ్యాసులవారు కూడా ఆ యా కథల ప్రసంగములతో ఆ యా వ్యక్తుల కుపదేశించినట్లు ముందు జరుగబోవునవి సూచించుచున్నట్లు మనకుఁ గనుపట్టుచున్నది. ఎక్కడెక్కడైతే వర్ణనలు కనిపించునో అది మూలభారతములోవి కావు. సౌతి తరువాతఁ గలిపెను. ఎట్లనఁగా, ఒక సందర్భంలో వ్యాసుఁడు ధృతరాష్ట్రుని దగ్గఱకు వచ్చి "దుర్యోధనుఁడు పుట్టగానే వానిని గంగలోఁ బాఱవేయుము" అనెను. ఈ ప్రసంగము కూడఁ దరువాతఁ గలుపఁబడినదే తోచుచున్నది. కానిండు, ఈ విధముగా మూఁడు నాలుగు కారణములవల్ల సౌతి మహాభారతములో నెక్కడ విస్తరించెనో ఆ భాగము విశేష రమణీయముగాఁ గనిపింపదు. ఏ యే స్థానములలో ఏవి తరువాతఁ గలుపఁబడెనో అవి యన్ని యేవో నిర్ణయించుట చాల కష్టమైన సంగతి యని మేమంగీకరింతుము. అయినను మహాభారతములో 24000 శ్లోకములున్న చోట ఒక లక్ష శ్లోకములయిన సంగతిని గూర్చి శ్రద్ధ చూపినపుడు ఇట్టి కొత్తభాగములు చాల పెంచఁబడియుండవచ్చునని మనము చెప్పుకొనవచ్చును. సౌతి ఎందుకట్లు పెంచెను అనఁగా మహాభారతమును ఎట్లు విస్తరింపజేసెనో చెప్పుట ఆవశ్యకము గనుక ఇక్కడ ఈ విషయమును విస్తరించియుంటిమి. సౌతి కూర్చిన ఈ విస్తారము వలన ఈ సమస్త గ్రంథముయొక్క ఉదాత్త రూపమునకు ఏ మాత్రము న్యూనత సంభవింపలేదు. ఇందువల్ల ఈ సమస్త గ్రంథమును వ్యాసకృత మునిగా అంగీకరించినను అనుచితమేమియు లేదని మనము జ్ఞాపకముంచుకొనవలెను. 24000 శ్లోకముల మహాభారతము ఒక లక్ష శ్లోక

మూల మహాభారతముగా రూపాంతరము పొందినది. అయినను దానిలో అసంబద్ధతకాని పరస్పర విరోధములుగాని తఱచుగా రాలేదు. ఈ పనిలో సౌతి చాతుర్యము నిస్సందేహముగా మెచ్చుకొనదగ్గది. సౌతి కవిత్వము కూడా ఏ విధముగాను తక్కువ తరగతిది కాదు. దానిమీఁద వ్యాసుని కవిత్వ శక్తియొక్క ఛాయలు ఉండుటవలన సమస్త గ్రంథము మిక్కిలి రమణీయమైనది. సౌతి మహాభారతములో దోషము చూపు స్థానములు ఎక్కువ లేవని సంక్షేపముగా మనము చెప్పవచ్చును. కాని రెండు చోట్ల అతని పొరపాటు ప్రకటముగా గన్పట్టుచున్నది. యుధిష్ఠిరుఁడు భీష్మ పర్వములో శల్యునితో కర్ణుని యుత్సాహము భంగపఱచుమని కోరిన సమయములో 'ఉద్యోగ'ములో నీవిచ్చిన మాట పూర్తిచేయు మన్నమాట చాల ఆశ్చర్యముగా నున్నది. ఏ సమయములో యుధిష్ఠిరుఁడు ఈ ప్రార్థన చేసెనో ఆ సమయములో వ్యాసుని భారతముగాని సౌతి మహాభారతము గాని లేదు. ఇట్టి స్థితిలో 'ఉద్యోగములో అనఁగా ఉద్యోగ పర్వములో నీవు మాట యిచ్చితివి' అని యుధిష్ఠిరుఁడెట్లు చెప్పఁగలఁడు. ఇట్లే అశ్వమేధ పర్వములో కుంతి శ్రీకృష్ణునితో ఇట్లు అనును.

"ఉత్తర గర్భము నుండి మృతపుత్రు డుద్భవించినచో నీవు వానిని బ్రతికింతువు. అని ఐషీకములో మాటనిచ్చితివి గనుక ఇప్పుడా మాటను నెఱవేర్చుము" అని, ఇక్కడ గూడ ఐషీక పర్వములో ఏ ప్రమాణమైతే కుంతి నోటి నుండి పలికించెనో అది చమత్కారమైనది. "ఓ యదునందనా! ఐషీక ప్రకరణములో నీవిట్టి ప్రతిజ్ఞ చేసియుంటివి" అని చెప్పి కుంతి మహాభారతములో ఐషీకపర్వమున నిచ్చిన ప్రమాణము అది నిజముగా ఊహింపరానిది. కాని ఎప్పుడైతే గ్రంథ విస్తారము చాల యెక్కువైనదో అప్పుడు దానిలోని ప్రకరణముల ప్రమాణము కథలోని పాత్రల ద్వారా ఇప్పించుట తప్పనిసరియైనది. అనఁగా ఇక్కడ తరువాత అయిన సౌతి కర్తృత్వము వ్యక్తమగుచున్నదని చెప్పవలసి యున్నది. చివర మనము మహాభారతము కావ్యములలో ఉత్కృష్టమైనదను సంగతి పరిశీలింపవలెను.

మహాకావ్య దృష్టిలో భారతము యొక్క శ్రేష్ఠత్వము ఏవిధముగా పెంచబడినదానిని వేఱుచేసిగాని లేక దానిని దృష్టిలో నుంచుకొనకగాని చూచినచో వ్యాసుని మూలభారతము మనకుత్కృష్టమైనది

ఒకమనోహరరూపము తో ప్రత్యక్షమగును. ఇక్కడ దానిని మనోహరత్వమునుగూర్చి పరిశీలించుట అనుచితముగాదు. ఈ ప్రపంచములో ఉన్న యుయుదారు ఉదాత్త రమణీయకావ్యములలో ఈ వ్యాసుని ఆర్ష మహాకావ్యము అన్నిటికంటె శ్రేష్ఠమైన ఉత్తమకోటికి చెందినది. యూనాని తత్త్వవేత్త అరిస్టాటిలు హోమరుయొక్క ఇలియడును ఆధారముచేసి కొన్ని మహాకావ్యలక్షణములను ఇట్లుచెప్పెను. "మహాకావ్యములోని విషయము ఒకటిగా నుండవలెను. ఆ విషయము ఏదోయొక గొప్ప అత్యంత విస్తృతమైనదిగాను మహత్త్వ ప్రసంగముగాను ఉండవలెను. దానిలోని ప్రధాన పాత్రలు ఉచ్చవర్గముగలవిగాన వానిశీలము ఉదాత్తముగా ఉండవలెను. గ్రంథములోని భాష వృత్తమును గంభీరమైయుండి కావ్యములోని సంభాషణములు వర్ణనలు ఏ విధములై యుండవలెను అని పాశ్చాత్య విద్వాంసులు చెప్పిన మహాకావ్యలక్షణములకు ఇక్కడి సాహిత్య శాస్త్రకారులు చెప్పిన లక్షణములకు తేడా అంత ఎక్కలేదు. ఇప్పుడా నాలుగు విషయములనుగూర్చి ఇక్కడ పరిశీలన చేయబడును.

ఈ మనమహాకావ్యముయొక్క ప్రధానవిషయము భారతయుద్ధము. హిందూదేశములోని ప్రాచీనేతిహాసములో భారతయుద్ధమును మించిన గొప్ప మహత్త్వ విషయముగల దింకేమియులేదు. ఆ సమయములో హిందూదేశ ప్రాచీన సంస్కృతి ఉన్నతశిఖరము నధిరోహించినది. దాని తరువాతనే దానికి అవనతి ప్రారంభమైనది. ఈయవనతి ఇంతవఱకు మెల్లమెల్లగా పెరుగుచువచ్చుచున్నది. కనుక మనలో భారతయుద్ధము సరిగా కలియుగముయొక్క ఆరంభముగా అంగీకరింపఁబడుచున్నది. సారాంశమేమన భారతయుద్ధముకంటె నెక్కువ మహత్త్వముగల ఇంకే ప్రసంగమును గూడ కల్పింపఁగలుగుట అసంభవమె. భారతయుద్ధ ప్రసంగమును మించి [illegible] విస్తృతమైనదియు ఎక్కువభావోద్రేకము గలదియు నగు ఇంకొక యే విషయము దొరకుట చాలకష్టము, ఈ ప్రసంగములోని ఒకొక్క చిన్న భాగములపైన సంస్కృతభాషలోని పంచ కావ్యములలో రెండు మహాకావ్యములు రచింపబడినవి. అర్జునుడు పాశుపతాస్త్రమును పొందినకథను మహాకవి భారవి కిరాతార్జునీయ కావ్యమును మఱి మాఘకవి శిశుపాలవధను [illegible] కావ్యమును రచించిరి. నైషధకావ్యముగూడ మహాభారతము

లోని నలదమయంతుల యాఖ్యానముమీదరచింపబడినదె. సారాంశమేమన, భారతయుద్ధముయొక్క ప్రసంగము ఎంతవిస్తృతమైనది అనగా దానిలోని ఒక్కొక్క చిన్నవిషయమును బట్టి ఒక్కొక్క సంస్కృతకావ్యము రచింప గలుగుటకు వీలుగానున్నది. మహాభారతములో కేవల భారతయుద్ధ కథేకాకుండ పాండవుల పూర్ణచరిత్ర కూడగలదని కొందఱందురు. కాని, ఆలోచింపగా మహాభారతము లోని ప్రధానవిషయము భారతయుద్ధమే అయినను దానిలో భారత యుద్ధమునకుగల కారణములు దాని పరిణామముల వర్ణన యుండుననియాకాంక్షించుటసహజమె. కనుకనే దానిలోపాండవుల పూర్వ చరిత్రయు నివ్వబడినది. ఆ రెండు చరిత్రలు చాలసంక్షేపముగా జెప్పబడినవి. అనగా ఆరంభములోని ఆదిసభాపర్వములు చివరి ఆశ్రమవాసాది పర్వములు చిన్నచిన్నవి. మధ్యనున్న ఉద్యోగపర్వముపైనున్న యుద్ధమునకు సంబంధించిన పర్వములు చాలా విస్తారముగారచింపబడినవని మనము జ్ఞాపకముంచుకొనవలెను. దీని తాత్పర్యమేమనగా మహాభారతములోని ప్రధాన విషయము భారత యుద్ధమేయని మన మంగీకరింపవలయును. వ్యాసుని మాటలలో జెప్పవలెనన్న మహాకావ్యములోని విషయము నరనారాయణ విజయము. అంటే శ్రీకృష్ణార్జునుల విజయమె. ఈసంగతి దేవతాస్త్రముల శ్లోకములోనే వ్యక్తముచేయబడుచున్నది.

పరిశీలింపగా మహాభారత కథాస్వరూపము ఇంతపెద్దదైనను దానిలో ఐక్యము సంపూర్ణత ఉన్నవి. దానిలో ఏమాత్రం అసంబద్ధత రానీయలేదు. దానిలో భిన్న భిన్న స్వభావముగల వక్తలు చాలమంది యున్నారు షేక్స్పియరు రచించిన యనేక నాటకములలో వర్ణింపబడిన వ్యక్తులందఱు ఇందుగూర్చబడియున్నారు మహాభారత కథ ఇంత విస్తృతమైనదైనను అది ఇంకను ఎక్కువగా విస్తరింపదగినదిగా మన్నది నిజమేమంటే గ్రంథకర్త తన దృష్టియంతను ప్రధానవిషయమైన యుద్ధముపైపే ఉంచెను. కనుక ప్రసంగమునుబట్టి యితర విషయముల మీద తనదృష్టి ఎక్కువగా వెళ్ళనీయలేదు. ఉదాహరణకు దుర్యోధనని వివాహవర్ణన మహాభారతములో మనకు ఎక్కడను దొరకదు. దుర్యోధనని భార్య పేరుకూడ భారతములో ఎక్కడనులేదు. ఇట్టిస్థితిలో ఆమె సంబంధములో ఎక్కువగా ఉల్లేఖించుట దీనినిగూర్చిన సంభాషణములు

అసలు మన కెక్కడఁ గనిపించవు. ఇది తెలిసినపుడు పాఠకులకు ఎక్కువ ఆశ్చర్యము కలుగకమానదు. ఆధునిక కవులు దుర్యోధనుని స్త్రీపేరు "భానుమతి" అని పెట్టిరి. మఱి ఆమెసంబంధములో మూర్ఖత్వముతోఁ గూడిన కథలను రచించిరికూడ. కాని యివన్నియు అసత్యములు, ఏలనఁగా మహాభారతములో దుర్యోధనుని స్త్రీ పేరైనను లేదుగదా. ఇలియడుకు ప్రతిద్వందియైన హెక్టరు స్త్రీపేరు ఎన్డ్రొమకీ. హెక్టరు ఎప్పుడైతే యుద్ధమునకు బయలుదేరునో అపుడు అతనికి భార్యకు జరిగిన కరుణారసయుక్తమైన సంభాషణ ఇలియడులో వర్ణింపబడినది. కాని భారతములో ప్రతినాయకుడైన దుర్యోధనుని పత్నియొక్క యొకసంవాదమును కూడ భారతకారుఁడు ఇయ్యలేదు. దీనిలో గ్రంథకారుని విశేషకుశలత కనుపట్టుచున్నదని మేము తలఁచుచున్నాము. దీనికి గారణమేమంటే వ్యాసుఁడు దుర్యోధుని పాత్రను హాతయుక్తమైనదిగాను అభిమాన సహితమైనదిగాను చెప్పెను. దుర్యోధనుఁడు యుద్ధమునకు వెళ్లునపుడు తన ప్రియపత్నిదగ్గఱ సెలవుపొంది వెళ్లునపుడు తనకంటినుండి ఒకటి రెండు కన్నీటిబిందువులు పడినట్లును కవివర్ణించినచో అపుడు అభిమానియైన దుర్యోధనుని పాత్ర కళంకితమైపోయెడిది. సారాంశమేమన, ఇక్కడ కవియొక్క చాతుర్యమే విశేషముగా దృష్టిగోచరమగుచున్నది. కాని దుర్యోధనుఁడు చాలక్రూరుఁడు నిర్దయుఁడువటి తనస్త్రీని ప్రేమించుట లేదు అని దానివల్ల అనుమానించుట యుచితముగా నుండదు. ఎప్పుడైతే గదాయుద్ధములో ఒడలువిరిగి దుర్యోధనుఁడు స్మృతిలేక పడెనో అపుడు మహాకవి వానివిలాపములో తల్లిదండ్రులను స్మరించుచు దానితోపాటు స్త్రీ సంగతికూడ చాలనేర్పుతో గలిపి వానిముఖమునుండే "ఓ లక్ష్మణ జననీ! నేను లేనప్పుడు నీకెట్టిగతికలుగునోగదా. అన్న ఈవివేచనవల్ల పాఠకునికి ఇదితోచకమానదు "మహాభారత విషయము చాలగొప్పదైనను అది యింకను విస్తరింపదగియున్నది" అని.

ఆలోచింపగా మహాభారతకథ చాల విస్తృతమైనదె అయినను మహాకవి వ్యాసుఁడు దానిని సంకలితముచేసి రెండవవైపు తనదృష్టిని పోనీయలేదనికూడ మనము ఉదాహరణకు చెప్పవచ్చును. మహాభారతముయొక్క ముఖ్యవిషయము భారతయుద్ధము. కనుక భారత యుద్ధవిషయమును

బాగుగా వర్ణించి మిగిలిన విషయములను వర్ణించలేదు. ఉదాహరణకు శ్రీకృష్ణచరిత్రమునుచూడుడు. శ్రీకృష్ణచరితము భారతముతో ఎంతగా ముడివడియున్నదో అంత మాత్రమె యివ్వబడియున్నది. దీనిలో అతని బాల్యచరిత్ర వర్ణన ఎక్కడచేయబడలేదు. రుక్మిణీవివాహము మొదలైన యితరవివాహములకు సంబంధించిన అప్రత్యక్షమైన యుల్లేఖములు అక్కడ సంభాషణలలో కనిపించును కాని పూర్తివర్ణనలు దానిలో ఎక్కడనులేవు. ఇది గ్రంథములోని లోపమని సామాన్య పాఠకులకు తెలియును. కాని ఇది యిటువంటిదిగాదు. దీనిలో నిజముగా కవి కుశలతగలదు. ప్రధాన విషయమును విడిచిపెట్టి ఇంక ఇతరమైన విషయములతో తగుల్కొనుట దోషము. కనుక వ్యాసుడు తన భారతములో శ్రీకృష్ణుని చరిత్రకు స్థానమీయలేదు. పైకి కనిపించులోపమును పూర్తి చేయుటకు సౌతిహరి వంశమను పేరుగల ఖిలపర్వముతో కలిపెను. ఇందువల్ల పాఠకుల జిజ్ఞాస తృప్తిపొందును. కానిందు మహాభారతవిషయము అతివిస్తృతము మహత్వ యుక్తమను ఏ యుద్ధమునైతే 18 అక్షౌహిణులు అనగా 52 లక్షల వీరులు తమలోతాము ఇంత తీవ్రముగా పట్టుదలతో యుద్ధముచేయగా ఒక పక్షములో ఏడుగురు రెండవపక్షములో ముగ్గురు అందఱు మొత్తము కేవలము పదిమంది వీరులు బ్రతికిబయటపడిరి. ఆ యుద్ధము హోమరు యొక్క ఇలియడు యుద్ధముకంటె చాలపెద్దది.

కాని భారతయుద్ధముయొక్క మహత్వము ఇంతకంటెను గొప్పది. హిందూదేశములోని యించుమించు రాజులందఱు ఈయుద్ధములో పాల్గొని యుండిరి. ఇంతమాత్రమేకాదు. హిందూదేశములోని నేటి ప్రసిద్ధరాజవంశములు తమ వంశముల యుత్పత్తి భారతయుద్ధ వీరులవల్లనే యైనట్లు చెప్పిరి దీనివల్ల ఈ యుద్ధమునకు రాష్ట్రీయమహత్వము ప్రాప్తించినది. లేక దాని కదివఱకటినుండి ఈ మహత్వము ప్రాప్తించినదని చెప్పవలెను. కౌరవుల సంస్కృతి చాల గొప్పతరగతిలోనిది. కురువుయొక్క పేరు బ్రాహ్మణ గ్రంథముల సమయము నుండి వైదిక సాహిత్యములో మాటి మాటికి వచ్చియుండెను. ఈ సంస్కృతిని సౌతిపెంచెనని చెప్పలేము. ఈ యుద్ధముతో శ్రీకృష్ణునికి ఘనిష్ఠమైన సంబంధమున్నది. ఇందువల్ల ఈ యుద్ధమునకు రాష్ట్రీయమహత్వము ప్రాప్తించినది. ఏలన, ధర్మము, నీతి

తత్త్వజ్ఞానముల సంబంధములో శ్రీకృష్ణుడు రాష్ట్రీయ మహత్త్వముగల వ్యక్తి. దీనినిగూర్చి ముందు విస్తరించి పరిశీలన చేయఁబడును. యూనానులకు ట్రోజనుయుద్ధము రాష్ట్రీయయుద్ధముగా తోచినట్లు భారతీయులకు భారతీయయుద్ధము రాష్ట్రీయయుద్ధముగా తోచినది. సారాంశమేమన, ఈ మహాకావ్య విషయము అత్యంత మహత్త్వముగలది. విస్తృతమైనది రాష్ట్రీయ స్వరూపముగలది. ఇపుడు మనము మహాకావ్యము యొక్క యితరమైన యావశ్యకమైన యంగములను పరిశీలింతము.

మహాభారతములో వర్ణింపబడిన వ్యక్తుల చరిత్ర మిక్కిలి యుదాత్తమైనదని విస్తరించి చెప్పఁబనిలేదు. యుధిష్ఠిరుఁడు, అర్జునుడు కర్ణుడు ద్రోణుడు సర్వోత్తముఁడగు భీష్ముని చరిత్రలనుబట్టి ధర్మనీతుల ఆచరణ సంబంధములో నీతియొక్క ఆచరణ ముందుజీవితమును ఏమాత్రము లెక్కపెట్టనలసినపని లేదనుశిక్షణను ఆర్యుల హృదయములమీద ప్రతిబింబించునట్లు చేయుటలో ఈ చరిత్రలు నేఁడు వేలకొలది సంవత్సరములనుండి సమర్థకము లగుచున్నవి. శ్రీకృష్ణునిచరిత్రయైతే సెబాసు అద్వితీయమైనదే దీనిలోని రహస్యపు మహత్త్వము విస్తరించి ముందు ముందు చూపఁబడును. దుర్యోధనుని పాత్రకూడ ఉదాహరింపఁదగినదే. పరిశీలింపఁగా వానినడక చెడ్డమార్గమువైపు అయినను వానిఅచంచలమైననిశ్చయము, వానిఅభిమానముగల స్వభావము—ఆ అభిమానమెట్టిదన సార్వభౌమత్వమునకు మృత్యువునకు మధ్యగల యేతరగతినిఁగూడ తాకలేదు. వాని మిత్రప్రేమము, వాని రాజనీతి, మొదలగునవి నిజముగా వర్ణింపదగినవి. ఈ సంబంధములో కవి వ్యాసుడు హోమరుమిల్టనులను కూడ క్రిందికి త్రొక్కివైచెను హోమరు యొక్క ప్రతినాయకుడు హెక్టరు శోచనీయదశలో నుండెను. అయినను అతడు తనదేశమును సేవించుటకయి తత్పరుడై యుండెను. కాని తన ప్రియభార్యదగ్గర సెలవుపుచ్చుకొనునపుడు తనబాలుని ముద్దు పెట్టుకొనునప్పుడును అతనిధైర్యము పటాపంచలయినట్లు కనుపట్టును. మిల్టను ప్రతినాయకుడు నాయకునికంటెగూడ నధిక తేజస్వియై అప్పుడప్పుడు ఇతడే కావ్యనాయకుడేమో అన్నంత శక్తివంతుడుగను అంత దుష్టుడుగను కనుపట్టెను. కానిందు మహాభారతములు వర్ణింపబడిన స్త్రీలు ఇలియడు వర్ణింపబడిన స్త్రీలకంటె చాలగొప్ప తరగతిలోనివారు. వారు ద్రౌపది కాలి

గోరుకుఁగూడ పోలరు. ఎడోర్రిమకీకూడ ద్రౌపదికి సాటిరాజాలదు. కవి శ్రేష్ఠుఁడైన వ్యాసుఁడు ద్రౌపదిపాత్రను నిజముగా అద్వితీయముగా జేసెను. ఆమె ధైర్యము ఆమె గంభీరస్వభావము ఆమె పాతివ్రత్యము ఆమె గృహదక్షత మొదలగుగుణములు అనుపమానమైనవి. ఇన్నియున్నప్పటికిని ఆమె మానవస్వభావమును దాటిపోలేదు. స్త్రీ జాతికి సహజమైన శోభాదాయకమైన అంతటిక్రోధమును తనభర్తపైని చూపుచుండును. ఆమె తనభర్తతో వాదవివాదములు చేయును. పతివ్రతలగుస్త్రీలకుఁ దగిన పాతములనుగూడ అప్పుడప్పుడుచేయును. ఆమె నిజమునకు క్షత్రియస్త్రీ. హెక్టరుభార్యలాగున ఆమె దారమువడకుచు కూర్చుండదు. కాని రాజపుత్రస్త్రీలకు దగినట్టి ధైర్య కార్యములను జేయును. కౌరవుల సభలో ద్యూత ప్రసంగమున ఆమె కష్టస్థితిలో పడినపుడుగూడ ఆమెధైర్యమేమాత్రమును సడలలేదు. ఆమె సభవారిని ప్రశ్నించినప్పటికి సభ యంతయును నోరు మెదపలేకపోయినది. చివరకు తనభర్తలను దాస్యమునుండి విడిపించి అప్పుడు వారితోగూడ అరణ్యావాసమునకై వెడలిపోయినది. కుంతిపాత్రకూడ ఇంతయుదాత్తమైనదే, పాండవులఅరణ్యావాసము పూర్తియైనమీదట శ్రీకృష్ణుఁడు విదురునియింట కుంతిని కలుసుకొనుటకు వెళ్ళినపుడు అతనిద్వారా ఆమె తనపుత్రులకెట్టి సందేశము పంపెనో అది క్షత్రియస్త్రీలకు ఉచితమైనది. విదులసందేశమువలె ఈ సందేశము చాల యుద్దీపకమైనది.

ఈ సందేశములో-ఎంత తీవ్రముగా చెప్పెనంటే - క్షత్రియ పుత్రుడైనవాడు జయించియైనరావలెను. లేదా చచ్చియైనను పోవలెనుగాని ఎన్నటికిని భితమడుగ రాదని. ఇట్టిసందేశము కేవలము తన లాభము కొఱకిచ్చినదిగాదు. అది అటువంటిదిగాదని — "ఆమె పాండవులు రాజ్యము పొందిన తరువాత ఆమె వారిదగ్గఱ ఎంతోకాలముఉండక ధృతరాష్ట్రునితోగూడ తపస్సుచేయుటకు వనమునకు వెళ్ళిపోయినసంగతి తెలిసికొన్నపుడైనను మనకు తెలియకపోదు. "నీవు మమ్ములను యుద్ధానికిప్రోత్సాహపఱచితివే ఇపుడు మా యైశ్వర్యమును అనుభవించకుండ వనమునకుపోవుచున్నావేమి" అని భీముఁడు అడిగినప్పుడు రాజైశ్వర్యములను చాల యనుభవించితిని నేను మీకు ఇచ్చిన సందేశము నా లాభముకోసముకాదు మీ కోసమే అని యన్నది. ఆమెచివర పాండవులకిచ్చిన సందేశము సువర్ణాక్షరములతో లిఖింపదగినట్టిది.

"ధర్మే వోధీయతాంబుద్ధి ర్మనో వోమహదస్తుచ"

అనగా మీ బుద్ధి ధర్మాచరణపైని అచంచలమైయుండుగాక. మీ మనస్సు సంకుచితముగాక విశాలమైయుండునుగాక, సమస్తమహాభారతము యొక్క తాత్పర్యము ఒక అరశ్లోకములో చెప్పవలెనంటే అది యిదే.

ద్రౌపది, కుంతి, గాంధారి, సుభద్ర, రుక్మిణి మొదలగు-మహాభారతములో వర్ణింపబడిన స్త్రీలు ఉదాత్తచరిత్రగలవారు. మరివారిలో మానవ స్వభావముయొక్క వెలుగ కూడ మహాకవి వ్యాసుడు కూడ కలిగించియుండెను. ఉదాహరణకు సుభద్రావివాహ సమయములో ద్రౌపది మత్సరభావమును ఒక సుందరవాక్యముతో అర్జుననిపైని ప్రకటించినది.

తత్రైవగచ్ఛ కౌంతేయ యత్రసాసాత్వతాత్మజా
సుబద్ధస్యాపి భారస్య పూర్వబంధః శ్లథాయ్తతే

(ఆది. 221 అధ్యాం 75)

అనగా ఏదో మొదటి బరువు మూట ఎంత గట్టిదైనను సరేకాని ఎప్పుడైతే రెండవ బరువు దానిపై పెట్టబడునో అప్పుడు వాని మొదటి మూట ఏదో కొంత పడలిపోవేపోవును" అని. కర్ణుని సంబంధములో కుంతికి గల పుత్రప్రేమ యుద్ధము తరువాతగూడ ప్రకటమైనది. ఉత్తర బృహన్నలతో "రణభూమి నుండి మంచిమంచి బట్టలు నా ఆటబొమ్మలకై తీసుకొనిరమ్మా" అని అనుట ఇట్లే అనేకోదాహరణ లివ్వవచ్చును.

మహాభారతములో వర్ణింపబడిన వ్యక్తులందఱు ఉదాత్త స్వరూపము గలవారె. ఇంతమాత్రమేగాదు. పైగా దానిలో అక్కడక్కడవర్ణింపబడిన దేవతల చరిత్రలుగూడ ఉదాత్తమైనవే. ఈ విషయములో హోమరు యొక్క ఇలియడుకంటె మహాభారతముయొక్క కౌశల్యము చాలగొప్పది. ఇలియడులో వర్ణింపబడిన యూనాని దేవతల ప్రవర్తన మనుష్యుల ప్రవర్తనకంటెగూడ చెడ్డది. వారు పరస్పరము పోరాటలు లేవదీసి హత్యలు కూడ చేయుదురు. వారి దేవతా స్వరూపము తఱచుగా నష్టప్రాయమై కనబడును. మహాభారతములోని దేవతలవర్ణన యిటువంటిదిగాదు. వారు మనుష్యుల వ్యవహారములో ఇట్లు చేయుచేసికోరు. ఎప్పుడైనను చేసుకోవలసివచ్చినచో దేవతలలాగే ప్రవర్తింతురు. ఒక యుదాహరణచూడండి. కర్ణుని సహజకవచములను అర్జునునికి ఇప్పించ కోరికతో ఇంద్రుడు ఒక

యుపాయముపన్నెను "ఎవడైనను బ్రాహ్మణుడు ఏదైన అడిగినచో అతడు లేదనడని వ్రతము కర్ణునికున్నదని ఇంద్రునికిఁ దెలియును. కనుక ఇంద్రుఁడు బ్రాహ్మణవేషము వేసికొని కర్ణునిదగ్గఱకువెళ్ళి కవచకుండలములను అడుగును. దాన శూరుడైన కర్ణుడు వెంటనే తన కవచ కుండలములను వానికిచ్చివేయును. కాని యింద్రుఁడు ఎవఁడో యొక మామూలు మనుష్యునివలె కవచ కుండలము లను బట్టలో దాచుకొని నిశ్శబ్దముగా పోడు. అతఁడు దేవస్వభావమునకు తగినట్లు ప్రవర్తించును. సంతోషించి అతఁడు కర్ణునితో ఇట్లనును, "నీవు నీ కిష్టమైన వరమును గోరుకో" అని. కర్ణుఁడు అమోఘమైనశక్తిని కోరుకొనెను. కాని "ఆశక్తిని కర్ణుఁడు అర్జునునిమీఁదనే ప్రయోగించు"నని తెలిసినను అతఁడు కర్ణునికి ఆ శక్తిని ఇచ్చివైచెను. సారాంశమేమన, మహాభారతములో వర్ణింపఁబడిన దేవతల నడతలు దేవతలకు సమానముగానే యుదాత్తములైనవి. ఇలియడు కంటె మహాభారతములో ఈ విశేషగుణమున్నది.

ఇపుడు కవి తనపాత్రలను స్వభావమును కథారచనను ఎట్లుచేసెనో విచారణ చేయఁబడును. భిన్న భిన్న వర్ణనలనుబట్టియు విశేషించి సంభాషణలనుబట్టియు స్వభావము ఉద్ఘాటింపఁబడును. ఈ సంబంధములోగూడ మహాభారతముయొక్క తరగతి అన్నిటికంటె శ్రేష్ఠమైనది. మహాభారతములోని రామణీయకము అందుగల సంభాషణలలోనున్నది. దానిలో ఇవ్వబడిన సంభాషణలలో సమానమైన ప్రభావశాలియైన భాషణము ఇతరమగు చోట్ల చాల తక్కువగానే కనుపట్టును. ఆ భాషణలద్వారా భిన్న భిన్న పాత్రలు ఉత్తమ రీతికిఁ జెందిన వ్యక్తులవుదురు. ఇట్టి భాషణల కొన్ని యుదాహరణములివి.

ఆదిపర్వములోని రంగములో దుర్యోధనుఁడు కర్ణుఁడు అర్జునుఁడు భీముల సంభాషణములు, వనపర్వము మొదట శిశుపాలునికి భీష్మునికి అయిన సంభాషణలు, వనపర్వములో మొదట యుధిష్ఠిర భీమ ద్రౌపదుల సంభాషణలు, ద్రోణపర్వములో ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని చంపుసమయములో ధృష్టద్యుమ్నుల సాత్యకి అర్జుని యుధిష్ఠిరుల సంభాషణలు. కౌరవ సభలో శ్రీకృష్ణునిభాషణములు అన్నిటికంటె శ్రేష్ఠములు. కర్ణపర్వములో కర్ణునిరథముపైని ఆక్రమణ చేసిన సమయములో శ్రీకృష్ణుఁడెట్టి భాషణములు చేసెనో అవియు ఇట్టివే. ఇవియు నింక నితరభాషణములు భారత

కర్తయొక్క యుత్తమ కవిత్వమునకు సాక్షులు. భారతములో వర్ణింపఁబడిన వ్యక్తుల భాషణములో విశేషతయేమంటే వారు తేజస్వులు నిర్భయులు. ఉదాహరణకు దుర్యోధనునికి ఉపదేశించునపుడు విదురుఁడు వానినిగూర్చి తీవ్రముగా బెదరించుటలో కొంచెముకూడ ముందువెనుకలు చూడఁడు. విదురునికి అతని జ్యేష్ఠత్వస్థితి అనుకూలమైనదేయని చెప్పవచ్చును. కాని శకుంతలకైతే ఇట్టి ఇదికూడ ఆధారములేదు. ఇంతయైనప్పటికిని ఆమె దుష్యంతునితో రాజసభలో చేసిన సంభాషణలు నిర్భయములు సదాచార సంపన్నమైనవి. సద్గుణముల గల ఒక ఆశ్రమవాసినియైన కన్యకు శోభను గలిగించునవి. కాళిదాసుని శకుంతలలోను వ్యాసుని శకుంతలలోను భూమ్యాకాశములకున్నంత తేడాగలదు. దుష్యంతుఁడు శకుంతలతో నిండు రాజసభలో ఇట్లనెను.

"నేనైతే నిన్నెపుడు చూడనైనచూడలేదే అటువంటప్పుడు నేను నిన్ను పెండ్లిచేసికొను సంగతి ఎట్లు సంభవించును." అని ఆసమయములో కాళిదాసుని శకుంతలతో సమానముగా ఆమె మూర్ఛితురాలుగాలేదు కాని ఆమె ఈ క్రిందివిధముగా చెప్పుచునే సభాస్థలమునుండి వెలికి వెళ్ళబోవును. ఇంతలో "ఎప్పుడైతె నీవు సత్యమును ఆదరించవో అప్పుడు నేను నీ సహవాసమునుగూడ గోరను. పతిపుత్రులకంటెను సత్యమే. తో విలువయైనది" అని.

కర్ణపర్వములోని శల్యకర్ణుల సంభాషణములుకూడ నిశ్లే తేజోవంతములు ఆవేశయుక్తములే, దానిలోని హంసకాకుల కథకూడ చాల చిత్తాకర్షకమైనదె. నీతితత్త్వములను హృదయాకర్షకముగా జేయుటకై చెప్పఁబడిన పశుపక్షులకథలు అన్నిటికంటె ప్రాచీనమైన సుందరమైన యుదాహరణములు. అనఁగా ఈ పద్ధతిని ఈ సఫ్ కవియె ప్రారంభించెనని మనమనుకొనరాదు. ఇవి ఈ సపుకంటె చాలపూర్వమైనవె, వ్యాసుని కావ్యములో ఇట్టి రెండుమూఁడు కథలు మనముదాహరణముగా అంగీకరింపవచ్చును. వ్యాసుఁడు తన కావ్యములో చూపిన సంభాషణలనుబట్టి పాఠకుల మనస్సులో నీతితత్త్వోపదేశములు బాగుగా ప్రతిబింబింపఁగలవు ఇందు సత్యవాదిత్వము ఋజుత్వము స్వకార్యదక్షత ఆత్మనిగ్రహము ఉచితాభిమానము ఔదార్యము మొదలగు సద్గుణములు పోషింపఁబడినవి. మహాభారతములో ఆత్మగతభాషణములులేవు. పాశ్చాత్యగ్రంథములలో ఆత్మగత

భాషణములు ఒక మహత్త్వయుక్త భాగములుగానున్నవి. ఆత్మగతమును వక్తృత్వపూర్ణముగా తయారుచేయుటకు ఆ గ్రంథకర్తల ప్రయత్నము జరుగుచునుండును. మన యీ గ్రంథములలో తఱచు ఇట్టి భాషణములు లేవు. వాస్తవికస్థితి విచారించినచో ఆత్మగతభాషణములను ఎప్పుడు ఎవఁడును చేయఁడని. కేవలము చింతనచేయుచుండునని, లేక ఇతర విషయములను విశేషముగా విచారణచేయఁడని మనము అంగీకరింపవలసి యుండును కాని యీ ప్రశ్న విలక్షణమైనది.

మహాభారతములోని వర్ణనశైలి పైతరగతికిచెందినది. దానిలో చేయఁబడిన వర్ణనలు హోమరు మిల్టనులశైలికంటె శక్తిలోను తగ్గిపోవు. వర్ణనలు చేయునపుడు ఎట్టి గడబిడలు కనిపింపవు. మాటలు సరళమై తేజోవంతములై యుండును. అట్లే దృశ్యముల వర్ణనలు స్త్రీ పురుషుల స్వరూపస్వభావములు వేషభాషల వర్ణనలు పూర్తిగా ఉన్నప్పటికి సరిగా మనోహరములుగా నుండును. వ్యాసుఁడు చేసిన ప్రత్యక్ష యుద్ధవర్ణనలు చాల సరసమైనవి. వానిని అద్వితీయములనికూడఁ జెప్పవచ్చును అక్కడక్కడ ఒకే ప్రసంగము మాటిమాటికివచ్చుటవల్ల పాఠకుల మనస్సు విసుగు చెందునన్నమాట నిజమేకాని ఈ ప్రసంగములు సౌతిచేఁ జెప్పఁబడెనన్న సంగతి మనము జ్ఞాపకముంచుకోవలెను ఇంతేగాక ఇంకొక సంగతి యున్నది. యుద్ధములోని ప్రధానశస్త్రములుధనుస్సుబాణములును అపుడు తఱచురథికులలో ద్వంద్వయుద్ధములు జరుగుచునుండును. అప్పటి యుద్ధ ప్రసంగముల కల్పన మనము మన మనస్సులో తలపవలయును. ఇట్లు వందలయేండ్లనుండి రథయుద్ధాలు గజయుద్ధాలునశించిపోయినవి. అందుచే అట్టి యుద్ధములకెట్టి నైపుణ్యము శౌర్యము అవశ్యకముగా ఉండవలెనో అట్టి సరియైన యూహామనమిప్పుడు చేయలేము. దీనికి ఫలితముగా వ్యాసుఁడు చేసిన యుద్ధవర్ణనలు అప్పుడప్పుడు కాల్పనికములుగ తోచును. ఇట్టియుద్ధములలో జరిగిన వందలకొలది వేలు వేలు ప్రసంగములన్నిటి వర్ణన సూక్ష్మముగా వక్తృత్వపూర్ణముగా జేయఁబడినవి. మహాభారతములోని యుద్ధప్రసంగముల కథలను విన్నప్పుడు వీరరసము ఉత్పన్నము కాకుండనుండదు. మహాభారతమును వినుటవల్లనే శివాజీవంటి వీరుల హృదయాలలో శౌర్యస్ఫూర్తియుదయించినదన్న సంగతి ప్రసిద్ధమే.

సృష్టిసౌందర్యముల వర్ణనము మహాభారతములో అంతగా లేవు. ఉన్నను రామాయణవర్ణనలవలె సరసములుగావు. ఇంతయైనప్పటికి మహాభారతము యొక్క తరగతి ఇతర కావ్యములకంటె శ్రేష్ఠమైనదె. పలయన దీనిలోని వర్ణనలు ప్రత్యక్షముగా జూచువారికి వనపర్వములోని హిమాలయ వర్ణనలు ఆహిమాచ్ఛాదితమైన యున్నత ప్రదేశములలో ప్రత్యక్షముచేసుకొన్న వాని ముఖమునుండియె కావలసినవి. ఎట్టి గాలితుపానులలో ద్రౌపదిపాండవులు చిక్కుకొన్నారో అట్టి గాలితుపానులు హిమాలయములలోను అగుచు నుండును. అట్టి గాలితుపానుల వర్ణనలు అంతసరసముగా అంత వాస్తవిక ముగానున్నవి. ఆ ప్రదేశములలోఉన్న ఏకవియో మాత్రమే అట్టి వర్ణనలు చేయగలడు గంధమాదన పర్వత వర్ణన అతిశయోక్తులతో నిండియుండుట వల్ల అవి కొంతకాల్పనికముగా తోచునుకాని నిజముగాచూచినచో ఆగంధ మాదనపర్వతముకూడ మేరు పర్వతమువలెనే కొంతకొంత కాల్పనికమె.

మహాభారతములోని స్త్రీపురుషులవర్ణన అత్యంతము మనోహరము గాను మర్యాదసహితముగాను చేయఁబడినది. ఆధునిక సంస్కృతకవుల వలె నిందు స్త్రీల సౌందర్యవర్ణన గ్రామ్యముగా జేయబడలేదు. యుధిష్ఠి రుఁడు చేసిన ద్రౌపదివర్ణన చూడఁదగియున్నది. "ఆమె అంత ఎత్తుగాదు. అంత పొట్టిదియుగాదు. అంత స్థూలముగాదు అంత సన్నముగాదు. ఆమె నేత్రములు శరదృతువందలి కమలపత్రములవలె విశాలములు. ఆమె శ్వాససుగంధ యుక్తము. మామూలు మనుష్యులు కోరుకొనుచున్నట్లు ఆస్త్రీ ఎంత యుండవలెనో అంత అందముగానున్నది. నేను పరుండిన పిదపపరుండును. నాకంటె ముందుగానే లేచును. ఇట్టి స్త్రీ ద్రౌపదిని నేను తగిన వేళకలిసికొనుచుందును" అని. అగుఁగాక బృహన్నల వేష ములోనున్న అర్జునుని వర్ణన చాల మజాతోఁగూడినది. సరిగా వర్ణింపఁ బడినది. భీష్ముఁడు కర్ణుఁడు యుద్ధమునకుఁ బోవునప్పటి వర్ణనము, ఆది పర్వములో రంగభూమియందు పిలువకుండవెళ్లు కర్ణునివర్ణనము మిగుల హృదయాకర్షకమైనది. ఈ యుదాహరణలవల్ల ఈ వర్ణన విషయమెట్టిదో తెలిసికొనగలమని ఆశింతుము, ఇప్పుడు మనము ఈకావ్యములోని సారిష యుంగము అనఁగా వృత్తమును భాషనుగూర్చి పరిశీలింతము.

మహాభారత రచన ముఖ్యముగా అనుష్టుప్ ఛందస్సులో చేయఁ బడినది, చాలచోట్ల ఉపజాతివృత్తములుగూడ జేయఁబడినవి. ఈ మహా

కావ్యములోని గంభీరమైనకథా వర్ణనలకు ఈ వృత్తములు అన్నివిధముల యోగ్యమైనవి. నేటి సంస్కృత మహాకావ్యములలో ఈ వృత్తములే యుపయోగింపఁబడుచున్నవి. పురాణములలో ఉప పురాణములలోను ఇతర సాధారణ గ్రంథములలోనుగూడ అనుష్టుప్ ఛందస్సే యుపయోగింపఁబడుచున్నది. కనుక ఇది మామూలుగా గనిపించును. కాని మహాకవుల అనుష్టుప్ ఛందస్సులోని శ్లోకములు చాల ప్రౌఢములు గంభీరములును. ఈ సంగతి రఘువంశములోని మొదటి నాల్గు సర్గములలోని శ్లోకముల వల్ల ప్రతివారిమనస్సుకు తట్టును. మహాభారతములోని భాషగంభీరము ప్రౌఢమునై యున్నది. ఈ విధముగా అది సరళము శుద్ధమునైనదికూడ, సరళత్వము ప్రౌఢత్వముల కలయిక తఱచు ఒకస్థానములో చాల తక్కువగా కనుపడుచుండును. ఆధునిక మహాకావ్యములలోని భాష అవశ్యము ప్రౌఢమైనదికాని ఈ ప్రౌఢత్వముకై వానిలో సరళత్వము విడువఁబడుచుండును. శబ్దములరమణీయధ్వని పాఠకులకు ఎక్కువగగానవచ్చును సరే కాని శబ్దముల యర్థము తెలిసికొనుటలో వారు కొంతసేపు ఆగవలసి వచ్చును. ఆలోచింపవలసియుండునుగూడ. ఆధునిక పురాణగ్రంథముల స్థితి దీనికి భిన్నమైనది. వానిభాష సరళముగానే యుండునుగాని అది చాల యశుద్ధమైయుండును. దానిలో పేరునకైనను ప్రౌఢత్వము సరళత్వము ఈ రెండును గనిపించును. శాదుకభాషలో నిష్ణాతుఁడైన ప్రతిభాశాలియైన యొక కవి ఎట్టిభాషను ఉపయోగించునో అట్టి భాషయే మహాభారతములోనిది. వాని గాంభీర్యమును దెలుపుట కెట్టి భాష యుండవలెనో పౌఢత్వము విషయములో మిల్టనుకావ్యభాష అట్టిదేయని ఆర్నాల్డు కవి చెప్పెను. కాని అది శుద్ధము అమిశ్రితమునైన ఆంగ్లభాష కాదు. అది లాటిను గ్రీకు శబ్దములలో వాటిరచనలతో పూర్తిగా నిండియున్నది. సారాంశమేమన, భాషా దృష్టితో చూచినచో మహాభారతముయొక్క తరగతి మిల్టను కావ్యముకంటెను మున్నతమైనది. మహాభారతములో గొన్ని భాగములలో ఉపయోగింపఁబడిన భాషన బట్టి-ఎప్పుడైతే సంస్కృత భాష వేలకొలదిజనులవ్యవహారభాష యైయున్నదో అప్పుడు శుద్ధముసరళములునైన సంస్కృతభాషలో ప్రౌఢశబ్దరచన ఎంతవఱకు ఉండుట సంభవములు కాగలదో-మనకు ప్రకటమగును.

మహాభారతములోని వ్యాసకృత మూలభాగమునందలి భాష ఇతర భాగముల భాషకంటె సరసమై సరళమై గంభీరమై కనుపట్టుచున్నది. సౌతి

కూడ తక్కువ ప్రతిభగల కవికాఁడు, కాని అతనికాలముతో సాధారణ మానవుల వ్యవహారములో సంస్కృతభాష ప్రచలితమై లేదు. ఇందువలన అతఁడు రచించిన భాగములోని భాషలోఁ గొంత తేడాయుండుట సంభవమె. వ్యాసకృత మూలభారత భాష ఎంత ప్రౌఢము, శుద్ధము సరసము సరళము నైనదో తెలిసికొన గోరువారు - భగవద్గీతలోని భాషను తప్పక చూడ వలయును. ఈ భగవద్గీతభాగము ఎట్లైతే సమస్తభారతమును మథింపఁగా వచ్చిన యమృతమో అట్లే దానిభాషకూడ అమృతమువంటిదే. ఏవిధంగా దానిలో మహాభారతములోని అన్నిటికంటె శ్రేష్ఠతత్త్వజ్ఞానము నిండి యున్నదో ఆవిధముగానే సంస్కృత భాషమీద వ్యాసునికున్న సామర్థము ఎంతయున్నదో ఏ శిఖరమువఱకు చేరియున్నదో అది యంత ఆ భగవద్గీత గ్రంథములో చూడవచ్చును.

సంస్కృతభాషలో సాహిత్యమంతటిని భాషాదృష్టితో జూచినచో భగవద్గీతకు సాటివచ్చు గ్రంథమేదియు లేదు. సంతృత్వము, శబ్దరచనశుద్ధి, వాక్యములలోని శ్రుతి మనోహరము, గంభీరధ్వని మొదలైనవి భగవద్గీత లోనున్న అద్వితీయగుణములు. ఈ సర్వోత్తమైన భగవద్గీతాములోని ప్రతియొకశబ్దము ప్రతియొకవాక్యము సువర్ణమయమైనది. అవి నిజముగా బంగారుముక్కలవలెచిన్నవి, బరువు విలువగలవి. తేజోవంతములైనవి.

పైని జెప్పఁబడిన గుణములేకాకుండ ఇంకొక గుణమునుబట్టికూడ ప్రపంచములోని అన్ని ఆర్షమహాకావ్యములలోను అందు ముఖ్యముగా మహాభారతము యొక్క శ్రేష్ఠత్వమును స్థాపించుచున్నది. ఏ మహా కావ్యములలోని ప్రాణము లేక జీవాత్మ ఇదేయని మనము చెప్పలేము. కవి వివిధరీతులద్వారా పాఠకులకు మనోరంజనము చేయుచునే వేలు వేలు ప్రసంగములను దృశ్యములను వర్ణించునుగాని మనోరంజనము చేయుటకు అతనికి ఇంకొక హేతువు కనుపట్టదు. దానిలో ఒక ప్రధాన హేతువున్నది. అది సమస్త గ్రంథములో ఒకసామాన్యసూత్రమువలె గుచ్చఁబడియున్నది. దానివల్ల ఈ కావ్యములోని ప్రాణముయొక్క లేక జీవాత్మయొక్క పరిచయము స్పష్టముకాగలదు. ఏదైన ప్రసంగమును వర్ణించునపుడు వ్యాసుడు నేత్రముల ముందు ఎల్లప్పుడు ధర్మమునె ఒక వ్యాపక హేతు వునుగా ప్రదర్శించుచుండును. "మనుష్యుఁడు ధర్మమును నాచరించుచుండ వలయును. ఈశ్వరునికి మనుష్యునికి సంబంధించిన తన కర్తవ్యములను

పాలింపవలెను. ధర్మాచరణవల్లనే వాని యాశయము నెఱవేరును" అని యాతని యుపదేశము. ఆ ధర్మాచరణమునుండి విముఖులగుటవల్లనే వారి యాశయములన్నియు నశించిపోవుచున్నవి. వాడెంత కష్టస్థితిలోనున్నను సరే వానిస్థితి ఎంతచెడ్డదైనను సరేకాని మనుష్యుఁడు ధర్మమునుండి మాత్రముజాఱరాదు. ఈయుపదేశానుసారముగానే సౌతికూడ అక్కడక్కడ ఉపదేశములు చేసెను. మహాభారతమంతటిలోను ధర్మము విశేషముగా నింపఁబడియున్నది, ఏ యాఖ్యానమునైననుసరే లేక ఏపర్వమునైనను తీసి కొనుఁడు "యతోధర్మస్తతో జయః" ధర్మమెటో జయమటు" అన్న ప్రతిధ్వనియె ముఖ్యతత్త్వముగా మనకు గనిపించును. ఈ విధముగా పూర్వపశ్చిమమహాకావ్యములలో ఎక్కడనుగూడ ధర్మమును నీతిని ప్రధాన విషయముగా నుంచు ప్రయత్నము చేయబడలేదు. స్వయముగా వ్యాసుడే తనమాటలలో మహాభారతముచివర భారతి సావిత్రి అనుపేరుగల నాలుగు శ్లోకములలో తనగ్రంథములోని గూఢతత్త్వమంతయు ప్రకటముచేసెను. వానిలోని శ్లోకమిది.

"ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష నచ కశ్చి చ్ఛృణోతి మే
ధర్మాదర్థశ్చ కామశ్చ స ధర్మఃకిం నసేవ్యతే"

అనగా నేను చేతులు పైకెత్తి గట్టిగా అరచుచున్నాను. నా మాట ఎవడును వినిపించుకొనుటలేదు "ధర్మమువల్లనే అర్థముకామము సిద్ధించును గదా ఆధర్మమును ఎందుకు మీరుసేవించరు" అని. వ్యాసుని యాహృదయ పూర్వకమైన ఉపదేశమే ఈ గ్రంథములోని తాత్పర్యము. దీనివల్లనే సమస్త ప్రపంచములో ఈ గ్రంథమునకుగల శ్రేష్ఠత్వము స్థిరపడుచున్నది.

ఈ మహాభారతమెంతపెద్దదో, దానిమూలభాగములేవో ఎంతటివో మూలభాగమునకు నేటి స్వరూపమెట్లు సిద్ధించినదో ఈగ్రంథమునకు కర్తలెవరెవరో అనువిషయములు విస్తారముగా "మహాభారతకరలు" అను భాగములో వివేచనచేయబడినవి. ఇపుడా విషయమునే సంగ్రహముగా సింహావలోకనము చేయబడును. మహాభారతములో ఇంచుమించు లక్ష శ్లోకములున్నవి. ఇంతటి పెద్దరచన ఒకేకవి రచించుట సంభవముగాదు. ఈ గ్రంథరచనను ఒకరికంటె నెక్కువమంది గావించియుందురని దీనివల్ల తెలియుచున్నది. ఇద్దరుకర్తలని గ్రంథములవల్లనే తెలియుచున్నది. వారు ఎవరనగా వ్యాసుఁడు, సౌతియును. వ్యాసకృతమగు మహాభారతమందును

మొట్టమొదట వైశంపాయనుడు ప్రకటపఱచెను. దీనివల్ల ముగ్గురు కర్త లనుటలో ఏ యిబ్బందియు లేదు. వ్యాస వైశంపాయనుల గ్రంథములో ఎక్కువగా తక్కువ యెక్కువలుండవు. వైశంపాయనుని గ్రంథములో 24000 శ్లోకములు డునని తెలియుచున్నది.

మూలగ్రంథము పేరు జయము, వైశంపాయనుఁడు దానికి భారత మని పేరుపెట్టెను. అతడె మొట్టమొదట భారతసంహితను చదివెను. ఆశ్వలాయన సూత్రములో అతఁడు భారతాచార్యుఁడని పిలువబడెను. భారతములో 8800 కూటశ్లోకములున్నవందురు. వ్యాసకృత భారతము లోని శ్లోకములసంఖ్య ఇదేయని కొందరి యూహ, కాని యీ యూహ సరియైనదికాదు. వ్యాసకృతభారతములోని శ్లోకములసంఖ్య ఇంతకంటె చాల యెక్కువ యుండియుండవలయును. వ్యాసుడు పూర్తిగా మూడు వత్సరములవరకు ప్రయత్నించి యుద్ధము ముగిసినపిదప తన గ్రంథరచనను చేసెను. వైశంపాయనుడు దానిని కొంచెమెక్కువగా పెంచెను. దానిని 24000 శ్లోకముల గ్రంథముగా తయారుచేసెను. మఱి చివర సౌతిదానిని ఒక లక్ష గ్రంథముగా చేసెను. ఇంత పెద్ద గ్రంథమును రచించుటకు సౌతి సమయములోని సనాతనధర్మముయొక్క పరిస్థితికారణమైయుండును. సౌతిసమయములో సనాతనధర్మముమీద బౌద్ధ జైనమతముల యాక్ర మణలు జరుగుచుండెను. సనాతనధర్మములోగూడ ఆసమయములో అనేక మతాంతరములు ప్రచలితమైయుండెను. వానిలో పరస్పరము విరోధము గూడ గలుగుచుండెను. కనుకనే చిన్న చిన్న గాథలను ఒకచోట చేర్చి మతాంతరవిరోధములన్నిటిని తొలగించి ఏదో యొకగ్రంథములో సనాతన ధర్మముయొక్క యుజ్జ్వలరూపము ప్రకటింపఁబడవలె ననువిషయము ఆవశ్యకమైయున్నది.

ఈ రాష్ట్రీయకార్యము సౌతి పూర్తిచేసెను. ఇట్లు చేయునప్పుడు అతఁడు అన్ని పుక్కిటి కథలను ఒకచోట చేర్చుటయేగాక ఇతరపద్ధతుల ద్వారాగూడ మహాభారతములో అనేకమైన యుపయోగకరమైన విషయ ములను సంగ్రహపఱచెను. సారాంశమేమనగా ధర్మమును నీతిని తత్త్వ జ్ఞానమును దెలుపునొక బృహద్గ్రంథముగా దానినిగూర్చెను. అత డేయే భాగములనుపెంచెనో పూర్తిగా సరిగాచెప్పలేము. అయినను ఈ విషయ ములో గొంతయూహచేయవచ్చును. సౌతి ఏయేభాగములను విస్తరించెనో

వానిని గూర్చికూడ ఇదివఱకే పరిశీలించితిమి. చివరికి కవిత్వ దృష్టితో గూడ వ్యాసభారతము ఎంత శ్రేష్ఠమైనదో కూడ బరిశీలించితిమి. ఈ భారతములో సౌతి చాలపూర్తిచేసెను. కాని దీనివల్ల గ్రంథమున క్షేమాత్రము న్యూనతగలుగలేదు. సరిగదా పైగా ధర్మము, నీతి, ఉచితకథాసంగ్రహము ఈ గ్రంథములో కలుగుటవల్ల దీనికి రాష్ట్రీయ స్వరూపము సిద్ధించినది. దీనివల్ల మూలగ్రంథ సమయముయొక్క పరిస్థితేకాక సౌతి దానిని పెంచు నప్పటి పరిస్థితిగూడ దీనిలో ప్రతిబింబించినది. ఈ సౌతియొక్క కాలము ఏదియనువిషయము విచారించుట యవసరము. ఈ సమయము ఇదివరలో మేము చెప్పినట్లు అశోకుని సమయమో లేక ఇంకొకటో చూడవలసి యున్నది.

# మహాభారత మీమాంస

## రెండవ ప్రకరణము

### మహాభారత గ్రంథకాలము

మహాభారతముయొక్క కాలమునకు సంబంధించిన విషయములో రెండు ప్రశ్నలిమిడియున్నవి. అందులో మొదటిప్రశ్న యిది. ఏ రూపములో ఇప్పుడుగూడ మహాభారతమును జూచుచున్నమో దాని కారూపమెప్పుడు ఏర్పడినది. ఇంక రెండవ ప్రశ్నయిది. మహాభారతమెప్పటిది అని. సౌతి మహాభారతములో అనుక్రమణికలను జోడించి ప్రతి యొక పర్వములోని యధ్యాయముల సంఖ్యను శ్లోకముల సంఖ్యను ఇచ్చియుండెను. ఈ యనుక్రమణికలనబట్టి పరీక్ష చేసినమీఁదట (ఇది మొదటనే చూచియున్నాముకూడ) ప్రచారములోనున్న మహాభారతములో సౌతి సమయము తరువాత ఏమియు గొత్తది కలుపబడలేదని తెలియును. కనుకనే ఇపుడు ప్రచారములోనున్న మహాభారతమును సౌతి మహాభారతమును ఒకటేయని మనము నిశ్చయముగా జెప్పగలను. ఈ గ్రంథముయొక్క కాలనిర్ణయము దీనిలోపల పైని ఉన్న ప్రమాణముల యాధారముపైని నిశ్చయపూర్వముగా చేయవచ్చును. మొదటనైతే మహాభారతము వ్యాసుఁడు రచించెను. దానిని మరల అతని తరువాత వైశంపాయనుని రచన జరగినది. అయితే ఈగ్రంధము మరెపుడు ఏర్పడెనను ప్రశ్న బయలు దేఱుచున్నది. యథార్థమున కీప్రశ్న వికటమైనది దీనిని నిర్ణయించుటకు మహాభారతములోని విశిష్ట భాగములను పరిశీలింపవలయును మఱి ఆ భాగముల పరిశీలనములకు సంబంధించినవిషయము భారతయుద్ధముతో వెళ్ళి కలియుచున్నదా? ఈప్రశ్నను విచారించునపుడు ఊహామీద ఎక్కువ యాధార పడవలసివచ్చుచున్నది మఱి విద్వాంసులుగూడ ఈవిషయములో భిన్నభిన్నమైన యూహాలు చేయుచున్నారు. కనుకనే యీ ప్రశ్నను ఇప్పుడే వేఱుచేసి విడిచిపుచ్చి ఈ భాగములోని మొదటి ప్రశ్న విచారించఁ బడును. "ప్రచారములోనున్న మహాభారతములో ఒక లక్షశ్లోకములున్న"

వని మహాభారములో జెప్పబడెను. ఆలోచించిచూడగా, ప్రత్యక్షముగా గలిపినది రెండు నాలుగు వేలకంటె తక్కువకావచ్చును అయినను మహాభారతము లక్షశ్లోకములదను లోకుల యొక్క యీ భావన మహాభారత కాలమునుండియే వచ్చుచున్నది. ఇట్టి స్థితిలో మహాభారత గ్రంథము ఒక లక్ష శ్లోకములది యెప్పుడైనదను సంగతి నిశ్చయించుటకు ముందు వెలుపలి ప్రమాణములలో "ఒక లక్షాత్మక గ్రంథమను నుల్లేఖము ఎక్కడెక్కడ దొరకచున్నదో చూడవలసియున్నది. ఇటువంటి యుల్లేఖము రెండుచోట్ల గనుపట్టుచున్నది. గుప్తకాలపు లేఖయందు "శతసాహస్ర్యాం సంహితాయాం" అని యున్నది. ఈ లేఖయొక్క కాలము * క్రిస్తు సంబంధమగు సంవత్సరము 445. ఇందువలన, మహాభారతమునకు దాని వర్తమాన రూపము క్రీస్తుసంవత్సరము 400నకు మునుపు ప్రాప్తమైయుండెనని ప్రకటమగుచున్నది. దీనిబట్టి కొందఱు మహాభారతమునకు వర్తమాన స్వరూపము గుప్తుల సమయమునం బ్రాప్తించెనని యూహించుచున్నారు. కాని యిది పొరపాటు, ఎందుచేత? ఏకలక్షాత్మక గ్రంథముయొక్క యుల్లేఖమింతకుం బూర్వము కూడ జూడంబడుచున్నది. అది యూనానుల లేఖయందున్నది. ఈ గ్రీకు లేఖకుండు లేకవక్త డాయోన్ క్రాయస్టోము. ఇతండు క్రీ॥ శ॥ ప్రథమశతాబ్దియందు దక్షిణహిందూస్థానములోని పాండ్య కేరళాదిభాగములకు వచ్చియుండెను. ఇతండు హిందూస్థానమున నొక లక్ష శ్లోకముల ఇలియడు కలదని వ్రాసెను; ఏ ప్రకారము ఇలియడు గ్రీకుల రాష్ట్రీయ మహాకావ్యమో, అదే ప్రకారము మహాభారతము హిందుస్థానమునందలి రాష్ట్రీయ మహాకావ్యము. ఈ యూనానీ లేఖకుడు మహాభారతమని పేరుచెప్పియుండలేదు. అయినప్పటికిం బై యుల్లేఖమునకు సంబంధము మహాభారతముతోడనే యున్నదనటకు సందేహము లేదు. ఈ వ్రాత రామాయణవిషయమునగాని శంకింపవీలుపడదు. ఎందుచేత? ఆలోచింపంగా వర్తమానరామాయణగ్రంథ మాపరదేశివచ్చిన సమయమున నుండెను. అయిననయ్యది లక్షాత్మకము కాదు. అదిబొత్తిగాం జిన్నది అనగా దాదాపు దీనిలో జతుర్థాంశమున్నది. తాత్పర్యము ఈ వ్రాత మహాభారత

---

* ఉచ్చకల్పము యొక్క మహారాజు సర్వనాథుని సంవత్. 197లో లేఖ. (గుప్తఇన్స్క్రిప్శన్సుభాగము. 3.134పుట)లో కలచురీ సవత్తయియున్నది. అనంగా ఈ లేఖ 197 + 170 = 376 శకపుది అనంగా 445 సంవత్సరపుది.

మునే వెంబడించుచున్నది. డ్రాయోన్ క్రాయసోస్టోముయొక్క సమయము క్రీ॥ సంవత్సరము 50నకు సమీపపుదియని యొప్పుకొనునెడల, నపుడు దక్షిణపాండ్యదేశమున మహాభారతము వ్యాప్తమై యుండెననియుఁ గాఁబట్టి సౌతియొక్క మహాభారతము దానికంటె ననేక సంవత్సరములకుముందే తయారై యుండుననియు స్పష్టపడుచున్నది. ఈ గ్రీకు వక్తయొక్క వర్ణనము నందఱికంటె ముందు వెబరుచేసియున్నాడు. అతని యూహ ననుసరించి ఇలియడు శబ్దముచేత మహాభారతమే బోధింపబడుచున్నది. అతడు చెప్పుచున్నాడు దేనియొక్క శ్లోకసంఖ్య మహాభారతమునంత పెద్దదో, యట్టి మహాకావ్యము హిందూస్థానమున నున్నందులకు నన్నిటి కంటె మొదటి ప్రమాణము డాయోను క్రాఁయసోస్టోముయొక్క లేఖయందు నగుపడుచున్నది. ముందునకుఁబోయి వెబరుచెప్పుచున్నాడు — "మేగాస్థినీజుయొక్క గ్రంథమున మహాభారతముగుఱించి యేమియు వ్రాయబడని కారణముచేత మహాభారతారంభము మేగాస్థినీజునకు దరువాతనై యుండును, కాని యిచ్చట వెబరు పొరపడుచున్నాడు. మేగాస్థినీజునా మకుఁడైన గ్రీకు రాజదూత హిందుస్థానదేశమున జంద్రగుప్త చక్రవర్తి యొక్క యాస్థానమందునుండెనని ప్రసిద్ధియున్నది. అనగా నతని సమయము క్రీ॥ సం॥ 300. అపుడు హిందుస్థానసంబంధులగు నేయే విషయము లతనికి దెలిసెనో, వానినన్నింటి నతఁడు ఇండికయని పేరుగల గ్రంథమున వ్రాసియుండెను. విచారింపగా నా గ్రంథము నష్టమైపోయినది. అయినప్పటికి నితర గ్రంథముయొక్క యుల్లేఖము లేదన్నమాటనిజము; కాని మేగాస్థినీజు యొక్క గ్రంథమంతయు నిప్పుడు లభింపకపోవుటచేత నా గ్రంథమున భారతముమాట లేనే లేదని నిశ్చయపూర్వకముగా జెప్పఁజాలము. అతని సమయమున నేకలక్షాత్మక మహాభారతము లేకుండెననియు, యథార్థమున నది లేదనియుగూడ జాలవఱకింతయే చెప్పబడజాలును. కాని యిందు నా సమయమున భారతమే లేదని చెప్పబడజాలదు. కనుక మనము మహాభారత కాలము నశోకునిసమకాలికముగా నమ్మవలయును. చంద్రగుప్తునికాలమున నొక లక్ష శ్లోకముల మహాభారతము లేకయుండును. చంద్రగుప్తుని మనుమడగు నశోకుని సమయమున నది తయారుచేయబడియుండును. అనగా క్రీ॥స్తుంవత్సరముకన్న నించుమించు 250 సంవత్సరములకుబూర్వ మది యుత్తర హిందుస్థానమునఁదయారై సుమారు 300 సంవత్సరమున దక్షిణమువైపు కన్యాకుమారిదాక ప్రచలితమైయుండును క్రీ॥ శ॥ 50

సంవత్సరమునకు సమీపముగా నచ్చట క్రాయసోస్టోమునకు దృష్టిగోచరమై యుండును.

ఈ ప్రకారము మహాభారతకాలము అన్నిటికంటె దిగువ మేర క్రీ॥ సంవత్సరము 50 అగుచున్నది. డాయోన్ క్రాయసోస్టోముయొక్క సాక్ష్యము చాల మహత్త్వముకలదియు, దృఢమైనదియు నై యున్నది. అందు నేకలక్షాత్మక గ్రంథముయొక్క యుల్లేఖము స్పష్టమగురీతిని జూడఁబడుచున్నది. ఇట్టి దశయందు జాలమంది యీ సాక్ష్యమునులేక ప్రమాణమును లక్ష్యముచేయకుండుటయు, మహాభారతకాలమును క్రీస్తు సంవత్సరము 50నకు నివలగా నీడ్చుటకు బ్రయత్నముచేయుటయు జాలనధికమగు తప్పిదమైయున్నది. ఈ విద్వాంసులకు నీ సాక్ష్యముయొక్క ప్రమాణముయొక్క జాడయే బొత్తిగా దెలియని యట్లుతోచుచున్నది. ప్రసిద్ధజర్మను విద్వాంసుడగు ప్రొఫెసరు బేబరున కీప్రమాణము తెలిసియుండెనని మనము పైని జెప్పియుంటిమి. కాబట్టి యీ ప్రమాణమెందాక గొట్టివేయబడదో, అందాక మహాభారతకాలము క్రీ॥ 50వ సంవత్సరమున కీవలగా నీడ్చుట వీలుపడదు. ఇపుడీ సంబంధమున నెక్కువవిచారింపక, మనము మహాభారతకాలమునకు నెగువమేర యెదియో యాలోచింతము. మహాభారతమున యవనులవర్ణన మాటిమాటికి జేయబడియుండుట ప్రథమమైన మహత్త్వవిషయము. వారి కుశలతను వర్ణించు2* నపుడు, వారు గొప్పయోధులని

---

* హాప్కిన్సు, మహాభారతమున గ్రీకు (యూనానీ) శబ్దములకుఁ గూడ బ్రవేశమున్నదనుచున్నాడు. జతుదాహపర్వమున నేలలోపలఁ (ద్రవ్వి దారి చేయఁబడెనని వర్ణించినపుడు, సురంగశబ్దము ప్రయోగింపఁబడినది. "సురంగాం వివిశుస్తూర్ణం మాత్రాసార్థమరిందమాః" (భా।ఆది।అ,148-12) ఈ సురంగశబ్దము గ్రీకు 'సిరింజస్'శబ్దమునుండి యైనదని హాప్కిన్సు చెప్పుచున్నాడు. మనకుగూడ నట్లేయగునని తోచుచున్నది. పురోచనుడు యవనుఁడని కూడ నూహకలుగుచున్నది. కన్నమువేయు నుపాయము యూనానుల యుద్ధకాలమందు నుండును. ఈజతుదాహపర్వమున, మ్లేచ్ఛభాషయందుమాట్లాడి విదురుఁడు యుధిష్ఠిరునికి, లాక్షాగృహమునమండింప జేయు ప్రయత్నము నితరులకు దెలియరానివిధముగా సూచించెనని వర్ణింపఁబడెను. కాని తరువాత విదురుని సంభాషణము సంస్కృతమునఁ గూటశ్లోకమునకుదుల్యముగానున్నది. విదురుఁడే మ్లేచ్ఛభాషయందు సంభాషించె

కూడ జెప్పఁబడెను. ఆదిపర్వమున నిట్లు వర్ణింపఁబడినది—ఏ యవనరాజును వీర్యవంతుఁడైన పాండురాజుకూడ జయింపలేకపోయెనో, వానినర్జునుఁడు జయించెను. యువనులకును మనకును జాలదగ్గఱపరిచయము అలగ్జాండరు (సికందరు) సమయమునఁ గలిగెననుమాట ప్రసిద్ధమైయున్నది. ఇంతకు మునుపు యవనులకును మనకును గలిగిన పరిచయము దగ్గఱదికాదు. మన వారికి వారిబుద్ధి కౌశల్యము యొక్క పరిచయము లేక యనుభవము కొంచెమును లేకుండెను. ఇటువంటి యవస్థయందు సికిందరుయొక్క యాక్రమణమును, అనగా క్రీ। శ। పూ। దాదాపు 320 సంవత్సరమును, సాధారణముగా, మహాభారత కాలమునకు పూర్వమర్యాదయని చెప్పఁ గలము. ఇఁక క్రీ। శ। పూ। 320 సంవత్సరము మొదలుకొని క్రీ॥50 సంవత్సరముదనుక లక్షశ్లోకములుకల యిప్పటి మహాభారతము తయారయ్యె ననువిషయము విశ్వసింపవచ్చును.

జ్యోతిషశాస్త్రము నాధారముచేసికొని రెండవ ప్రమాణ మీయఁ బడును. జ్యోతిషశాస్త్రములోని రెండు విషయములు అనగా రాసులు నక్షత్రములును-ఈకాల నిర్ణయమునకు నెంతయు నుపయోగించుచున్నవి. మన మొదలిటి యార్యజ్యోతిషయముయొక్క రచన రాసులమీఁదను గాదు. హిందుస్థానము (భారతవర్షము)న రాసులయొక్క ప్రవేశ మెప్పటినుండియైనదియు మిక్కిలి నిశ్చయముగా జెప్పబడును. ప్రమాణ

---

వని యొక్క మహత్త్వముగల ప్రశ్నము కలుగుచున్నది అతడు ప్రాకృత భాషయందు మాట్లాడెనని టీకాకారుఁడు సూచించుచున్నాడు. కాని సత్య మైన విషయమైతే ప్రాకృతము మ్లేచ్ఛభాష కానేరదు. అది యట్లైయైన యెడల నీదేశములోని సాధారణజనులా భాషయందు మాట్లాడుచుండెడి వారు. కనుక నదిలోకులకు దెలియదని విశ్వసింపబడజాలదు. ఆ భాష గ్రీక్కేయగునని యాలోచన కలుగుచున్న సికందరుయొక్క కాలమున గొంతకాలమువఱకు, పంజాబును రాజభాషగానెంచి, కొందఱు యూనానీ భాషమాట్లాడనేర్చుకొనియుందురు; ఇప్పుడేవిధముగా మనవారు మఱి యొకరికి దెలియకుండుటకై యింగ్లీషున మాట్లాడుచున్నారో, అదే విధ ముగా రహస్యము మాట్లాడవలసినపుడు యూనానిభాష యుపయోగింప బడియుండును. సారాంశము, ఈ ప్రకారముగా యూనానిభాషకు గొంత ప్రచారమున్నపుడు, మహాభారతము నిర్మింపబడియుండును.

దృష్టిచేత, మహాభారతమున మేషము, వృషభము, మొదలైన రాసుల యుల్లేఖ మెన్నడు లేదనునదియొక మహత్త్వవిషయము. మహాభారతమున గాల నిర్దేశము చేయబడినప్పుడెల్ల నీసంగతి నక్షత్రములమీద నున్నదనియే చెప్పబడినది. రామాయణమున శ్రీరామజననము వర్ణింపబడినది. అచ్చట, నాసమయమున గర్కాటకలగ్నముమీద నైదుగ్రహము లుచ్చస్థానమందు గలవనియె చెప్పఁబడెను. దీనిబట్టి, హిందుస్థానమున రాసులు ప్రచారము లోనికి వచ్చినపిమ్మట రామాయణమునకు వర్తమానస్వరూపము ప్రాప్త మైనదని నిశ్చయమగుచున్నది. మహాభారతమునఁ జెప్పఁబడిన యుధిష్ఠిరుని జన్మకాలము రాశివ్యతిరిక్తమై యున్నది. అచ్చట నిట్లు వర్ణింపబడినది—"చంద్రుఁడు జ్యేష్ఠా నక్షత్రముమీద నున్నపుడు, అభిజిన్ముహూర్తమున యుధిష్ఠిరుఁడు జన్మించెను * సారాంశము, మహాభారతమున నచ్చట నక్షత్రములమాటయే యున్నది. రాసులమాటలేదు. దీనిఁబట్టి, హిందు స్థానమున రాసుల ప్రచారము మహాభారతమునకుఁ దరువాత నయ్యెనని నిశ్చయముగా దెలియుచున్నది. ఏదేని మనపూర్వగ్రంథనుగూర్చి, యది ప్రాచీనమో లేక నవీనమో నిశ్చయముగా దెలిసికొనగోరినయెడల, రాసులయుచ్చారణ మొక యత్యంతమహత్త్వముగల జ్ఞాపక ప్రమాణమై యున్నది. ఈ యుల్లేఖముయొక్క యాధారముమీదఁ బ్రాచీనగ్రంథములు

---

* మహాభారతముయొక్క యాదిపర్వములో యుధిష్ఠిరునిజన్మకాల సంబంధమున నీవాక్యమున్నది: "ఐంద్రే చంద్రసమారోహే ముహూర్తేఽభి. తేఽష్టమే దివామధ్యగతే సూర్యే తిథౌ పూర్ణేఽతిపూజితే।" ఈ శ్లోకము నందు రాశిమాటయెందును లేదు. దానిమీఁద జతుర్ధరుని టీకయిది :- "ఐంద్రే జ్యేష్ఠానక్షత్రే అష్టమేసంవత్సరారంభాత్ అభిజితె అభిజితి త్రింశన్ముహూర్తస్యాహ్నః అష్టమే ముహూర్తే దివాశుక్లపక్షే మధ్యగతే తులాగతే తిథౌ పూర్ణే పుణ్యాయాంపంచమ్యాం అయం యోగః। ఇందు మధ్యగతే, అనుదానికర్థము తులాయనగతే అని చేయుటకువీలులేదు. ఇది కేవలము కూటార్థమునకే పద్ధతియైయున్నది. అప్పుడప్పుడుటీకాకారునికి దివామధ్యగతే సూర్యే యని యగపడియుండును (ఎందుచేతననగా అభిజిన్ముహూర్తము చేతనదిబోధితమగుచున్నది) కనుక నిది యర్థముచేయబడియుండును. కాని దీనికి మఱియొక యర్థముండనే యుండజాలదు. ఏమైన నగుఁగాక, మూలమున రాశిపేరు లేదనుమాట నిర్వివాదమని సిద్ధించుచున్నది.

రెండుభాగములు అనగా బూర్వకాలికములు నాధునికములును అగుచున్నది. భారతవర్షమున రాసులెప్పటినుండి వ్యాపించినవో, యిదియిప్పుడు మనము విచారింపవలయును.

రాసులను మనవారు గ్రీకులనుండి కైకొనిరనుట నిశ్చయము. శంకర బాలకృష్ణదీక్షిత కృతమైన భారతీయ జ్యోతిష శాస్త్రము యొక్క 139వ పుటయందు, క్రీ॥ పూ॥ దాదాపు 450 సంవత్సరములకుం బూర్వము రాసులు మనయిచటికి దీసికొనిరాబడియెనని నిశ్చయింపబడినది. మహాభారతమున శ్రవణాద్యనక్షత్రము మొదలుచేసి గణనయున్నది. దానిసమయము శా॥ 450 అయియున్నది; భారతమున రాసులమాటలేదు. ఇందుచేత శకమునకు మునుపు దాదాపు 600 సంవత్సరములవఱకు మేషాది నామములు మనదేశమునలేకుండెనని స్పష్టమగుచున్నది. శకమునకు మునుపు 500కం బ్రాంతమున మనదేశమునందు మేషాదులప్రచారము కలిగెనని దీక్షితుని యభిప్రాయము; కాని యీమతము చాలవరకు వివాదగ్రస్తమైయుండగలదు మనదేశమున మేషాదిరాసుల నామములు గ్రీకులతోడ మనకు దృఢపరిచయము కలిగినపుడు వ్యాపించినవనుటలో సందేహము లేదు. కాబట్టి ప్రస్తుతవివేచనయందు, గ్రీకులతో మనకు దృఢపరిచయమెప్పుడు కలిగినదో, యీ విషయమై యైతిహాసికముగగూడ విచారింపవలసియున్నది.

క్రీ॥ శకమునకు మునుపు 326వ సంవత్సరమున సికిందరు హిందుస్థానముమీదికి దాడివెడలెను. ఆసమయముననే గ్రీకులతోమనకునెక్కువ పరిచయమయ్యెను. వారి శూరత్వముయొక్క తారతమ్య జ్ఞానము కూడ మనకు గలిగినది. కాని యపుడు వారి జ్యోతిషశాస్త్రము యొక్క పరిచయమేమియు మనకు గలుగలేదు ఎందుచేత? సికిందరువెనుకకు మరలినతరువాత పంజాబునుండి గ్రీకులను జంద్రగుప్తుడు వెడలించెను దీనికిబిదప జంద్రగుప్తుని యాస్థానమున మెగాస్థినీజ నామకుండగు నొక గ్రీకురాజదూత నివసించుచుండెను. తరువాతగూడ గొన్నిదినములవఱకు గ్రీకురాజదూతయిచ్చట నివసించుచుండెను. కాని యీసంబంధము పరరాష్ట్రీయసంబంధము యొక్క పద్ధతిగానే యుండెను. కావున వీనికి విశేషమైన దృఢపరిచయము కలుగుటకు నేమియు వీలులేకుండెను. సికిందరునకు మునుపు యూనానులతో మనకు గొంచెముగూడ బరిచయము లేదనియు జెప్పంజాలము. పారసీ

(*Persian*) చక్రవర్తియగు దారాయుస్సు మఱియు ఖుసరు తూర్పున సింధువువఱకు దేశమునుజయించిరి. పడమట ఏషియామైనరుయొక్క కొననున్న గ్రీకురాజ్యములనుగూడ గెలిచెను. ఈ చక్రవర్తియొక్క సైన్యమునందు వేర్వేఱు దేశములలోనిసేనలు, గ్రీక్కులయు హిందుస్థానవాసులయు సేనలు, కలవని గ్రీక్కుల యితిహాసము (హిస్టరి) నుండి తెలియుచున్నది; ఇంకను మన హిందుస్థానిసోదరులలో చక్రవర్తితోగూడి గ్రీకుదేశముదాఁక నేగిరి కూడను. సారాంశము క్రీ॥ శ॥ పూ 500 సంవత్సరములవఱకు గ్రీక్కులతోడి మన సహవాసమునకు ప్రమాణము దొరకుచున్నది. దీనికి బూర్వముకూడ జాలసందలసంవత్సరములదాఁక వ్యాపారసంబంధముచేత వారియొక్క భాష మన కావశ్యకమైయుండును. ఇదిగాక సికందరు సమయమున నతనితోనున్న గ్రీక్కులకు, అఫ్గనిస్థానమున గ్రీక్కులయొక్క పురాతనమైన యొక నివాసస్థానమున్నదని తెలిసెను. ఈ యవన జాతి జనుల నామము కాంభోజాది మ్లేచ్ఛుల వెనువెంట మహాభారతమున మాటిమాటికి గనబడుచున్నది. వీరియొక్క యాచారవిచారము లధికముగా మాఱియుండెను. ఈ విషయములన్నిటివలన, క్రీ। శ। పూ। 800-900 సంవత్సరములు మొదలుకొని సికిందరు సమయమువఱకు అనఁగా క్రీ। శ। 300దనుక మనకు గ్రీక్కులతో బరిచయముండెను. వీరు ముఖ్యముగా అయోనియన్ జాతివారైయుండిరి. కనుకనే మన ప్రాచీన గ్రంథములయందు యూనానులకు యవీన శబ్దము ప్రయోగింపఁబడినది. ఇంత విస్తరించి వివేచనచేయుటకు, పాణినిసూత్రములయందు యవీనలిపియొక్క యుల్లేఖము కనఁబడుటయే కారణము. పాణినియొక్క సమయము సికిందరునకు మునుపటిది కావలయును, అప్పుడతని సూత్రములయందు యవన శబ్దమెట్లు వచ్చినది? అని ప్రశ్నము కలుగుచున్నది. సికిందరునకు మునుపు యవనుల పరిచయము కొంచెమును లేనియెడల బాణిని సూత్రములకు సికిందరు తరువాతనే సమయము నీయవలయును. కాని మన యీ పరిచయము క్రీ॥ శ॥ 800-900 ఏండ్లవఱకు బ్రాచీనమైనదని మనము చూచియుంటిమి. ఇట్టియవస్థయందు బాణిని సమయ మక్కడివఱకు బోగలదు; కాని యితర యల్పపరిచయముచేతనే హిందుస్థానమున మేషాదిరాసులు వచ్చుటవలన జ్యోతిషశాస్త్రముయొక్క గణితమునందు మిక్కిలి యెక్కువ మార్పు కలిగియున్నది. ఇంతకు బూర్వము వేదాంగజ్యోతిషము 27 నక్షత్రాదివిభాగములమీద జేయఁబడినది. మఱియు దానికి వైపునున్న జ్యోతిష

గణితములన్నియు 12 రాసులయునట్లే 30 అంశములయు నాధారముమీద రచింపబడెను. ఇతయెక్కుడు పరివర్తనమునకు గ్రీకులకును మనకును నొకచో సహవాసము దృఢపరిచయము నత్యంత మావశ్యకమై యున్నది. ఈ సహవాసము మఱియుఁ బరిచయమెప్పుడైనదో యిఁకఁ జూడవలయును.

ఎప్పుడు సెల్యూకసునియొక్క యధికారము హిందుస్థానమునుండి తొలఁగెనో, అప్పుడు క్రీ. పూ. 250కు ప్రాంతమున, బైక్ట్రియదేశమందున్న యూనానులు హిందుస్థానముమీఁదికి దండెత్తి పంజాబులో దిరుగఁడమ రాజ్యమును స్థాపించిరి. వారి యీ రాజ్యము 100 వత్సరముల దాక హిందుస్థానమున నుండెను. గ్రీకువారికిని శకజాతివారికిని సాహచర్యము ప్రసిద్ధమైయున్నది. ఇందువలన శకయవన, శబ్దము ప్రచలితమైనది. వారియొక్క విఖ్యాతుఁడైన మినందరురాజు బౌద్ధ చారిత్రమున మిలిందనామమున ప్రసిద్ధుఁడైయున్నాఁడు. అతని ప్రశ్నముల సంబంధమున మిలిందప్రశ్న, నామకమైన బౌద్ధగ్రంథము రచింపబడియున్నది. ఈ గ్రీకుల యనంతరము పక్షాంతరమున నించుమించుగా నిదేసమయమున శకులు హిందుస్థానముమీదదండయాత్రలుసలిపిరి. వారిలో రెండుభాగములున్నవి. అందొకభాగము పంజాబునుండి మధురవఱకు వ్యాపించియుండెను; మఱియొక భాగము సింధు కఠియావాడనుండి యుజ్జయినివైపున మాలవావఱకు వెళ్ళియుండెను. ఈశకులతో యూనానులుకూడ నుండిరి. ఎందుచేత? వారిరాజ్యము బైక్ట్రియామునందే యుండెను. వారు యూనానుల శాస్త్రములన్నిఁటిని మఱి కలాకుశలతను దెలిసియుండిరి. పైని వ్రాయఁబడిన రెండవభాగములోని శకు లుజ్జయినిని గెలిచి యచటదమరాజ్యమును స్థాపించిరి. మఱియు విక్రమవంశజుల తరువాత ఆశకుల రాజధాని యయ్యెను. వారిచ్చట శకకాలము నారంభించిరి. కనుక నాకాలము ను శకమనుచున్నారు. శకులరాజ్యము ఉజ్జయిని, మాలవా, మఱియు కఠియావాడునందు దాదాపు 300 సంవత్సరములదాఁక నుండెను. వీరి యధికారమునందు యవనజ్యోతిషము మఱియు జ్యోతిషముయొక్క శాస్త్రవేత్తలు తమవిద్యలను మేలవించి రాశ్యంశాది ఘటితమైన గ్రహగణితము యొక్క యారంభమును జేసిరి. ప్రాచీనములైన పంచసిద్ధాంతములిచటనే చేయఁబడియుండును. అవి యన్నియు రాశ్యంశఘటితమైన గణితముయొక్క యాధారముమీద రచింపబడినవి. పిమ్మటివగు బ్రహ్మసిద్ధాంతము,

ఆర్యసిద్ధాంతము, సూర్యసిద్ధాంతముకూడ వీనియాధారమునఁ జేయబడినవి. సారాంశము, యీరాని జ్యోతిషము యొక్క రచన చేయబడినది; కావున భారతీయ జ్యోతిషకారులందఱు ఉజ్జయినియొక్క రేఖాంశమును శూన్య రేఖాంశముగా మన్నించుచున్నారు. ఏ ప్రకారముగా నాంగ్లేయ జ్యోతిష్కులు గ్రీనిచుయొక్క రేఖాంశమును శూన్యముగావిశ్వసించుచున్నారో, అదే ప్రకారముగా నార్యజ్యోతిష్కులు ఉజ్జయినీ రేఖాంశమును శూన్యముగా విశ్వసించుచున్నారు. అచ్చట రాజాశ్రయమున కధీనమైన యొక ప్రాచీనవేధశాలకూడనుండెను. అదె వర్తమానార్యజ్యోతిష్కులకుఁ బునాది వేసెను. జ్యోతిషశాస్త్రముయొక్క యీ యభ్యాసమేమో యొకటి రెండు సంవత్సరములదికాదు. ఎందుచేత? దానికి ప్రాప్తించిన క్రొత్త రూపము కేవలము గ్రీక్కుల యనుకరణముచేతనే ప్రాప్తముకాలేదు. దాని వికాసము స్వతంత్రరీతిని మఱియు స్వాతంత్ర్యపద్ధతినిగూడ నయ్యెను. దాని యందు గ్రహగణిత మవశ్యమొక ప్రధానాంగము; కాని యుగాదికల్పన గణితముకూడ గ్రీక్కులకంటె బొత్తిగా వేఱైనది. అందుగల్పారంభమును నిశ్చయించునపుడు బహువిధముల గణితము తయారు చేయవలసియున్నది. సారాంశమిది, హిందుస్థానమున పంజాబునుండి మాలవావఱకు ఒకటి, రెండువందల యేండ్లు జ్యోతిషశాస్త్రముయొక్క యభ్యాసమైయుండును. మఱియు నుజ్జయినియందు రాజాశ్రయముచేత దానికి దుదిస్వరూపము నిశ్చితమును స్థిరమునై యుండును.

ఈ ప్రకార మితిహాసవ్యాప్తిచేత, హిందుస్థానమందు రాశ్యంశాది గణితముయొక్క ప్రచారము క్రీ. సంవత్సరమునకు దాదాపు 200సంవత్సరములకు బూర్వమయ్యెను. శంకర బాలకృష్ణదీక్షితుడు చెప్పిన 450సంవత్సరముల సమయమింతకన్న దూరమైయున్నదనుట సత్యము. కాని దానికిఁ దగ్గ క్రీ॥ పూ॥ 200 సంవత్సరములను విశ్వసించుటకు నాటంక మేమియు లేదు. ఎందుచేత? అది పూర్వపుటెల్లయై యున్నది. కనుకనే దానిపై పున నిది సమయముకాగలదనియు, నాపై పునసేదశయందును బోజాటడనియు సిద్ధమగుచున్నది. ఐతిహాసిక ప్రమాణముల యాధారమీద రాసులు, అంశములు మొదలుగాగలవి వ్యాపించుటకు నిటీవల ఈ నిశ్చితసమయమున ధ్యానమీయబడినయెడల, మహాభారత వీసమయమునకు మునుపటిది యని తెలియును. ఎందుచేత? అందు రాసులమాటలేదు. ఈ దృష్టితో విచారించినమీద మున్ను చెప్పబడిన మనసమయము అనగా క్రీ॥ పూ॥ 250సంవత్స

రములే ప్రాయికముగా నిశ్చితమైనట్లగుచున్నది. మేగాస్థనీజుయొక్క గ్రంథమున మహాభారతము మాటలేనికారణమున, నా గ్రంథము క్రీ॥ పూ॥ 400 సంవత్సరముల కిటీవలనై యుండునన్న మునుపటి యనుమానము కలుగుచున్నది. రెండవవిషయము. గ్రీకుల శూరత్వవర్ణన మహాభారతమందు గనబడుచున్నది. దీనిబట్టికూడ, దానిసమయము సికిందరు యొక్క దండయాత్రకు బిమ్మటిది కావలయును, అనగా క్రీ॥ పూ॥ 300 సంవత్సర కిటీవల గావలయుననియే నిశ్చయమగుచున్నది. ఇక మూడవ ప్రమాణము దీసికొనెదము; రాశిమొదలైనవి వ్యాపించిన సమయము క్రీ॥ పూ॥ 200 సంవత్సరములై యున్నది, అది దీనికన్నను జాలదగ్గఱిది అనగా నిటీవలిది కాగలదు. సరేకాని యీ సమయము రెండు వందల కంటె నధికముగా నీవైపున కీడ్వబడజాలదు. శంకర బాలకృష్ణదీక్షితుడు స్వయముగా ఆ ప్రాచీనసిద్ధాంత గ్రంథములు వేనియందు రాశిమొదలైనవాని గణితమున్నదో అది క్రీ పూ॥ రెండువందలకంటె నధికముగా నీవైపునకు గాజాలదని యనుచున్నాడు. ఇట్టిస్థితియందు జాలమట్టు మహాభారత కాలమునకు నీవలి సరిహద్దు క్రీ॥ పూ॥ నూఱుసంవత్సరములని చెప్పుకోదగియుండును.

ఈ విషయము మిగుల మహత్త్వముకలది. అది సాధారణపాఠకులకందఱకు జక్కగా దెలియును. కావున గొంచెమధికముగా విస్తరించి వ్రాయుట యావశ్యకము, మనము చెప్పునది యేమనగా నే గ్రంథములయందు రాసులమాటలేదో, అనగా నిట్టి యుల్లేఖమున కావశ్యకత యున్నప్పటికి వానియందు నక్షత్రములే యుల్లేఖింపబడెనో, ఆగ్రంథములు క్రీ॥ పూ॥ దాదాపు రెండువందల యేండ్ల పూర్వమువైపునకగును అని. ఈ కారణచేత నారంభమునందు మేషాదిరాసుల ప్రచారము మన చోట లేకుండెను. వీనిని దాదా పీసమయమున (క్రీ॥ పూ॥ 200సంవత్సరమున) గ్రీకులనుండి మనము స్వీకరించితిమి. ఈ విషయమున శంకరబాలకృష్ణదీక్షితునికిని మనకును గొంచెము మతభేదమున్నది. అతడు చెప్పునది యేమనగా మనము యూనానులనుండి రాసులను గైకొనలేదు. కాని క్రీ॥ పూ॥ దాదాపు 446 సంవత్సరమునకు బూర్వము మన మీరాసులను స్వతంత్రముగా గల్పించితిమి! యని, ఇంతకుమునుపు మనయందు రాసుల ప్రచారము లేదనుమాటను వారుకూడ నొప్పుకొనుచున్నారు. మేషవృషభాదిరాసులపేరులును గ్రీకులయందు బ్రచలితములైన రాసులపేరులును,

సమానము లై యున్నవి. మఱియు వానియాకృతులుకూడ సమానముగా గాల్పనికములై యున్నవి యను విషయము మీద నిపుడు ధ్యానముంచ వలయును. ఇట్టిస్థితియందు, ఒక్క సమానమైన యాకృతుల యొక్క కల్పన రెండు వేర్వేఱుచోటుల నుత్పన్నమగుట యసంభవము గానగపడు చున్నది. దీనినిబట్టి మనచోచటికి రాసులు గ్రీకులనుండి తీసికొనఁబడియె ననియే చాలసంభావనీయముగా నగుపడుచున్నది మనము గ్రీకులనుండి రాసులను గైకొంటిమని నమ్మినయెడల, నిచ్చట నొక ప్రశ్నము బయలు దేఱుచున్నది. దీక్షితుఁడు గణితమునుండి రాసుల ప్రచారసమయము గ్రీకులకు సుమారుపటిదియని యెట్లు సిద్ధింపఁజేసెను? కనుకనే యిచట నీ ప్రశ్నము కొంతవిచారింపవలసియున్నది. రాసులయారంభము మేషము తోడను, నీ నక్షత్రములతో వానికిఁ గావించిన మేలన మశ్వినితోడను నై యున్నది. కాఁబట్టి వసంత ప్రవేశము మేషారంభమున నశ్వినీ నక్షత్ర మందున్నపుడీ మేలనము హిందుస్థానమున జేయఁబడు యుండునని యను మానము కలుగుచున్నది. వసంతసంపాతము యొక్క గతివెనకవైపున నగుచున్నది; అనఁగాఁ దొలుత మేషవృషభాదిరాసుల యారంభమేదో యొక బిందువుచేత విశ్వసింపఁబడినపుడు, ఆ బిందు వశ్వినీనక్షత్రముకంటె వెనుక వైపునకు దొలఁగిపోవచ్చియున్నది. ఈ సమయమున మేషారంభము యొక్క యీ బిందువు రేవతీనక్షత్రము కంటె వెనకకు దొలఁగిపోయి యున్నది. ఈ స్థితి ఇంచుమించు 72 సంవత్సరము లయందు నొక యంశము యొక్క యంతముచేత నగుచున్నది. దీని ననుసరించి వర్తమానస్థితి యొక్కయాధారముమీద, నశ్వినీనక్షత్రముతో మేషారంభమెపుడయ్యెనో, ఈ విషయము నిశ్చయింపబడఁగలదు. ఈప్రకారముగా లెక్కవేసి దీక్షితుడు క్రీ॥ పూ॥ 446వ సంవత్సరమును నిశ్చయించెను. కాని మనకు నిచట నక్షత్రముల సంబంధమున గొంచెమధికముగావిచారింపవలసియున్నది. వేదముల యందు నక్షత్రములగణన కృత్తికనుండిచేయఁబడినది. నక్షత్రములపేరులు వచ్చినచోటెల్లను కృత్తిక, రోహిణి మృగశిర మొదలుగా నక్షత్రముల గణన కనఁబడుచున్నది. దీనితరువాత నొకప్పుడు, భరణి, కృత్తిక మొదలుగా గణన ప్రచలితమైయుండునని తెలియుచున్నది. ఈ రెండు గణనలు మహాభారతమున జెప్పబడియున్నవి. అనుశాసనపర్వములోని 64వమఱియు 89వ యధ్యాయములయందు కృత్తికాది నక్షత్రములన్నియు జెప్పబడినవి; కాని యింకొకచోట శ్రవణా నక్షత్రమన్ని నక్షత్రముల యారంభమని

నున్నదని చెప్పఁబడినది. అశ్వమేధ పర్వమునందు యొక్క 44వ యధ్యాయము నందు 'శ్రవణాదీని ఋక్షాణి' అని చెప్పెను. ఇందుచేత నక్షత్రముల యారంభము శ్రవణముతోనయ్యెనని ప్రకటమగుచున్నది: అనఁగా శ్రవణా నక్షత్రమున నుత్తరాయణమైనపుడు, నక్షత్రముల యారంభము భరణితోఁ జేయుటకు నాటంక మేమియును లేదు. ఈకారణముచేత వేదాంగ జ్యోతిష మున ధనిష్ఠానక్షత్రమునందు నుత్తరాయణము చెప్పఁబడినది. కృత్తికకు ముందు నేడవ నక్షత్రమున నుత్తరాయణమగునని యే దీనికర్థమగు చున్నది. ఎపుడది యొక నక్షత్రమునకు ముందువచ్చునో, అపుడొక నక్షత్ర ప్రారంభము కృత్తిక వెనుకకు దొలఁగిపోవుచున్నది; అనఁగా నా సమయ మున భరణితో నక్షత్రప్రారంభము మన్నింపఁబడుటకు మొదలిడెను. దీని తరువాత నశ్వినితో నక్షత్రారంభమయ్యెను. అదే పద్ధతి నేటివఱకు వ్యవహరింపబడుచు వచ్చుచున్నది. అనఁగా, నక్షత్రములయందు అశ్విని, భరణి మొదలుగా క్రమమే మనయందు ప్రచలితమగుచున్నది. మహాభారత మున నీక్రమమునకు ప్రమాణమేమియు గనఁబడదు. ఇందుచేత మహా భారతము దీనికి ముందటిదియని స్పష్టమగుచున్నది ఈ క్రమము, ఎపుడు జ్యోతిషశాస్త్రమునకు క్రొత్త స్వరూపమువచ్చి రాశి, అంశము మొదలగు దాని యనుసారముగా గణితము చేయబడుటకు నారంభమయ్యెనో, యప్పటిది. ఇదేక్రమమును సిద్ధాంతగ్రంథములు మొదలుకొని యాధునిక జ్యోతిషగ్రంథము లన్నిఁటియందును గనఁబడుచున్నది. సారాంశము, మేషాదిరాసుల యారంభ మశ్వినీ నక్షత్రమందైనపు డీపద్ధతి వ్యాపక మయ్యెను.

మేషాదిరాసులయు నశ్విన్యాది నక్షత్రములయు గణనారంభమువకు సంబంధించిన లెక్కచేయునపుడు, దీక్షితుఁడు మేషరాశికి నశ్వినీ ప్రత్యక్ష తారకు మైత్రిఁ జేసి గణితముగావించెనని మునుపు చెప్పియుంటిమి కాని యీ గణన, ఎపుడు మేషారంభము సరిగా నశ్వినీ నక్షత్రమునుండియే యయ్యెనో, అదే సమయమునుండి యైనదని మన్నించుట కేమియు నావశ్యకతలేదు. నూత్నమైన గణితపద్ధతి వ్యాపకమగుటకు జాలకాలము పట్టియుండుననుట సంభవము. ఈ సమయము ఒకటిరెండేండ్లది మాత్రము కాదు; ఇంక నేమఁలేని బహుసంవత్సరములది కావలయును. ఈ విష యముకూడ నాలోచింపవలసియున్నది-అశ్వినీ నక్షత్రము 13 అంశములది యైయున్నది, ఎందుచేత? 360 అంశములుగల యొక సంపూర్ణచక్రమును

27 నక్షత్రములయందు విభజించినయెడల నొక నక్షత్రము 13 అంశలు 20 లిప్తలు యగుచున్నది. ఈ కల్పన ననుసరించియే నక్షత్రముల పాద విభాగములును జేయబడినవి. ఒక మేషరాశి రెండు నక్షత్రములయొక్క పాదముది యగుచున్నది 27 నక్షత్రములను 12 రాసులయందుఁ బంచిపెట్టినయెడల నొకరాశి రెండు నక్షత్రములయొక్క పాదముది సరిగానగును. నక్షత్రములు పాదములుగా అనగా చతుర్థాంశ విభాగములుగా ఇందుకొఱకే చేయబడినవి నక్షత్రచక్రము పఞాంతారమున రాశిచక్రము యొక్క యారంభమేదో యొక బిందువు చేత గల్పింపఁబడుచున్నది. ఆర్యజ్యోతిషమునం దీయారంభ మేస్థానమునుండి విశ్వసింపబడిరెను నన విషయమునందును జాల మతభేదములు కలవు సారాంశము, ఆలోచింపగా మేషారంభము సరిగా నశ్విని యందుగాక దానితరువాత గొన్ని యంశలయందు నైయుండును, అయినను అశ్వినినుండియే నక్షత్రగణము యొక్క యారంభము మన్నింపబడవచ్చును ఈ ప్రకారము, ఈ దేశమునందు రాశ్యంశాది జ్యోతిషపద్ధతి వ్యాపకమైయున్నపుడు, మేషాదిరాసుల యారంభము అశ్విని యొక్క కొన్నియంశలు కడచినవెనుకనయ్యెనని నమ్ముటకు నే యాపత్తియులేదు. సంపాతబిందువు నొకయంశము వెనుకకు చలించుటకై 72 వత్సరములు పట్టు ననునీ నియమమును నమ్మినయెడల, 300 వత్సరములయందు సుమారు 4 అంశలగును. అనఁగా మేషారంభము అశ్వినికి విమ్మట 4 అంశలమీద నైనపుడు, మేషాదిగణన మనయార్యులయందు వ్యాపకమయ్యెనని స్పష్టముగానమ్మవచ్చును. పైనీయఁబడిన యైతిహాసిక ప్రమాణమువలన క్రీ॥కు దాదాపు 200 ఏండ్లమునుపు రాశ్యంశాది పద్ధతి మనచోట స్వీకరింపఁబడెనని విశ్వసించినయెడల, మేషాదిరాసులను నశ్విన్యాది నక్షత్రములతో మేలవించుట సంభవమైయుండెను. కాఁబట్టి మన యచటి రాసుల ప్రచారమునకు నిదేశమయమని యెంచుట యుచితమైయుండును.

మనము గ్రీకులనుండి లేక యవనులనుండి కొంచెమైనను దీసికొనియుండలేదని కొందఱు లోకులాగ్రహపూర్వకముగాఁ జెప్పుచున్నారు. కాని గ్రహగణితమునకు బ్రధానమైన తాళముచెవిని మనము గ్రీకులనుండియే చేపట్టితిమనుమాటను శంకరబాలకృష్ణదీక్షితుఁడు కూడ నొప్పుకొనుచున్నాడు. గణితముయొక్క సాహాయ్యముచేత, నేసమయమునందే గ్రహమాకాశమందు నేస్థానమునఁ బ్రత్యక్షమైయున్నదో, ఈసంగతి దెలి

క్రొత్తపద్ధతి, మునుపు మనచోట లేకుండెను. భారతీయ జ్యోతిషశాస్త్రమందు గ్రహముల మధ్యస్థితి నెఱిగించు కళ దెలుపఁబడియుండలేదు; కాని గ్రహముల ప్రత్యక్షస్థితి మధ్యమస్థితికంటె కొంత ముందుగాని వెనుకగాని యగుచున్నది; కాబట్టి మధ్యమస్థితినుండి స్పష్టమైన స్థితిని నిశ్చయము చేయుటకు కొంచెము సంస్కరింపవలసియున్నది. దీక్షితుఁడు, మనయిచట నీ కేంద్రాను సారియగు ఫలసంస్కారము గ్రీకులనుండి గైకొనఁబడినదను విషయము నొప్పుకొనుచున్నాడు. (భా॥ జ్యో॥ పుట 51౦ ఎపుడు హిందుస్థానమున గ్రీకుల ప్రవేశము యధికమైన ప్రసారము కలిగెనో, ఆ సమయమును నిశ్చయించుటకై మనము పై యైతిహాసిక ప్రమాణముకూడ నిచ్చితిమో, ఆ సమయమున మనయిచట నితత్త్వము తీసికొనఁబడియుండును. ఈ సంగతిని దీక్షితుఁడు కూడ నంగీకరించుచున్నాఁడు. అతఁడు తన గ్రంథము యొక్క ౬౧౭వ పుటయందుఁ జెప్పినదేమనఁగా "హిపార్కసునకు బూర్వనము, అనఁగా క్రీ॥ పూ॥ మూడవపతాంతరమున రెండవ శతాబ్దియందు. ఈదేశమున గ్రీకుల ప్రసారమెక్కువైనపుడు, క్రీ॥కు దాదాపు 200 ఏండ్ల పూర్వము భారతీయ జ్యోతిషమునకు యూనానీ జ్యోతిషము యొక్క సాహాయ్యమువలన మన యిచ్చట స్పష్టముగా గ్రహముల గనుపఱచు క్రొత్తపద్ధతి వ్యాపించెనని తలఁచుట యుక్తియుక్తముగా నగపడుచున్నది ఆ సమయముననే మనము యూనానాలనుండి రాశిసంబధమైన జ్ఞానము సంపాదించితిమి. ఇంతకంటెకూడ నియమించు 200 సత్సరముల మున్నపు మనము మన స్వతంత్రకల్పనచేత రాశిజ్ఞానమును బొందితిమను మాట నమ్ముటకు నేమియు నావశ్యకత లేదు. రాసుల ప్రచారమయును క్రీ॥కు దాదాపు 200 ఏండ్లకు బూర్వమని యొప్పుకొన్నప్పటికి మేషారంభ మశ్వినీతారకు బిమ్మట సుమారు 4 అంశలే అయియుండెను. కనక నశ్వినీ నక్షత్రముతోడనే మేషారంభమునకు మైత్రి చేయఁదగియుండెను. దీక్షితుఁడు క్రీ॥ పూ॥ 146వ యేడును నశ్వినీతారకును మేషారంభమునకును మైత్రికి సమయముగా జెప్పుచున్నాఁడు. ఆ సమయముకన్న నీసమయము అనగా క్రీ॥కు దాదాపు 200 ఏండ్ల మునుపటిసమయము 3½ అంశాలు (72 వర్షములకొక యంశ యొక్క పరిమాణముచేత) ఈ వైపునకు వచ్చుచున్నది; కాని యింత కొంచెది యెడముననే మేషాదిరాసులకు నశ్విన్యాది నక్షత్రములకును వియోగము కాజాలదు. ఇది గాక హిందుస్థానమున రాసుల ప్రవేశమునకు నేసమయము అనగా క్రీ॥పూ॥ 200 ఏండ్లు నిశ్చయింపబడెనో,

అది దీక్షితుని మతముకంటె నేమియు విశేషము భిన్నముకానేరదుకూడను. దీనికి గారణమేమనగా నతని మతానుసారముగా గూడ నీ సమయమున యూనానీ జ్యోతిషికుల ప్రధానతత్త్వము (కేంద్రానుసారి ఫలసంస్కారము)ను హిందుస్థాన జ్యోతిష్కులు స్వీకరించిరి.

హిందుస్థానమున క్రీ॥పూ॥ 445 ఏండ్లకు సమీపమున రాసుల ప్రచారము జరిగెనన్న, దీక్షితుని యీ మతము ఇతర ప్రమాణములచేతఁగూడ సరిగానచ్చును. బౌద్ధధర్మ గ్రంథమగు త్రిపిటకమునఁగూడ రాసులమాటలేదు. ఏదయిన గాలము నిర్దేశింపవలసినపుడు వాటియందు నక్షత్రమున నీపని చేయవలయును; నేనీ నక్షత్రమున వెళ్ళితిని; నేనీనక్షత్రమున దిరుగవచ్చితిని; ఇవి మొదలుగా వర్ణనలు మహాభారతమందువలెనే త్రిపిటకమునగూడ నగుపడుచున్నవి.

పుష్యేణ సంప్రయాతోస్మి శ్రవణే పునరాగతః।

అనఁగా నేనుపుష్యనక్షత్రమందువెళ్ళి శ్రవణమందు మరలవచ్చితిని. బలరాముని యీవచన మందువలెనే నక్షత్రముల యుచ్చారణము త్రిపిటకమందుఁగూడ వినఁబడుచున్నది. వర్తమాన కాలమునందు రాసుల యుపయోగము లగ్నకాలముననుసంక్రాంతికాలమునను మాటిమాటికి జేయఁబడుచున్నదను విషయముమీద ధ్యానముంచవలయును. లగ్నము సంక్రాంతియు రాసులమీదనే యాధారపడియున్నవి. ఈ లగ్నములయు సంక్రాంతులయు నుచ్చారణము త్రిపిటకమున లేదు. త్రిపిటకముల సమయము నిశ్చితమైయున్నది. క్రీ॥ పూ॥ 475వ సంవత్సరమున బుద్ధుడు మృతుఁడయ్యెను. అతని యనంతరము అశోకుని కాలమువఱకు బౌద్ధ గ్రంథములు చేయఁబడినవి. అపుడు, రాసల ప్రచారము అశోకునితరువాతనై యుండునని విశ్వసించుటకుఁ జోటున్నది. రెండవసంగతి యేమనఁగా, సరస్వత్యాఖ్యానము (అధ్యాయము 37, శల్యపర్వము) నందు గర్గమునియొక్క యుల్లేఖమిట్లున్నది :— తపశ్చర్యా యోగముచేత వృద్ధగర్గముని సరస్వతియొక్క పవిత్రతీరమున గాలజ్ఞానగతియు, నక్షత్రముల స్థితియు దారుణములు శుభకారకములునగు నుత్పాతముల జ్ఞానమును బొందెను. ఈ బౌద్ధుఁడేమో రెండవవ్యక్తియైయుండును. గర్గవారాశిరుఁడను పేరుగల నొక జ్యోతిషికునియొక్క యుల్లేఖము పాణినిమ సూత్రము లందు గనఁబడుచున్నది. ఆగర్గునికంటె నీగర్గుఁడు మఱియొక్కఁడు కాబోలును.

కనుకనే యుతనిని వృద్ధగర్గుడని చెప్పియున్నట్లు తోచుచున్నది. ఇప్పుడు గర్గసంహిత పేర బ్రత్యక్షమగు గ్రంథము ఇతడు పెంచినదైయుండును, లేక యిట్టు కాకయుండును. ఇందు, సాకేతము (అయోధ్య) యవనులచేత నాక్రమింపబడెనని టకు బ్రమాణమున్నది. కనుక నీ గ్రంథము యొక్క యంతిమనిర్మాణకాల విషయమున, నయ్యది గ్రీకు కులరాజైన మినిందరు (మిలిందు)నాటిది అనగా క్రీ॥ పూ॥ 145వర్షము లను ఒడటిదియగునని నిశ్చయమగుచున్నది. ఈ సంహితయందును రాసులపేర్లు లేవు. కావున క్రీ॥ పూ॥ 145 ఏండ్ల పిమ్మట రాసులు ప్రచురమయ్యెనని నమ్మవలసియున్నది. సారాంశము, క్రీ॥ పూ॥ 445 సంవత్సరమునను రాసులప్రచారమునకు సమయమని యెట్లును విశ్వసింపజాలము.

మీది వివేచనవలన సౌతియొక్క మహాభారతమునకు అనగా ఒక లక్షశ్లోకముల వర్తమానమహాభారతమునకు రెండువైపులను (అనగా ఆ వైపున, అనగా దూరముకంటె దూరము, మఱియు ఈ వైపున, అనగా దగ్గఱకంటె దగ్గఱ) కాలమర్యాద యీ ప్రకారము నిశ్చితమైనది. (1) బాహ్యప్రమాణములు క్రీ॥ పూ॥ 410లోని సర్వనాథ మహారాజుయొక్క, శిలాశాసనమందు శతసాహస్ర్యాం భారతీ సంహితాయాం అని వ్రాతకనబడుచున్నది. ఇది యీవైపున అనగా మిక్కిలిదగ్గఱగా జివరిసరిహద్దుగానున్నది. (2) ఇంతకంటెను బూర్వము హిందుస్థానమునకు వచ్చిన గ్రీకు వక్తయగు డాయోన్ క్రాయసోస్టోముయొక్క లేఖయందు నొక లక్ష శ్లోకముల యిలియడుయొక్క యే యుల్లేఖము కలదో, అది రెండవసరిహద్దుగా నున్నది. ఈ రెండవ బాహ్యప్రమాణమువలన మహాభారతనిర్మాణకాలము క్రీ॥ పూ॥ 50 సంవత్సరములకన్న నీవలకు రాజాలదు. (3) రాసులనాటలేకుండుటయు నొక ప్రమాణము. దీక్షితని మతాన సారము క్రీ॥ పూ॥ 445కుం బ్రాంతమున రాసులప్రచారము జరిగెను. కాని యాలోచించిన యెడల నీప్రచారము క్రీ॥ పూ॥ 200కుం బ్రాంతమున బఱాంతరమున 150కిం బ్రాంతమున నయ్యెనని తోచుచున్నది ఇది మూడవసరిహద్దు. అనగా దీనికింబూర్వము మహాభారత నిర్మాణకాలము కావలయును. ఉచ్చారణాభావము బలహీనమైన యొక ప్రమాణము నిజమే కాని రాసులయుచ్చారణ మత్యంతావశ్యకము. కావుననే యీ ప్రమాణము కూడ నిదువిచారింపబడినది. సారాంశము, క్రీ॥ పూ॥ 200పఱకు ఈవైపు అనగా మిక్కిలి

దగ్గఱనైన కాలమర్యాదను, మనము సంకుచితముచేయుచు వచ్చితిమి. ఇపుడు మనము అవైపునఁగా మిక్కిలి దూరమైన కాలమర్యాదను విచారింతము. మహాభారతమున గ్రీకుల శూరత్వము బుద్ధిమత్తయు స్పష్టముగా ప్రశంసింపఁబడినవి. ఇటువంటి ప్రశంస సికిందరుయొక్క యాక్రమణము తరువాతనే చేయఁబడఁగలదు. సికిందరుయొక్క యాక్రమణము క్రీ॥ పూ॥ 321లో నయ్యెను. కనుకనే మహాభారతము దానితరువాతిదై యుండవలయును. దీని బూర్ణముగా విచారింపక మునుపు ఇకను లోపలివి అట్లే వెలుపలివియు నగు సాధక ప్రమాణము లేవియున్నవో, వాని యుల్లేఖము ముందు చేయఁబడును ఈ కారణములన్నింటికిని, క్రీ॥పూ॥ 320 మొదలుకొని 200 దాఁక గలసమయమున వర్తమాన మహాభారతముయొక్క నిర్మాణము జరిగెనని సారాంశము. లోకమాన్యతిలకు కూడ తన సుప్రసిద్ధ గ్రంథము "గీతారహస్యము"నందు నీ సిద్ధాంతమునే స్వీకరించెను. ఈ నిర్ణయమును జాలమంది యితర గ్రంథకారులు కూడ మన్నించుచున్నారు; కాని యొకానొక పాశ్చాత్య గ్రంథకారుఁడు ఈ సిద్ధాంతమును విరోధించుచున్నాఁడు, కనుకనే యిందు నతనిమతమును గొంత విచారించుట యావశ్యకము.

ఇంతవఱకు ప్రతిపాదితమైన దానిలోని యొక విశేషమును మా చదువరులకుఁ జెప్పవలసియున్నది. సౌతిసమయమునకుఁ బిదప మహాభారతమున నేమాత్రము వృద్ధియు జరుగలేదని సిద్ధాంతము. లక్షలో నొకపది యైదు శ్లోకములు తరువాతఁగూడ గలుపఁబడియుండుట సంభవము. ఈ సిద్ధాంతము, మహాభారతములోని శ్లోకసంఖ్య సౌతిచెప్పిన సంఖ్యకంటెఁ దక్కువయున్నదను విషయముపైఁ రచింపఁబడినది. ఈ సిద్ధాంతము వలన, మహాభారతములోని యేదియేని శ్లోకము నాధారముచేసికొని యొక యనుమానము చేయబడునెడల, నయ్యనుమానము గ్రంథమంతటికిని సంబంధింపఁ జేయవచ్చునని నిశ్చయమగుచున్నది. ఆ యనుమాన మాశ్లోకమునకు మాత్రము సంబంధించుననుట మన్నింపఁదగినదికాదు. కేవల మాశ్లోకము తరువాత గలుపఁబడినది లేక ప్రక్షిప్తమనటయు మన్నింపదగదు. ఒక్కొక శ్లోకమును ప్రక్షిప్తమని చెప్పి కొందఱు బాధకవాక్యములనుండి తప్పించుకొనుటకు యత్నించుచున్నారు. మేము తొందరపడి యిట్లు

చేయుము* మహాభారతమందు కొన్నిభాగములు ప్రాచీనములును మఱికొన్ని సౌతికాలీనములునై యున్నవి. అనఁగా క్రీ॥ పూ॥ 200 సంవత్సరముల కంటెను ప్రాచీనములైన కొన్నిభాగములు మహాభారతమునందుఁగలవు; కాని, యిటీవలి సమయముయొక్క యొక్కభాగము కూడ మహాభారతమున లేదని మేము చెప్పవలసియున్నది. ఇంత చెప్పి యిపుడు మేము మా ప్రధాన విషయమును విచారింతుము.

మహాభారతకాలమును నిశ్చయించునపుడు గ్రంథములోపలి ప్రమాణ విషయమునఁ జెప్పఁబడినది యేమనఁగా మహాభారతమందు నేదయే ప్రాచీన

---

* సౌతి మహాభారతమునకు దరువాత, దానియందు నధికమేమియు ప్రక్షేపముకాలేదు. కనుక మేము తొందరపడి యీ యీ వాక్యములు ప్రక్షిప్తములని చెప్పము. ఇక్కడ దొందరపడి యనుశబ్దమునకు నర్థము నుగొంత వివరింపవలసియున్నది. సౌతి హరివంశములోని సంఖ్య 12000 అని చెప్పెను. కాని వర్తమాన హరివంశము యొక్క సంఖ్య 15465 అగుచున్నది. అనఁగా, ఇందు 3465 శ్లోకములు పెరిగినవి ఇట్టిస్థితియందు హరివంశమునందలి యేదేనిశ్లోకము తరువాతి ప్రమాణమున దిసికొనఁబడునేని తద్విషయమున శంకకలుగఁగలదు ఇదే సంగతి వనపర్వ ద్రోణపర్వముల సంబంధమునను నేదేని యంశమునందు జెప్పఁబడలేదు. వనపర్వమునందు సౌతి 11664 శ్లోకములని చెప్పియున్నాడు. కాని యిప్పుడు వాటి సంఖ్య 11854 అయియున్నది. అనఁగా కొంచెము తక్కువగా 200 శ్లోకము లెక్కువయున్నవి; ద్రోణపర్వమునందు సౌతి ౮౯౦౯ శ్లోకములనిచెప్పెను, కాని యిపుడు వాటిసంఖ్య ౯౫౯౩ అయినది. సారాంశము, అన్నిటికంటె నధికముగా శ్లోకసంఖ్య ద్రోణపర్వమునఁ బెరిగినది. ఇట్టిస్థితియందు ద్రోణపర్వములోని వాక్యమేదైనను వక్ష్యమాణప్రమాణమునకై కొనఁబడెనో, తత్సంబంధమున శంకచేయుట కవకాశముండగలదు. అంకెల యాధారమునఁ జేయఁబడిన యీ యనుమానము విచారింపఁదగియున్నది. సభాపర్వమున విరాటపర్వమునఁగూడ కొన్ని శ్లోకములెక్కువ కనఁబడుచున్నవని యిందుఁజెప్పవలసియున్నది. ఆరంభమున మూఁడవ పుటయందు నీయఁబడిన పటము జూడుఁడు ఇంతయైన పిమ్మటను, మహాభారతమునందీ శ్లోకములు ప్రక్షిప్తములని చెప్పుటకు మేము సాహసింపము. ఇదే మా సిద్ధాంతము. ఇదే సత్యముకూడ నైయున్నది.

గ్రంథముల నామములు వచ్చినవో, అవన్నింటియొక్క వివరణము చేయఁబడును. వేదములు, ఉపవేదములు, అంగములు, ఉపాంగములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, సూత్రములు, ధర్మశాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు, కావ్యములు, నాటకములు మొదలగువాని యందుండి వేనివేనియొక్కయు లేఖము మహాభారతమున గనబడుచున్నదో తెలిసికొనఁదగును; మఱియుఁ కను వాని నామనిర్దేశమునకు గ్రంథాంతర ప్రమాణమునయందు ప్రథమస్థానము నియమవేయును; అని ఈ విషయమున హాప్కిన్సు చర్చచేసియున్నాఁడు. ఇపుడు మేము ఆ గ్రంథముయొక్క తాత్పర్యము వైపు ధ్యానముంచుచుఁ, జెప్పఁబడిన ప్రమాణములనన్నింటి నిచ్చట క్రమముదప్పి విచారింతుము. మహాభారతమందు గావ్యములును నాటకములును సామాన్యముగా నుచ్చరింపఁబడినవి; కాని ఆట శైలూష్యాదులమాట వచ్చినను గూడ నే నాటక గ్రంథము పేరును జెప్పఁబడలేదు. దీని తరువాత నీకు మను, సూత్రములు, ధర్మశాస్త్రములు, ఏఱి పురాణములయందునుండియు నే గ్రంథముల యుచ్చారణము మహాభారతమునఁ గనఁబడుచున్నవో, యిది చూతుము.

"బ్రహ్మసూత్రపదైశ్చైవ" (గీ। అ,13-4) గీతలోని శ్లోకపాదమున బ్రహ్మసూత్రముల పేరువచ్చినది. ఈ బ్రహ్మసూత్రములేవి? నిజముగా నిది గొప్పమహత్త్వముగల ప్రశ్నము. అవి బాదరాయణకృతమైన నేఁటి బ్రహ్మసూత్రము, లేయగునెడల, నందువలనఁ గేవలము మహాభారతముయొక్కయే సమయము నిశ్చయింపఁబడదు, ఇంక నేమంటేని, దేనిని మేము మహాభారతముయొక్క యత్యంత ప్రాచీనభాగమని విశ్వసించుచున్నామో, ఆ భగవద్గీతయొక్కయు సమయము నిశ్చయింపఁబడుచున్నది. ఇట్లగుటచేత, భగవద్గీతా సమయము నెంతయు నీవైపునకు లాగవలసియుండును. కనుక నిచట నీప్రశ్నము సవిస్తరముగా విచారింపఁబడవలయును. బాదరాయణ కృతవేదాంతసూత్రములయొక్క సమయము చాలమట్టు నిశ్చితప్రాయమై యున్నది. దీని నిర్మాణము క్రీ॥ పూ॥ 250 మొదలుకొని 100దాఁక గల సమయమున నయ్యెను. ఇదు బౌద్ధజైనమతముల ఖండన చక్కఁగా జేయఁబడినది. పాశుపత పాంచరాత్రములయొక్క ఖండన మీ సూత్రముల యందుఁ గలదు. ఇట్టిస్థితియందు, బౌద్ధజైనమతములు పడిపోయిన తరువాత నీ గ్రంథము చేయఁబడియుండునని చెప్పవలయును. అనఁగా, ఎపుడు

మౌర్యవంశము నష్టమయ్యెనో, ఎపుడు పుష్పమిత్రుఁడు నగ్నిమిత్రుఁడు ననెడు రాజులు. క్రీ॥ పూ॥ 150కిఁ బ్రాంతమున మగధరాజ్యమును దమ యధీనముగాఁ జేసికొనిరో, అప్పుడీ గ్రంథము చేయఁబడియుండును. ఈ యువరాజులు సమ్రాట్టులుఁ బూర్ణముగా సనాతన ధర్మాభిమానులై యుండిరి. వీరు బౌద్ధధర్మమును బడఁగొట్టి యజ్ఞాదికర్మములఁదిరుగ నారంభముచేసిరి. వీరు అశ్వమేధముగూడఁ గావించిరి. సారాంశము, వీరిసమయమున నార్య ధర్మమునకు సంపూర్ణమైన విజయము లభించెను. వీరిసమయముననే వేదాంత తత్త్వజ్ఞానమునకుఁ బ్రాబల్యము స్థాపింపఁబడినది. ఈ రాజుల సమయముఁ (క్రీ॥ పూ॥ 100ఏండ్ల)లోని యీ గ్రంథములమాట మహాభారతాంతర్గతమైన గీతయొక్క శ్లోకమున నగుపడుట యాశ్చర్యకరముగా నున్నది. ఈ యాశ్చర్యమునకుఁ గారణమేమనఁగా మహాభారతమునఁగూడ బౌద్ధ జైన మతముల ఖండనములేకున్నది; ఇదే ప్రకారము పాంచరాత్రము, పాశుపతము, సాంఖ్యము, యోగముననెడి మతములను ఖండింపక దీనికి మైత్రి చేయఁబడెను. ఇట్టి స్థితిలో మహాభారతము వేదాంత సూత్రములకన్న మున్ముందటిది కావలయును మఱి భగవద్గీతయయినచో దానికన్నను మునుపటిదియగును. భగవద్గీతయందు వేదాంతసూత్రముల యుల్లేఖము చూడఁబడినచో, మహాభారతముయొక్కయు, భగవద్గీతయొక్కయు, సమయము క్రీ॥ పూ॥ 150కి నవలై పునను్నది. ఈ కఠినసమస్యను విప్పుటయే యిచట మహత్త్వ విషయము.

ప్రొఫెసరు మాక్సు ముల్లరు, ప్రొఫెసరు అయతి నేర్కరును గీతయందు వేదాంతసూత్రముల యుల్లేఖమున్నదని చెప్పుచున్నారు. ఈ శ్లోకము విషయమున వీరేమి చెప్పుచున్నారో చూడవలసియున్నది. సంపూర్ణ శ్లోక మిట్లున్నది.

ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్।
బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః॥

ప్రొఫెసరు మహాశయులు చెప్పుచున్నారు — ఈ శ్లోకమునందు బ్రహ్మసూత్రపదైః శబ్దముయొక్క ప్రయోగము వేదాంతసూత్రములకై చేయఁబడినది; మఱియు దీనికివిరుద్ధముగా శంకరాచార్యుఁడు మొదలైన టీకాకారులు గొంచెమైన జెప్పుదురు. వేదాంతసూత్రములయందు భగవద్గీతా వచనముల యాధారము స్మృతియని గైకొనఁబడినవో, వాటివిషయమున,

నీ వచనములను భగవద్గీతకూడ రెండవచోటినుండి కైకొనెననియే కేవలము చెప్పఁబడఁగలదు. చాలవఱకైతే, రెండు, అనఁగా భగవద్గీతయు వేదాంత సూత్రములును, ఒక కాలమువి లేక యొకకర్తవి యనియే మన్నింపఁబడఁగలవు. ఈ విషయము వేదములయందును స్మృతులయందును ఋషులచేత నట్లే యాచార్యులచేతఁ బ్రతిపాదింపఁబడినవని యింతయే యీ శ్లోకమున కర్థమున్నది. పై కథనమును సత్యమని ఋజువుచేసినయెడల మా కష్టమంతయుఁ దొలఁగగలదు. మొదటఁ జూడవలసిన దేమనఁగా బ్రహ్మసూత్రపదైః, అనుదానికి శంకరాచార్యుఁ డేమి యర్థముచేసెను?, బ్రహ్మణః సూచకాని వాక్యాని పద్యతేగమ్యతే జ్ఞాయతె బ్రహ్మేతి తాని బ్రహ్మసూత్రపదేన సూచ్యంతే అనఁగా, ఇచ్చట నాచార్యుడు బ్రహ్మ విషయమున విచారము గల యుపనిషద్వాక్యములను సమావేశపఱచెను. ఆచార్య శంకరుఁడు చేసిన యీ యర్థమే సరిగానున్నది ప్రొఫెసరు మాక్సుముల్లరుయొక్క కథనము శంకరునికి విరుద్ధముగా నీప్రశ్నముతో ప్రారంభమగుచున్నది—భగవద్గీతయందుఁ జేయఁబడిన బ్రహ్మసూత్ర శబ్ద ప్రయోగము బాదరాయణుని వేదాంతసూత్రములకే యెట్లుచెందఁగలదు? ఈ సూత్రమును బ్రహ్మసూత్రమని యెందును జెప్పలేదు. ఆచార్యుఁడు దానిని వేదాంత మీమాంసా శాస్త్రమని చెప్పెను. ప్రొఫెసరు మాక్సుముల్లరు, బాదరాయణ సూత్రములయందు భగవద్గీతలోని యేవాక్యములు స్మృతియని చెప్పి గ్రహింపఁబడినవో, వాటిని భగవద్గీత యేదో రెండవచోటి నుండి గ్రహించి యున్నదని చెప్పుచున్నాఁడు. అయినచో, మొదట "బ్రహ్మసూత్ర" నామకమైన యొకగ్రంథముండి యుండుననియు, నయ్యది వేదాంత సూత్రములయందుఁ గలుపఁబడియుండుననియుఁ గూడ మేము చెప్పఁగలము, వేదాంతసూత్రములకు బూర్వమనేక సూత్రములుండెనన్న యీసంగతి నిర్వివాదముగా సిద్ధమైయున్నది. పాణిని నూతనములు ప్రాచీనములునైన సూత్రముల నుల్లేఖించెను. అగుఁగాక; రెండిటికి గర్తయొకఁడనియు మన్నించుటకు శక్యముకాదు. పద్యమునకు సరలమైన యర్థముచేయఁబడునేని ప్రొఫెసరు మాక్సుముల్లరు అంకుల్నేర్కరుకూడఁ జెప్పిన యర్థముకూడ సరియైనదికాదని తెలియును. ఈ పద్యమునందు వేదము స్మృతియని పేరుగలవి లేనిచో నేవో గ్రంథములే యుల్లేఖింపఁబడినవి మఱియు ఋషి యాచార్యుఁడనను పేర్లుగల యెవరో యిద్దఱు కర్తలే యుల్లేఖింపఁబడవలయును; అనఁగా ఋషిభిః శబ్దము కర్త

యందు వచ్చిన తృతీయయే యున్నది ఇది రెండిటితోను సంబంధింపఁ బడవలయును; అనఁగా ఋషిభిః ఛందోభిః గీతం, ఋషిభిః బ్రహ్మసూత్ర పదైః గీతం, అని యీ ప్రకారము అన్వయింపవలయును. బ్రహ్మసూత్ర పదైః, ఇది కరణ తృతీయ, ఈ వాక్యమునఁ గర్త చెప్పఁబడలేదు. కనుక ప్రొఫెసరు మహాశయులు ఆచార్యైః, శబ్దమును శ్లోకము బయటినుండి కర్తయొక్క స్థానమునందు బ్రయోగించుచున్నారు; కాని యిట్లు చేయుటకు వారి కధికారమేమియును లేదు. ఋషిభిః శబ్దమునే ముందటి వాక్యమునుండి కర్తృస్థానమునకు గైకొనిరావలయును. తాత్పర్యమేమనఁగా ఈ శ్లోకమునందు ఋషి, యాచార్యుఁడు నను పేరిట కర్తలు చెప్పఁబడరైరి. కావున నిందు వేదాంత సూత్రనులబోధముకాఁజాలదు. వేదాంత సూత్రములకుఁ గారకుఁడగు బాదరాయణుని ఆచార్యుఁడనుచున్నారు. ఋషి, యనికాదు. ఏ ప్రకారమిచట నీ కర్తయొక్కయు భేదము నిష్పన్నముకాదో. అదేప్రకారమచట గ్రంథమునకును భేదమేమియు నిష్పన్నము కాదు. ఛందోభిః, శబ్దముచేత సమస్తవేదమను నర్థము చేయఁబడఁ జాలదు. ఛందోభిః, చేతఁగవితా బద్ధమగు వేదమంత్రములు అనఁగా కేవల బ్రాహ్మణములే యర్థమగుచున్నవి. సారాంశము, ఇక్కడ గ్రంథభేద మొక్కింతయు లేదు. గ్రంథము కేవలమొకటి యైయున్నది. అయ్యది వేదమేయగుచున్నది. ఈ దృష్టిచేత శ్లోకమునకు సరలమైన యర్థమిదే యగును. ఏమనఁగా వేదములోని ఛందోబద్ధమైన మంత్రభాగమునందు వివిధైః పృథక్, అనఁగా వేర్వేరు చోటులఁ జిందరవందరగా బడియున్న యేవచనములుకలవో, వానియందును వేదము యొక్క బ్రాహ్మణ భాగమున వినిశ్చితైః హేతుమద్భిః, అనఁగా నిశ్చితార్థము చేత హేతువులతో లేక కారణోపపాద్యములతో సహితము సమర్థింపఁబడ్డ యేవచనములు కలవో, వానియందును ఋషులు బ్రహ్మమును వర్ణించిరి. ఈ యర్థము వలన నిచట బ్రహ్మసూత్రపదముచేత బాదరాయణాచార్యుని వేదాంత సూత్రముల యుల్లేఖము చేయఁబడదనియే నిశ్చయమగుచున్నది. సూత్ర శబ్దముచేత, వేని యొక్క రచన మిక్కిలి చిన్న చిన్నవియు నిశ్చయార్థక ములునగు వాక్యములయందు జేయ బడియున్నదో, అటువంటి పాణిని సూత్ర తుల్యములైన గ్రంథములు బోధితము లగుచున్నవి కనుకఁ జదువరుల మనసునందు, యీ శ్లోకములోని సూత్రశబ్దముచేత వేదాంత సూత్రములే యెందులకర్థముకావని సందేహముదయింపఁగూడదు. అనఁగా సూత్ర

శబ్దముయొక్క యుపయోగము గద్యోపనిషద్భాగములకై చేయఁబడు టకు శక్యముకాదని చెప్పఁబడగలదు. కాని సూత్రశబ్దమున కీయర్థ మాధునికమని జ్ఞప్తియుంచుకొనవలయును. ప్రాచీనకాలమున సూత్ర శబ్దముచే ఏదోయొక వివక్షిత విషయము మీఁదఁ బ్రతిపాదితమైన గ్రంథము యొక్కయే బోధము కలుగుచుండెడిది. బౌద్ధులును జైనులును సూత్ర శబ్దము నిదే యర్థమున నుపయోగించిరి. వారియొక్క సూత్రములు లేక సుత్తములు పాణిని సూత్రములవంటివి గాక యుపనిషద్భాగముల వలెనే గద్య గ్రంథమయములై యున్నవి. వాటియొక్క స్వరూపమే మనఁగా, "హేతుమద్భిర్వినిశ్చితైః" అనఁగానిశ్చిత రూపముతోఁ జెప్పఁబడిన హేతువులు లేక యుపపత్తులుగల సిద్ధాంతములను బ్రతిపాదించుటయే. వాటియందుఁజిన్న చిన్నవాక్యములే యుండనగునని నియమమేమియు లేదు సారాంశము, భగవద్గీత పాణిని కంటెను మునుపటిది, అందలి సూత్రశబ్దము బ్రహ్మజాల సుత్తము మొదలైన బౌద్ధ సూత్రములవంటి యుపనిషద్గద్య భాగమునకే ద్యోతకమగుచున్నది. మహాభారతమునకును వేదాంత సూత్రములకును గర్తయొకఁడేయను నికల్పనయు సరియైనది కాదు. వేదాంత సూత్రములను జేసినవ్యాసుఁడు బాదరాయణ వ్యాసుఁడును మహాభారతకర్త ద్వైపాయన వ్యాసుఁడునై యున్నారు. మహాభారతమున బాదరాయణుని పేరు కనిపింపనే కనిపింపదు. ఏప్రకారమ్ము ద్వైపాయన వ్యాసుఁడు వేదములకుఁగూడ సంగ్రహకర్తయు, వ్యవస్థాకర్తయునై యున్నాఁడో ఆ ప్రకారము బాదరాయణ వ్యాసుఁడు కానేరడు. ఇదిగాక, బాదరాయణుని వేదాంత సూత్రములు కీ॥ పూ॥ 150 మొదలుకొని 100 వఱకు నైయున్నవని కూడ నిశ్చయింపఁబడెను; ఎంతతక్కువగాఁ జూచినను అవి బౌద్ధజైన మతముల తరువాతివియై యున్నవి. కాని భారతముయొక్క యాదికర్తయు వేదములకు వ్యవస్థ గావించిన వాడును భారత యుద్ధకాలికుఁడుగా వ్యాసుఁడు (ద్వైపాయనుఁడు) బౌద్ధుల తరువాతి వాఁడని యెన్నడును జెప్పుటకు వీలుకాదు. ఈ వ్యాసుఁడు బౌద్ధ జైన ధర్మములు తెలియఁబడక పూర్వము కొన్ని యేండ్ల క్రిందటి వ్యాసుఁడై యున్నాఁడు. భగవద్గీత, మహాభారతమ్ము యొక్కయే యొక యత్యంత ప్రాచీన భాగమైయున్నది. ఎవరైన, నిష్టమువచ్చినయెడల సౌతికృత మహాభారతమును వేదాంతసూత్రముల సమయముదాఁక లాగికొనిరాఁజాలును; కాని ద్వైపాయన వ్యాసుని

భండాగారమున భగవద్గీతను ఎవరును ఆసమయమునుదాఁక లాగికొని రాఁజాలరు. గీతయందలి "బ్రహ్మసూత్రపదైశ్చైవ" అను యీశ్లోకమే మునుపటిది లేక వేదాంత సూత్రములనాఁటిది యని చెప్పుటయు యుక్తి సంగతముకాఁజాలదు. సంక్షేపముగాఁ జెప్పవలసినదేమనఁగా, బ్రహ్మసూత్రపదముచేత వేదాంత సూత్రములు నిర్దేశింపఁబడవనియే. వేదాంత సూత్రకారుఁడైన బాదరాయణ వ్యాసుఁడును మూలభారత కర్తయగు ద్వైపాయన వ్యాసుఁడును భిన్నవ్యక్తులగుచున్నారు వారిరువురికిని వేల కొలఁది యేండ్ల యెడమున్నది. వర్తమాన సమయమునఁ గొందరు వారిద్దఱను ఒకవ్యక్తిగా విశ్వసించునెడల, బాదరాయణ వ్యాసుఁడు మునుపటి వ్యాసునియొక్క యవతారముగాఁ జెప్పఁబడఁగలఁడు. కాని చారిత్రిక దృష్టినిబట్టి యీ రెండు వ్యక్తులు భిన్నములైనవారని నిర్వివాదముగా సిద్ధమగుచున్నది.

భగవద్గీతకును బ్రహ్మసూత్రములకును లేక వేదాంతసూత్రములకుఁ కర్త యొకఁడు కాఁజాలడు. దీనికొక గొప్ప కారణమున్నది. అది యేది? వేదాంత సూత్రకారుఁడు సాంఖ్యయోగముల రెంటిని ఖండించెను. ఇంతయేకాదు వేదాంత సూత్రకారునికిఁ బ్రధాన శత్రువు సాంఖ్యమేయై యున్నది. దాని నతఁడు చాలముఖ్యత్వముతో విస్తరించి ఖండించి యున్నాఁడు సాంఖ్య మతఖండనమును శంకరాచార్యుఁడు ప్రధాన మల్లనిబర్హణ మనియెను మఱియు దీనితోఁగూడ "ఏతేన యోగః ప్రత్యుక్తః" ఈ ప్రకారముగా యోగము యొక్క ఖండనము కూడ వేదాంత సూత్రములయందున్నది. భగవద్గీత యందీ విషయము లేదు. అందుసాంఖ్యయోగములు సేకరింపఁబడియున్నవి. ఇంతేకాదు సాంఖ్యమునకు బ్రథమ గౌరవమునిచ్చెను. సారాంశము, భగవద్గీత సాంఖ్యమును యోగమును దనవిగా జేసికొన్నది. కాని వేదాంతసూత్రము ఈ రెంటిని గపరికొట్టుచున్నది. దీనిఁబట్టి, రెంటింటికిని కర్తయొకఁడు కాఁడనియు రెండింటికిని సమయమే యొకటి కాఁజాలదనియు సిద్ధమగుచున్నది. భగవద్గీతయందువలెనే మహాభారతమందును సాంఖ్యయోగముల ఖండనము లేదు; కాని స్వీకారమున్నది. చాలచోటులను వాటియొక్క ప్రశంసయున్నది ఇంకను చీటికి మాటికిఁగూడ నావతములు సవిస్తరముగా విచారింపఁబడినవి. తాత్పర్యమేమనఁగా భగవద్గీతయు వేదాంత సూత్రములును నొక్కఁడు చేసినవియుగావు ఒక్కకాలమలోనివియుఁగావు. ఈ విషయము

సాంఖ్యయోగము సంబంధమగు నారెండిటియందుం గావింపఁబడిన వివేచన చేత స్పష్టమగుచున్నది. ఇంతయేకాక భగవద్గీతకును వేదాంత సూత్రములకును వేదాంతవిషయకము లైన మతములయందుగూడ భేదమున్నది; కాని యీ విషయమైన వివేచన ముందునకుఁబోయి చేయఁబడును.

మహాభారతమున మఱియే రెండవ సూత్రముయొక్క నామనిర్దేశము లేదు అందు నాశ్వలాయన గృహ్యసూత్రములోని యొకటి రెండు వచనములున్నవని హాప్కిన్సు చెప్పుచున్నాఁడు; కాని యీమాట మాకు సరిగా నచ్చదు కారణ మేమనఁగా అశ్వలాయన గృహ్యసూత్రమందు భారత మహాభారతములు రెండిటియొక్క పేరులు గానఁబడుచున్నవి; అనఁగా అశ్వలాయన సూత్రము మహాభారతము తరువాతిదయి యున్నది. హాప్కిన్సు ఇచ్చిన ప్రమాణము (భా, ఆది, అ, 74)నందు నాశ్వలాయన సూత్రము పేరు లేదు. "వేదేష్వపి వదంతీమం" ఇంత మాత్రము చెప్పియున్నాఁడు. హాప్కిన్సు స్వీకరించిన దేమనఁగా.

అంగాదంగా త్సంభవసి హృదయాదధిజాయసే।
ఆత్మావై పుత్రనామాసి స జీవ శరదః శతమ్॥

ఈ మంత్రము కౌషితకి బ్రాహ్మణములోనిది. దానితరువాతి శ్లోకమని యిదికూడ నతఁడు చెప్పినమాటయే.

జీవితం త్వదధీనం మే సంతానమపిచాక్షయం।
తస్మాత్త్వం జీవ మే పుత్ర సుసుఖీ శరదాం శతం॥

ఈ మంత్రము కౌషితకి బ్రాహ్మణమున నుండక యాశ్వలాయన సూత్రమందే కనఁబడుచున్నది. కాని యిందువలన నియ్యది యాశ్వలాయననిది కాదని ప్రకటమగుచున్నది ఈ శ్లోకములకు మొదటనే మంత్రము చెప్పఁబడినది. ఎట్లు "వేదేష్వపి వదంతీమం మంత్రగ్రామం ద్విజాతయః" ఇందువల్ల నీశ్లోక మేమో మఱియొకచోట వేదములోనొకభాగముననున్నదని ప్రకటమగుచున్నది. అది కౌషీతకియందు గనఁబడనిచో, నయ్యది యిపుడు దొఁకని యేదో యితరశాఖయందు నుండును. సారాంశము, ఈ శ్లోకమాశ్వలాయనమందు భారతము యొక్క నామప్రమాణము ప్రత్యక్షముగా నున్నది. ఇట్టిస్థితిలో మహాభారతమందు నాశ్వలాయనములోని శ్లోకము కనఁబడుట యెన్నఁడును సంభవింపదు.

ఏదైన నొక గ్రంథమందు నేదైన రెండవగ్రంథముయొక్క ప్రమాణ మున్నపుడు మఱియు నందువలన రచనాకాలముయొక్క నిర్ణయము చేయ వలసినపుడును, రెండువిషయముల ప్రమాణములేక రెండు విషయముల జ్ఞానము తప్పక కావలయును. మొదటివిషయము రెండవగ్రంథ మా స్థితి యందు నీ సమయమునకున్నదా లేదా; ఇంక రెండవవిషయము ఆ రెండవ గ్రంథముయొక్క నిశ్చితసమయమేది. ఆ రెండవగ్రంథముయొక్క నిశ్చిత సమయము తెలియనియెడల నిట్టి ప్రమాణముచేత నేమియు నిష్పన్నము కాదు. ఏదైన నొకవ్యక్తియొక్క నామము అందున్నచో, ఈవ్యక్తియొక్క సమయము మునుపటిదియని యింతయే నిశ్చయముకాఁగలదు. కాని యెటులనున్నది యటులనే యున్నదను సంగతి నిశ్చితముకాఁజాలదు. ఇది గాక యీ వ్యక్తియొక్క సమయముకూడ నిశ్చితరూపమున దెలిసికొన వలయును; లేనియెడల దానిచేతఁ గొంచెమనుమానముకూడఁ జేయఁబడఁ జాలదు. ఈ దృష్టిచేత విచారించి పైని మేముల్లేఖించిన రెండు సూత్రములకు సవిస్తరమైన నిర్దేశము చేయుట మాకావశ్యమైయుండెను. ఈ రెండు గ్రంథములకు కర్తలు ప్రసిద్ధులై యున్నారు. వీరి గ్రంథములును ప్రసిద్ధములై యున్నవి యీ గ్రంథముల సమయముకూడ మోటు లెక్క చేత నిశ్చయింపఁబడినదివలె నున్నది. ఆశ్వలాయనుని గృహ్యసూత్రములయు బాదరాయణుని వేదాంత సూత్రములయు సమయము క్రీ। పూ। 100 వత్సరములకు దగ్గఱిదిగానున్నది. ఈ రెండింటియందును మహాభారతము మాటయున్నది; అనఁగా ఆశ్వలాయనమందు మహాభారతముయొక్క పేరు ప్రత్యక్షముగానున్నది. ఇంకను వేదాంతసూత్రములయందు మహాభారతములోని వచనములు స్మృతియని చెప్పి యుద్ధరింపఁబడి యున్నది. కనుకనే యీ రెండు గ్రంథములును మహాభారతమునకుఁ దరువాతివియని నిశ్చయపూర్వకముగా జెప్పవచ్చును. ఇపుడు మహాభారతమందుఁగూడ నీ గ్రంథముల యుల్లేఖము గనఁబడుచున్నది. కాని మేము సవిస్తరముగా వివేచనఁగావించి యీ యుల్లేఖ మా గ్రంథముల విషయమున గాదని సిద్ధముచేసి యుంటిమి. చెప్పఁబడిన యిద్దఱు గ్రంథకర్తలయొక్క నామములు మహాభారతమున బొత్తిగా లేనేలేవనికూడ ధ్యానమీయఁదగియున్నది. హాప్కిన్సు చెప్పినదేమనఁగా, అనుశాసనపర్వమున నాల్గవ యధ్యాయమందు నాశ్వలాయనునియొక్క నిర్దేశమున్నది. కాని యీ యాశ్వలాయనుఁడు గోత్రప్రవర్తకుఁడని జ్ఞప్తియుంచుకొన వల

యును, సూత్రకారుఁడనికాదు. విశ్వామిత్రునికిఁగల యనేక పుత్రులలో నితఁడొక గోత్ర ప్రవర్తకుఁడైన పుత్రుఁడుగా నుండెను. అనఁగా ఇతడు వేద సంహితా కాలమునందలి ఋషియైయున్నాడు, సూత్రకారుఁడు కాడు.

వేటియొక్క యుల్లేఖము సామాన్యరీతిని మహాభారతమున గనఁబడుచున్నవో, ఆ సూత్రముల యొక్క విచారమును ఇపుడు మేము, గొంత చేయుదుము. ఇందువలన మహాభారతకాలమును నిర్ణయించు యందు గొంచెమును సహాయములభింపదని మేము పైని జెప్పియుంటిమి అయినప్పటికి దెలియుదగిన విషయము లన్నిటిని నొకచో జేర్చుట యావశ్యకమైయున్నది. ఒకవేళ భవిష్యత్తునందు, సమయనిర్ణయము చేయుటకై, కొన్ని క్రొత్తవిషయములు తెలియవచ్చును. అప్పుడీ విషయముయొక్క యుపయోగము చేయఁబడును. మహాభారతమున ననేకసూత్రముల నిర్దేశముకలదు. సభాపర్వములోని కచ్చిత్, అనుఅధ్యాయమందు యుధిష్ఠిరుని చేత ప్రశ్న వేయబడెను అశ్వసూత్రము, రథసూత్రము, మఱియు శతఘ్ని సూత్రమును నీవభ్యసించుచుంటివా లేదా? ఈ సూత్రములేవియో యెవరాలోచించిరో, ఈ సంగతుల నిర్దేశములేదు; కాని యపుడు అనేక విషయములమీద శాస్త్రరూపములైన సూత్రములుండెననియు, అవి యభ్యసింపఁబడుచుండెవనియు మాత్రమగుపడుచున్నది. ఈ సూత్రములు కేవలము వల్లించుటకై యుపయోగించు చిన్నచిన్న వాక్యములవంటివిగాక విస్తృత స్వరూపముగలవైయుండును. సూత్రకర్త మఱియు సూత్రకారుడు వంటి వేలువేలు నామములుకూడ ననుశాసనపర్వమందు గనబడుచున్నది. ఒక చోట సూత్రకారుడనియు గ్రంథకర్తయనియు నిర్దేశమున్నవి. ఇదువల్ల సూత్రశబ్దము చేత సర్వసామాన్యమైన గ్రంథముయొక్క విశిష్టజ్ఞానము కలిగి యుండునని తెలియుచున్నది.

ధర్మసూత్రముల సంబంధమున కాక ధర్మశాస్త్రముల సంబంధమున నధికమైన యుల్లేఖ మగపడుచున్నది; ఎందుచేననఁగా, మహాభారతమునకు ధర్మగ్రంథ యొక్క స్వరూపమును ప్రాప్తి పఁజేయుటల్ల నయ్యావి యెక్కువ యుపయుక్తములై యగియుండును. నీతిశాస్త్రమను పేరు చాల మారులు వచ్చినది. నీతిశాస్త్ర కర్తలు నామములు చాలమంది యగపడుచున్నారు వారు శుక్రుఁడు, బృహస్పతి మొదలైనవారు ధర్మశాస్త్ర

ములును మాటిమాటికి నుల్లేఖింపఁబడినవి. ఒకచోట మను ధర్మశాస్త్రము యొక్క యుల్లేఖము కనఁబడుచున్నది. రాజధర్మము మొదలుగా నన్ని విషయములయందును మనువచనముల యుపయోగము చేయఁబడినది. కాని యా వచనములు నేఁడు ప్రత్యక్షమైయున్న మను స్మృతిలోనివని చెప్పఁబడఁజాలవు. ఈ సంబంధమున నసే విస్తృతమైన భాషాంతరీకరణము నకును బనిలేదు. అది హాప్కిన్సుయొక్క గ్రంథమున నీయఁబడినది. మేము వర్తమానమనుస్మృతి మహాభారతమునకుఁ దరువాతిదియని ముందే చెప్పియుంటిమి.

ఇపుడు పురాణముల సంబంధమున విచారము చేయఁబడును. మహాభారతమునందుఁ పురాణముల యుల్లేఖ మధికముగా నున్నది. వర్తమాన పురాణగ్రంథములు మహాభారత కాలమునకు నిటీవలి వనుటలో నెవరికిని గొంచెమును సందేహములేదు; కాని మహాభారతమున పురాణము లయుల్లేఖ మున్నది. భారతమునకుఁ బూర్వమున్న పురాణములసంఖ్య యొక్కటియో? పదునెనిమిదియో? అని యొక గొప్ప ప్రశ్న కలుగుచున్నది. స్వర్గారోహణ పర్వమునందు నీ యుల్లేఖము కనఁబడుచున్నది—ఈ భారతమున నష్టాదశపురాణములు, అన్ని ధర్మశాస్త్రములు, మరియు సాంగములగు చతుర్వేదములు మేలవింపఁ బడియున్నవి. ఏ మహాత్ముఁడు వ్యాసఋషి యష్టాదశపురాణములకుఁ గర్తయై యున్నాఁడో మఱియు వేదములకుఁ గేవలము మహాసాగరమై యున్నాడో వారియొక్క గ్రంథము సజీవమైన దేవతావాణియైయున్నది. అందఱు దీని నవశ్యము వినవలయును." ఇప్పటి లోకులకుఁ, బురాణములు పదునెనిమిదియునియు వానికన్నిటికిని గర్త యొక వ్యాసఋషియనియు నూహయున్నది. ఈ యూహయే పై నుడువఁబడిన భాషాంతరమందుఁ గూర్చఁబడినది. ఈ శ్లోకములు మహాభారతమునకుఁగూడఁ బిమ్మటివి యగుట సంభవమగుచున్నది; ఎందుచేతననఁగా, ఇంత పెద్దవియు ననేకమునగు గ్రంథముల రచన యొక వ్యక్తిచేతనే కాఁజాలదు. కాని యీ శ్లోకము లసత్యములని విశ్వసింపక మహాభారతముకంటెఁ బూర్వ మీపదునెనిమిది పురాణములేవో యల్పరూపమున నుండియుండవని యెంచఁబడినయెడల నాశ్చర్యము లేదు. మఱియును వేదముల వ్యవస్థకుఁ ముఖ్యముగా ద్వైపాయన వ్యాసులీ పురాణములకుఁగూడ వ్యవస్థ గావించియుండుననుటయు సంభవ

మగుచున్నది. వాయుపురాణము యొక్క యుల్లేఖము వనపర్వము యొక్క 192వ యధ్యాయములో 16వ శ్లోకమునందుగనబడుచున్నది. ఇట్టిస్థితిలో వాయుపురాణమును స్వతంత్రమనియు బూర్వమనియు విశ్వసించిన యెడల, బదునెనిమిది వేర్వేఱుపురాణములు మొదటినుండియు నుండెననికూడ విశ్వసింపవలసియున్నది. మార్కండేయ సమస్యాపర్వమునందు గలియుగమును వర్ణించుసను యమున నుక్తమైనయుల్లేఖము చేయబడినది. మార్కండేయుడు చెప్పుచున్నాడు "వాయుప్రోక్తమగు పురాణమును స్మరించి యీ భూత భవిష్యత్తులను జెప్పియున్నాను" అని యదార్థమున మార్కండేయునికిస్వయముగా వేలకొలది యుగముల యనుభవము కలదు. కావున వానికి వాయు పురాణమును స్మరింపవలసిన యావశ్యకత యేమియును లేదు. అగుంగాక; మునుపు పదునెనిమిదిపురాణములు నుండు నెడల నవి యిప్పటిపురాణముల కన్న నవశ్యము వేఱై యుండుననుటకు సందేహము లేదు * ఇపుడు మేము

---

* మూలపురాణ మొకటి యుండెననియు వ్యాసులు దానికిం బదునెనిమిది పురాణములు చేసెననియు నింకనొక గ్రంథకారుడును నిదే కల్పన చేసియున్నాడు. ఈ మూల పురాణములమీంద మూండు నాలుగు సంస్కారములై యుండుననియు నపుడెచ్చటనైనను దానికి వర్తమాన స్వరూపము ప్రాప్తించి యుండుననియు నీ విషయమున సందేహము లేదు. తలచు సౌతి సమయమున 18 పురాణములై యుండును. వ్యాసుడొక్క మూలపురాణమునకే 18 పురాణములు చేసెననియుం ఆదిపురాణముల యందుం బండెన్డు పండెన్డువేల శ్లోకములుండెననియుం జెప్పు చున్నారు. విక్రముని సమయమున నీ పురాణములకు బ్రథమసంస్కరణము తయారయ్యెను. తరువాత గొంతకాలమునకు పౌరాణికులు దాదాపు నాలుగులక్షల శ్లోకముల గ్రంథమును నిర్మించిరి. సౌతియొక్క మహాభారతమునకు బిమ్మట, అతనియనుకరణము మీద, రామాయణము మఱియితర పురాణములయొక్క క్రొత్తసంస్కరణములు తయారు చేయబడియుండునని మేము పూర్వము చెప్పియుంటిమి. దీని తరువాతగూడ నీ పురాణముల యందు నింకను గొంత పూర్తియవశ్యము అయియున్నది. అందు భవిష్య ద్రాజుల వర్ణనచేర్చబడియున్నది. ఇది క్రీ॥ తరువాత 300 మొదలుకొని 600 లోపు సమయముననైనది. ఈ సంగతి, క్రీ॥ తరువాత 500కు దాదాపున నున్న కైలకిల యవనరాజు సమయమువఱకుగల యయ్యాయిరాజుల వర్ణనవలన స్పష్టముగా గనుపట్టుచున్నది.

ఇతిహాసమును విచారింతుము. ఇతిహాస శబ్దముకూడ మహాభారతమునఁ జాల మార్లు గపడుచున్నది. ఇతిహాస శబ్దముచేత నేయర్థము గ్రహింపవలయునో, యనినిశ్చయముగా జెప్పుటకు శక్యము కాకున్నది. పురాణము నితిహాసమును జోడుగాఁ దఱచొ కేచోటను గనఁబడుచున్నవి. ఉపనిషత్తులందుఁగూడ ఇతిహాసపురాణం, అనిచెప్పబడెను. పురాణశబ్దముచేత బహుప్రాచీనకాలకథయు ఇతిహాసశబ్దముచేత సమీపకాలకథయు నర్థముచేయబడినచో నే యాటంకమునులేదు. పురాణములయందు గాథలుగాక యింక నితరవర్ణనయును గలదు. దేవతలయు దైత్యులయు గథలు పురాణములందు గానఁబడుచున్నవి. కాని యితిహాసమునందుఁ గేవలము రాజులయొక్కయే కథల సమావేశము కాఁగలదు. ఆఖ్యాన శబ్దముచేత నొక విశిష్టకథగల గ్రంథముయొక్క బోధము కలుగుచున్నది. స్వయముగా మహాభారతవిషయమై యితిహాసము, పురాణము, ఆఖ్యానము ఈ మూడుశబ్దములును వ్యవహరింపబడి యున్నవి. మహాభారతము తక్క మఱి రెండవ యితిహాస గ్రంథమేదియో చెప్పఁబడజాలదు. ద్రోణాచార్యునివర్ణించునపుడు; వారు వేదములను, వేదాంగములను, ఇతిహాసములనుదెలిసినవారని చెప్పఁబడెను. దీనిబట్టి పూర్వమింకను జాల యితిహాసములుండునని యనుమానము కలుగుచున్నది. కాని యివన్నియు మహాభారతమునఁ గలుపబడియున్నవి; కనుక నవి నఖివృద్ధిస్థితియందుగానరావు; ఇంక వర్తమానమున ఇతిహాసశబ్దము చేత గేవలముమహాభారతముయొక్కయే బోధముకలుగుచున్నది. సారాంశము, ఈ విషయములో భేదము లగుపడుచున్నవో యవి యివియైయున్నవి—కథముగియుగాథ, ఆఖ్యానము మఱియు పాఖ్యానము, వీటియందుగాథ ఆయైతిహాసికశ్లోకబద్ధమగు వర్ణనగా జెప్పుచున్నారు. దానియొక్కరచనను వంశావలీకారులు చేసియున్నారు. ఆఖ్యానమునకు నుపాఖ్యానమునకును విశేషభేదములేదు. ఉపాఖ్యానమందు బుక్కటి పురాణములకు విశేషముగా నంతర్భావము కాగలదు. ఈ గ్రంథములన్నింటిలో నే గ్రంథమునకును నామనిర్దేశము, గ్రంథకర్తయొక్క నామముతోగూడ, మహాభారతమున జేయబడలేదు, కావున మహాభారతకాలమును నిర్ణయించుపట్ల వీటియొక్క యుపయోగ మే మాత్రమును లేకున్నది. ఇంతవఱకు సూత్రపురాణేతిహాసముల నామనిర్దేశముచేత వర్తమాన మహాభారతముయొక్క కాల నిర్ణయము చేయుటకు నెంతసాహాయ్యము కాగలదో యిది విచారింపఁబడినది; మఱియును వర్తమానములైన గృహ్యసూత్రములు, వేదాంతసూత్రములు,

పురాణములు, మనుస్మృతి యివన్నియు మహాభారతము తరువాతివని నిశ్చయము చేయఁబడినది. ఇఁక వేదములు, మఱియు నుపనిషత్తుల సంబంధమున విచారము చేయఁబడును. యథార్థమున నీ గ్రంథములు మహాభారతముకంటె మునుపటివియని నిశ్చితమైయున్నది. ఇట్టి యవస్థయందు వీటి యుల్లేఖము మహాభారతమున గనబడుటలో నాశ్చర్యమేమియును లేదు. ఈ గ్రంథముల సమయము నిశ్చయాత్మకమైన రీతిని స్థిరము కాని మాట నిజము, అయినప్పటికి నాసమయము క్రీ. పూ. 300 ఏండ్ల కిటీవలిదికాదని చెప్పఁబడఁగలదు. ఇట్టి దశయందు నీవిచారము ప్రాయికముగా విషయాంతరముతోఁ దుల్యమేయగుచున్నది. కాని యీ సమాలోచనాత్మకమైన గ్రంథము యొక్క పరిపూర్తికై, యీ విషయముకూడ గొంత యుల్లేఖింపబడుట యావశ్యకము. కనుక హాప్కిన్సుయొక్క గ్రంథమునే సహాయము చేసికొని యిచట సంక్షేపముగా గొంత విచారము చేయఁబడును. వేద గ్రంథములన్నియు మహాభారతము కంటె బూర్వము పూర్తియై యుండెనన్న యీ విషయము ప్రకటమైయున్నది. ఇప్పుడే గ్రంథములలో వేటివేటియొక్క నామనిర్దేశము మహాభారతమునందున్నదో యిది చూడవలయును. నాలుగువేదములును పేర్లతో సహిత ముల్లేఖింపఁబడినవి. కాని యక్కడ అథర్వవేదము యొక్క పేరు విడువబడినది. తఱచు ఋగ్వేదముతోడనే గణన ప్రారంభమగుచున్నది. అక్కడక్కడ సామవేదమునకు గూడ నగ్రస్థానమీయఁబడెను. ఈనాలుగుగలిసి చతుర్మూర్తివేదమగుచున్నది. అక్కడనక్కడ చాతుర్విద్యనామమును గనఁబడుచున్నది; కాని త్రైవిద్యనామముయొక్క యుపయోగమెక్కువగాఁ జేయఁబడినది. వేదములు నష్టమైనట్లును మఱియునయ్యవి విభాగము చేయఁబడినట్లును బ్రసిద్ధి యున్నది. మొదట నొకవేదమేయుండెను; కాని కృతయుగము తరువాత త్రివేదములు, ద్వివేదములు, ఏకవేదము, అనృక్కు మొదలుగా భేదములు కలిగినవి. అపాంతరతమ ఋషి వేదములను వేఱుచేసెను. వేదములు దృష్టములు, కృతములులేక సృష్టములని చెప్పఁబడెను. "మంత్ర బ్రాహ్మణ కర్తారః" ఈ విధముగా హరివంశమున జెప్పఁబడినది. వేదములకు గర్త యీశ్వరుఁడు. అగ్నియు సూర్యుడును వేదకర్తలు. మొట్టమొదట బ్రహ్మ వేదమును బఠించెను, ఎట్లు "స్తుత్యర్థమిహదేవానాం వేదః సృష్టః స్వయంభువా" (శాంతిపర్వము అధ్యాయము 328). పదము మఱియు క్రమముయొక్క యుల్లేఖము కనఁబడుచున్నది. సంహితాధ్యాయీ,

శబ్దము యొక్క యుపయోగము అది పర్వములో 167వ యధ్యాయ మందును అనుశాసనపర్వములో 143వ యధ్యాయమందును జేయఁబడినది. బ్రాహ్మణముల యుల్లేఖము శాంతిపర్వములో 269వ యధ్యాయమందును వనపర్వములో 217వ యధ్యాయమందును గనఁబడుచున్నది. అచ్చట, బ్రాహ్మణములలో వర్ణితములే భిన్నభిన్నములైన యగ్నుల యుల్లేఖము మున్నది. యాజ్ఞవల్క్యుని శతపథబ్రాహ్మణము యొక్క యుల్లేఖము సంపూర్ణముగాఁ బేరుతో సహితము చేయఁబడెను. అనఁగా శాంతిపర్వములో 329వ యధ్యాయమందు సరహస్యము, ససంగ్రహము, సపరిశేషము నైన యుల్లేఖమున్నది. ఇతర బ్రాహ్మణముల యుల్లేఖమున సాధారణముగా "గద్యాని" శబ్దముయొక్క యుపయోగము చేయఁబడెను. అరణ్యము యొక్క యుల్లేఖము చాలచోటులనున్నది; ఎట్లనఁగా గాయన్త్యారణ్యకే విప్రాః, 'అరణ్యక పదోద్భూతాః' ఇత్యాదికము, ఆరణ్యకమును వేద ములలోని తత్త్వభాగమనికూడఁ జెప్పెను. 'వేదవాదానతిక్రమ్య శాస్త్రాణ్యారణ్యకానిచ' అని కూడ నుల్లేఖమున్నది ఉపనిషత్తుల యుల్లేఖము ఏక వచనమందును, బహువచనమందును సమూహార్థమందును జేయఁబడి యున్నది. ఆరణ్యకము యొక్క యుల్లేఖము వేదముకంటె వేఱుగా జేయఁ బడినట్లే ఉపనిషత్తుల యుల్లేఖముకూడ వేదముకంటె వేఱుగా జేయఁబడి యున్నది. ఉపనిషచ్ఛబ్దమునకార్థము సాధారణరీతిని రహస్యము లేక గుహ్య మనికూడ జేయబడినది. మహోపనిష శ్చబ్దమునకార్థము సందిగ్ధముగా నగ పడుచున్నది; ఎందుచేతననఁగా, ద్రోణపర్వములో భూరిశ్రవునివిషయమున 'ధ్యాయ న్మహోపనిషదోగ యుక్తోఽభవన్మునిః' అని చెప్పఁబడెను మఱియు నచట నేగ్రంథమునకుల్లేఖమో తెలియుటలేదు కాని సాధారణ రీతి నుపనిషచ్ఛబ్దముచేత గ్రంథముయొక్క యుల్లేఖముకలిగి అందుఁదత్త్వ జ్ఞానముయొక్క బోధమగుచున్నది. మహాభారతమునందు నేయుపనిషత్తు నకు బేరీయఁబడకుండుట యెంతయు నిరాశాజనకమైన విషయము. మహా భారతమునకు బూర్వమునజాలయుపనిషత్తులుండెను దానితరువాతగూడ జాలయుపనిషత్తులు చేయఁబడినవి. దశోపనిషత్తుల యొక్కయునుల్లేఖము మహాభారతమునలేదు దశోపనిషత్తులు మహాభారతముకంటె మునుపట్టివి యని ప్రమాణాంతరములచేత నిశ్చయపూర్వకముగా నిరూపింపబడగలదు. అయినప్పటికి నిదేమాట యితరోపనిషత్తులగూర్చి చెప్పబడజాలదు. ఉదా హరణార్థము, శ్వేతాశ్వతరము పదింటికిని వెలుపలియుపనిషత్తు. దాని

సమయమును నిర్ణయించుటకై సాధనము దొరకుచున్నది. ఈ యుపనిషత్తులోని కొన్నివచనములు మహాభారతమునందుఁ గనఁబడుచున్నవి. కాని యీయుపనిషత్తుననే యీ వచనములు ఏమో మఱియొక చోటినుండి తీసికొని రాబడియున్నవని తెలియుచున్నది.

ఇపుడు మనము ఉపవేదములయు వేదాంతములయు విషయమునఁ గొంచెము విచారింతము. ఉపవేదములు మూఁడున్నవి. ఆయుర్వేదము, ధనుర్వేదము మఱియు గాంధర్వవేదము. వీని యుల్లేఖము మహాభారతమునఁ గనిపించుచున్నది. నాల్గవయుపవేదము స్థాపత్యమను పేరఁ బ్రసిద్ధమైయున్నది. దీనికి భిన్నమైన యుల్లేఖము ఆదిపర్వమున వాస్తువిద్య పేరునఁ జేయఁబడినది. ఈ యుపవేదములలో ఆయుర్వేదమునకుఁ గర్త కృష్ణాత్రేయుఁడు, ధనుర్వేదమునకుఁ గర్త భరద్వాజుఁడు. గాంధర్వవేదమునకు గర్త నారదుఁడును చెప్పఁబడిరి (శాన్తి, అ, 320). వీరితోడ నింకను గొందఱు కర్తలయొక్క యుల్లేఖమున్నది; ఏవిధముగా ననఁగా, బృహస్పతికి వేదాంగజ్ఞానమున్నది, శుక్రుఁడు నీతిశాస్త్రమును జెప్పెను, గార్గ్యునికి దేవర్షి చరిత్రము తెలియును. ఇవి మొదలైనవి. ఆయుర్వేదమునకు సంబంధించి విశేషమైన యుల్లేఖములేదు, అయినను పిత్త, శ్లేష్మ, వాయువుల యొక్క స్పష్టమైన యుల్లేఖము కలదు. భారతీయాయుర్వేదము యొక్క యీ ముఖ్యసిద్ధాంతము బహుప్రాచీనమైనది (శాన్తి, అ, 243). సభాపర్వములో 5వ మఱియు 11యధ్యాయములందు నాయుర్వేదమున నెనిమిదిభాగములున్నవని చెప్పబడినది. వనపర్వమునందును విరాటపర్వమునందును శాలిహోత్రముయొక్కయు నుల్లేఖమున్నది. ఇది అశ్వచికిత్సాశాస్త్రమని ప్రకటమైయున్నది. దీనికర్తయొక్క యుల్లేఖమెచ్చటనులేదు ధనుర్వేదముయొక్క యుల్లేఖమెక్కువగానున్నది. ఇది నాలుగువిధములనియు నిందు బదిభాగములున్నవనియు జెప్పబడియున్నది. ఈ విషయముమీద సూత్రములుకూడ నుండెనని కచ్చిదాఖ్యానము బట్టి తెలియుచున్నది. క్షత్రియుల వర్ణనచేయునపుడు "ధనుర్వేదేచ వేదేచ నిష్ఠాతః" అని చీటికిమాటికి జెప్పబడుచున్నది; ఇందుచేత, క్షత్రియులీ రెండు విషయముల యభ్యాసమును జేయుచుండెడివారని విదితమగుచున్నది. ఆదిపర్వములో 138వ యధ్యాయమునందు, క్షత్రియులు వేదములకంటెగూడ ధనుర్వేదమునందు నెక్కువ ప్రవీణులైయున్నారని వర్ణింపబడినది. ఇపుడు

ధనుర్వేదమునందలి గ్రంథమొక్కటియు దొరకకున్నది. కాని చెప్పబడిన వర్ణనములన్నియు గల్పితము లెంతమాత్రమును గాజాలవు. మహాభారత కాలమున బదిశాఖలుకల ధనుర్వేదనామకమైన గ్రంథము తప్పక యుండి యుండును మరియు దానియందు అస్త్రములకుగూడ వర్ణనమగుననుట సంభవమైయున్నది. గాంధర్వవేదముయొక్క వర్ణన వనపర్వములో 91వ యధ్యాయమందున్నది. అందు గీతము, నృత్యము, వాదిత్రము (పాట, ఆట, వాద్యము) మరియు సప్తభేదములు ముఖ్యవిషయములై యున్నవి. నటసూత్రముయొక్క యేయుల్లేఖము పాణినివిషయమునగలదో అది దీని యందు లేదు. గాంధర్వవేదమునందు నాటకాభినయముండదు. గానములో నేడు భేదములయుల్లేఖము సభాపర్వములో 11వ యధ్యాయమనందున్నది. మూడుమద్దెల శబ్దములకును ఆఱు నొకటి గాయకస్వరములకును నుల్లేఖ మున్నది.

వేదాంగములు 6 కలవను నీవిషయము ప్రసిద్ధమైయున్నది. వాటి పేరుల యుల్లేఖము స్పష్టము. ఛందస్సు, వ్యాకరణము, జ్యోతిషము, నిరుక్తము, శిక్ష మఱియు గల్పము. కాని యాస్కుని విడిచిపెట్టి వేదాంగములలో దేనికిఁగూడఁ గర్తయొక్క యుల్లేఖమొక్కింతయు లేదు. ఏ వేదాంగములు వర్తమానసమయమునఁ బఠింపఁబడుచున్నవో, అవే మహాభారత కాలమునఁగూడఁ బ్రసిద్ధములై యుండెడివనియుఁ బఠింపఁ బడుచుండెడివనియు లేక లేవనియుఁ గూడఁ జెప్పుటకు వీలుగాకున్నది. ఇందువలన, ఈ యుల్లేఖా భావము కావచ్చునని తెలియుచున్నది. అయినను వర్తమానవేదాంగముల యొక్క కర్తలును వారి గ్రంథములును మహాభారతముకంటె మునుపటివి యనుటకు సందేహము లేదు. ఈ యంగము లకు ఉపాంగములుకూడ నుండెను. ఎందుచేతననఁగా, వనపర్వములో 64వ యధ్యాయమున నిట్లు వ్రాయబడియున్నది. 'వేదాః సాంగోపాంగాః సవిస్తారాః।' ఈ యుపాంగము లేవియైయుండునో, ఈ విషయమునకు జాడ యగపడదు మరియు టీకాకారుఁడు దీనిగుఱించి కొంచెమేనియు వ్రాయడయ్యెను. శాంతిపర్వమునందు 335వ యధ్యాయములో 25వ శ్లోకమున "వేదేషు సపురాణేషు సాంగోపాంగేషు గీయసే।" అని యీ యుల్లేఖ మున్నది. అంగములలో జ్యోతిషము మరియు నిరుక్తముయొక్క యుల్లేఖ మెక్కువగాఁ గనఁబడుచున్నది. యాస్కునియొక్క నిరుక్తము,

మరియు నిఘంటువుపీటిమహాత్త్వముశాంతిపర్వము 343వ యధ్యాయములో 73వ శ్లోకమునందు వర్ణింపఁబడినది మరియు నిదే కోశమునకుఁగూడ నుల్లేఖము కలదు. జ్యోతిషముయొక్క యుల్లేఖము. ఉపనిషత్తులయందును నక్షత్రవిద్యయను పేరునఁ చేయఁబడియున్నది. నక్షత్రజీవి మరియు ఆయుర్వేదజీవి వీరిద్దఱు శ్రాద్ధనిమంత్రణమునకు నయోగ్యులుగాఁ బరిగణింపఁబడుట యెందులకో యూహింపరాకున్నది. నక్షత్రవిద్యయందును జ్యోతిషమునందును గొంత భేదము ఉండవచ్చును. ఫలజ్యోతిషము కొంచెము నిందింపఁబడెనని తోఁచుచున్నది. వనపర్వములో 209వ యధ్యాయమునందు జెప్పెను. ఎట్లనఁగా "ఇరువురు వ్యక్తులయొక్క పుట్టుక యొకే నక్షత్రమందగుచున్నది; కాని వారిద్దఱు ఒకే రీతిగా భాగ్యవంతులు కారు, ఇకనేమంటేని వారి భాగ్యములోఁ జాలభేదము పాటిల్లుచున్నది. ఏ జ్యోతిష గ్రంథమునకు లేక గ్రంథకర్తకు ఉల్లేఖమెచ్చటను లేదు, కాని గర్గుని పేరు సారస్వతోపాఖ్యానమున గనడఁబడుచున్నది. శాంతిపర్వములో 340వ యధ్యాయము యొక్క 95వ శ్లోకమునందు గర్గునికి కాలయవనునితో సంబంధము కలుపఁబడియున్నది. ఈ గర్గుడు కాలజ్ఞుఁడై యుండెను మరియు జ్యోతిస్సులు అనఁగా గ్రహములయొక్క వక్రగతిని దెలిసికొనుచుండెడువాడు. డికోబీయను నతఁడు మహాభారతకాలమునందలి గ్రహమాల పూర్వము 300 క్రీస్తు సంవత్సరమున దెలియఁబడిన గ్రహమాలకంటె వేఱై యుండెనని సిద్ధము చేసియున్నాఁడుఁ అనఁగా సూర్యుఁడు క్రిందను చంద్రుఁడు పైనను ఉండెనని యెంచఁబడియెను. మహాభారతకాలమున కల్పసూత్రములు ఎన్నెన్నియుండెనో యీ విషయమున్నచోటఁ కనబడదు. కేవలము కల్పవేదాంగము యొక్క యుల్లేఖము మాత్రమున్నది. కాని మహాభారతమునకుఁ బూర్వము వేదభేదములతోను శాఖాభేదములతోను శ్రౌతసూత్రములు వేలు వేలుగానున్నవన్నమాట నిర్వివాదము ఆలోచింపఁగా మహాభారతములో వేదములు, బ్రాహ్మణములు, యాజ్ఞవల్క్యుని శతపథబ్రాహ్మణము, ఆరణ్యకములు ఉపనిషత్తులు ఆఱు వేదాంగముల ఉల్లేఖమున్నది. అయినప్పటికిని దీనివల్ల మహాభారతకాలమును నిర్ణయము చేయుటలో కొంచెముగూడ ఊహింపలేము. దీనికి కారణము ఇది ముందుగా ఈ గ్రంథకర్తల నామములు ఈయఁబడలేదు; ఇంకను ఈ గ్రంథముల అట్లే వీటి కర్తలయొక్క సమయము కూడ నిశ్చయింపఁబడలేదు, ఇంతియేకాక ఆ సమయము తెలియనే

తెలియదు. ప్రాయశః ఈ గ్రంథముల సమయము మిగులఁ బ్రాచీనమై యుండును, కాఁబట్టి యొకవేళ నయ్యది తెలిసినప్పటికిని దానివలన విశేషోపయోగ మేమియు నుండఁజాలదు. ఉదాహరణార్థము, మహాభారతము వేదాంగ జ్యోతిషమునకుఁ బిమ్మటఁ జేయఁబడినదని తెలిసినదనుకొందము. అందుచేత మనకు లాభమేమాత్రమును లేదు. ఎందుచేతననఁగా, ఈ జ్యోతిషము యొక్క సమయము క్రీస్తు సంవత్సరమునకుఁ బూర్వము 1400 లేక 1200 పరిగణింపఁబడుచున్నది. ఈ సమయమునకుఁ దరువాత మహాభారతము అయ్యెనని చెప్పఁబడునేని, దీని చేత మహాభారతకాలమును నిర్ణయించుగలోనేమి లాభము కాఁగలదు? ఏ దేని లాభమున్నయెడల నయ్యది, ఏ గ్రంథముల యుల్లేఖము మహాభారతమునఁ జేయఁబడియున్నదో ఆ గ్రంథముల గుఱించియే కాఁగలదు. ఏ విధముగా ఆరణ్యకశబ్దము మహాభారతమునఁ గనఁబడుచున్నది; మరియును పాణిని సమయమున ఆరణ్యకశబ్దమున కర్థము వేదములోని విశిష్టభాగము, కాకుండెను, ఇఁకనేమంటేఁ అరణ్యములో నివసించు మనుష్యుఁడు అయియుండెను; ఇందువల్ల, వేదములోని యారణ్యక భాగములు పాణినికి వెనుకను మహాభారతమునకు ముందును కేయఁబడియుండవలయును లేక వాటి కీపేరు పెట్టఁబడియుండవలయును. అది యట్లుండుఁగాక; మహాభారతమునందు వేదములోని యీ భాగమునకు లేక ఉపనిషత్తులకునుల్లేఖము లేదు, కాఁబట్టి యీ భాగములు ఆసమయమున లేనేలేవని చెప్పఁబడునేని, అపుడు ఈ యనుమానముకూడ జేయఁబడఁజాలదు. ఎపుడు, ఉల్లేఖించి తీఱవలయునను విషయమునకు ఆవశ్యకత లేదో, అపుడు ఉల్లేఖాభావముచేత నేమియు ననుమానము చేయఁబడఁజాలదు. ఇట్టిస్థితియందు మహాభారతమునకుఁ బూర్వము ఏయే గ్రంథము లుండెనో, ఇయ్యది నిశ్చయాత్మకమైనరీతిని జెప్పఁబడఁజాలదు.

ఈ దృష్టితోఁజూచినయెడల, వేదముల లేక ఉపనిషత్తులయొక్క కొన్ని భాషాంతరములు మహాభారతమునఁ గనఁబడుచున్నప్పటికిని అవి యేవి యనువిషయముయొక్క విచారమును గావించుటకు ఏమియు నావశ్యకతలేదు. ఈ కారణముచేత నివ్విషయము తెలియఁబడినప్పటికిని ఏ యనుమానమును జేయుటకు వీలులేదు. వేదములోని యేయే వచనములు మహాభారతమున నెన్నియగపడుచున్నవో, వాటిని వెదకి హాప్కిన్సు తన గ్రంథమునందు ఇటువంటి యుదాహరణముల యొక్క యొకపంక్తినే

యిచ్చియున్నాడు. ఈ యుదాహరణములఁబట్టి, వేదములు, బ్రాహ్మణములు మొదలుగా నన్ని గ్రంథములును మహాభారతమునకు దరువాతివియని స్థూలమైన యనుమానము కాఁగలదు; కాని యీ స్థూలాను మానముచేత విశేషలాభ మేమి యగును ? కఠోపనిషత్తుయొక్క భాషాంతరములు మహాభారతమున గనఁబడుచున్నవని వేటివలన దెలియునో యిటువంటివి కూడను ఉదాహరణము లీయఁబడి యున్నవి; కాని వీటిచేతఁగూడ విశేష లాభదాయకమైన యనుమాన మేమియు జేయఁబడఁజాలదు. శ్వేతాశ్వతరోపనిషత్తు మరియు మైత్రాయణోపనిషత్తుయొక్క యేభాషాంతరములు మహాభారతమున గైకొనబడినవో వాటియొక్కయు నుదాహరణములను హాప్కిన్సు ఇచ్చియున్నాడు. ఈ రెండు ఉపనిషత్తులును దశోపనిషత్తుల కన్న వెలుపటివియనియు వీటియొక్క సమయముకూడ గొంచెమైనఁ దెలియలేదనియు జ్ఞప్తి యందుంచుకొనవలయును. ఇట్టి దశయందు ఉపనిషత్తుల తరువాత మహాభారతరచన జరిగెనని వచింపబడునేని, అపుడు ఇటువంటి కథనమువలన నేమియు నిష్పన్నము కానేరదు. మైత్రాయణోపనిషత్తు నుండి మహాభారతమునకు గొన్ని వేదాంతతత్త్వములు తీసికొని రాఁబడి యున్నవి వాటి విచారము వేదాంతవిషయముతోడిపాటుగా స్వతంత్రరీతిని ముందునకుబోయి కావింపబడును. వైదికగ్రంథములయొక్క యెన్ని భాషాంతరములు మహాభారతమునఁ బుచ్చుకొనఁబడినవో యీ విషయముల గుఱించి మనకు నిచ్చట జెప్పవలసిన యవసరములేదని తాత్పర్యము. గృహ్యసూత్రముల, ధర్మసూత్రముల మరియు బురాణములయొక్క యావశ్యకమైన యుల్లేఖము మునుపు చేయబడియున్నది. ఇపుడు దర్శనము, అనుశాసనము, పథములేక మతముయొక్క యుల్లేఖము విషయమై కొంత విచారము చేయవలసియున్నది.

న్యాయము, వైశేషికము, సాంఖ్యము యోగము, పూర్వోత్తర మీమాంసలును గలిసి యేయాఱుదర్శనములున్నవో, వాటికి ఏకత్ర ఉల్లేఖము మహాభారతములో నెచ్చటనులేదు. ఒక్కకపిలుఁడు దక్క ఈ దర్శనములయొక్క ప్రసిద్ధకర్తలును మహాభారతమునఁ బేర్కొనఁబడరైరి. న్యాయమునకు సూత్రకర్తయగు గౌతముని, వైశేషికమునకు కణాదుని, యోగమునకు పతంజలి మరియు ఉత్తరమీమాంసకు బాదరాయణుని యొక్కయు బేరులు మహాభారతమునలేవు. బాదరాయణుని సూత్రములు

మహాభారతమునకు బిమ్మటివియైయున్నవని మనము మునుపు చెప్పి యుంటిమి. వానియొక్కసమయము క్రీస్తుసంవత్సరమునకు బూర్వము 100 అని యెంచఁబడినయెడల మహాభారతము దానికంటె మునుపటిది యగు చున్నది. పతంజలియొక్క యోగసూత్రముల సమయముకూడ దీనికే దాదాపుదియైయున్నది. పతంజలి తనమహాభాష్యమునందు, పుష్పమిత్రుని యశ్వమేధమును మరియు సాకేతము (అయోధ్య) మీఁదికి యవనరాజగు మినందరు (మిలిందు) యొక్క జైత్రయాత్రను ఉల్లేఖించియున్నాఁడు; మరియు ఈ యుల్లేఖము, ఈ రెండువిషయములు పతంజలి సమయమున ఐనవనుకొనునట్లుగా జేయఁబడియున్నది. దీనిబట్టి పతంజలియొక్క సమయము క్రీస్తువత్సరముకంటె బూర్వము 150 మొదలుకొని 100కి నడమఁ బ్రాయికముగా నిశ్చితమగుచున్నది; అనగా వర్తమాన మహాభారతము క్రీస్తువత్సరమునకు 150వత్సరముల మునుపటిదియని సిద్ధమగుచున్నది. మహాభారతమునందుఁ బతంజలి యొక్క యుల్లేఖములేకుండుట విశేష మహత్త్వముగల ప్రమాణము కానేరదని యెవరైనను జెప్పినచో, ఇట్లు చెప్పుటకు వీలులేదు. పతంజలియొక్క పేరును అవశ్యము ఉచ్చరింపవలసి యుండెను; ఎందుచేత? యోగశాస్త్రముయొక్క లేక యోగమతము యొక్క యుల్లేఖము మహాభారతమందు వేలకొలదిచోటుల గనఁబడు చున్నది; ఒకచోటఁగూడను యోగజ్ఞానమునకుఁ బ్రవర్తకుఁడు హిరణ్య గర్భుఁడు (బ్రహ్మ) అయియున్నాఁడని స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. ఆ సమయమున పతంజలియొక్క యోగసూత్రముల రచన ఐయున్న పక్షమున, వాటియొక్క యుల్లేఖమవశ్యము చేయఁబడియుండును. బాద రాయణ సూత్రములకుగూడ నిదేస్థితియగుచున్నది. ప్రస్తుతసమయము నందు బాదరాయణునిసూత్రములు సర్వమాన్యములును వేదతుల్యములునై పరిగణింపఁబడుచున్నవి. అయ్యవి మహాభారత సమయమున నుండునేని అవి తప్పక పేర్కొనఁబడియుండును. ఇట్లు ఉల్లేఖింపక వేదాంతమునకుఁ బ్రవర్తకుడు అపాంతరతముడు అథవా ప్రాచీనగర్భుఁడు అయియున్నాడని చెప్పబడియున్నది. సారాంశము, మహాభారతసమయము యోగముమరియు వేదాంతముయొక్క సూత్రకర్తలకు మునుపటిదియైయున్నది మరియు నీ రెండింటిస్థితియు సమానమైయున్నది; అనగా రెండిటియొక్క కర్తలు వేర్వేఱుగా జెప్పఁబడియున్నారు. వీరి సమయము నిశ్చితమైయున్నది; మరియును మహాభారతము వీరి సమయమునకు మునుపటిదియను నీ

ప్రమాణము విశేషమహత్త్వముకలదియైయున్నది. పూర్వమీమాంసాసూత్రకర్త జైమిని యింకను న్యాయసూత్రకర్త గౌతమునియొక్క నామములు మహాభారతమందుఁ జూడబడుచున్నవి. కాని యీనామములు సూత్రకర్తయొక్క యోగ్యతతో లేవు; కాని సాధారణఋషులయొక్క పద్ధతి మీద నీయఁబడియున్నవి. తాత్పర్యమేమనగా, గౌతమ సూత్రములును జైమిని సూత్రములును మహాభారతమునకు అనంతరపువియైయున్నవి. న్యాయము, మీమాంసాశాస్త్రమును మహాభారతమునకు బూర్వపుటివియైయున్నవని తెలియుచున్నది; ఎందుచేతననఁగా, ఆలోచింపఁగా న్యాయ శబ్దము ప్రత్యక్షముగా నుపయోగింపబడి యుండలేదు. అయినను ఆ విషయముయొక్క యుల్లేఖము హేతువాదశబ్దముచేతఁ జెప్పియుండెను. (అనుశాసనము అ. 37, 12-14). నైయాయికులు వేదప్రమాణమునంగీకరింపరు కాని యీమతము వేదబాహ్యమని చెప్పబడియెను. మహాభారతమునందు వైశేషికముయొక్క కణాదునియొక్కయు నామములు లేవు. ఆనామములు ఒకమాఱుమాత్రము హరివంశమున నీఁబడియున్నవి వైశేషికశబ్దముయొక్క ఉపయోగము ఒకమాఱుమాత్రము గుణములయొక్క విశేషము అనగా ఉత్తమము, ఈ యర్థమందు జేయఁబడియున్నది. పూర్వమీమాంసయొక్క పేరు శాంతి పర్వములో 19వ యధ్యాయమునందునీయబడియున్నది. ఇందు ఎవరు పాఖండులైనపండితులకు విరుద్ధులైయుండిరో, ఎవరికిబూర్వమీమాంస శాస్త్రమునందు మంచిజ్ఞానముండెనో, మరియు నెవరుకర్మముల యాచరణ చేయుచుండిరో, ఆలోకుల ప్రశంస చేయఁబడియున్నది. ఇందువల్ల, మహాభారతకాలమున బూర్వశాస్త్రమే కర్మశాస్త్రమని యెంచబడియుండును స్వభావతః ఉత్తరశాస్త్రము వేదాంతశాస్త్రమని యెంచబడియుండుననియు దెలియుచున్నది. కాని యీవిషయమునందు సందేహించుటకెక్కువయవకాశమున్నది. సాంఖ్యశాస్త్రమునకు బ్రవర్తకుడైనకపిలునియొక్క పేరుమాటికి మాటికి గనబడుచున్నది. ఇంకను వారి శిష్యులుకూడ జాలమంది చెప్పఁబడియున్నారు. వారిశిష్యులలో ఆసురియొక్కయు బంచశిఖునియొక్కయు నామములు వచ్చియున్నవి. అసితదేవలుఁడను పేరుకూడ వచ్చియున్నది. కపిలునియొక్క వర్తమానసూత్రములు బహునవీనము లనుమాటప్రసిద్ధియైయున్నది. కపిలునియొక్క యింకే ప్రాచీనగ్రంథము ఈ సమయమున బ్రసిద్ధమైనదిలేదు. మహాభారతమునందు గపిలుఁడు అగ్ని, శివుని, విష్ణుని మరియు ప్రజాపతియొక్క యవతారమని విశ్వసింపఁబడెను. దీనిఁబట్టి,

అతడు బహు ప్రాచీన సమయమున నుండియుండుననియు అతని కాలము విషయమై యేమియు నిశ్చయము చేయఁబడజాలదనియు ననుమానము కలుగుచున్నది. వేదములను నిందించువాడను పద్ధతిమీఁద నొకచోట (శాంతిపర్వము, అ. 269.9) కపిలుని యొక్క వర్ణన చూడఁబడుచున్నది. కపిలుఁడు అహింసావాదియు యజ్ఞమునకు విరుద్ధుఁడును అయియుండెనని కూడ దెలియుచున్నది. కపిలునియొక్క సమయము బౌద్ధకాలమునకుఁ గొంచెము పూర్వమని నమ్మఁబడునేని, అపుడు ఈకపిలుడు అర్వాచీనుడని చెప్పవలసివచ్చును. పంచశిఖుని సమయము నిశ్చయపూర్వకముగా నుడవఁ బడఁజాలదు. కాని బౌద్ధమతవాదులయందు బంచశిఖుని పేరు కనఁబడుచున్నది. ఈతనికాలము బుద్ధసమయమునకు సమీపపుదిగా విశ్వసింపఁబడఁ గలదు. ఇందుచేత బుద్ధుని మరియు బంచశిఖునియొక్క యనంతరము మహాభారతకాలమును నిర్ణయించుటకు మంచిసాహాయ్యము దొరకుచున్నది.

ఇప్పుడు మనము నాస్తికమతముల విషయమున ఒకింత విచారము చేయుదము. న్యాయము మరియుసాంఖ్యము వేదములను గౌరవింపవు, కనుకనే యీ రెండునునాస్తికమతములై యున్నవి. కానివారియొక్కయనేక సిద్ధాంతములు ఈ రెండు మతములకు సనాతనధర్మము నుండి తేబడియున్నవి. నిజమైన నాస్తికమతములు కేవలము లోకమతము, బౌద్ధము మరియును జైనమే అయియున్నవి. మహాభారతమున వీటియొక్క యుల్లేఖ మెంతగాఁ జేయఁబడియున్నదో చూడవలసియున్నది. నామముచేత వీటియొక్క యుల్లేఖమెందును లేకుండుట యాశ్చర్యముగా నున్నది. ఈ మతములు నాస్తికములైనకారణముచేత వీటియొక్కపేరులయుల్లేఖించుట యుచితము కాదని యూహింపఁబడి యుండుననుట సంభవమగును. లోకాయతమతమునకు నాయకుఁడైన చార్వాకునియొక్క పేరు మహాభారతమందెచ్చటను అగపడదు. కానియుద్ధానంతరమున యుధిష్ఠిరుఁడు ఎపుడుహస్తినాపురమున ప్రవేశించెనో, ఆ సమయముయొక్క వర్ణనమందు, ప్రకటముగా నతని ధిక్కరించువాఁడును దుర్యోధన మిత్రమునగు చార్వాకనామకుఁడైన యొక బ్రాహ్మణ పరివ్రాజకుని పేరు కనుపట్టుచున్నది. దీనిబట్టి చార్వాక నామము బహునింద్యమైయుండెనని తెలియుచున్నది. బృహస్పతి నాస్తిక మతమునకు బ్రవర్తకుఁడని యెంచఁబడియున్నాడు. బృహస్పతి అసుర మతమునకు బ్రవర్తకుడని యూహింపఁబడుట యాశ్చర్యవిషయము; కాని

యుపనిషత్తులయందు, అసురులను కుమార్గమున బ్రవర్తింపఁ జేయుటకై బృహస్పతి మిధ్యాశాస్త్రమొకటి రచించియుండెనని కథయగపడుచున్నది. ఆలోచింపఁగా ఈకథ మహాభారతమందు లేదు, అయినను దీనియొక్క రచన తరువాత నయియుండునని చెప్పఁజాలము. లోకాయతము పేరు ఆది పర్వముయొక్క 70వ యధ్యాయమునందు శ్లో. 46న గనపడుచున్నది. ఎట్లనఁగా "లోకాయతికముఖ్యైశ్చ సమన్తాదనునాదితం" ఇందు కణ్వాశ్రమములో లోకాయతము లేక నాస్తికమతముయొక్క నాయకుల వాదవివాదములు ప్రతిధ్వనించుచుండెనని చెప్పఁబడియున్నది. ఇందువలన, లోకాయతము లేక చార్వాకమతము బహుప్రాచీనమని ప్రకటమగుచున్నది. ఇప్పుడు, బౌద్ధులయుల్లేఖము మహాభారతమందు ఉన్నదోలేదో చూడవలసియున్నది. చూడఁగా వీరియొక్క యుల్లేఖము నామధేయముతో జేయఁ బడకయుండును అయినను వీరిమతములయొక్క యుల్లేఖము అక్కడక్కడఁ గనఁబడుచున్నది. అశ్వమేధిక పర్వముయొక్క 49వ యధ్యాయము (అనుగీత)లో అనేకమతములు చెప్పఁబడియున్నవి. అచ్చట నన్నింటికి మొదట చార్వాకమతముయొక్క యుల్లేఖ మీప్రకారముగా జేయఁబడియున్నది — "దేహము నశించినపిదప ఆత్మయు నశించుచున్నదని యొకొక్కరు చెప్పుచున్నారు". దీనికి తరువాత కొందఱు లోకులు ఈ జగత్తును క్షణికముగా విశ్వసించుచున్నారని చెప్పఁబడియున్నది. ఈ వర్ణనయందు బౌద్ధమతముయొక్కయుల్లేఖము చూపట్టుచున్నది. ఒకొక్కచోట నిర్వాణశబ్దముయొక్క ప్రయోగముచేయఁబడినది. ఈవిధముగా శాంతిపర్వము అధ్యాయము 167 శ్లోకము 46లోగూడ బౌద్ధమతమునకే బోధ కలుగుచున్నది. సారాంశము, మహాభారతముయొక్క విస్తృత భాగమునందు బౌద్ధమతముయొక్క వర్ణనమగపడుచున్నది. జైనమతముయొక్క యుల్లేఖము స్పష్టముగానున్నది. ఆదిపర్వమునందు నగ్నక్షపణకుని యొక్క యుల్లేఖముకలదు. ఇదేవిధముగా ఇతర స్థానములయందు నగ్నులు, దిగంబరులు, పిచ్చివారివలెఁ దిరుగువారు, ఇత్యాదిలోకుల యొక్క యుల్లేఖమున్నది. ఇంతయైనమీఁదట గూడ స్పష్టమగురీతిని నామముయొక్క యుల్లేఖము చేయఁబడదయ్యెను. ఇచట జైన, బౌద్ధ మతములకంటె పూర్వము వారి మతములకు తుల్యములైన యన్య మతములు ప్రచలితములైయుండెననిచెప్పుట యావశ్యకము. మహాభారతమందు బౌద్ధ, జైనమతముల యుల్లేఖము కలదని నమ్ముటకు నేయాటంకమును

లేదు, మహాభారతకాలమును నిశ్చయించుటకు ఇదియొక ముఖ్యమైన సాధనము. దీనిఁబట్టి, క్రీస్తుకంటె బూర్వము 400 సంవత్సరముల కీవల మహాభారతము రచింపఁబడిన సిద్ధాంతము చేయుటకు వీలగుచున్నది. ఈ సిద్ధాంతము మనము నిశ్చయించిన సమయమునకు విరుద్ధముకానేరదు. బౌద్ధ, జైనధర్మముల ప్రసారముచేతనే మహాభారతమునకు మహాభారతస్వరూపము ఈయవలసివచ్చెనని యే మనము ప్రతిపాదించి యుంటిమి.

ఇక్కడ ఇపుడు ఒక యత్యంతమహత్త్వముగల ప్రశ్నము యొక్క విచారము చేయఁబడును. భగవద్గీత మహాభారతములో ఒక అతిప్రాచీనమైన భాగము. ఈ భగవద్గీతయందు బౌద్ధమతము ఖండింపఁబడినదని కొందఱి యభిప్రాయము. అనఁగా, దీనిఁబట్టి, భగవద్గీత మూలభారతములోనిదియుఁగాక బౌద్ధమతమునకు దరువాతిదియని యోలేక మహాభారతము నాఁటిదియని యో సిద్ధముచేయుటకై ప్రయత్నము చేయఁబడుచున్నది. కాని యీ యభిప్రాయము సరియైనదికాదు. వీరు భగవద్గీతయందలి అసుర స్వభావవర్ణనము బౌద్ధులదేయని చెప్పుచున్నారు; అనఁగా—

అసత్య మప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరమ్।
అపరస్పర సంభూతం కిమన్య త్కామహైతుకమ్॥

ఈ శ్లోకమునందు బౌద్ధమతముయొక్క దిగ్దర్శనము చేయఁబడి యున్నది. కాని సత్యమైన విషయమేమనఁగా, పై వర్ణనము బౌద్ధులదికాదు, చార్వాకులదో లేక బార్హస్పత్యులదో యయియున్నది. బౌద్ధులు, "అహంకారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః" ఇటువంటిస్వభావము కలవారు కారని యే తైలింగ ప్రభృతివిద్వాంసుల యభిప్రాయము. నేఁడు ఈ శత్రువును పడఁగొట్టివేసితిని, రేపు దానిఁ బడఁగొట్టుదును, ఇత్యాది గర్వోక్తులు బౌద్ధులవిషయములో వచింపఁబడఁజాలవు. "ఈశ్వరోఽహమహంభోగీ సిద్ధోఽహంబలవాన్ సుఖీ" ఇటువంటి మాటలు వారి ముఖమునుండి వెలువడఁజాలవు. వారికిఅన్నింటికంటెను, సంసారము త్యజించి యరణ్యమునకుబోయి స్వస్థ చిత్తముతో ధ్యానముచేయుచు గూరుచుండుటయే పరమపురుషార్థమై యుండెను. భజంతే నామయజ్ఞైస్తే దంభేనావిధి పూర్వకమ్, ఈవర్ణనముకూడ వారివిషయమై కాఁజాలదు, ఏలయనఁగా వారు యజ్ఞమునకు బద్ధవిరోధులై యుండిరి. ఈ వర్ణన చార్వాకులవిషయమై చక్కఁగా ఉపయుక్తమగుచున్నది. ఏచార్వాకులు మరియు అసురులు,

"శరీరము భస్మమైపోయినతరువాతనేమియు మిగులదు. ఈ శరీరము ఉండఁగనే సుఖముయొక్క ఏయే యుపభోగము కాఁగలదో, అయ్యదిసమస్తము చేసివేయవలయు"నని తలఁచుచుండిరో, వారివిషయమై యీవర్ణనము శోభావహము కాఁగలదు. పైశ్లోకమందు బౌద్ధమతముల యుల్లేఖము ఉన్నదో లేదో యిపుడు చూడవలయును. జగత్తు ఈశ్వరశూన్యమైయున్నది. ఈ మతము బౌద్ధులదికాదు చార్వాకులదియై యున్నది. బౌద్ధులు, ఈశ్వరుఁడు ఉన్నాఁడో లేడో యనువిషయమై విచారమునే చేయరు. వారు, జగత్తు అసత్యములేక మిథ్య యనువిషయమును గూడ విశ్వసింపరు. వారైతే జగత్తును సత్యముగను, కాని క్షణికముగను విశ్వసించుచున్నారు. చార్వాకులు జగత్తును అసత్యముగా విశ్వసింపరనుటసత్యము; కానిఅసత్యశబ్దమునకుఅర్థము 'నాస్తిసత్యం యస్మిన్' అనికావలయును. అనఁగా జగమునందు సత్యము లేదు అని యర్థముకావలయును. అపరస్పరసంభూతం, అను దానికర్థము కొంచెము సందిగ్ధమైనదివలెదోచుచున్నది. దీనియర్థము పంచభూతములనుండి యీజగత్తు నిర్మింపబడియున్నదో అనగా పృథ్వి, అప్పు, తేజము, వాయువు మరియు ఆకాశము, అవన్నియు ఒకటిరెండవదానినుండి పుట్టినవికావు అని కాఁగలదు. 'కామహైతుకమ్' ఈ చివరివిశేషణమైనచో నిశ్చయపూర్వకముగాఁ జార్వాకులనిమిత్తమే కలుపఁబడియుండగలదు. వారిమతము, జగత్తునకు హేతువు కేవలము కామము ను దేమియుఁగాదు: జీవితమునకు ఫలము కేవలముసుఖోప ఈ మతమును బౌద్ధులు స్వీకరింపరనుట ప్రసిద్ధము. ఇట్టిస్థితిలోఁ బైశ్లోకము భోగమేయనియే నందు బౌద్ధమతములయొక్క దిగ్దర్శనము చేయఁబడి యుండలేదనుట స్పష్టము. ఆలోచించినయెడల, చార్వాకుల మతమేదియై యుండెనో నిశ్చయపూర్వకముగా జెప్పబడజాలదు అయిననుమాధవుడు సర్వదర్శనసంగ్రహమందుబృహస్పతియొక్క శ్లోకములను గైకొనియున్నాడు వాటివలన గొంత తోచుచున్నది. కాని యిపుడు బృహస్పతి సూత్రములు లభింపకున్నవి. మాక్సుమూలరు హైందవ తత్త్వజ్ఞానముమీద వ్రాసిన గ్రంథములో ఈసూత్రముల విషయమై ఇట్లు వర్ణించుచున్నాడు. ఇపుడు బృహస్పతిసూత్రములునష్టమైపోయినవి. ఈసూత్రములయందు ఆ దేహాత్మవాదుల లేక కామచారులైన లోకాయతికుల అనగా చార్వాకానుయాయుల యొక్క మతములు గ్రథితములై యుండెను. వారు ఏ వస్తువు ప్రత్యక్షముగానగపడదో అదిలేనేలేదని విశ్వసించుచున్నారు. ఈ యనీశ్వరవాది మతమునకు ప్రవర్తకుఁడు, దేవతలకు గురువైన బృహ

స్పతి యగుననుట యాశ్చర్య విషయము. కాని బ్రాహ్మణమునందును ఉపనిషత్తునందును, బృహస్పతి అసురులకు వారియొక్క నాశనమునకై మిథ్యయు మరియు అనర్థకారకమునగు తత్త్వజ్ఞానమును బ్రకటించియుండె నని కథయున్నది. ఉదాహరణార్థము, మైత్రాయణోపనిషత్తు 7_9నందు, బృహస్పతి శుక్రునిరూపము ధరించి, దేవతలయొక్క లాభమునకు అసురులనాశనమునకును ఈమిథ్యాజ్ఞానమును బ్రతిపాదించియుండెనని వర్ణనము కలదు. అసురుల లేక పారసీల అనఁగా పశ్చిమ దేశస్థులయొక్క తత్త్వజ్ఞానమందుగూడను దేహమును బ్రధానముగా గణించి విచారము చేయఁబడియున్నదని తెలియుచున్నది. ఏమేనియగుఁగాక, ఇట్టి యనీశ్వరవాది మతములు వైదికకాలము మొదలుకొని బ్రచలితములై యుండెననుటకు సందేహములేదు. వీటియొక్క యుల్లేఖము ఋగ్వేద సూత్రములయందు సైతము కనఁబడుచున్నది, ఇంకను మాక్సుమూలరు వీటివర్ణనమును దన గ్రంథమందు జేసియున్నాడు. మైత్రాయణోపనిషత్తునందు జెప్పఁబడిన కథ అతిప్రాచీనకాలమునుండి బ్రచలితమైయుండును. ఈ యుపనిషత్తుయొక్క సమయము నిశ్చితముకాలేదు; అయినను ఈ అసురమతము వేదకాలమునుండియే అనఁగా బుద్ధునికంటె బూర్వమే బ్రచలితమై యుండెననుటకు సందేహములేదు. భగవద్గీతయందు యుల్లేఖము చేయఁబడియున్నదో అయ్యది అసురమతమే. మరియు నది బహుప్రాచీనముకూడనై యున్నది. ఈవర్ణనముఇంకను ఈమతము బౌద్ధులవిషయమై యుపయోగింపజాలవు. సారాంశము, భగవద్గీతయందు బౌద్ధమతముయొక్క యుల్లేఖమున్నదని చెప్పుట యేమియు సరియైనదికాదు. గీత నేవిధముగా జూచినను బుద్ధునికి దరువాతిదియే కాఁజాలదు

కొందఱు లోకులు, భగవద్గీతయందు అహింసామతము స్వీకరింపఁబడియున్నదనియు బౌద్ధధర్మమందుగూడ అహింసామతము బ్రతిపాదితమై యున్నదనియు జెప్పుచున్నారు. ఏ ప్రకారముగా బౌద్ధధర్మమునందు జాతినిబంధనము నెడల అనాదరభావముకలదో మరియు నన్ని జాతుల వారికిని భిక్షువులగుటకు సమానాధికారము ఈయఁబడియున్నదో, అదేప్రకారముగా భగవద్గీతయందును, శూద్రులకు, ఇంతియేకాక శ్వపచులకు సయితము మోక్షాధికారమున్నదని చెప్పఁబడియున్నది. దీనిఁబట్టి అలోకులు, భగవద్గీత బౌద్ధ ధర్మప్రచారమునకుఁ బిమ్మటిదియని యనుమానము చేయుచున్నారు. కాని యీ యనుమానము సరియైనదికాదు. అహింసాతత్త్వము హిందు

స్థానమందు అనఁగా భరతవర్షమునందు బహుప్రాచీనసమయమునుండి ప్రచలితమైయున్నది. ఉపనిషత్తులయందును ఈ తత్త్వముయొక్క యుపదేశము కనబడుచున్నది. ఉదాహరణార్థము, ఛాందోగ్యోపనిషత్తు (ప్రపాఠకము 8, ఖండము 14) నందు జెప్పియున్నది:—

అహింసన్ సర్వభూతాని అన్యత్ర తీర్థేభ్యః।

అనఁగా, భగవద్గీతలోని యీ మతము ఉపనిషత్తునుండి గ్రహింపఁబడియున్నది, బౌద్ధధర్మమునుండికాదు. రెండవసంగతి, శూద్రులవిషయమై కూడ వారికి బ్రహ్మవిద్యాధికారమున్నదనుటయే యుపనిషదనుకూలమైన మతము. ఉపనిషత్కాలమున విద్వాంసులకు ఎటువంటిసమదృష్టియుండెనో, యీ విషయము ఛాందోగ్యోపనిషత్తులో నుడువఁబడిన రైక్వుని మరియు జానశ్రుతియొక్క కథనలన స్పష్టముగా నగపడుచున్నది. ఈ తత్త్వము ఉపనిషత్తునందుండి గీతకు దీసికొనిరాఁబడియున్నది; ఇది యెంత మాత్రమును బౌద్ధసమయమునకుఁ బిమ్మటిదికాదు. ఇంతియేకాక, బౌద్ధకాలమున కనంతరము సనాతన ధర్మముల ప్రవాహము తాలుమూలై పోవనారంభించెననియు ఆ సమయమున బౌద్ధులలోని శూద్రభిక్షువులయొక్క నిషేధము కొఱకే వారికి బ్రహ్మవిద్యాధికారములేదని నిశ్చయము చేయఁబడెననియు జెప్పఁబడఁగలదు. ఈ మతము బాదరాయణుని వేదాంతసూత్రమునందు గనఁబడుచున్నది. దానియందు ఉపనిషత్తులోని జానశ్రుతి మరియు రైక్వునియొక్క కథకు ఏదో మరియొక సంబంధమును విశ్వసించి శూద్రశబ్దమునకు విలక్షణమైన యర్థము చేయఁబడియున్నది. సారాంశము, భగవద్గీత బౌద్ధమతమునకుమునుపటిదియు ప్రాచీనోపనిషత్తులకు దగ్గఱదియునై యున్నది. బాదరాయణుని వేదాంతసూత్రములు బౌద్ధమత ప్రచారమునకు ననంతరము చాలకాలమైనతరువాత నయియున్నవి. మనము ఈ గ్రంథములో నొక స్వతంత్రభాగమునందు భగవద్గీతాసమయము వర్తమాన మహాభారతసమయముకంటె బహుప్రాచీనమని సిద్ధించుటకు విచారము చేసియుంటిమి. ఇక్కడ మాత్రము మహాభారతముయొక్క వర్తమానస్వరూప సమయమే విచారింపఁదగియున్నది. ఇందు బౌద్ధమతముయొక్క యుల్లేఖము ప్రత్యక్షనామమున ప్రకటము కాకయుండును, అయినప్పటికి నిది స్పష్టముగా నగపడుచున్నది; కాఁబట్టి వర్తమాన మహాభారత సమయము బౌద్ధమతమునకు నిటీవలిదియని సిద్ధించుచున్నది, అనఁగా క్రీస్తుసంవత్సర

మునకుఁ బూర్వము 400కుఁ బిమ్మటిది; మరియు నీ సిద్ధాంతమువలన పూర్వోక్తమతమునకు విరుద్ధముకానేరదు.

ఇప్పుడు, సనాతనధర్మములో, మతమతాంతరములనుండి యే యే మతములయొక్క యేగ్రంథములు ఉల్లిఖితమైయున్నవో యివి విచారింపఁబడును. నారాయణీయమునందు పంచమహాకల్పవిశేషణము విష్ణువుకొఱకు గ్రహింపఁబడియున్నది. టీకాకారుఁడు ఇందు పంచమతములయొక్క వాటి యాగమముల యొక్కయు సమావేశమగుచున్నదని చెప్పుచున్నాఁడు. అనఁగా, అతఁడు చెప్పునదియేమనఁగా ఆశబ్దమునందు శైవము, వైష్ణము, సౌరము, శాక్తము మరియు గాణపతము, ఈ యైదు మతములు గలిసి యున్నవి యని. కాని మహాభారతమందు ప్రత్యక్షమైన యుల్లేఖము కేవలము మొదటి మూఁడుమతములకే యున్నది; శాక్తగాణేశ మతముల యొక్క లేక ఆగమములయొక్క యుల్లేఖము లేదు. శైవమతము యొక్క యుల్లేఖము పాశుపతజ్ఞానము పేరిటఁ జేయఁబడియున్నది మరియు ప్రత్యక్షశివుని దానికిఁ గర్తగాఁ జెప్పియుండెను. కాని యీమతమునందలి యే గ్రంథముయొక్క నామము గనఁబడదు. పాశుపతుల మతము ఏదియై యుండెనో యిదికూడవర్ణింపఁబడదయ్యెను. వైష్ణవులయొక్క మతము భాగవతనామమునఁ బేర్కొనబడియున్నది, కాని వారియొక్క గ్రంథములు ఏవేవియో చెప్పఁబడలేదు. పంచరాత్రమతమునకుఁ బ్రవర్తకుఁడు స్వయముగా భగవానుఁడై యున్నాఁడు. ఈ శబ్దముయొక్క యుపయోగము విష్ణునికై లేక శ్రీకృష్ణునికై చేయఁబడఁగలదు. ఇందు చేతనే యీమతము వారిని 'సాత్వతులు, అని చెప్పుచున్నారు. పాంచరాత్రమతములో నేయే గ్రంథములుండెనో యిదియెచ్చటను జెప్పఁబడియుండలేదు. శాంతిపర్వము లోని నారాయణీయోపాఖ్యానమంతయు నిదేమతమునకు సంబంధించినది యైయున్నది. ముఖ్యపంచరాత్రము లేక నారద-పంచరాత్రము దక్క యే రెండవగ్రంథముయొక్క యుల్లేఖమును లేదయ్యెను, ఇందుచేతఁగాల నిర్ణయము విషయమున విశేషమైన సహాయత దొరకదు. శాంతిపర్వము యొక్క 335వ యధ్యాయమునందు ఏసప్తఋషులు, చిత్రశిఖండి, నామమునఁ బ్రసిద్ధులైయుండిరో, వారందఱుఁగూడి వేదములయొక్క సారము నుండి మేరుపర్వతముమీఁద నొకయుత్తమశాస్త్రమును రచించిరని వర్ణింప బడినది. అదే యీ పంచరాత్రము. ఆగ్రంథమందు శ్రేష్ఠమైన లోకధర్మము వివరింపఁబడియుండెను. మరీచి, అత్రి, అంగిరుఁడు, పులస్త్యుఁడు, పుల

హుఁడు, క్రతువు మఱియు వశిష్ఠుఁడు వీరేనని చెప్పబడిన చిత్రశిఖండులు. ఆ గ్రంథములో నొక లక్షశ్లోకములు ఉండెనని చెప్పఁబడియున్నది. చూడఁగా ఆ గ్రంథము కల్పితముగాకయుండును, అయిన, వర్తమాన సమయమునఁ బ్రసిద్ధమైన పంచరాత్ర గ్రంథములు ఎప్పుడు రచింపఁబడియుండెనో యీ విషయము. ఐతిహాసికరీతిని నిశ్చయముచేయుట యసంభవము; కాఁబట్టి మహాభారతకాలమును నిర్ణయించుటకై సాధనమేమియు లేకున్నది. మహాభారతమునందుఁ బాశుపతగ్రంథము వర్ణింపఁబడక పంచరాత్రగ్రంథము వర్ణితమైయున్నది. దీనిఁబట్టి ఆ సమయమునందు బాశుపత గ్రంథము లేకయుండునని యనుమానము కలుగుచున్నది. ఉన్న యెడల ప్రకారము సౌతి నారాయణీయోపాఖ్యానము యొక్క సమావేశమును మహాభారతమునఁ జేసియుండెనో, అదేప్రకారము పాశుపత గ్రంథమునకుగూడ సమావేశమును జేసియుండును. సౌరోపాఖ్యానము యొక్క యుల్లేఖము ద్రోణపర్వములో 82వ యధ్యాయమునందున్నది. ఈ యుపాసన సరిగా బ్రాహ్మణులు ఎల్లప్పుడు గాయత్రీమంత్రమునఁ జేయుచున్నట్లే యున్నదో, లేక దానికంటె వేఱుగానుండెనో, ఈవిషయమున్న చోటు కనిపింపదు. సౌరోపాఖ్యానముయొక్క మతము కొంచెము వేఱుగానుండెనో, లేక యెట్లుండెనో, యిదికూడ దెలియదు. సౌరమత గ్రంథములకు గొంచెమైనను ఉల్లేఖము లేదయ్యెను. కనుక యీ విషయముమీద నెక్కువ వ్రాయుటకు నవకాశములేదు.

ఈ ప్రకారముగా నింతవఱకు, ముందు అంతః ప్రమాణముచేతనేమి సిద్ధమగుచున్నదో మఱియు గాల నిర్ణయమునకై యెట్టిసాహాయ్యము లభించుచున్నదో యీ విషయమై వివేచన చేయఁబడినది. ఈ వివేచనకు సారాంశమిది :— మహాభారతమందు వేదములు, ఉపవేదములు, అంగములు, ఉపాంగములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులును జేర్కొనఁబడియున్నవి; కాని వీటియొక్క కాలము అనిశ్చితమైయున్నది. దానియొక్క అంచనా కేవలము స్థూలమానముచేత చేయఁబడుచున్నది మఱియు నది కూడ బహుప్రాచీన కాలపుదియైయున్నది. కావున నీ గ్రంథములనుండి కాలనిర్ణయమునకై యెక్కువ సాహాయ్యము లభింపదు ఇందుచేత మనము వాటియొక్క భాషాంతరములను ఈయము. మహాభారతములో సూత్రములయు ధర్మశాస్త్రములయు నుల్లేఖము కనఁబడుచున్నది. కాని దేనియొక్క పేరును ఈయఁబడలేదు. మనువు యొక్క పేరు ప్రసిద్ధమైయున్నది.

మఱియు నయ్యది మాటిమాటికి నగపడుచున్నది. అతనియొక్క యనేక వచనములు సయుతము కనఁబడుచున్నవి. కాని మనుస్మృతి మహాభారతమునకుఁ బిమ్మటిదియని నిర్వివాదముగా సిద్ధమైయున్నది. మనము పైన, ఆ మహాభారతములో గనఁబడుచున్న యొక ఆశ్వాలాయన గృహ్యసూత్ర వచనము నుదాహరించియుంటిమి; కాని యిందుచేత ఆ వచనము ఆ సూత్రమునుండియే గ్రహింపబడినదియని చెప్పఁబడజాలదు. ఆశ్వాలాయన సూత్రముకంటె బూర్వము మహాభారతము రచింపబడినది ఎందుచేతననఁగా అందు మహాభారతముయొక్క యుల్లేఖమున్నది. 'బ్రహ్మసూత్రపదైః' శబ్దముచేతఁ బాదరాయణుని వేదాంత సూత్రములు బోధితములుకావు. బాదరాయణసూత్రముల విషయమై మహాభారతవచనములు అధారముగా దీసికొనఁబడియున్నవి; కాఁబట్టి యవి మహాభారతమునకు దరువాతివియై యున్నవి. మహాభారతమందు న్యాయముయొక్క వైశేషికము యొక్క మఱియు వాటిసూత్రములయొక్క యేయుల్లేఖము లేకున్నది. సాంఖ్య యోగముయొక్క కపిలునియొక్కయు నామములు మాటిమాటికి నగపడుచున్నవి. కాని పతంజలి యోగసూత్రము యొక్క యుల్లేఖములేదు. యోగశాస్త్రమునకు గర్త మఱియొకఁడే చెప్పఁబడియున్నాడు. దీనిఁబట్టి పతంజలియొక్క సమయము మహాభారతమున కనంతరమైయున్నది. పాశుపత పాంచరాత్రమతముల యుల్లేఖమున్నది. కాని యందలి యే గ్రంథము యొక్కయు నుల్లేఖములేదు. సప్తర్షికృతమైన యేకలక్షాత్మకమగు పంచరాత్రగ్రంథము ఉల్లిఖితమైయున్నది. ఆలోకింపఁగా నయ్యది కల్పితము కాకపోయినప్పటికిని అది యెప్పటిదో చెప్పుటకు వీలనుపడదు, కనుక దానివలన విశేషలాభము చేకూఅదు సంక్షేపమున, ఈ మొదటి యంతః ప్రమాణముయొక్క యాధారముమీఁద ఆశ్వాలాయనుని గృహ్యసూత్రము, బాదరాయణుని వేదాంతసూత్రము, మఱియుఁ బతంజలియొక్క యోగ సూత్రమునకు బూర్వము మహాభారతమైనదను నంతమాత్రమే నిశ్చయముగా జెప్పఁబడగలదు. ఈ సూత్రములయొక్క కాలము, విశేషించి పతంజలియొక్క కాలము; క్రీస్తునకుబూర్వము 150-100 అయియున్నది; అనఁగా మహాభారతము ఈ సమయమునకు ముందటిదియని నిశ్చితమగుచున్నది.

రెండవ యంతః ప్రమాణము మహాభారతములో గనఁబడుచున్న గద్యము మఱియు ఛందస్సులును; దీనిఁబట్టి యిపుడు, మహాభారతములోని

ఛందస్సులు ఏనాంటివో, వానిచేత మహాభారత కాలముయొక్క నిర్ణయము ఏమైనం గానం గలదో లేదో యాలోచింపవలయును. ఈ దృష్టితో పాశ్చాత్య గ్రంథకారులు మిక్కిలి సవిస్తరముగా విచారించి యున్నారు. చూడంగా ఈవిచారము నిర్ణయాత్మకమైన సిద్ధాంతమునకై విశేషముగా నుపయోగింపదు, అయినను చదువరులు దీనిగుఱించి కొంత యెఱింగియుండుట యావశ్యకము దీనిని వివేచింపకముందు మనమిచ్చట గద్యవిషయమున గొంచెము సూచింతను. మహాభారతములో జాలచోటుల గద్యముకనంబడుచున్నది. విశేషించి ఆదిపర్వము, వనపర్వమునందు నిది యధికముగా నున్నది. ఈ గద్యభాగములను సౌతిస్వయముగా రచించియుండును. అక్కడక్కడ, మునుపటి యేదేని యితిహాసాది గ్రంథమునుండి యొకానొక భాగము తీసికొనంబడియుండుటయు సంభవమగుచున్నది. మొదటిపర్వమున జనమేజయ, దేవశునులయొక్క కథాభాగము ప్రాచీనముగా దోచుచున్నది. కాని వనపర్వముయొక్కయు శాంతిపర్వముయొక్కయు గద్యభాగము క్రొత్తదిగను సౌతికృతముగను గనుపట్టుచున్నది. మహాభారతములోని గద్యభాగము, వేదముయొక్క బ్రాహ్మణభాగమందును ఉపనిషద్భాగమందును గనంబడుచున్న గద్యముకంటె బొత్తిగా వేఱైయున్నది. బ్రాహ్మణభాగములోని గద్యమునందు ప్రాచీన ప్రయోగములును ఎక్కువగా నున్నవి. అందలి భాష చాలవక్తృత్వముతో నిండియున్నది మఱియు నొకే ప్రయోగముయొక్కయు నిట్లే వాక్యములయుం బునరావృత్తి దీనియొక్క పోషణమునకై చేయంబడినదిగా నగపడుచున్నది. కానిమహాభారతములోని గద్యము ఇటువంటిదికాదు. ఇందు ప్రాచీనశబ్దములు లేక ప్రాచీన ప్రయోగములులేవు; వక్తృత్వశక్తియు నటువంటిదిలేదు. ఏ సమయమున సంస్కృతభాషయొక్క యుపయోగము సాధారణజనులయొక్క సంభాషణమునందు జేయబడకయుండెనో, ఆసమయమున గద్యభాగముయొక్క రచనచేయంబడియుండెనని స్పష్టముగా నగపడుచున్నది. ఈగద్యభాగముచేత బ్రాహ్మణకాలమునకు బిమ్మటం జాలయేండ్లు గడచినతరువాత, ఎపుడు సంస్కృతభాషోపయోగము వ్యవహారమునందు లేకుండెనో, అపుడు మహాభారత రచన జరిగియుండునని మాత్రమే యనుమానము చేయంబడగలదు. అనంగా, క్రీస్తుకు బూర్వము 200 ఏండ్ల ప్రాంతమని యేసమయమును మనము నిశ్చయించితిమో, దానిని స్థిరముచేయుటకై యీ గద్యభాగముయొక్క విచారముచేత సాహాయ్యము మాత్రము దొరకుచున్నది.

ఇపుడు మనము పద్యముల విషయమున విచారింతము. హాప్కిన్సు తన గ్రంథమునందు ఈ విషయమై; దానియొక్క 175వ పృష్ఠము (పేజీ) ఈ విషయముచేతనే నిండిపోవునంత యధికముగాను విస్తారపూర్వకముగను విచారము చేసియున్నాఁడు. దానియొక్క సంపూర్ణమైన యుల్లేఖము ఇచ్చటఁ జేయంబడజాలదు, మఱియును దానిచేత స్థూలానుమానము దక్కి మఱేమియు నధికముగాఁ దెలియఁజాలదు. కావున దానియందలి కొన్ని విశేషములు ప్రధానములైన విషయము ఇచ్చట జెప్పనఁ జాలును. మహాభారతమున ముఖ్యముగా అనుష్టుప్పు శ్లోకములున్నవి. ఇంకను వీటికంటెఁ గొంచెము తక్కువగా ఉపజాతి వృత్తములయొక్క అనఁగా త్రిష్టుభ్ వృత్తములయొక్క శ్లోకములున్నవి. నూటికి 05 అనుష్టుప్పులు, 5 కంటెఁ గొఁచెము తక్కువ త్రిష్టుప్పులు, 1/5 అనఁగా శేషించిన యన్ని శ్లోకములు ఇతర వృత్తములవియు నై యున్నవి. ఈ 1/5లో నన్నివిధముల వృత్తములునుగలిసియున్నవి. అతఁవృత్తములలో రథోద్ధత మొదలు శార్దూల విక్రీడితముపఱకు 16వృత్తములమచ్చులు (నమూనాలు) ఉన్నవి. మాత్రావృత్తములలో పుష్పితాగ్ర, అపరవక్త్రి, మాత్రాసమక మఱియును అర్యాగీతి మఱియును ఉపగీతి, ఈ వృత్తములన్నియుఁగలవు. ఈ భిన్న భిన్న వృత్తములు ఎపుడు ఎట్లు పుట్టినవో యిందులకు నిశ్చితమైన యితిహాసము చెప్పఁబడఁజాలదు. కాళిదాసుని సమయమునుండియో యిన్నివృత్తములయొక్క యుపయోగము అగుచువచ్చినది యను సంగతి ప్రసిద్ధమైయున్నది. ఆర్యావృత్తముయొక్క యుపయోగము బౌద్ధ, జైన గ్రంథములయందుబహుప్రాచీన సమయమునుండి యగపడుచున్నది. సారాంశము, ఈ వృత్తములయొక్క యుపయోగము చేత మహాభారత కాలమునునిర్ణయించుటకు సాధనమేమియును దొరకలేదు, మరియు నేకాలమును మనము నిశ్చయించితిమో దానికి విరుద్ధమైనదికూడ నే విషయముఁ గనఁబడదు; సౌతి రుచి వైచిత్రముకొఱకు లేక "యేది మహాభారతమందు లేదో. అయ్యది మఱి మరియొకచోట నెచ్చటనులేదు" అను ప్రతిజ్ఞను బూర్తిచేయుట కొఱకు నీ భిన్న భిన్న వృత్తముల శ్లోకములను ఉపయోగించి యుండునని యనుమానము జనించుచున్నది. ఇప్పుడు మనము మహాభారతములోని ప్రధాన చ్ఛందస్సులైన యనుష్టుప్పులను మఱియుఁ త్రిష్టుప్పులను విచారింతము.

అనుష్టుప్పులు మఱియుఁ త్రిష్టుప్పులు వైదిక వృత్తములై యున్నవి అనుష్టుప్ వృత్తములను ప్రతిపాదమందు నెనిమిది యక్షరములును త్రిష్టుప్ వృత్తమునకుఁ బాదమునకుఁ బదునొకండు అక్షరములును అగుచున్నవి. ఈ అక్షరములయొక్క హ్రస్వ, దీర్ఘ క్రమము నిశ్చయింపఁ బడియుండలేదు. అనుష్టుప్ ఛందస్సునందుఁ బ్రథమపాదములోని యైదవ యక్షరము తేలుచు దీర్ఘమగుచున్నది ఇటువంటి యొక విశేషత వైదికమైన యనుష్టుప్‌కంటె వ్యాసునియొక్కయు వాల్మీకియొక్కయు ననుష్టుప్పునందు నూతనముగా నగపడుచున్నది. వైదిక కాలము నుండి యిటీవల సమయమున మెల్ల మెల్లఁగా త్రిష్టుప్పుయొక్క యుపయోగమగుట కారంభమయ్యెను; అపుడు దానియొక్క హ్రస్వ, దీర్ఘ క్రమము సంపూర్ణముగా నిశ్చయమైయుండెను. మఱియుఁ దుట్టతుదకు నయ్యది రామాయణము దును దాని తరువాత కావ్యములందును ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర మొదలుగా వృత్తములయొక్క స్వరూపమునఁ గనుపట్ట నారంభించెను. చూడఁగా అనుష్టుప్పుయొక్క హ్రస్వ, దీర్ఘ క్రమములు విశేషరీతిని నిశ్చితములు కాకయుండెను. అయినను హ్రస్వ, దీర్ఘ క్రమముల ననుసరించి దానిలో వేర్వేఱు భేదములు అయియున్నవి మఱియును వానియందు వేర్వేఱు మాధుర్యము ప్రకాశమగుచున్నది. దీనివిషయమై హాప్కిన్సు విస్తరించి విచారము కావించి యున్నాఁడు దానియొక్కయుల్లేఖము ముందునకుఁబోయి చేయఁబడును. అనుష్టుప్పునకు నాలుగు పాదములును, త్రిష్టుప్పునకు నాలుగు పాదములును సామాన్యముగా విశ్వసింపఁ బడుచున్నవి; కాని యప్పుడప్పుడు ఇంకను రెండుపాదములు చేర్చఁబడుచున్నవి. అనుష్టుప్పును సాధారణ ఫక్కిని శ్లోకమనుచున్నారు. ఏదియేని గ్రంథముయొక్క శ్లోక సంఖ్యను విచారించునపుడు 32 అక్షరములకు ఒక యనుష్టుప్పు అని యెంచి యే గణన చేయఁబడుచున్నది. గద్యగ్రంథము యొక్కయు గణనయిటువంటి లెక్కచేతనే, అనఁగా 32అక్షరములకు నొక శ్లోకమను లెక్కచేతనే, చేయఁబడుచున్నది. త్రిష్టుప్ వృత్తముయొక్క శ్లోకమునందు 11 అక్షరములు అగుచున్నవి. ఏ విధముగా:—

సన్తి లోకా బహవస్తే నరేన్ద్ర।

ఈ వృత్తమునకింకను అనేకోదాహరణము లున్నవి. ఏయే స్థానములయందు ఈ మాదిరి శ్లోకములు కానఁబడుచున్నవో అవిమిక్కిలి ప్రాచీన భాగములని యనుమానము చేయఁబడుచున్నది. భగద్గీత యత్యంత

ప్రాచీనభాగమని చెప్పఁబడియెను. సనత్సుజాతీయముగూడ నిదేప్రకారమైన యాఖ్యానయమై యున్నది. వ్యాసమహర్షికి ఇటువంటి శ్లోకములు రచియించుటకు మాటిమాటికి స్ఫూర్తియగుచుండెను. అక్కడక్కడ సంపూర్ణముగా అధ్యాయమే యిటువంటి శ్లోకములది యయియున్నది. ఇంకను అచ్చటచ్చట అనుష్టుప్ శ్లోకములమధ్యనే యొకటి రెండు శ్లోకములు కనుపట్టుచున్నవి. సరళమును మఱియు, ప్రభావవంతమునగు భాషయందు, ఇటువంటి శ్లోకములయొక్క రచనాశక్తి వ్యాసమహర్షియొక్క భాషాప్రభుత్వమునకు సాక్షియైయున్నది. రామాయణములోని శ్లోకములు కొంచెమెక్కువ సుబద్ధములై యున్నను అవియింతసరళములును స్వాభావికములును మామూలుసంభాషణమునకు తుల్యములుకావు. కాళిదాసకావ్యముయొక్క సమయమునుండి యైతేని యిటువంటి శ్లోకములు తఱచు కృత్రిమములును దుర్బోధములును అగుచున్నవి. సౌతికూడ నిటువంటి శ్లోకములను జేసియుండెను మఱియు నతనికి నిటువంటి శ్లోకముల రచనకుఁ దగినకళయును జక్కఁగా నమరియుండెను. ఈ విషయమునకు ప్రమాణమేమనఁగా "యదాశ్రౌషమ్" మొదలుగా 69 శ్లోకములు మహాభారతముయొక్క మొదటియధ్యాయమునందు నిదేవృత్తమున రచింపఁబడియున్నవి. ఈ సంపూర్ణమైన యధ్యాయము మఱియు నీశ్లోకములన్నియు సౌతివే యనుటకు సందేహములేదు. ఈత్రిష్టుప్ వృత్తశ్లోకముల యాధారమున మహాభారతకాలము కాళిదాసాదులకు మునుపటిదియనియు రామాయణమునకుఁగూడ మునుపటిదియనియు నిశ్చితమగుచున్నది; ఎందుచేత ? రామాయణములోని త్రిష్టుప్ శ్లోకములు నియమబద్ధములై యగపడుచున్నవి.

శ్లోకములయొక్కయు త్రిష్టుప్రచనయొక్కయు విచారముచేత గ్రంథకాల నిర్ణయమునకు నెటువంటి సాహాయ్యము లభించుచున్నదో తెలిసికొనవలసియున్నది. మహాభారతగ్రంథము వైదికకాలము మొదలుకొని అర్వాచీన సంస్కృత కాలమువఱకుఁ జేయఁబడియున్నదను విషయము మునుపు నిశ్చయింపఁబడినది; అనఁగా అందుఁ గొన్నిభాగములు అత్యంత ప్రాచీనములు కొన్ని నవీనములుకూడనై యున్నవి. రామాయణ కాలమందు హ్రస్వదీర్ఘానుక్రమమునకు ఏ నియమము నిశ్చితమైయున్నదో, దానికంటె మహాభారతములోని త్రిష్టుప్రచన వేఱైయగుపడుచున్నది. ఏ విధముగా, "నచైతద్విద్మః కతరన్నో గరీయః" ఇందు హ్రస్వదీర్ఘాను

క్రమము నిశ్చయింపఁబడ్డ నియమము ననుసరించలేదు. ఇట్టివి యనేకశ్లోకములు మహాభారతమందు గనఁబడుచున్నవి. దీనిఁబట్టి మహాభారతకాలము రామాయణము కంటె బూర్వమని నిశ్చయమగుచున్నది. "పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢ చేతాః" ఈ చరణముకూడ నేకాగ్రతతో నాలోచింపఁదగియున్నది. ఇందు 'మి' మరియు 'సమ్' ఈ రెండుయక్షరములును దీర్ఘములై యున్నవి. అవి హ్రస్వములగునేని యీ చరణము నియమాను సారమై యుండును. అనఁగా, 'పృచ్ఛామితే ధర్మ విమూఢచేతాః' ఇట్లున్న యెడల నీ చరణము ఇప్పటినియమము ననుసరించినదియై నిశ్చయముగా జెప్పఁబడును.

త్రిష్టుప్ శ్లోకములు మూలవైదిక మంత్రములనుండి తీసికొని రాఁబడినవని చెప్పుటకు నావశ్యకతలేదు. చూడఁగా వైదిక త్రిష్టుప్పునందు హ్రస్వదీర్ఘనియమమేమియులేదు, అయినను ఇష్టమువచ్చినట్లుగా నెచ్చటను హ్రస్వముగాని దీర్ఘముగాని విడువఁబడదయ్యెను. హ్రస్వదీర్ఘమునకు యోజనచేయదగిన ప్రయోజనమేమనగా దానివల వృత్తమాధుర్యమునకు నేమియు హానిరాఁగూడదు. ఉదాహరణముకొఱకు నీ వైదికత్రిష్టుప్ శ్లోకార్థముమీఁద విచారముగావింపుడు "నమస్తే విష్ణువాస అకృణోమి। తన్మేజుషస్వ శిపివిష్ట హవ్యమ్।" ఇందుఁబ్రతిచరణమునఁ బదునొకండక్షరములు అవశ్యముగానున్నవి. కాని దీనియొక్క హ్రస్వదీర్ఘక్రమము వర్తమాన త్రిష్టుప్‌వృత్తముతో సమానముకాదు. అయినప్పటికిని ఇందలి హ్రస్వదీర్ఘక్రమము మాదుర్యహీనము కానేరదు వైదికత్రిష్టుప్పు ననుకరించుటచేత మహాభారతములోని త్రిష్టుప్పు అనియంత్రితమైయున్నది; దీనిఁబట్టి దానియొక్క సమయము బహుప్రాచీనము. అనుష్టుప్ ఛందస్సు యొక్క ప్రథమ, ద్వితీయపాదములయందలి హ్రస్వదీర్ఘములయొక్క క్రమము నేఁటివఱకు నిశ్చితముకాలేదు; అయినను మాధుర్యము యొక్క దృష్టిచేత దానికిఁగూడ గొంతనియమమున్నది. ఈ నియమములను వెదకి నిశ్చయించుటకు విద్వాంసులనేకులు శ్లోకాసామ్యముచేతఁ బ్రయత్నించియున్నారు. ఒక యుదాహరణమును దీసికొనుఁడు— "దమయన్త్యా సహాసలో విజహారామరోపమః" యొక్క స్థానమందు "విజహార దేవోపమ." యని చేయఁబడునేని యది ప్రమాదమగును అనఁగా దీనియొక్క మాధుర్యము నష్టమైపోవును. ఈ ప్రకారముగా శ్లోకసామ్యముచేత హెచ్చినన్ను మహాభారతమునందు మూడు, నాలుగు మాదిరుల శ్లోకములున్నవని

కాలసంబంధియైన యనుమానమును సిద్ధము చేసియున్నాఁడు. మొదటి ప్రకారము—బొత్తిగా ననియంత్రితములైన యుపనిషత్తులలోని శ్లోకముల యొక్క మాదిరులవిఁద; రెండవప్రకారము ఎయ్యది దీనికంటె గొంచెము తక్కువగా ననియంత్రితమైనదో అటువంటి మహాభారతములోని ప్రాచీన భాగము, మూఁడవప్రకారము— భారతములోని ప్రధానములైన ప్రభావవంతములగు శ్లోకములు; నాలుగవప్రకారము రామాయణములోని శ్లోకములకు సమానమైన క్రొత్తగా వృద్ధిచేయఁబడిన భాగము. హాప్కిన్సు మహాభారతమునకుఁ బిమ్మటిదియగు నొక యైదవప్రకారమునుగూడఁ జెప్పియున్నాఁడు. కానిదానికి నీయఁబడిన యుదాహరణము అనుష్టుప్ ఛందస్సుదిగాఁ దోఁచదు. ఏవిధముగా,

పురావృత్తోఽభయంకరా మనుష్యదేహాగోచరాః।
అభిద్రవన్తి సర్వతో యతశ్చ పుణ్యశీలనే॥

ఈ శ్లోకము అనుష్టుప్ ఛందస్సుదికాదు. ఇది మఱియొక్క యక్షర వృత్తముయొక్క శ్లోకము అయియున్నది. సారాంశము, హాప్కిన్సు యొక్క మతము ననుసరించికూడ ఛందోవిచారముచేత మహాభారత సమయము ఉపనిషత్కాలము మొదలు రామాయణ కాలమువఱకు వచ్చి చేరుచున్నది.

త్రిష్టుప్పుకంటెఁ బెద్దవృత్తముల శ్లోకములు సాధారణముగా ఆదిపర్వప్రారంభమున, శాంతిపర్వమందు, అనుశాసనపర్వమందు మఱియు హరివంశమందుఁ గనఁబడుచున్నది. అవి యితర పర్వములందుగూడగలవు. కాని వాటియొక్క సంఖ్య చాల తక్కువయైయున్నది. ఈ చెప్పఁబడిన భాగములు సౌతిద్వారావృద్ధినొందింపఁబడినవని చెప్పియుంటిమి. కర్ణపర్వమునందొకచోట వరుసగా ఇరువదియైదు అర్ధసమవృత్తములు కనబడుచున్నవి; అచ్చటనే యొక శార్దూలవిక్రీడితమును అయిదు మాలినీ వృత్తశ్లోకములున్నవి. కొందఱు ఈ శ్లోకములు నవీనమైన ఛందశ్శాస్త్రముయొక్క నియమము ననుసరించి శుద్ధములై యున్నవనియు ఈ నియమములు క్రీ॥శ॥ 500కు దాదాపువియై యున్నవనియుఁ జెప్పుచున్నారు. ఇట్టి దశయందు ఈ శ్లోకములు సౌతివిగా నెట్లు నమ్మఁబడునని యొక ప్రశ్నము బయలు దేఱుచున్నది. వీటిసమయము క్రీ॥ శ॥ 200కుఁ బూర్వపుది యెట్లుకాఁగలదు? కాని క్రీ॥శ॥ 500వత్సరములని పైనఁబడిన సమయము అధునికమైన

ఛందో గ్రంథముయొక్క సమయమనియు ఛందస్సులన్నిటిది కాదనియు జ్ఞప్తియుంచుకొనవలయును. ఈ ఛందస్సులన్నియు అప్పటికి వందలకొలది యేండ్లకుఁ బూర్వమే యుండెను. ఇంకను వీటికి ఉపయోగముకూడ నగుచుండెడిది. రామాయణములోఁగూడ నియ్యవి యుపయోగింపఁబడియున్నవి. క్రీస్తునకుఁ బూర్వము అనేక కావ్యగ్రంథములు నష్టములై పోయినవి వాటి యందీవృత్తముల యుపయోగము చేయఁబడియుండెను. సారాంశము, అధునికములైన ఛందశ్శాస్త్ర గ్రంథములు రచింపఁబడకముందే వేర్వేఱు ఛందస్సుల యొక్క కల్పన యుత్పన్నమైయుండెను. ఇంకను వాటిననుసరించి సౌతిశ్లోకములను జేసియున్నాఁడు. ఈ శ్లోకములే వర్తమానగ్రంథకారులకు ప్రమాణభూతములై యున్నవి. త్రిష్టుప్‌వృత్తము యొక్క యనియమిత శ్లోకములు మహాభారతములోని ప్రాచీన భాగముల యందునుండి యగుచున్నవి. వీటియొక్క మాదిరులమీఁద సౌతియును గ్రోత శ్లోకములఁ జేసియుండుననుట సంభవమగుచున్నది. కాళిదాసుఁడు శాకుంతలములోని నాల్గవయంకమున వైదికఋక్కులమాదిరులమీఁద, అగ్నిస్తుతియందలి ఋక్కులను జేసియున్నాఁడనుట ప్రసిద్ధము. కనుకనే క్రీ॥శ॥ పూ॥ 200కు దాదాపున సౌతిశార్దూల విక్రీడితము మొదలుగా ఛందస్సుల యందు శ్లోకములఁ జేసియుండుననుట యేమియు నసంభవవిషయము కానేరదు. ఇపుడు ఈ ప్రశ్నముకూడ జేయబడగలదు ఏమనగా ఏయార్యావృత్తము మునుపు ప్రాకృతమునందు బుట్టెనో, అది సంస్కృతమునకు ఎపుడు తీసికొనిరాఁబడినది? రామాయణమందు అక్షరచ్ఛందస్సులయొక్క యుపయోగము చాలతక్కువగా జేయఁబడియున్నది, కాని యార్యావృత్త శ్లోకములులేవు. దీనిఁబట్టి కొందఱు మహాభారతములోని కొంత భాగము రామాయణమునకుఁ బిమ్మటిదియని చెప్పుదురు. కాని రామాయణమందు నార్యావృత్తము తప్పక యుపయోగించవలసినదేయను నియమమేమియును లేదు. చూడఁగా నీ వృత్తము రామాయణమందు లేదు, అయినను అది సంస్కృతభాషయందు ఆసమయమునకంటెఁ బూర్వము ప్రచలితమే కాదని చెప్పఁబడఁజాలదు మహాభారతకాలమున ననేక ప్రాకృతగ్రంథముల యొక్క నిర్మాణము జరగియుండెను. వీటిద్వారా యార్యావృత్తము యొక్క యుపయోగము సంస్కృతమందుఁ జేయఁబడుట సంభవమై యున్నది. సారాంశము, మహాభారతమునకు నేసమయమును మనము నిశ్చయించి యుంటిమో, అనఁగా క్రీ॥ పూ॥ 250—300 సంవత్సరములు,

దానికి విరుద్ధముగా నీపెద్దఛందస్సులవిచారముచేతఁగూడ నేప్రమాణమును గనఁబడదు.

ఇపుడుమనము మూఁడవ యంతః ప్రమాణముయొక్క విచారమును జేయుదము. ఆర్యావర్తములోని ధార్మికములు రాజకీయములునైన యితిహాస సందర్భములయందు, బుద్ధుని ధర్మమతమునకు, లేక గ్రీకులతోడి యుద్ధమునకు, లేక వారితోడి కొంతవ్యవహారమునకు సమయము నిర్ణీతమైయున్నది. కనుకనే యావిషయమున కెచ్చటనైనను ఉల్లేఖ మున్నదో లేదో చూడవలసియున్నది. ఈ ప్రమాణము మిగుల మహత్త్వము కలవి. ఈ ప్రమాణముయొక్క యాచారముమీఁద మనము ముఖ్యముగా బూర్వకాలికమైన మర్యాద (హద్దు)ను నిశ్చయించియుంటిమి. గౌతమ బుద్ధుని మృత్యుసమయము క్రీ॥ పూ॥ 474 అయియున్నది. అనఁగా, బౌద్ధ ధర్మప్రచారము క్రీస్తు సంవత్సరమునకు 450-400 ఏండ్ల మునుపటిదియై యుండెను. మహాభారతమందు బుద్ధునిపేరుకూడను లేదు, కాని బౌద్ధ భిక్షువులయొక్కయు బౌద్ధమతముయొక్కయు నిర్దేశమున్నది. ఈ స్థితియే జైనధర్మమునకును గలదు. జైనధర్మప్రచారకుఁడైన మహావీరుడు బుద్ధునికి సమకాలికుఁడు. అతని ధర్మముయొక్క ప్రచారముకూడ బౌద్ధదర్శనమునకుఁ దోడ్పోడనగుచుండెను. మహాభారతమందు జినునియొక్కనామము లేదు, కాని క్షపణక, నామమున జైనుల యుల్లేఖము చేయఁబడియున్నది. దీనిఁబట్టియును అదేకాలము నిశ్చితమగుచున్నది. గ్రీకులకును ఆర్యులకును యుద్ధప్రసంగము సికందరుని సమయముననయ్యెను. అనఁగా క్రీస్తువర్షమునకు దాదాపు 300 కంటె బూర్వము మనకు గ్రీకులయొక్క యుద్ధకౌశలముతోఁ బరిచయము కలిగెను. యమనుల యుద్ధకుశలతయొక్క వర్ణనము మహాభారతమందు రెండుమూఁడుచోట్ల నగపడుచున్నది. యవనులయొక్క యుల్లేఖమునైతము మాటిమాటికిఁ జేయఁబడియున్నది. కనుకనే మహాభారతము క్రీ। పూ। 300 ఏండ్ల కిటీవలిది కావలయునన్న మాట నిశ్చితమగుచున్నది.

ఇపుడు చివర మనము నాల్గవయదితః ప్రమాణముయొక్క విచారమును జేయుదము. మహాభారతమున జ్యోతిషసంబంధులగు నేవిషయములు కనబడుచున్నవో, వాటియొక్కయుపయోగము కాలనిర్ణయమునకై విశేషరీతిని గాజాలదు. దీని వివేచన విస్తరించి ముందునకుబోయి చేయఁబడును. మహాభారతమందు ఆకాశస్థగ్రహములయు నక్షత్రములయు స్థితి

వర్ణింపఁబడియున్నది. వాటి యాధారమునఁ గొందఱు గ్రంథములోని కథానకముయొక్క సమయమును నిర్ణయించుటకు యత్నించియున్నారు, కాని యది సఫలము కాదయ్యెను. మహాభారతమందు నక్షత్రములు, మాసములు, అయనములు, పక్షములు మొదలుగాఁగలవాటియొక్క నామములు చూడఁబడుచున్నవి. మఱియు వీటిచేతఁ బ్రాచీనసమయము బోధితమగుచున్నది; ఇట్లు మహాభారత గ్రంథముయొక్క కాలనిర్ణయము విషయమై కొంత యల్పమైన సాహాయ్యము కూడ దొరకుచున్నది; కాని యీదృష్టిని బట్టి యావర్ణనమునకు నేమియు మహత్త్వము లేకున్నది. ఈ విషయము యొక్క విచారము ముందు చేయవలసియేయున్నది. కావున నిచ్చట నెక్కువగా విస్తరింపవలసిన యావశ్యకత లేదు. జ్యోతిషసంబంధియైనది. కేవలము ఒకే విషయము కాలనిర్ణయ కృత్యమునకు నుపయోగింపగలదు మఱియు దానియొక్క యుల్లేఖమును మనము మొదలనే చేసియుంటిమి. మహాభారతములో రాసుల యుల్లేఖము లేదని యెడు నీ నిషేధాత్మకమైన విషయము అత్యంత మహత్త్వము గలిగియున్నది. మనము క్రీ॥ పూ॥ దాదాపు 200 సంవత్సరములకు విదప నీ దేశమందు రాసులయొక్క ప్రచారము అయ్యెననియు మహాభారతము ఇంతకు మునుపటిదియనియుఁ జెప్పియుంటిమి.

ఇప్పుడు బాహ్యప్రమాణములు విచారింపఁబడును. ఏ గ్రంథములయందు లేక శిలాశాసనములయందు మహాభారతముయొక్క యుల్లేఖమగపడుచున్నదో, అవి యత్యంతమహత్త్వముగల ప్రమాణములనుట స్పష్టము. ఇటువంటి ప్రమాణమొకటి మొదలనే యీయఁబడియున్నది. "గుప్త ఇన్స్క్రిప్శన్స్" యొక్క మూఁడవ భాగములో సర్వనామము యొక్క యే శిలాలేఖమున్నదో, అందు క్రిస్తుసంవత్సరమునకు 445 ఏండ్ల కంటె మునుపటిదగు నేక లక్షాత్మక భారతసంహితయొక్క స్పష్టమైన యుల్లేఖముకలదు. ఇది దక్క యొండు ప్రమాణమేమియు నిప్పటికు దొరకలేదు. పరదేశీయుల గ్రంథమును జూచుటవల్ల బౌద్ధుల లేక జైనుల గ్రంథములయందు మహాభారత గ్రంథముయొక్క యుల్లేఖమును పొందమైతిమి. కాని గ్రీకుల గ్రంథములలోనుండి డాయన్ క్రాయసోస్టొమ్ నామకుఁడగు వక్తయొక్క గ్రంథమునందు నొకలక్షశ్లోకముల యిలియడు ఉల్లేఖింపఁబడినది. ఈ వక్త క్రీ॥ సం॥ కు దాదాపుగా 50 ఏండ్ల కంటె పూర్వము హిందుస్తానమునకు వచ్చియుండెను. ఈ విషయము యొక్క

యుల్లేఖమును మనము ముందే చేసియుంటిమి. ఈ విషయము జర్మన్ పండితుఁడగు వేబరుయొక్క యన్వేషణముఁబట్టి తెలిసియున్నది. ఈ యాధారముమీఁద విచారింపఁగా మహాభారతసమయము క్రీ॥ శ॥ పూ. 50 పండ్లకంటె నిటీవలికిలాగనే లాగఁబడఁజాలదు. చెప్పఁబడిన రెండు ప్రమాణములును అత్యంతమహత్త్వము కలవియైయున్నవి కావున మనము వాటియొక్క యుల్లేఖమును ఆరంభముననే చేసియుంటిమి.

ఈ ప్రకారము, అంతఃప్రమాణములయు బాహ్యప్రమాణములయు విచారములు గావించినమీఁద, క్రీ॥ శ॥ పూ 300లో సికందరుయొక్క సమయమునందు హిందుస్థానమునకు గ్రీకులు వచ్చినతరువాత మఱియు క్రీ॥ శ॥ పూ. 50 పండ్ల ప్రాంతమున డాయన్ క్రాయసోస్టోము హిందుస్థానమునకు రాకపూర్వము, విశేషముగా నీదేశమునందు రాసులు వ్యాపింపకముందు, మరియు పతంజలి సమయమునకు వెనుక అనఁగా క్రీ॥ సం॥ కు 150 కంటెఁ బూర్వము మహాభారతకాలము నిశ్చితమైయున్నదని తెలుచున్నది. సారాంశము, మహాభారతముయొక్క వర్తమానస్వరూపము క్రీ॥ సం॥ కు దాదాపు 250—200 పండ్ల మునుపటిది యనియే నిర్ణయమగుచున్నది.

పశ్చిమవిద్వాంసులు మహాభారతకాలము చాలనే యిటీవలిదియని చెప్పుచున్నారు. ఈ విషయము సిద్ధింపటకై హాప్కిన్సు కొన్ని కారణములనుకూడ జెప్పియున్నాఁడు ఇప్పుడు మనము సంక్షేపముగా వాటిని విచారింతము. అతఁడు చెప్పినదియేమనఁగా "మహాభారతమున 64 కలలు చెప్పఁబడియున్నవి; శాస్త్రములలోని మతములయొక్క యుల్లేఖమున్నది; యజుర్వేదములోని 101 శాఖలు చెప్పఁబడియున్నవి; గ్రీకుశబ్దము మఱియు గ్రీకుల యుల్లేఖముకలదు; పదునెనిమిది పురాణములు చెప్పఁబడియున్నవి; వ్యాకరణము, ధర్మశాస్త్రము, గ్రంథము, పుస్తకము, వ్రాయఁబడిన వేదముల మఱియు వ్రాయఁబడిన మహాభారత పుస్తకముయొక్క వర్ణనమున్నది; కనుక నీ విషయములన్నిటిఁబట్టి మహాభారత సమయము చాలనే యాధునికము కావలయును." కాని యీ విషయములనుండి దేనియొక్కయుఁ గాలము నిశ్చితముకాలేదనుట సత్యమైయున్నది. ఈ యన్ని విషయములు క్రీ॥ సం॥ కు 200 పండ్ల మునుపటివియనికూడఁగా గలదు. ఇట్టి దశయందు నీ కారణములకు నేవియు నుపయోగము చేయఁబడజాలదు. హాప్కిన్సు ఇట్లుకూడఁ జెప్పుచున్నాఁడు ఎట్లనఁగా "అది

పర్వములోని ప్రథమభాగము మఱియు హరివంశమునువిడిచి మిగిలిన మహాభారతము క్రీ॥ శ॥ 200కుఁ బ్రాంతమునఁ జేయఁబడియుండును. కాని యీ భాగములు దీనికంటెను ననంతరములై కావలయును, ఎందుచేత? 'దీనార' నామకమగు రోమన్ నాణెము యొక్క యుల్లేఖము హరివంశమందున్నది మఱియు హరివంశముయొక్క యుల్లేఖము ప్రథమభాగమందున్నది. ఇచ్చట నీ ప్రశ్నము బయలుదేఱుచున్నది ఏమనఁగా, రోమనుల దీనారము నాణెము హిందుస్థానమున కెప్పుడు వచ్చెను? అది హిందుస్థానమునకు క్రీ॥ సం॥ 100–200కుఁ బ్రాంతమున వచ్చెనని విశ్వసింపఁబడినప్పటికిని, ఈ విశ్వాసముఁబట్టి హరివంశములో నీపై యుల్లేఖమున్నంత భాగముమాత్రము తరువాతిదికావచ్చునన్నచో మనపని తీరఁగలదు. కారణమేమనఁగా, సమస్త మహాభారతమందు-శాంతిపర్వమందు ననుశాసన పర్వమందును-దీనారముల యుల్లేఖమెచ్చటను లేదు. ప్రతిచోటను సువర్ణనిష్కములయొక్కయే యుల్లేఖము చేయఁబడియున్నది. అనఁగా, సమస్తమహాభారతము మఱియు నీ భాగములు 200కు మునుపటివియై యున్నవి. హరివంశమునందు అర్థ శ్లోకానుకరణము సంభవమగుచున్నది. మనము మహాభారతములోని హరివంశనామకమైనభాగము కేవలము సంఖ్యాపూర్తికిని శ్రీకృష్ణునికథయొక్క పూర్తికిని జతపఱుపఁబడి యుండెనని ముందుచెప్పియుంటిమి; కాని హరివంశ గ్రంథము సౌతిదికాదు, ఎందుచేత? సౌతి యేసంఖ్యను జెప్పియున్నాఁడో, అది కేవలము అంచనాచేతను స్థూలమానముచేతను అయియున్నది. హరివంశమునందుఁ బదురెండువేల శ్లోకసంఖ్య అంచనాచేతను మోటలెక్కచేతను జెప్పఁబడియున్నది. ఏవిధముగా ఉద్యోగపర్వములోని 6698 శ్లోకసంఖ్య సూక్ష్మమానముచేతఁ జెప్పఁబడియున్నదో అలాగే యింకను ఇతరపర్వములలోని శ్లోకసంఖ్య నిశ్చితమైయున్నదో ఆ విధముగా సరియైన శ్లోకసంఖ్య హరివంశమునకుఁ జెప్పఁబడియుండలేదు. దీనిఁబట్టి హరివంశము విషయమై సౌతి యేమియు ఉత్తర దాతృత్వము (జవాబు దారి)ను తనమీఁదఁ బెట్టుకొనియుండలేదని ప్రకటమగుచున్నది. ఈ ఖిల పర్వమందు 15465 శ్లోకములున్నవి; కనుక సౌతికిఁబిమ్మటఁగూడ నీ పర్వములో శ్లోకములు చాలఁ బూరింపఁబడియున్నవని విశ్వసింపవలయును. సారాంశము, హరివంశమునందుఁ గనఁబడుచున్న దీనారములయొక్క యుల్లేఖమునుబట్టి మహాభారత కాలమును నిర్ణయించుట యుచితముకాదు.

హాప్కిన్సు ఇంకను అనేక కారణములను జెప్పియున్నాఁడు. వాటి వల్లనే సంగతి నిశ్చితమగుచున్నదో చూడవలసియున్నది. (1) అతఁడు చెప్పునది యేమనఁగా— "అనుశాసనపర్వములో భూదాన ప్రశంసా శ్లోకములయందు దామ్రశాసనమునకు నెందును ఉల్లేఖములేదు. అగ్రహార, పరిగ్రహాదుల యుల్లేఖమైతేఁ గలదు కాని తామ్రపటముయొక్క పేరు కూడలేదు. మనువునందును నీయుల్లేఖములేదు; కాని నారద, విష్ణు, యాజ్ఞవల్క్యులయందున్నది. దీనిఁబట్టి, మహాభారతకాలము తామ్ర శాసనమునకు ముందటిదియని ధైర్యమువచ్చుచున్నది" కాని పై వివేచనవలన మహాభారతకాలము తామ్రశాసనముకన్న నెంత ముందటిదిగా విశ్వసింపఁబడవలయునో యీ విషయమునకు సరియైన నిర్ణయము కాకున్నదనుట ధ్యానింపఁదగియున్నది. (2) హాప్కిన్సు చెప్పునది యేమనఁగా— "ఆశ్వలాయన సూత్రమందు సుమంతు - జైమిని-వైశంపాయన-పైల-సూత్ర భాష్యభారత మహాభారత-ధర్మాచార్యాః ఈప్రకారముగా నుల్లేఖముకలదు. కాని యితర సూత్రములయందు భారత, మహాభారతములకుమారు ఇతిహాస, పురాణశబ్దములయొక్క యుపయోగము చేయఁబడియున్నది. సాంఖ్యాయన సూత్రమందు గొంచెమేని యుల్లేఖములేదు. ఎపుడు మహాభారతముయొక్క యుల్లేఖము ప్రాచీన సూత్రములయందుఁగాక కేవలము అధునిక సూత్రములందే యున్నదో, అపుడు సూత్రకాలమున మహాభారతము లేకుండెనని ప్రకటమగుచున్నది." కాని యేసూత్రములెప్పుడు చేయఁబడినవో, యీ విషయమునకు సరియైన నిర్ణయమిప్పటివఱకుఁగాలేదనుట సత్యమైనవిషయము. ఇట్టి యవస్థయందు మహాభారతకాల సంబంధమున నేమియు ననుమానము చేయఁబడజాలదు. ఔను, కొన్ని సూత్రములు ప్రాచీనములనియు మఱికొన్ని దానికి దరువాతివియనియు ననుమానమవశ్యము బయలుదేఱుచున్నది. (3) హాప్కిన్సు చెప్పునదియేమనఁగా— "పతంజలియొక్క మహాభాష్యమందు 'అసిద్వితీయోఽనుససార పాండవమ్' ఈ వాక్యమున్నది మరియు నితరస్థానములయందును మహాభారతము దూరముగా నుల్లేఖింపఁబడినది. దీనిఁబట్టి మహాభారతము పతంజలికంటెఁ బూర్వమని సిద్ధించుచున్నది మఱియు దానిసమయము క్రీ. శ. యొక్క రెండవశతాబ్దివఱకుఁ జేరుచున్నది." కాని మహాభాష్యముయొక్క కాలము రెండవశతాబ్దియని యెప్పుడు మఱియు నెవరు నిర్ణయించిరి? మనము మహాభారతము పతంజలికి మునుపటిదియనియు మఱియు బతంజలి యొక్క

సమయము క్రీ॥ శ॥ పూ. 150-100కి దాదాపుది యనియు మునుపు చెప్పి యుంటిమి. ఇట్టిస్థితిలోఁ జెప్పఁబడిన ప్రమాణము హాప్కిన్సునకు విరుద్ధము గను మనమతమునకు ననుకూలముగనే యగపడుచున్నది. (4) హాప్కిన్సు యొక్క కథనము ననుసరించి—"ఎపుడు మహాభారతము వ్రాయఁబడెనో, అపుడు బౌద్ధుల ప్రభుత్వము నశించియుండును, ఎందుచేతననఁగా ఏడూకము యొక్క లేక బౌద్ధుల దేవస్థానములయొక్క నిందాపూర్వకమైనయుల్లేఖము చేయఁబడియున్నది. ఈవర్ణనము వనపర్వములో, గలియుగమున నేయే సంగతులు జరుగునో యవ్యవి చెప్పఁబడిన యధ్యాయమునందు నున్నది." జ్ఞప్తియుంచుకొనవలసినది యేమనఁగా—"పృథివియందు ఏడూకమే ఏడూకమగును ఇంకను దేవతామందిరములకు నాశమగును" ఈవర్ణనముఁబట్టి బౌద్ధధర్మము క్షీణదశలోనున్నప్పుడు మహాభారత రచనజరిగెనని సిద్ధింపనేరదు. దీనికిబదులు, బౌద్ధధర్మమునకు జయము కలిగినప్పుడు పైవర్ణనమయియుండవలయునని యే చెప్పవలసివచ్చుచున్నది. బౌద్ధధర్మము క్షీణదశలోనున్నపుడైతే మందిరములు వృద్ధియై యేడూకములు నశించి పోవలయును. (5) హాప్కిన్సు చెప్పుచున్నాఁడు—"ఇంతకంటెను, కలియుగము గుఱించి చేయఁబడిన వర్ణనయందు శక, యవన, బాహ్లికాది మ్లేచ్ఛరాజులు హిందుస్థానమున రాజ్యముచేయుదురని చెప్పఁబడియుండుట విశేషమహత్త్వముగల సంగతియై యున్నది. ఈ విషయము వీరియొక్క రాజ్యములు హిందుస్థానమున స్థాపితములైయున్నపుడును జెప్పఁబడఁగలదనుట ప్రకటమైయున్నది. సీథియన్ (శక), గ్రీక్ (యవన), మఱియు బైక్ట్రియన్ (బాహ్లీక) ప్రజలయొక్క రాజ్యము హిందుస్థానమున క్రీ॥ పూ. 200కు ననంతరము స్థాపితమయ్యెను మఱియునయ్యది యనేక సంవత్సరములవఱకు నుండెను. అనఁగా, దీనిఁబట్టి క్రీ॥ పూ. 200కు నిటీవలను జాలకాలమునకు మహాభారతము తయారయ్యెనని స్వాభావికమైన యనుమానము కాఁగలదు." కాని యీ యనుమానము చేయఁబడజాలదు. చిట్టచివరికి ఇట్టియనుమానముచేసి తీఱవలయునన్నమాట లేదు. కలియుగము యొక్క వర్ణనమునందు ప్రత్యక్షములగు విషయములే చేరియుండలేదు. ఇఁక నేమంటేని యే భయంకరవిషయములయొక్క కల్పన చేయఁబడఁగలిగి యుండెనో వాటియొక్కయు నుల్లేఖము భవిష్యరూపమునఁ జేయఁబడ

గలదు. ఈసృష్టినిబట్టి శక, యవనుల రాజ్యమునకు ముందును మహాభారత కాలము కాగలదు. దీనిని విచారించుటకై ప్రాచీ నేతిహాసము వైపునకు ధ్యానమీయఁ దగియున్నది. పూర్వమెన్నడును హిందుస్థానము మీఁద మ్లేచ్ఛుల యాక్రమణము జరగెననుటకు నెందునునుల్లేఖములేదు. సేమిరామీసుయొక్క యాక్రమణము కల్పితమైయున్నది. మొదటి యైతిహాసికమైన యాక్రమణము పర్షియాదేశస్థులది, కాని వారు సింధునదియొక్క యీవలియొడ్డునకు రాలేదు. రెండవయాక్రమణము పంజాబునందునర్థము గావించి రాజ్యము స్థాపించిన సికిందరుది. ఈ సమయము క్రీ॥ పూ॥ 320-300 సంవత్సరపుది. దీనికిఁ బిమ్మట బైక్ట్రియాలోని గ్రీకులు క్రీ॥పూ॥ 200కుఁ బ్రాంతమునఁ బంజాబునందు రాజ్యమును స్థాపించిరి. ఈ సమయమునకు బూర్వము, ఇరువదియైదు ఏబదిసంవత్సరములనడుమ, మహాభారత నిర్మాణమయ్యెనని మనముచెప్పుచున్నాము. ఇపుడులోకులకు సికందరు యొక్క యాక్రమణము స్మృతికి దప్పకరావచ్చును. మఱియు దీనియొక్క యాధారము మీఁద లోకులు కలియుగమున మ్లేచ్ఛులయొక్క రాజ్యము అగునని భవిష్యకథనమును జేసియుందురు. మ్లేచ్ఛులయందు శక, బాహ్లిక ప్రభృతులు చేర్పఁబడుచున్నారనుట నిశ్చితము. హిందుస్థానమునకుబయట నున్న మ్లేచ్ఛులయొక్క స్థితి ఈ దేశమందున్నవారికి బహు ప్రాచీనకాలము నుండి తెలిసియుండెను. శకజనులయొక్క స్థితియందు వారిరాజ్యము స్థాపింపబడినతరువాతనే తెలిసెనని చెప్పఁబడజాలదు. పారాంశము "శక, యవన, బాహ్లికాది మ్లేచ్ఛరాజులు, పుడమియందు రాజ్యముచేయుదురు" ఈ కల్పనయొక్క సృష్టి సికిందరుయొక్క యాక్రమణమునుండికాఁగలదు. హిందుస్థానమందు గ్రీకులయొక్క రెండవ రాజ్యము అపాలోడోటస్సుచేత క్రీ॥ పూ. 160లో స్థాపితమైయుండెను. ఈ భవిష్యత్కథనము ఆ సమయమునకు మునుపటిదియును గాఁగలదు. కొందరులోకులు మహాభారతమందు వర్ణింపబడిన భగవంతుడే యీ అపాలోడోటస్సుఅని చెప్పుచున్నారు; కాని యిది సత్యముకాదు. ఈభగదత్తుఁడు ప్రాగ్జ్యోతిషమునకు రాజై యుండెను.

(6) హాప్కిన్సు చెప్పునది యేమనఁగా— "మహాభారతములో నొకచోట రోమక నామము కనఁబడుచున్నది. దీనిఁబట్టి రోమక లేక రోమను జనుల యొక్కనామము మహాభారతకారకునికి కేవలము వినికివల్ల దెలిసియుండెను

ఏవిధముగా గ్రీకుల లేక యవనులయొక్కస్థితి చక్కగా దెలిసియుండెనో, అదేవిధముగా రోమనులయొక్కస్థితి విశేషరీతిని దెలియకపోయియుండును. అయినను అతఁడు రోమనులయొక్క నామమును వినియుండెను. ఈ విషయముమీఁద విచారముచేయఁగా మహాభారతకాలము చాలనే యాధునికమని సిద్ధించుచున్నది." కాని సికందరుతో వచ్చిన గ్రీకులవల్ల రోమనులయొక్క పేరు వినఁబడియుండుననుటయును సంభవము, ఎందుచేత? ఆసమయమునఁగూడ రోమనులయొక్క రాజ్యము ప్రతాపమును నధికముగా నుండెను. అపొలోడోటస్సుయొక్క సమయమున నయ్యది యింకను జాల వృద్ధినొందియుండెను సరే, కాని కేవలము పేరు విని తెలిసికొనుటకు గ్రీకులయొక్క మొదటి యాక్రమణము చాలును. ఇదిగాక యింకొక విషయమున్నది. మనము రోమశబ్దముచేత రోమనులకే బోధము కలుగునని యూహింతుము. సభాపర్వముయొక్క 51వ యధ్యాయమందు జెప్పియున్నాఁడు—"ద్వ్యక్ష, త్ర్యక్ష, లలాటాక్ష, ఔష్ణీష, అంతర్వాస, రోమక, పురుషాదక, ఏకపాద, ప్రముఖస్థానములనుండివచ్చిన రాజలోకము ద్వారమునొద్ద నడ్డముగా నుండుటచేత వెలుపటినుండి యొత్తిడిచేయబడినవారై నాకగపడిరి." ఈ వాక్యమునందు రోమకశబ్దమునకు ముందు వెనుకలనున్న పేర్లనుబట్టి చూచినయెడల రోమక, శబ్దమునకర్థము రోమకుఁడు అనగా శరీరమునిండ వెండ్రుకలుగలవాఁడు చేయవలయుననియే మనకుఁ దెలియుచున్నది. ఈ శబ్దమునకు రోమనులతో సంబంధమేమియును లేదు. (7) హాప్కిన్సు చెప్పునది యేమనఁగా "మహాభారతమందు హిందుస్థాన సామ్రాజ్యము యొక్క యేకల్పనకలదో, యది వైదికకాలికము కాక యాధునికమైయున్నది, అనఁగా బౌద్ధసమ్రాట్టగు నశోకునియొక్క సృష్టియైయుండును మఱియు నీప్రకారము హిందుస్తాన సామ్రాజ్యము పాండవుల నెత్తులమీఁద బెట్టబడియుండును. మనుస్మృతియందును సామ్రాజ్యముయొక్క కల్పన లేకున్నది. అందు వర్ణింపఁబడిన రాజులు బొత్తిగా చిన్న చిన్న రాజ్యములకు నధిపతులైయున్నారు. దీనిఁబట్టి యశోక సామ్రాజ్యమునకు పిదప మహాభారతము రచింపబడియుండునని సిద్ధమగుచున్నది." వైదిక సాహిత్యమునందు సామ్రాజ్య కల్పనలేదని మనము చెప్పము. వైదికకాలము మొదలుకొని బౌద్ధకాలమువఱకు చిన్న చిన్న

రాజ్యములుండెననుటలో సందేహములేదు; కాని మనయూహాలో, ఆ సమయమునందు అందరికంటెను బలవంతుఁడును అందరిచేత గప్పముగైకొను వాఁడునగు రాజుకూడనుండెను. ఈ విషయమై విశేషవివరణము ముందు నకుబోయి రాజకీయపరిస్థితి ప్రకారణమునందు జేయఁబడును. చూడఁగా హాప్కిన్స్ చెప్పినది యొకతుణకాలము విశ్వసింపఁబడవచ్చును. అయినను ఐతిహాసిక దృష్టిని బట్టి పర్షియా చక్రవర్తుల సామ్రాజ్యము యొక్క మాదిరులమీఁద లేక అలగ్జాండరు సామ్రాజ్యము యొక్క మాదిరులమీఁద నుత్తరహిందుస్థానములో దఱచు అనేక భాగములయందు జంద్రగుప్త సామ్రాజ్యము స్థాపితమైయుండెనని యే నమ్మవలయును. ఇంతియేకాదు. ఇఁకనేమంటేని చంద్రగుప్తునికి ముందే నందులు హిందుస్థానమునందు మగధసామ్రాజ్యమును స్థాపించిరనికూడ జెప్పవలయును. అశోకుని సమయమున సామ్రాజ్యకల్పన హిందుస్థాననివాసులలో జాగ్రదవస్థయందు నుండెననుటయు నశోకునికిఁ బూర్వమీకల్పన యిచ్చట లేకుండెననుటయు సత్యమైనదికాదు సారాంశము, అశోకునికి ముందు లేక యశోకుని సమయమునకు దగ్గఱ మహాభారతనిర్మాణమయ్యెనని చెప్పుటకు సత్యత్వము విషయమై యేమియు బాధ యుండఁజాలదు. ఉక్తప్రమాణములఁబట్టి హాప్కిన్సుయొక్కయు మనయొక్కయు మతములోనున్న భేదము చూడగా నంత యెక్కువకాదు అయినప్పటికిని మహత్త్వము కలదియై యున్నది. హాప్కిన్సుచేతఁ జెప్పఁబడిన పై ప్రమాణములఁబట్టి క్రీ। పూ. 150కి ననంతరము మహాభారతము నిర్మితమయ్యెనని కనఁబడుచున్నది; కాని మన మతము ననుసరించి మహాభారతము క్రీ। పూ. 250కి సమీపమున దయారైనది; మరియు మన యీ సిద్ధాంతమునకు మునుపటి ప్రమాణములనుండి యేమియు బాధకలుగనేరదు.

కాని హాప్కిన్సు తనమతమునకు నిచ్చిన సారాంశము నిజముగాఁ జమత్కారికమును నసంభవనీయము నై యున్నది. అతఁడు మొదలనే భారతముయొక్క మూలకథాసమయము క్రీ। పూ. 700 మొదలుకొని 1700 దాఁక కాఁగలదని చెప్పియున్నాఁడు. కాని మహాభారతముయొక్కవృద్ధికి నే సమయము నతఁడు చెప్పియున్నాఁడో, అది యీ ప్రకారముగా నున్నది—కురు—భారతులయొక్క భిన్న భిన్నకథలను ఒకచోఁ జేర్పుటవలన వే

భారతము చేయఁబడినదో, దానియొక్క సమయము క్రీ పూ. 400 సంవత్సరములై యున్నది. పాండవులయొక్క కథ, పురాణముల యందలికథ, శ్రీకృష్ణుని దేవత్వకథయు నొకచో జేర్చి యేభారతము చేయఁబడినదో, దానియొక్క సమయము క్రీ పూ. 400 - 200 వత్సరములై యున్నది. ఇంతకంటెను ముందునకుఁబోయి యే వృద్ధియైనదో, అది శ్రీకృష్ణుని యొక్క యీశ్వరత్వము, నీతి మఱియును ధర్మముయొక్క శిక్షనిచ్చునట్టి పెద్దపెద్ద భాగములను, పురాణములయందు వర్ణితములైన నవీనములు మఱియు బురాణములునైన కథలను, అట్లు పరాక్రమములయొక్క యతిశయోక్తితోఁగూడిన వర్ణనములను, కలుపుటవలన నై యున్నది; మఱియు నీవృద్ధియొక్క సమయము క్రీ పూ. 200 మొదలుకొని సం। 200 క్రీస్తుశకమువఱకునైనది. అంతిమవృద్ధి ఆదిపర్వములోని ప్రథమభాగమును శాంతిపర్వమునండి విడదీయుటచేతనై యున్నది; మఱియు దీనిసమయము సం. 200 క్రీస్తుశకమునుండి మొదలుకొని 400 క్రీస్తుశకము దనుకనై యున్నది.

ఈ కాల్పనికమైనవృద్ధియొక్క భిన్నభిన్నములైన మెట్లను మనము విడిచివైచి కేవలము భారతము అట్లు మహాభారతముయొక్క యే విచారమును జేయుదమేని, అపుడు హాప్కిన్సు యొక్క మతమున భారతసమయము క్రీ పూ. 400 మఱియు మహాభారతసమయము సం। 200 - 400 క్రీస్తుశకపుది యగుచున్నది. ఈ మతమునకు ముఖ్యాధారముగా బూర్వోక్తమైన గుప్త శిలాలేఖమునందు నొక లక్షశ్లోకముల మహాభారతగ్రంథముయొక్క వర్ణనమున్నది, కాఁబట్టి హాప్కిన్సు సహితముగా ననేక పాశ్చాత్య పండితులు పౌలికృతమైన యొక లక్షశ్లోకములయొక్క భారతము సం. 400 క్రీస్తుశకముదాఁక జేయఁబడినదని చెప్పుచున్నారు. కాని మనకు పది యనేకములైన యావిష్కారములచేతను క్రొత్త క్రొత్త సంగతులచేతను బరిపూర్ణమైయున్నదో, యట్టి హాప్కిన్సుయొక్క గ్రంథములోని యీ విషయముగూర్చి, యాశ్చర్యము కలుగుచున్నది. దేనియొక్క రచన సం. 50 క్రీస్తుశకమునుండి సం. 90 క్రీస్తుశకమువఱకు నై యున్నదో యింకను దేనియందు హిందుస్థానములోని యొక లక్షశ్లోకములుగల యితి యద్దుయొక్కయుల్లేఖము చేయబడియున్నదో, డాయోన్ క్రాయసోస్టోమ్

నామకుఁడగు గ్రీకువక్తయొక్క యీ యుల్లేఖమునకు నేమియు జాడ యగపడదు. ఈ ఘటన మఱేమియు గ్రొత్తదికాదు. చాల యేండ్లకుఁ బూర్వము వేబరు దీనియొక్క రహస్యమును మొలవేసియుండెను అప్పటి నుండియు లోకులయొక్క ధ్యానము ఈవైపుగా నాకర్షింపఁబడియున్నది. డా యోన్ క్రాయసోస్టోమునకు నొకలక్షశ్లోకముల గ్రంథముయొక్క సంగతి మలబారుప్రాంతమునదెలిసెను, అనఁగా ఆసమయమునందు మహాభారతము హిందుస్థాన మందంతటను వ్యాపించియుండెను. ఈ సంవత్సరమునుబట్టి మహాభారతసమయమును క్రీస్తుశకముయొక్క యీవలివైపునకునీడ్చుకొని వచ్చుట యసంభవమైయున్నది. మనకు డా యోన్ క్రాయసోస్టోముయొక్క ప్రమాణముమీఁద పాశ్చాత్య విద్వాంసులు ఎట్లు విచారము గావించుచున్నారో తెలిసికొనుటకు నెక్కువయభిలాషముండెను; కాని మన యీ యభిలాషయెందును తృప్తిగలదికాలేదు. వేయేల, హాప్కిన్సు యొక్క పెద్ద గ్రంథమందైనచో నీ ప్రమాణముయొక్క పేరు సమయము లేకున్నది !!!

## మూఁడవ ప్రకరణము

# మహాభారత మీమాంస

### ఏమి భారతీయయుద్ధము కాల్పనికమా?

మహాభారతకాలనిర్ణయమైన తరువాత ఇపుడు మన మనసునందు వే మూలభారత గ్రంథము యొక్క మహాభారతము మీఁద మహాభారతరచన జరగియున్నదో, ఆమూలభారత గ్రంథము ఎప్పుడు చేయఁబడియుండునో అని జిజ్ఞాస యుత్పన్నమగుచున్నది. భారతీయ యుద్ధమునకు దరువాత నీ గ్రంథము యొక్క నిర్మాణమయ్యెననుటలో సందేహము లేదు. అప్పుడు స్వాభావికముగా నీ ప్రశ్నము ఎదురగుచున్నది, ఏదనఁగా భారతీయ యుద్ధ మెప్పుడయ్యెను. ఈ ప్రశ్నము యొక్క విచారము చేయకముందు మనము మరొక విషయమునుగురించి విచారింపవలసియున్నది. కొందఱు చెపునది యేమనఁగా—"భారతీయయుద్ధము కానేలేదు. ఇది యైతే కేవలము ఒక కల్పనాకథయైయున్నది. ఇందు ఒక కథాపద్ధతిమీఁద, సద్గుణములయు దుర్గుణములయు ఉత్కర్షమును జూపునట్టి, యనేక కాల్పనికపాత్రలయొక్క వర్ణనము కలదు." ఈ భ్రమోత్పాదకల్పనను దూరముచేసివేయుట యెక్కువ యావశ్యకము. ఈ కల్పన యెట్టిదో సాధారణమైనదికాదు. ఇంక నేమంటేని యనేక విద్వాంసులదియు పండితులదియు నైయున్నది. గుజరాతి పండితుఁడు గోవర్ధనరామ త్రిపాఠియొక్క మాననీయ గ్రంథమైన 'సరస్వతీచంద్ర' కథయందే ప్రకాశితమైయున్నది. అందు భారతీయ యుద్ధ సంబంధమున రూపము యొక్క కల్పన చాల బాగుగా ప్రకటన చేయబడియున్నది. కాని యీ కల్పనవలన కల్పనయే యయియున్నదని జ్ఞప్తియందుంచుకొనవలయును. జర్మను పండితుఁడు బేబరును మరియు చంద్రదత్తునైతము దీనిని స్వీకరించియుండిరి. ఐతిహాసికతత్త్వములనుండి యీ మతమును విశ్వసించియున్నారు. కనుక దీనిని ప్రమాణముగ గూడ గ్రహించవలెను. లోకులయొక్క కథనమునందు సత్యము యొక్క విచారము చేయవలసియున్నది. "వైదికసాహిత్యమందు భారతబేబరు చెప్పెడిదియేమనఁగా

యుద్ధముయొక్క లేక భారతీయయోద్ధులయొక్కయు నుల్లేఖ మేమియును లేకయున్నది. బ్రాహ్మణములయందు 'అర్జున' అన్నది యింద్రునిపేరు అతడు ఇంద్రునికుమారుఁడనియు జెప్పఁబడియున్నది. అర్జునియొక్క మనుమడు పరీక్షిత్తుయుండెను మరియు నతనికొడుకు జనమేజయునియొక్క యుల్లేఖము పరీక్షిత్ - 'జనమేజయు'యని శతపథ బ్రాహ్మణములో జేయఁబడి యున్నది; కాని యతఁడు అర్జునునికి పౌత్రుఁడని యెందును జెప్పబడి యుండలేదు. భారతీయయుద్ధము బ్రాహ్మణకాలమునలేక బ్రాహ్మణములకు మునుపుకు పోవలయును. ఇట్లయైన పక్షమునసే భారతీయయుద్ధమందు వేలు లక్షలు వీరులు కాలముచేసిరో మరియు నర్జునుఁడు శ్రీకృష్ణుడును మిక్కుటమగు పరాక్రమము నగపఱచిరో, ఆయుద్ధమునకు నెచ్చటను నుల్లేఖమే లేకపోవుట యెంతయు నాశ్చర్యవిషయమైయున్నది. నిజముగా అర్జునునియొక్క పౌత్రునియుల్లేఖమై తేఉన్నదికాదా స్వయముగా అర్జునుని యుల్లేఖములేదే. దీనఁబట్టి భారతీయయుద్ధము కాల్పనికమైయున్నదనియు భారతమందు వర్ణింపబడ్డ భారతీయవ్యక్తులు కవికల్పనద్వారా నిర్మితములైన సద్గుణములుగల మూర్తులని ప్రకటమగుచున్నది." ఇపు డిచ్చట దీని విచారము చేయఁబడవలయును.

ఏదేని వ్యక్తియొక్క లేక ఘటనలేకపోవుట యుండుట విషయమై దాని యొక్క యుల్లేఖము ఐతిహాసికముగా విశ్వసింపఁబడు గ్రంథములో నుండుట యనెడు ప్రమాణముచాలునని యూహింపఁబడుచున్నది. రోమ్ నగరమును స్థాపించిన రోమ్యులస్ నామకుఁడైన యొక పురుషుఁడు అయి యున్నాఁడు ఈ విషయమును ఋజువుచేయుటకై రోముయొక్క యొక ప్రాచీనేతిహాసము చాలును. తిరుగ ఇచ్చవచ్చినట్లుగా, నా యితిహాస మందు ఆ పురుషునియొక్క కథ పుక్కిటి పురాణముయొక్క పక్కి మీఁదనే యెందులకు నీయఁబడకూడదు. ఇదేవిధముగా హోమరుయొక్క యిలియడ్డువలన ఏకిలీజు నామకుఁడగు నొకానొక యైతిహాసికవ్యక్తి యుండెననుసంగతి సిద్ధమై విశ్వసింపఁబడుచున్నది. ఇదే న్యాయము ననుసరించి యెపుడు భారతమందే యిది యితిహాసగ్రంథమని స్పష్టముగా జెప్పబడియున్నదో, అపుడు ఐతిహాసిక సాక్షియొక్కయు ప్రమాణము యొక్కయు నాధారముమీద పాండవులు ఉన్నారనియు భారతీయ యుద్ధముకూడ జరిగియున్నదనియు విశ్వసించుటకు నేయాటంకమును లేదు అవును, ఏదియేని యుచితమైన కారణముబట్టి యీ ప్రమాణము విడుచ

టకు నర్హమని సిద్ధింపఁగలదేని, అపుడు దానినవశ్యము విడిచివేయ వలయును. కాని యీ సంగతిని సిద్ధింపఁజేయుటకై బేబరు ఉల్లేఖాభావ రూపమైన యేకకారణమును జెప్పియున్నాఁడో, అది చాలనేరదు.

ఉల్లేఖాభావరూపమైన ప్రమాణములను ప్రస్తావించెడు నిచ్ఛ స్వాభావికము, ఎందుచేతననఁగా, ఈ ప్రమాణము నిజముగా మిక్కిలి మోహపెట్టునదియైయున్నది. ఎపుడు వైదికసాహిత్యములో భారతీయయుద్ధము యొక్క యుల్లేఖమే లేదో అపుడు భారతీయ యుద్ధము కానేలేదని విశ్వసించెడుపట్ల మనస్సునకు స్వాభావికమైన ప్రవృత్తికలుగుచున్నది. కాని యిట్టిదశలయందు నెల్లప్పుడును, ఉల్లేఖమున కావశ్యకత యుండెనో లేదో యీ సంగతి విచారింపవలయును. ఉదాహరణార్థము, ఒకానొక గ్రంథమందు నారాయణరావు పేశ్వా (పీష్వా)యొక్క యుల్లేఖమున్నది, కాని యాగ్రంథమందు నారాయణరావుయొక్క నాయకత్వముక్రింద ముందుగా జరిగిన పానిపత్తు (పానిపట్టు) యుద్ధముయొక్క యుల్లేఖములేకున్నది; అప్పుడీయుల్లేఖాభావముఁబట్టి పానిపత్తుయుద్ధము జరుగనేలేదని యొక యనుమానము చేయవలసినదేనా? లేక సోదరుఁడు సదాశివరావు లేక తండ్రి సేందియా నామకుఁడగు నొక వీరపురుషుఁడు లేనేలేరా? పానిపత్తు యుద్ధముయొక్క యుల్లేఖము తప్పక చేయబడవలయునని యావశ్యకత యేమియు లేదు. అయినను, పైగ్రంథములలో నేగ్రంథమైనను మరాటి యితిహాసవిషయమై యగునేని, అపుడు అందు పానిపత్తుయుద్ధము సంగతి యవశ్యము రావలయుననుట ప్రకటమైయున్నది. ఈ యాలోచనాదృష్టిచేతఁ జూచినయెడల, వైదికసాహిత్యకాలమున నేయనేకఘటనలుండినవో, అవన్నింటియొక్క యుల్లేఖము ఆసాహిత్యమునందు జేసియేయుండవలయునని చెప్పఁబడజాలదు; ఎందుచేత? బ్రాహ్మణాది గ్రంథములు ఇతిహాస గ్రంథములుకావు; ఇఁక నేమంటేని యవి ధార్మికగ్రంథములై యున్నవి. వాటియందు దేవతాస్తుతులను యజ్ఞాదులయు వర్ణనము కలదు. వాటి యందు ప్రసంగము ననుసరించి యెవరేని రాజుయొక్క లేక వ్యక్తియొక్క పేరు కనఁబడుచున్నది. సత్యమే; కాని యీ యుల్లేఖము చేయఁబడియే యుండవలయుననుటకు నేమియు నావశ్యకతలేదు. ఇట్టిస్థితిలో ఆ గ్రంథములయందు భారతీయయుద్ధము లేక భారతీయయోద్ధులయొక్క సంగతి కనఁబడకుండుట యేమియు నాశ్చర్య విషయముకాదు. సారాంశము,

భారతీయ యుద్ధములేక యోద్ధలయొక్క సంగతి శతపథ బ్రాహ్మణము లేక యితరవైదిక సాహిత్యమునందు లేకున్నప్పటికిని, ఈయుల్లేఖాభావము నాధారముచేసికొని పై సంగతులు జరుగనేలేదని యనుమానము చేయుట యెంతయుఁ బొరపాటై యున్నది.

ఒకచోట రమేశచంద్రదత్తు భారతీయ యుద్ధమైతే సంభవముగుచున్నది; కాని పాండవులుండుట యసంభవము; ఎందుచేతననఁగా పాండవులయొక్క కల్పన కేవలము సద్గుణోత్కర్షముయొక్క కల్పనమాత్రమై యున్నదని యింతమాత్రము స్వీకరించియున్నాఁడు. కాని యీ కథనముకూడఁ బొరపాటు. మహాభారతమందు పాండవులయొక్క యే యితిహాసముకలదో యది కేవలము సద్గుణములయొక్కయే వర్ణనములతో నిండియున్నదని చెప్పఁబడజాలదు. ఉదాహరణార్థము, ఐదుగురు సోదరులుకలిసి యొక స్త్రీని వివాహమాడిరి. ఈ వర్ణన యేమాత్రము సద్గుణవర్ణనమని చెప్పబడ జాలదు. వైదికసాహిత్యసమయమునందు ఆర్యులకిటువంటి యాచారము లేకుండెను. వైదికఋషులు, ఏప్రకారము యజ్ఞస్తంభమునకు నలువైపులను అనేకరశనలు కట్టఁబడగలవో, అదేప్రకారము ఒక పురుషునికి ననేక స్త్రీలు కాఁగలరు. కాని యేప్రకారము ఒకేరశన యనేక యూపములకు గట్టఁబడ జాలదో, అదేప్రకారము ఒక స్త్రీకి ననేకపతులు కాఁజాలరని స్పష్టముగా జెప్పియున్నారు. ఈ కథనమునకు, ఆ సమయమున నొకస్త్రీకి ననేక పతులుండెడు నాచారములేకుండెనని తాత్పర్యమగుచున్నది. అయితే మఱి యీ కాల్పనికపాండవులు ఇటువంటి వివాహము నెట్లు చేసికొనిరి? సత్యమైన విషయమైతేని పాండవులు ఏవిధముగను కాల్పనికులుకారని యగుచున్నది. భీముఁడు రణభూమియందు దుశ్శాసనునియొక్క రక్తమును త్రాగియుండెను; ఈ శాస్త్రవిరుద్ధమైన భయంకరకృత్యము సద్గుణులకు జేసెను? సారాంశము, పాండవులేమాత్రమును సద్గుణములయొక్క యవతారములుగా జేయఁబడియుండరైరి, ఇఁకనేమంటే వారు సాధారణ మనుష్యులవలెనే చిత్రింపబడియున్నారు. ఈ ప్రకారముగా భారతీయ యుద్ధము భారతీయ యోద్ధులును కాల్పనికులు కారనుమాట సిద్ధించు చున్నది.

బ్రాహ్మణగ్రంథములయందు భారతీయయుద్ధముయొక్క నామము లేక యుల్లేఖము కనఁబడకుండుట ప్రమాణము కాదను సంగతి యవశ్యము

ఆశ్చర్యకరమని యొక శంక యిచ్చట కలుగఁగలదు. కాని యిది యుఁ జెప్పఁబడఁజాలదు, ఎందుచేత? ఏ బృహత్స్వరూపమునందు భారతీయ కథ యిప్పుడు మనకు నగపడుచున్నదో. ఆ స్వరూపమప్పుడు లేకుండెను సౌతి మహాభారతమునకు నేవర్తమాన బృహత్స్వరూపము నిచ్చియున్నాఁడో, అది యపుడు లేకుండెను. ఆ సమయమందు యుధిష్ఠిరునియొక్క యశ్వమేధము అంత యెక్కువ ప్రసిద్ధముకాకయుండెను. యుధిష్ఠిరుఁడు ఒకే యశ్వమేధమును జేసియుండెను, కాని యతనికంటె పూర్వము ఎందఱో రాజులు అనేకాశ్వమేధములు చేసియుండిరి. ఆ సమయమున శ్రీకృష్ణుని యందలి భక్తికిగూడ చాల తక్కువప్రచారముండెను. ఏ భాగవత మతము శ్రీకృష్ణునియందలి భక్తియనెడు నాధారముమీఁద స్థాపితమై యున్నదో, దానికి అసమయమునఁ బుట్టుకయు లేకుండెను; ఒక వేళఁ బుట్టియున్నప్పటికిని దానికి ప్రచారము చాలతక్కువయై యుండెను. పరీక్షిత్తు కొడుకు జనమేజయుఁడును వానియొక్క ముగురుసోదరులును వేర్వేరువిధములైన నాలుగశ్వమేధములను చేసియుండిరి. కనుక వాటినామములు నాలుగశ్వమేధవర్ణన ప్రసంగములో శతపథ బ్రాహ్మణమునందు గనఁబడుచున్నవి. ఎపుడు మనము ఈ యన్ని విషయములను విచారించుచున్నామో మఱియు భారతస్వరూపము బొత్తిగా నల్పమైయుండెడిదనియు శ్రీకృష్ణ భక్తికిఁ దలచు పుట్టుకయె యయియుండెడిదనియు నీ విషయములమీఁద ధ్యానముంచుచున్నామో, అపుడు మనకు బ్రాహ్మణగ్రంథములయందు భారతీయ యుద్ధమునకు లేక యుధిష్ఠిరాదులకు గొంచమేని యుల్లేఖము లేకుండుటకు నాశ్చర్యపడవలసిన యవసరము బొత్తిగా లేదు ఐతరేయ బ్రాహ్మణములో విచిత్రవీర్యునికి బుత్రుఁడగు ధృతరాష్ట్రునియొక్క యుల్లేఖమున్నదని యిచ్చట జెప్పవలసియున్నది. సారాంశము, భారతీయయుద్ధముయొక్క యుల్లేఖము బ్రాహ్మణములయందు లేదు, దీనిఁబట్టి యెంతమాత్రము భారతీయ యుద్ధము కాల్పనికమని సిద్ధింపనేరదు. ఇంక భారతీయయోధులు మాత్రము కాల్పనికులు కాఁజాలరు. రమేశచంద్రదత్తు యుద్ధమగుటయైతే విశ్వసించుచున్నాఁడు, కాని యతఁడు పాండవులు కాల్పనికములైన సద్గుణమూర్తులని చెప్పుచున్నాడు రెండిటివిషయమునను ఉల్లేఖాభావమనెడిప్రమాణమునకు సమానోపయోగము చేయబడియున్నదని జ్ఞప్తియుంచుకొనవలయును. కనుక నొకసంగతి సత్యమని యెందులకు జెప్పఁబడునో మఱి రెండవది యసత్యమని యెందు జెప్పఁబడునో యిది యూహకు రాకున్నది.

కొందఱు లోకులు యుద్ధమును సత్యమనినమ్మి, భారతీయయుద్ధము ఏరీతిగా నైనదని వర్ణనము మహాభారతములో జేయఁబడియున్నదో ఆ రీతిగా నాయుద్ధముకాలేదు, కాని మఱియొకరీతిగా జరిగినదియని చెప్పుచున్నారు. ఆ మతమునుగూడ నిచ్చట బేర్కొనట యావశ్యకము. ఆ యుద్ధమునందు జనమేజయుఁడు ప్రధానుఁడై యుండెననియు ఆ యుద్ధమునందే యతనియొక్క నాశము జరగెననియు వేబరుయొక్క మతమై యున్నది. అతనియొక్క యీకల్పన బృహదారణ్యమున గనఁబడుచున్న యీ క్రింది యుల్లేఖము నాధారముచేసికొని వచ్చినదిపది. యనఁగా, అందొక ఋషి యాజ్ఞవల్క్యనడిగెను—"క్వ పారిక్షితాః అభవన్। క్వపారిక్షితాః అభవన్" అనఁగా పారిక్షితులకు నేమియయ్యెను? ఈ ప్రశ్నము నాధారము జేసికొని వేబరు తన కాల్పనికవిచారము నీరీతి బ్రకటించియున్నాఁడు— "దీనిఁబట్టి యా సమయమునఁ బారిక్షితులయొక్క నాశము జరిగి యుండునని చెప్పవలసియున్నది. కాని వారియొక్క యైశ్వర్యము మరియు జీవన చరిత్రముయొక్క సంగతులు లోకుల స్మరణమునందు అరబ్బీ సంబంధము గలిగియుండియుండును. వంశముతో సహితము వారియొక్క నాశము ఏదో విలక్షణమైనరీతిని జరగియుండుననుటకు సందేహములేదు." కాని పై ప్రశ్నము నాధారముచేసికొని, పారిక్షితులయంతము ఏదో భయానకమైన రీతినయియున్నదని యనుమానము చేయఁబడజాలదు. బృహదారణ్యకనందెపుడు పారిక్షితు లెచ్చటనున్నారని ప్రశ్నముచేయబడెనో, అపుడీ యుత్తరముకూడ నీయఁబడియున్నది ఏమియనఁగా "తే యత్రాశ్వమేధయాజినో యాంతి।" ఈ యుత్తరమువలన పై ప్రశ్నమునకు సత్యమైన తాత్పర్యము రహస్యమును నూహాకువచ్చుచున్నది. పారిక్షితులు అనఁగా జనమేజయుఁడు మరియు నాతనియొక్క ముగ్గురుసోదరులు ప్రస్తుతకాలమునందే యే యశ్వమేధములను జేసియుండిరో యనిలోకులయొక్క కనుల యెదుట నుండెను. కనుక పై ప్రశ్నమునందు అశ్వమేధము చేయువారికి నేమిగతి కలుగుచున్నదో యీ రహస్యమును దెలిసికొనుటకుగల యిచ్ఛ ప్రకటమగుచున్నది — అతఁడు బ్రహ్మజ్ఞానియొక్కయే గతిని బొందఁ గలుగునా? మరియు నీ రహస్యముపై పున ధ్యానముంచియే యాజ్ఞవల్క్యుఁడు, అశ్వమేధమును జేయువాఁడు అధ్యాత్మవిద్యనుండి ప్రాప్తమగు గతినే. చెందుచున్నాఁడని యుత్తరమిచ్చియున్నాఁడు ఇచ్చటఁబారిక్షితుల యొక్క బ్రహ్మహత్యయే పేర్కొనఁ బడదయ్యెను మరియు నయ్యది

ప్రశ్నవక్తయొక్కయే మనసునందు లేకున్నది. శతపథబ్రాహ్మణములో మరియొక వచనమునందు జనమేజయ పారిక్షితునిచేత జేయఁబడిన యే బ్రహ్మహత్యయొక్క యుల్లేఖమున్నదో, దానివిషయమై యీ బ్రహ్మహత్యకు సంబంధము భారతీయయుద్ధముతో నేమియునులేదు, ఎందుచేత? ఆ యుద్ధమునందు బ్రహ్మహత్య జరుగనేలేదు. ద్రోణాచార్యుఁడు బ్రాహ్మణుఁడై యుండెను, కాని యతఁడు క్షత్రియోద్యమమును స్వీకరించి రణభూమియందు నిలఁబడియుండెను, కాఁబట్టి యిటువంటి బ్రాహ్మణుని యుద్ధమందు జంపుట బ్రహ్మహత్య కాదని సిద్ధించుచున్నది. మహాభారతమునందును ద్రోణాచార్యుని హత్యవలన బ్రహ్మహత్యయైనదని యెందును జెప్పబడదయ్యెను. ఇట్లు కాకపోయినప్పటికిని, ఎపుడు మనము బ్రహ్మహత్యయొక్క సవిస్తరవర్ణనము శతపథబ్రాహ్మణమందులేదని చూచుచున్నారో అపుడా బ్రహ్మహత్యకు సంబంధము భారతీయయుద్ధముతో ప్రధానమై గలుపబడజాలదు. సారాంశము, భారతీయయుద్ధములో జనమేజయుఁడు యుండెననియు అదే యుద్ధములో నతనియొక్క నాశము జరగెననియు వెబరుగారియొక్క యీ కథనము బొత్తిగా నసత్యమైయున్నది.

భారతీయ యుద్ధమువిషయమై యింకను లోకులయొక్క యనేక కల్పనలు కలవు. జర్మన్ పండితుఁడు, మూలభారతసహిత చిన్నకథగా నుండెనని ఆ కథ బౌద్ధధర్మమును సంబంధించియుండెననియు దానికి నాయకుఁడు కర్ణుఁడై యుండెనని; తరువాత నెపుడు బ్రాహ్మణధర్మమునకు ప్రాబల్యము వచ్చెనో అపుడు బ్రాహ్మణులు కృష్ణపరమాత్మయొక్క భక్తుఁడగు నీ అర్జునునకి వాని సోదరులకును ప్రాధాన్యము నిచ్చెనని; మరియు నీప్రకారము శ్రీకృష్ణునియొక్క లేక విష్ణునియొక్క మహిమ వృద్ధిఁజెందెననియుఁ జెప్పుచున్నాఁడు. టాల్‌బాయిస్‌హ్వీలరు, పాండవులయొక్క యుద్ధసమయమున శ్రీకృష్ణుఁడు లేఁడనియు; అతనియొక్క నామము పిమ్మటఁ గాథయందుఁ గలుపఁబడి యున్నదనియుఁ జెప్పుచున్నాఁడు. మఱికొందఱులోకులు, ఈయుద్ధమందుజయము పాండవులకు కాక దుర్యోధనునికి నయ్యెనని చెప్పుచున్నారు. ఈయన్ని కల్పనలును యుద్ధముకాకపోయెడు విషయమైనవికావని జ్ఞప్తియుంచుకొనవలయును, అయినను వీనియొక్క ఖండనము చేయవలసియున్నది.

శ్రీకృష్ణునికి పాండవులకునుగల బరస్పరసంబంధము నీ విధముగను విడఁదీయఁబడఁజాలదు. వారికి సంబంధము మూలభారతము నందుండక మహాభారతమందుఁ బిదపఁ గలుపఁబడి యున్నదని విశ్వసింపఁబడఁజాలదు ఇంతియేకాక యీ మతము యితిహాసక దృష్టిఁబట్టియు నసత్యమై యున్నది. శ్రీకృష్ణునికిని పాండవులకును బరస్పరసంబంధము మెగస్థనీజు యొక్క గ్రంథమునుండియు స్పష్టముగా నగపడుచున్నది. మెగస్థనీజు హిందూస్థానముయొక్క ప్రసిద్ధ దేవతను హెరక్లిజునామమున వర్ణించి యున్నాఁడు. అతఁడే శ్రీకృష్ణుఁడు. ఈ సంగతి యతనియొక్క యీ వర్ణనముఁబట్టి ప్రకటమగును—"హెరక్లిజును శౌరశేని ప్రజలు పూజించుచున్నారు మరియు నీ ప్రజలకు మథోరా అనెడి ముఖ్యపట్టణముగలదు." అనగా "హెరక్లిజు"ను మరియు "హరి"ని ఏకముచేసి యతఁడు శ్రీకృష్ణుని యొక్క పై వర్ణమును జేసియున్నాఁడు. అతడు హెరక్లిజునకు పాండియా యనుపేర నొక కావ్యముండెననియుఁ జెప్పియున్నాఁడు; కాని యీ వర్ణనము భ్రాంతిచేతనే చేయఁబడినది. ఏమేని యగుఁగాక దీనిఁబట్టి శ్రీకృష్ణునికిఁ బాండవులకుఁ బరస్పర సంబంధముయొక్క కథ మెగస్థనీజు యొక్క సమయమందును బ్రసిద్ధమైయుండెనని ప్రకటమగుచున్నది. దీని కంటెను మునుపటి ప్రమాణము పాణినియొక్క యొక సూత్రమునందుఁ జూడఁబడుచున్నది, అది యిట్లున్నది—"వాసుదేవార్జునాభ్యాంకన్." ఈ సూత్రమునుబట్టి యీ సమయమునందు లోకులు వాసుదేవుని మరియు అర్జునుని భజించుచుండిరను సంగతి ప్రకటమగుచున్నది. సారాంశము, శ్రీకృష్ణునికి భారతకథకును చాలా ప్రాచీనమైయున్నది, అదేమియు మహాభారత రచనా సమయమునకుఁ బిమ్మటఁ గలుపఁబడియుండలేదు.

శ్రీకృష్ణు డాధునిక వ్యక్తికాక బహు ప్రాచీనుఁడై యున్నాఁడు. అతనియుల్లేఖము చాందోగ్యోపనిషత్తులో నిట్లగపడుచున్నది—"కృష్ణాయ దేవకీపుత్రాయ" ఏ ప్రకారము జనమేజయ పారిక్షితునియొక్క చర్చ బృహదారుణ్యకమందున్నదో, అదేప్రకారము సమకాలీనమైన ఛాందోగ్యమందు శ్రీకృష్ణునియొక్క నుల్లేఖముకలదు. అనఁగా, రెండువ్యక్తులును బ్రాహ్మణకాలీనములని ప్రకటమగుచున్నది. సారాంశము, భారతీయ యుద్ధముతో శ్రీకృష్ణునికి సంబంధము కాలదృష్టిఁబట్టియు నసంభవము కాదు. నూతన పద్ధతిఁబట్టి విచారముచేయువివేచకులకు, ప్రాచీనకథలు ఏ

విధముగాఁ జెప్పఁబడియున్నదో ఆ విధముగా నియ్యవికావని విశ్వసించు పట్ల సాధారణమైన ప్రవృత్తి కలుగుచున్నది. కాని వాస్తవమున, నే విధముగాఁ గథ వినఁబడియున్నదో యీ విధముగానే యదియైయుండునని విశ్వసించుటయె యెల్లప్పుడు నుచితమైయున్నది. ఒకప్పుడు తప్పనిసరియేని యీ కథలో నేది యాధునికదృష్టిఁబట్టి బుద్ధివాదమనెడి యొరగొల్లునఁ బరీక్షించుచో సత్యమని తోఁచదో యా చమత్కారికభాగము విడువవలయును; కాని యీ కథాస్వరూపమును మాత్రము తారుమారు చేసి వేయుట యేవిధముగను యుక్తిసంగతము కాజాలదు. ఈ దృష్టిచేత భారతీయ కథలు ఏ రూపాంతరములు నైనఁ జెప్పఁబడియున్నవో యవి నిస్సందేహముగా విశ్వసింపఁ దగినవి కావని యంగీకరింపవలయును.

యూరోపియన్ పండితులయొక్క యాశయమెల్లప్పుడు నిట్లే యగుచుచున్నది. ఈ విషయమై మరియొక యుదాహరణమును గైకొనుఁడు. మహాభారతమందు మునుపటి పాండవుల కథయే లేకుండెను. కురువులయొక్క భారతులయొక్కయుఁ గథ యుండెడిది. కాని బౌద్ధధర్మము పడిపోయినమీఁద భారతులయొక్క స్థానమునఁ బాండవులనుంచి బ్రాహ్మణులు తమ ధర్మములయొక్క దృఢతకొఱకు అందు శ్రీకృష్ణభక్తిని గలిపినది మహాభారతము చేసిరియని వారి యభిప్రాయమైయున్నది. వారు చెప్పునది యేమనఁగా—"మూలభారతజనులు పంజాబునందే నివాసులై యుండిరి; కాని యెపుడు భారతులకు బదులు పాండవులుంచఁబడిరో, అప్పుడు ఇంద్రప్రస్థము వారికి ప్రోత్తరరాజధానియై చేయఁబడెను." ఈ మతమును సమర్థించుకొఱకు వారు పాండవుల యుల్లేఖము వైదిక సాహిత్యమునందు బొత్తిగా లేదని చెప్పుచున్నారు. ఈయుల్లేఖము మొట్టమొదట బౌద్ధజాతకముల యందగపడుచున్నది. బౌద్ధజాతక సమయమునఁ బాండవులయొక్క కథ యవశ్యము ప్రచలితమైయుండును. దీనికిఁ బిమ్మటనే మూలభారతమందు మార్పుచేసి పాండవులయొక్క కథ కలుపఁబడియెను. ఈ విషయముయొక్క జాడ (ఆ పండితులయొక్క మతము ననుసరించి) పొరపాటుచేత మహాభారతమందు నుంచఁబడియున్న యొక ప్రాచీనశ్లోకముఁబట్టి నడచుచున్నది. వన పర్వములో 48వ యధ్యాయమందు జూదమును మఱల వర్ణించునపుడు యుధిష్ఠిరుఁడీ శ్లోకమును దుర్యోధనుని వచనముగాఁ జెప్పియున్నాఁడు :—

బ్రవీమి సత్యం కురుసంసదీహ
తవైవ తా భారత పంచనద్యః।

అనఁగా, దుర్యోధనుఁడు యుధిష్ఠిరునితోఁ జెప్పినది యేమనఁగా, నీయొక్క వనవాసము మరియు నజ్ఞాతవాసము పూర్తియైన తరువాత— "ఈ కౌరవసభలో సత్యము చెప్పుచున్నాను ఏమనఁగా, ఓయి భారత! ఈ పంచనదదేశము నీదేయగును" ఇక్కడ యూరోపియన్ పండితులయొక్క ప్రశ్నమిది—ఎపుడు పాండవులయొక్క రాజ్యము పంజాబునకు వెలుపల యమునాతీరమందున్న యింద్రప్రస్థమున నుండెనో, ఇంకను నెపుడు వారు ఈ రాజ్యమునే ద్యూతమునందుఁ బోఁగొట్టుకొనియుండిరో, అపుడు వారు వనవాసము మరియు నజ్ఞాతవాసముయొక్క ప్రతినను బూర్తిచేసినపిమ్మట వారికి పంజాబు రాజ్యముఁ దిరుగనిచ్చుట యనెడి సంగతి యెట్లు నుడువఁబడినది? ఇచట పంచనదదేశమునకు నేమి సంబంధమున్నది? దీనిఁబట్టి యీ పండితులయొక్క యూహ యేమనఁగా— "ఆరంభమునఁ బంచనదదేశ రాజులగు భారతులకు మరియుఁ గురుదేశరాజులకు ద్యూతము జరగి యుద్ధమయియుండును మరియుఁ బాండవులు పిదపఁ గలుపఁబడియుందురు" (హాప్కిన్సు పేజీ 374) వారికి నింకనొక ప్రశ్నముకలుగుచున్నది. అది యిది — ఈ గ్రంథమునకు మహాభారత నామమెట్లీయఁబడినది? మూల యుద్ధములో భారతప్రజలే యుండిరని తెలియుచున్నది, కాఁబట్టి యీ గ్రంథమునకు భారతము మహాభారతము నని నామధేయము లీయఁబడియుండును.

ఇందుఁ బంచనదదేశముయొక్క యే యుల్లేఖమున్నదో యది సౌతియొక్క కూటశ్లోకములలోనుండిన యొక చిక్కుపెట్టు సంగతియై యున్నదని స్వీకరింపవలసియున్నది. కాని యీయొకశ్లోకము నాధారము చేసికొని సమస్త భారతీయకథను తాఱుమాఱు చేసివైచుట యుచితముకానేరదు. మరియు దుర్యోధనుని సంభాషణమునందుఁ బంచనదదేశనామము ఎట్లు వచ్చినదో యీ సంగతికి స్పష్టీకరణముకూడ గాఁగలదు. ప్రాచీన కాలమున హిందుస్థానమునకు నేదియు స్వతంత్రనామము లేకుండెను. పరదేశీయులు దానికిఁ బ్రస్తుతకాలమున హిందుస్థానమను పేరు నిచ్చియున్నారు. పురాణములయందు, ప్రాచీనసమయమున హిందుస్థానమును భరతఖండముగా జెప్పియుండిరని యున్నది, కాని మహాభారతములో నాపేరు లేకున్నది.

పాండవు లన్ని దేశములను జయించిరని వర్ణనమగుచున్నది. చూడఁగా నీ ఘటన తరువాతిదియని విశ్వసింపవలయును, అయినను పాండవులు పంజాబు దేశమును గూడ జయించిరనుటలో సందేహములేదు. భారతీయ కథయొక్క ప్రాచీనతను నమ్మినమీఁద నా సమయమునఁ బంజాబుదేశము మాత్రము హిందుస్థానమునకు ముఖ్యమైయుండెనని చెప్పవచ్చును. పాండవులాసమయమందు సార్వభౌములై యుండిరి. ఇట్టిస్థితిలో వారి ప్రతిజ్ఞ సిద్ధింపనియెడల వారి సామ్రాజ్యమంతయుఁ గౌరవులకు లభించును, అనఁగా సమస్త హిందుస్థానము కౌరవులవశమున సాగును. ఈ దృష్టిచేత నిచ్చట పంచనదదేశముయొక్క యుల్లేఖము చేయఁబడియున్నది; అనఁగా ముఖ్య భాగముయొక్క నిర్దేశముచేత నిందు సమస్త సామ్రాజ్యముయొక్కయు నిర్దేశము చేయఁబడియున్నది. ఇంద్రప్రస్థ మనురాజధాని సైతము దానిలోఁ జేరిపోయినది. ప్రస్తుతకాలమునగూడ ఢిల్లీరాజధాని పంజాబునందే చేరియున్నది. పంజాబులో వేర్వేరు రాజులుండిరి. కాని వారందఱు పాండవుల యంకితము కలవారై యుండిరి. తాత్పర్యమేమనగా బంచనదదేశముచేత నిచ్చట భరత ఖండసామ్రాజ్యముయొక్క బోధమగుచున్నది. లేక యీ కూట శ్లోకమునకర్థము మఱియొక విధముగను జేయఁబడఁగలదు. 'పంచనద్యః, శబ్దముచేతఁ బంజాబులోని పంచనదులని యూహింపక హిందుస్థానమందలి పంచనదు లూహింపఁబడవలయును. సింధువు, సరస్వతి, యమున, గంగ మరియు సరయువు, ఈయైదునదులను గలిపి యా సమయములోని మనభారతదేశము చేయఁబడియెను. అగుఁగాక; మునుపు భరతునికి మఱియు కురువునకే మధ్యను జగడముజరగెనని విశ్వసించునెడల, అప్పుడును పంచనదదేశమంతయు నొకరాజునకు వశమైయుండుననుట సంభవముకాదు. ప్రాచీనకాలమున హిందుస్థానమందుఁ బెద్ద పెద్ద రాజ్యములులేకుండెను. కురుజనులయొక్క హస్తినాపురరాజ్యమునకు సమానమైనదే భరతజనులకు నొక చిన్న రాజ్యము పంజాబులో నుండియుండును, కనుక నీకల్పనయందును పంజాబు సామ్రాజ్యముయొక్కయే యుల్లేఖము స్వీకరింపవలసివచ్చుచున్నది. సారాంశమేమనఁగా, పంచనదశబ్దాధారముమీఁద యూరప్దేశీయ పండితులు ఏశంకలు చేసియున్నారో యింకను ఆశబ్దముయొక సాహాయ్యముచేత నే కల్పనలు చేసియున్నారో, అవి యుక్తియొక్క ప్రమాణముయొక్కయు దృష్టిచేత నిలువఁజాలవు.

ఇదియుఁగాక యింకొక సమాధానమున్నది, అది యిది భారతమునకు మహాభారతస్వరూపము నిచ్చునపుడు పాండవులయొక్క కల్పితము లేక ప్రచలితమైన కథను గలుపుటకు నేమియుఁ బ్రయోజనమగపడదు. ఎపుడు మహాభారతము రచింపఁబడియెనో యపుడు, అనఁగా క్రీ. పూ. 300కుఁ బిమ్మట (మహాభారతముయొక్క యీ కాలమర్యాద ప్రాచ్య, పాశ్చాత్య విద్వాంసులకందఱకు మాన్యమైయున్నది), పాండవుల రాజ్యమేదియుఁ బ్రసిద్ధముకాకుండెను. అప్పటి యితిహాసముఁబట్టి పాండవ రాజ్యమునకు దేనికిని అస్తిత్వములేక ప్రధానతయగపడదు. ఇట్టిదశయందు ఏ మహాభారతగ్రంథముయొక్క రచన సనాతన హిందూధర్మమును గాపాడుటకై చేయఁబడియున్నదో దానియందు, ఏ రీతిని సమాజముయొక్క నాయకుల మన్నింపక యత్యంతము అప్రసిద్ధులైన పాండవులను గలిపి వైచుటకు బుద్ధి యేరాష్ట్రీయకవికిఁ గలుగును. ఇదిగాక మఱియొకటి కూడనున్నది ఏమనఁగా, ప్రాచీనమైన భారతులయుఁ గురుప్రజలయుఁ గథ యగునేని, అపుడు ఏకథ సర్వసాధారణముగా నాదరణీయమై యుండి రాష్ట్రీయమైయుండెనో, దానిని స్థిరపఱచుటకు నేమియాపత్తియుండెను? ప్రతిమనుష్యుఁడును ఆ కథయే స్థిరముచేయఁబడుట యిష్టమైయుండెనని స్వీకరించియుండును ఈ ప్రకారము పాండవులకథకుఁ దరువాతఁ గలుపఁబడుట సంభవముకానేరదు. ఇదిగాక యొకస్త్రీని అయిదుగురు పురుషులు వివాహమగుపక్షమున నేయనేకకారణములు మహాభారతమందు జెప్పఁబడియున్నవో, అవి యన్లైన నీ విషయమును సమర్థించుటకై చేయఁబడియున్నవనియు నీ ప్రయత్నము పిదపఁ జేయఁబడియున్నదనియు బ్రకటమైయున్నది. కాఁబట్టి పాండవులకథ మూలభారతములోనిదై యున్నదనియు వారి చమత్కారికమైన వివాహముయొక్క సమర్థనము తరువాత జేయఁబడియున్నదనియుఁ దప్పక చెప్పవలసియున్నది. ఈప్రకారము విచారింపగా పాండవుల కథ పిమ్మట గలుపఁబడినదను నీ కల్పన సరియైనదని నచ్చనేనచ్చుదు.

మూలయుద్ధము భారతులకును కురుప్రజలకును అయియుండెనని చెప్పుటకూడ నొకవిధమునఁ దలక్రిందుగా నగపడుచున్నది. దీనికిఁ గారణమేమనఁగా, ఏ వైదిక సాహిత్యగ్రంథమందును లేక యితరగ్రంథములయందును భారత, కురునామములు రెండును వేర్వేరు ప్రజలవియైనట్లు

కనఁబడవు. భరతునియొక్క వంశస్థులను భారతులనుచున్నారు మరియు నీ దృష్టినిబట్టి భారతశబ్దముయొక్క యుపయోగము కౌరవుల కొఱకుఁ గూడఁ జేయఁబడుచున్నది. ఈ శబ్దము భరతవంశజులందఱికి నుపయుక్తమై యున్నది; ఇంతియేకాక బ్రాహ్మణకాలమున భారతశబ్దము ఆర్య వీరు లందఱకు నుపయోగింపబడినదై చూడఁబడుచున్నది. ఆ సమయమందు భరతవంశ్యులు ఏదేని మఱియొక నామముతో అనఁగా భారతనామముతోఁ బ్రసిద్ధులైయున్నట్టులగపడదు. మహాభారత, లేక భారత, నామము యుద్ధమునకు పెల యుంచఁబడెను. దీనికొక గారణమిది చెప్పఁబడగలదు ఏమనగా కౌరవులు పాండవులు నిద్దఱును భారతవంశము వారై యుండిరి; కాబట్టి యిరువురిని లక్ష్యముచేసి భారత నామముంచఁబడియున్నది. ఇంతియె కాదు పాండవులకుఁ బ్రధానసహాయులు పాంచాలురు, మహాభారత సమకాలీనులై యుండిరి. కురు,పాంచాలురమహాత్త్వము బ్రాహ్మణభాగముల యందు మాటిమాటికి గనఁబడుచున్నది. కొందఱు లోకులు కురు, పాంచాలురకు యుద్ధము జరిగి చివరికి నిరువురిది యొక రాజ్యమయ్యెనని యనుమానించుచున్నారు. ఈయనుమానము కూడ నిజమైనది కావచ్చును. కాని యే వైదిక సాహిత్యగ్రంథమందును అర్యుల సందర్భమున గురు, భారతుల జంటకు నుల్లేఖము చూపట్టదు. మహాభారతములో నేదేనియొక ప్రాచీనము లేక నవీనముగుభాగమునందు కురు భారతుల యుల్లేఖము లేదు. అనఁగా మూల యీ గ్రంథములో కురుభారతులకు యుద్ధమగుటయొక్క భారత కల్పన నిరాధారామైయున్నది. ఇరువురి యొక్క యుద్ధమును వర్ణించునట్టి గ్రంథముయొక్క నామము, ఇరువురి నామములయొక్క దృష్టిచేతను, చరితార్థము కావలయును. భారతశబ్దమునందు యుద్ధము చేయునట్టి రెండు పక్షములకును సమావేశము కలుగుచున్నది; అనఁగా కురు, పాండవులు లేక కురుపాంచాలురు ఇద్దఱయొక్క సమావేశమగు చున్నది. కనుక భారతము, లేక మహాభారత, నామమే యీ గ్రంథము నకు నుచితముగా దోఁచుచున్నది.

పై కల్పనల జేయువారు కూడ దరువాతఁ గలుపఁబడిన పాండవుల యొక్క కథ యెందులకు నెట్లు కలుపఁబడియున్నదో యీ సంగతిని జెప్పఁజాలరు. పాండవులలోని యుధిష్ఠిరునియొక్క నామము పాణినియందు గనఁబడుచున్నది. దీనిబట్టి పాణిని సమయమున పాండు

భారతులుండిరని విశ్వసింపవలసియున్నది. పాణిని యొక్క సమయము క్రీ పూ. 800కుఁ బ్రాంతపుదియైయున్నది. ఈ సమయము మొదలు క్రీ పూ. 300 వఱకు నీ కథ క్రొత్తగా నుత్పన్నముకాలేదని ప్రకటమగుచున్నది. ఇట్టి దశయందు, పై కల్పన చేయువారుకూడ, ఆ సమయమునకుఁ బిమ్మట నీ కల్పన యెట్లు కలుపఁబడియుండునని యధికముగాఁ దెరుగుడపడినవారై యగపడుచున్నారు. ఎపుడు మనము ఈ కల్పన మాత్రము నిర్మూలము నిరాధారము నైయున్నదను విషయముమీఁద ధ్యానముంచుచున్నారమో, అపుడు దాని తిరుగుడులోఁ బడియుండుటకుఁ గూడ నావశ్యకత యేమియు నుండదు. ఈ ప్రకారముగా పాండవులు కాల్పనికులు కారనియు, వారియొక్క కథ తరువాత గలుపఁబడినది కాదనియు, భారతీయ యుద్ధముకూడ గాల్పనికము కాదనియు నిశ్చయమగుచున్నది. ఇపుడు భారతీయ యుద్ధ మెపుడయ్యెనను ప్రశ్నము పైని విచారము చేయవలసియున్నది.

## నాల్గవ ప్రకరణము

# మహాభారత మీమాంస

### భారతీయ యుద్ధకాలము

భారతీయ యుద్ధము హిందుస్థానముయొక్క ప్రాచీనేతిహాసమునకు నిశ్చితమైన యుగ్గమస్థానమైయున్నది. ఇచ్చవచ్చినట్లుగా యుద్ధము ఏవో రెండు పక్షములయందు నగుఁగాక, కాని ప్రాయికముగాఁ బాశ్చాత్య విద్వాంసులందఱు మాత్రము భారతీయయుద్ధ మవశ్యకముగా జరగియున్నదని నమ్ముచున్నారు. రామ, రావణుల యుద్ధము ఐతిహాసికము కాకపోవచ్చును కాని భారతీయ యుద్ధము కావుట నిర్వివాదమైయున్నది. ఈ యుద్ధము ఏ సమయమందు జరగినదో యీ విషయమున మాత్రము వేర్వేఱు మతములు ప్రచలితములై యున్నవి. ఈ ప్రయత్నము చాల గొప్పదైయున్నది; కాని దీనికి దృఢమైన నిర్ణయము నేఁటివఱకుఁ గాదయ్యెను. మనమిచ్చట, నేఁ యీ విషయమునఁ బ్రచలితములై యున్నవో యా వేర్వేరు మతములయొక్క దిగ్దర్శనమును గావింతము, మఱియు మనదృష్టిచేత వాటిలోనుండి యేమతము గ్రహింపఁదగియున్నదో యిది కూడ జెప్పెదము.

సమయక్రమము ననుసరించి యీ మతము లెవరివో, ఏవో ఎటువంటివో, ఈ విషయమైన సంగ్రహ వర్ణనమిది:— (1) పరలోక వాసియైన మోడక్కుయొక్క మతము ఇది. ఈ యుద్ధము క్రీ। పూ. 5000 ఏండ్ల రమారమిదయ్యి యున్నది అని అతఁడు చెప్పినది యేమనఁగా— "భారతీయ యుద్ధకాలీనమైన గ్రహముల స్థితి మహాభారతములో భిన్న విభిన్నములైన రెండు నక్షత్రములమీఁద నున్నదని చెప్పఁబడియున్నది. ఒకే సమయము తో నొక గ్రహము రెండు నక్షత్రములలో నున్నదని నిర్ణయము చేయఁబడదు. కనుక ఒకనక్షత్రము సాయనముగాను రెండవదానిని నిరయనముగాను విశ్వసింపవలయును. దీనిఁబట్టి యా సమయమున వసంత సంపాతము పునర్వసు నక్షత్రమందు నుండెనని తెలియుచున్నది. ఈ

లెక్కలనుబట్టి గణితముచేసి చూచినమీఁద భారతయుద్ధముయొక్క సమయము క్రీ. పూ. సమీపముగా 5000 సంవత్సరాలు వచ్చుచున్నది. (2) మహాభారతముఁబట్టి భారతీయయుద్ధము కలియుగముయొక్క ప్రారంభమున నయ్యెనని విశదముగా దెలియుచున్నది. ఎపుడు భీముఁడు దుర్యోధనుని దన్నియుండెనో అపుడు దానికి గారణమును జెప్పుచున్న (శల్యపర్వమందు) శ్రీకృష్ణుడు చెప్పినదేమనగా "ప్రాప్తం కలియుగం విద్ధి" అనగా "కలియుగమారంభమయ్యెనని తెలిసికొనుము." దీనిఁబట్టి, యుద్ధము సమాప్తమైనమీద శీఘ్రముగనే అనఁగా చైత్రమాసమందు గలియుగారంభమయ్యెనని చెప్పఁబడుట సిద్ధమగుచున్నది. అనగా కలియుగముయొక్క యారంభకాలమున యుద్ధము జరగియుండెనని నిశ్చితమగుచున్నది. ఆర్యజ్యోతిష్కులందఱి యొక్క మతానుసారముగా గలియుగము క్రీ. పూ. 3101 సంవత్సరమున ప్రారంభించెను. కాబట్టి భారతీయ యుద్ధసమయము క్రీ. పూ 3101 సంవత్సరమని నిశ్చితమగుచున్నది. ఈ మతమే మనకు గ్రాహ్యమని తోచుచున్నది. (3) ఆర్యసమాజములోని యొకానొక విద్వాంసుఁడు, ప్రాచీన జ్యోతిష్కుఁడు వరాహమిహిరుఁడు, మరియు కాశ్మీరమునందలి యొక పండితుఁడు, విశేషించి రాజతరంగిణీ నామకమగు నితిహాసమునకు గర్త కల్హణుఁడు, కలియుగమారంభమైన తరువాత 653 పండ్లపిమ్మట, అనగా క్రీ. పూ. 2448వ యేడున, లేక శకసంవత్సరమునకు బూర్వము 2526వ వర్షమున భారతీయ యుద్ధమయ్యెనని విశ్వసించుచున్నారు. పురాణములయందు పాండవ సమకాలీనుఁడై బృహద్రథవంశీయుడగు మగధరాజు మొదలుకొని నందుని పర్యంతము కాలమీయఁబడియున్నది. పై విద్వాంసులు దాని యాధారముమీఁద నీ సమయము నిశ్చితమగుచున్నదని చెప్పుచున్నారు. (5) మద్రపురీ విద్వాంసుడు పిలండీ అయ్యారు, ఇతర ప్రమాణములఁబట్టి, క్రీ. పూ. 1194వ యేఁడాది యొక్క 14 అక్టోబరును యుద్ధమునకు మిక్కిలినిశ్చయాత్మకమైన సమయముగా నమ్ముచున్నాఁడు. ఈ ప్రకారము భారతీయయుద్ధమునకు వేర్వేఱు సమయములు విశ్వసింపబడుచున్నవి మనమిచ్చట వాటివిషయమై విస్తరించి వివేచింపవలసియున్నది. ముందుగా మనము సమస్త జ్యోతిష్కులమతము బట్టియు సాధారణముగా సమస్తాస్తిక హిందువుల మతము బట్టియు సాధారణముగా నెంచఁబడుచున్న భారతీయయుద్ధసమయముగుఱించియు దానిపైఁ జేయఁబడు నాక్షేపముల గుఱించియు విచారమును జేయుదము.

## భారతీయయుద్ధమును కలియుగారంభమును

కలియుగము భారతీయ యుద్ధమునుండి మొదలిడుచున్నదను నీకారణము మహాభారతమందే యీయఁబడియున్నదని మనము చెప్పియుంటిమి. "ప్రాప్తం కలియుగం విద్ధి" ఈ వచనముగాక, మహాభారతమందు, ఇంకను రెండుమూడు వచనములున్నవి. వనపర్వములో భీముడు మారుతి సంవాదమందు జెప్పఁబడినది యేమనగా—

ఏ తత్కలియుగం నామ అచిరోద్యత్ ప్రవర్తతే।

"శీఘ్రముగానే యేది ప్రారంభమగుచున్నదో యది కలియుగము" ఆదిపర్వముయొక్క యారంభమునందే, భారతీయ యుద్ధము గలియుగ, ద్వాపరములయొక్క సంధియందు నయ్యెనని చెప్పఁబడియున్నది.

అన్తరేచైవ సంప్రాప్తే కలిద్వాపరయో రభూత్।
స్యమన్త పంచకే యుద్ధం కురుపాండవసేనయోః॥

తాత్పర్యమేమనఁగా కలియుగారంభమందు భారతీయ యుద్ధమయ్యెనను కల్పన మహాభారత కారుఁడగు సౌతియొక్క సమయమున, అనఁగా క్రీ॥ శ॥ కు దగ్గఱగా 300 సంవత్సరములకు మునుపు, పరిపూర్ణముగా ప్రసిద్ధమైయుండెను; అనఁగా నీకల్పనదగ్గఱగా 2200 ఏండ్లనుండి యిప్పటివఱకు నిచ్చట ప్రసిద్ధమైయున్నది. ఈ విచారము యొక్క యుత్పత్తి యీ కారణములచేత నయియుండునని తోఁచుచున్నది, ఏది యనఁగా భారతీయ యుద్ధమందు నీతి ధర్మరహితములైన యనేక భయంకర కార్యములు జరగినవి, పాండవుల సమయమునుండి హిందుస్థానము యొక్క ధార్మికము మరియు సాంపత్తికమునగు స్థితి దినదినము క్షీణింపమొదలిడెను. ఇంకను శ్రీకృష్ణపరమాత్మ భూలోకమును విడిచి వెడలిపోయినప్పటినుండి హిందుస్థానమునకు దుర్దశయు అవనతియుఁ గానారంభమయ్యెను. సారాంశము, అతి ప్రాచీనకాలమునుండి, లోకాభిప్రాయానుసారాము, భారతీయ యుద్ధసమయమునకు, కలియుగారంభమునకు మరియు శ్రీకృష్ణ సమయమునకు దృఢసంబంధము మరియు శ్రీకృష్ణ సమయమును జెప్పుటయే భారతీయ యుద్ధసమయమును జెప్పుటయగును. తరువాత జేయఁగల వివేచనఁబట్టి యీ మూఁడు విషయములయొక్క సమయము వేర్వేఱు రీతిని ఒకేయవధికి నెట్లువచ్చుచున్నవో యియ్యది తెలియఁగలదు.

## శ్రీకృష్ణునియొక్క సమయము

శ్రీకృష్ణుని సమయమును నిశ్చయించుటకై మనకు నొక గొప్ప బాహ్య ప్రమాణసాధనము దొరకుచున్నది. హిందుస్థానమునకు వచ్చిన మేగస్థినీజు శ్రీకృష్ణునివిషయమై మిగుల మహత్త్వముగల సంగతులను వ్రాసియున్నాఁడు. ఈ రాజదూత హిందుస్థానమునఁ జంద్రగుప్తుని యాస్థానమునందు సెల్యూకస్ నామకుఁడగు గ్రీకురాజుయొక్క పక్షమున నుండెను. అతఁడిట్లు వ్రాసియున్నాడు ఎట్లనగా— "సంద్రకోటస్సునకు మరియు డాయోనిసోసునకు మధ్యను 153 తరములు మరియు 6042 సంవత్సరములు గలవు. హిరాక్లీజు, డాయోనిసోసునుండి 15 తరముల తరువాతివాఁడు." నతనికి హిందుస్థానమందుఁ జంద్రగుప్తుని సమయమున నేసంగతులు తెలిసియున్నవో వాటియాధారముమీద నతఁడీ సంగతి వ్రాసియున్నాడు. గ్రీక్కులు భవిష్యదితిహాసకారులకు నీ మహోపకారము జేసియున్నారు. ఏదియనగా వారు ఏయే స్థానమునకునేగిరో అక్కడక్కడ నా సమయమందు ప్రచలితములైన యైతిహాసికవిషయములను సమీకరించి వారు వ్రాసియున్నారు. వారు ఈ విధముగనే యీజిప్టుదేశమందుకూడ నైతిహాసిక సామగ్రి నన్వేషించి రాజుల వంశపరంపరయొక్కయు స్థితి వ్రాసియున్నారు. మొదటఁ గొన్నిదినములవఱకు నీసంగతులు స్థూలముగను మరియు నీ విశ్వసనీయముగను నూహింపఁబడుచుండెడివి; కాని మెసపుటోమియాయందు నీదినములలోనే యిష్టికాలేఖములు, అనగా గాల్చబడిన యిటికలమీద వ్రాయబడిన వ్రాతలు దొరకుచున్నవో వాటినిబట్టి ప్రపంచమునకు నీ సంగతులు నిజమని తోచనారంభించినవి. మనము చెప్పినదానికిఁ దాత్పర్యము మేగస్థినీజు చేత ఎచ్చరికతో వ్రాయబడ్డ సంగతులు నమ్మ దగియున్నవనియే. ప్రాచీన కాలమున నితరదేశముల తోడిపాటుగా, హిందుస్థానమందును రాజులయొక్క వంశావళియు ప్రతిరాజును రాజ్యము చేసిన సమయము రెండును సావధానముగా వ్రాసి సురక్షితముగా నుంచబడుచుండెడివనుటలో నేమియును సందేహములేదు. ప్రాచీనకాలమునందు నేదియు విశేషసంవత్సరము (ఏవిధముగా శాలివాహనశకము క్రీస్తు శకము లోనగు వాటివంటిది) ప్రసిద్ధమైలేకుండెను, కనుక రాజులయొక్క వంశావళియు వారియొక్క శాసనకాలమే కాలము గొలుచుటకై సాధనముగా నుండెను. కాబట్టియే వంశావళులు సురక్షితము చేయబడియుండెడివి.

సారాంశమేమనగా మేగస్థినీజు చెప్పిన తరములయొక్క సంఖ్యలు ఇతి హాసదృష్టిబట్టి గౌరవింపదగినదియు నమ్మదగినదియునైన సాధనములై యున్నవి. మేగస్థినీజు ఏ సంద్రాకోటస్సును పేర్కొనియున్నాడో అతడు ఐతిహాసికుడైన చంద్రగుప్తుడే యైయున్నాడు. ఈతరములు ఏడాయా నిసోసునుండి లెక్కింపబడియున్నవో, అతడెవరో మనము నిశ్చయముగా జెప్పజాలము. కాని మనము ముందే హీరాక్లీజుకు అర్థము హారిలేక శ్రీకృష్ణుడే యగునని చెప్పియుంటిమి. మేగస్థినీజు శౌరాసేనీ ప్రజలు హీరాక్లీజులను భజించుచుండిరనియు నతనియొక్క ముఖ్యనగరము మథురయై యుండెననియు వ్రాసియున్నాడు. ఈవర్ణనముబట్టి నిశ్చయముగాఁ హీరాక్లీజు శ్రీకృష్ణునికే పేరై యుండెనని సిద్ధించుచున్నది. డాయొనిసాసు మొదలు హీరాక్లీజువఱకు 15 తరములు గలవు. దానిఁ దీసివేయఁగా, మేగాస్థినీజుచే నీయఁబడిన వర్ణనముబట్టి, హీరాక్లీజు మొదలు చంద్రగుప్తుని వఱకు 153—15=138 తరములు గలవని మనకు దెలియుచున్నది. మేగస్థినీజుచే ఇన్ని తరములలో నెన్నియేండ్లు గడచినవో యీ సంగతి చెప్పియుండుటలేదు. అయినప్పటికి ప్రపంచముయొక్క యితిహాసమును జూచుట బట్టి బండలెక్కచేత రాజులయొక్క యొకతరములో నెన్నియేఁడులు పట్టుచున్నవో యిది చెప్పఁబడగలదు. ప్రతిరాజుయొక్క తరమునకు సగటున 20 వర్షములు పట్టుచున్నవని యైతిహాసిక సిద్ధాంతముకలదు. ఈ సిద్ధాంతానుసారము శ్రీకృష్ణునుండి చంద్రగుప్తునివఱకు మోటు లెక్కచేత 138 × 20 = 2760 ఏడులైనవి. చంద్రగుప్తుని సమయము క్రీ॥ పూ. 312 సంవత్సరమైయుండెనని నిశ్చితమైపోయియున్నది. ఈలెక్క బట్టి శ్రీకృష్ణుని సమయము క్రీ॥ పూ. 3032 సంవత్సరము నిశ్చితమగుచున్నది. ఈ సమయము ఐతిహాసికమగుటలో మనకు, ఈ సమయము కలియుగారంభకాలమునకు దగ్గఱిదియని దృఢప్రమాణము దొరకుచున్నది.

ఛాందోగ్యోపనిషత్తులో శ్రీకృష్ణుని యొక్క యుల్లేఖము "కృష్ణాయ దేవకీపుత్త్రాయ" చేయఁబడియున్నది. భగవద్గీతలో "వేదానాం సామవేదోస్మి" ఈ వాక్యముచేత శ్రీకృష్ణుఁడు సామవేదముతోడ దనకు దాదాత్మ్యమును ప్రకటించి యున్నాడు. దీనిబట్టి సామవేదములోని ఛాందోగ్యోపనిషత్తునందు శ్రీకృష్ణుని యుల్లేఖము స్వాభావికమని కనుపట్టుచున్నది. శ్రీకృష్ణ సమయము ఛాందోగ్యోపనిషత్తు ఎప్పుడు చేయఁ

బడినదియు నిశ్చయముగా జెప్పఁబడఁజాలదు, అయినప్పటికి భాషయొక్క ప్రమాణముఁబట్టి యది దశోపనిషత్తులలోను అతి ప్రాచీనోపనిషత్తని తెలియుచున్నది. సాధారణముగా నీ యుపనిషత్తుల సమయమును వేదాంగములకంటె ముందటిదిగా నెంచవలయునని స్పష్టమైయున్నది. వేదాంగములలో వేదాంగ జ్యోతిషముయొక్క సమయము నిశ్చయముగా జెప్పఁబడగలదు. శంకర బాలకృష్ణదీక్షితుఁడు తన భారతీయ జ్యోతిషశాస్త్రముయొక్క యితిహాసమునందు, వేదాంగ జ్యోతిషముయొక్క సమయము, క్రీస్తుకంటె పూర్వము దాదాపు 1410 సంవత్సరములని నిశ్చయించి యున్నాడు. అనగా, ఛాందోగ్యోపనిషత్సమయమును దీనికన్న పూర్వమనియు శ్రీకృష్ణ సమయము దానికన్నను పూర్వమనియు విశ్వసింపవలయును. ఈ ప్రమాణముఁబట్టి పైనిఁ జెప్పఁబడిన శ్రీకృష్ణ సమయము సరిగానున్నదని యనుమానము జనించుచున్నది. భారతీయయుద్ధముకూడ నిదే సమయమున నయ్యెనని చెప్పబడగలదు.

## కలియుగారంభము

ఇపుడు మనము కలియుగముయొక్క ప్రారంభకాలమును విచారింతము. భారతీయ యుద్ధమునకుఁ గలియుగారంభమునకు సమయ మొకటియే యని మనమిదివఱకుఁ జూచియుంటిమి. కలియుగ ప్రారంభమెప్పుడయ్యెనో యిదికూడ మనము చూచియుంటిమి. హిందుస్థానమందలి సమస్త జ్యోతిష్కులయొక్క మతానుసారము కలియుగముయొక్క ప్రారంభము క్రీ పూ. 3101 వత్సరమందు నయ్యెను. ఇప్పటి ప్రతి పంచాంగమందును ఈ సమయమే యీయఁబడియున్నది. శకము 1838 యొక్క పంచాంగమందు గలియుగములో 5017 వర్షములు గడచెనని వ్రాయఁబడియున్నది. దీనిఁబట్టి పంచాంగములయందీ సమయము ఆర్యభట్టు, బ్రహ్మగుప్తుఁడు, వరాహమిహిరుఁడు మొదలుగా జ్యోతిష్కులయొక్క సమయమునుండి వ్రాయఁబడుచున్నది యని స్పష్టముగా దెలియుచున్నది. వీరికంటె పూర్వము ఇదేసమయమున వ్రాయఁబడియుండెనో లేక లేదో యనువిషయమున సందేహముకలదు. ప్రతియేడు లోకులకు గలియుగములో నిన్నియేండ్లు గడచినవని తెలియుచుండెనేని, అపుడీ జ్యోతిష్కులకంటె మునుపటి యే గ్రంథమునందైనను ఈ సమయముయొక్క యుల్లేఖము తప్పక కావలసియుండును. అభాగ్యవశమున నేటివఱకు నిట్టి

యుల్లేఖమేదియు లభింపకున్నది. అప్పుడు ఆర్యభట్టాది జ్యోతిష్కులు దేనియాధారముమీద నీ సమయమును జెప్పియున్నారని ప్రశ్నముకలుగుచున్నది. ఈ విషయమై రెండు పక్షములు కాగలవు. ఈ సమయము లోకులయొక్క పుక్కిటిపురాణమునుండి తెలిసియుండెనని యొక మతము; అనగా వారికి యుధిష్ఠిరశకము తెలిసియుండెనని చెప్పఁబడగలదు. క్రీస్తు వర్షమునకు పూర్వము, లేక శకసంవత్సరమునకు పూర్వము యుధిష్ఠిర సంవత్సరమేదియు ప్రసిద్ధమై లేదని మనమతమైయున్నది. కాని యీ సమయమున హిందుస్థానమందు వంశావళియుండెడిదని మనము ముందు చెప్పియుంటిమి; అనగా ఈ వంశములో నీయీ రాజులు ఈ సంవత్సరములందాక రాజ్యము చేయుచుండిరనుసంగతి వ్రాసియుంచఁబడియుండెడిది. ఇట్టి దశయందు యుధిష్ఠిరుని తరువాతి వంశావళి, రాజులయొక్క శాసనకాల సహితముగా, అవశ్యము ప్రచలితమైయుండునని చెప్పగలము. ఈ విధమైన వంశావళి నాధారము చేసికొని క్రీస్తు సంవత్సర ప్రారంభమున, ఎపుడు సిద్ధాంతస్వరూపమైన యుగపద్ధతి స్థిరమయ్యెనో అపుడు, ఆర్య జ్యోతిషకారులు యుధిష్ఠిరుని కిన్నిసంవత్సరము లయిపోయినవని నిశ్చయించిరి. ఎందుచేత? ఆ సమయమునకు మునుపు 300 ఏండ్లనుండి మహాభారతము స్పష్టముగా, కలియుగారంభము, భారతీయయుద్ధము మరియు యుధిష్ఠిర రాజ్యారోహణము ఒకే సమయమందు నయ్యెననియే సమస్తాస్తిక హిందువులకు సూచించియుండెనని చెప్పియుండెను. ఈ ప్రకారము మొదట నూతన సిద్ధాంతకారుఁడైన యార్యభట్టుఁడు, కలియుగారంభ సమయము క్రీ.పూ. 3101 సంవత్సరము (శకసంవత్సరముకంటె పూర్వము 3178 వత్సరము)గా జెప్పెను.

కలియుగారంభ మీరీతిగాఁ బుక్కిటి పురాణము లేక రాజులయొక్క వంశావళి యాధారముమీద జెప్పఁబడలేదని కొందఱు లోకుల మతము— దాని నార్యభట్టుడు గణితముచేత స్థిరపఱచెను. కాని యీమతము యథార్థము కాజాలదు. శంకరబాలకృష్ణదీక్షితుని మతముకూడ, నిదేయైయున్నది; కాని యతడు చేసిన వివేచన యతనియొక్క యన్యమతములకు విరుద్ధముగానున్నది. గణితముఁబట్టి కలియుగారంభమును దెలిసికొనుటకై యేమి సాధనముండెను? మహాభారతయుద్ధకాలమందు నీ గ్రహములు ఈ నక్షత్రములమీద నుండెను. ఈ ప్రకారమైన విధానమును బుచ్చుకొని

దాని యాధారముమీద గణితముద్వారా యీ సమయము నిశ్చయింపఁ బడియున్నదని తోచదు; ఎందుచేతనన, మహాభారతమందు జెప్పఁబడినస్థితి, కలియుగారంభమందున్న గ్రహములతో బొత్తిగా గలియదు. ఈ గ్రహస్థితి విషయమై మనము ముందునకుఁబోయి విచారింతము. మహాభారతమందు జెప్పఁబడిన గ్రహస్థితిననుసరించి గణితముచేసి యీ సమయము స్థిరపఱుపఁబడియున్నయెడల, అపుడు అది నిశ్చయముగా సరియైనదే బయలుదేఱఁగలదని, మనము దీనిఁగూడ నిజముగా నొప్పుకొనఁగలము; కాని దురైవమువలన బొత్తిగాఁ గాలేదు. కలియుగారంభమందు గ్రహములయొక్క స్థితి యీ ప్రకారముగా నుండెనని మొదట నెచ్చటను నుడువఁబడలేదు. ఇంక గణితమునకై యాధారమెక్కడినుండి వచ్చినది? దీక్షితుఁడును మఱి కొందఱును కలియుగారంభమున సమస్త గ్రహములు మధ్యమమానముఁబట్టి యశ్విని యందుండెనని చెప్పుచున్నారు. ఈ యభిప్రాయము నాధారముచేసికొని యార్యభట్టుఁడు గణితముద్వారా మధ్యమమానముచేత గ్రహములు ఒకేస్థానమున నెప్పుడుండెనో యిదిస్థిరపఱిచెను, మరియు దానినతఁడు కలియుగారంభముగా విశ్వసించెను. కాని కలియుగారంభమందు ఇట్టి గ్రహస్థితియుండెడిదని యెవరుచెప్పిరి? మధ్యమ గ్రహములాకాశమందు నగపడవు, స్పష్టగ్రహము లగుపడుచున్నవి. అనఁగా, కన్నులారఁజూచి యొకరిట్టి విధానమును వ్రాసియుంచిరనుట పొసఁగనేరదు. అపుడు గణితముయొక్క యీ సాధనమును జ్యోతిష్కుఁడు తన కల్పనాధారమున స్థిరపఱచియున్నాఁడనియే తెలియుచున్నది. ఆర్యభట్టుఁడు ఉదాహరణమిచ్చునపుడు దానియుత్తరమును ఆధారమునుగూడఁ గాల్పనికముగానుంచునంతటి పిచ్చివాఁడు కాఁడు. దీక్షితుఁడు స్వయముగా జెప్పునదియేమనఁగా— "మహాభారతము, మనుస్మృతివంటి వెనుకటి వివేచనయందు వచ్చిన యేగ్రంథమందును, జ్యోతిషగ్రంథములలో జెప్పఁబడిన యుగారంభమునకు, కలియుగముయొక్క మరియుఁ బ్రతియుగము యొక్క ప్రారంభమున గ్రహములన్నియు నశ్విన్యారంభమందుసమకూడునని యు లక్షణమీయఁబడియుండలేదు. పైపెచ్చు మహాభారతమందొక చోట, సూర్యుఁడు, చంద్రుఁడు, బృహస్పతి మరియు పుష్యము ఒక రాశికి వచ్చినమీఁద కృతయుగమగుచున్నదని చెప్పఁబడియున్నది." అతఁడిదికూడ జెప్పుచున్నాఁడు— "పై నీయఁబడిన యుగలక్షణము పురాణములందుఁ

గూడ నెచ్చటను జెప్పఁబడియుండలేదు." అట్టిచో బైయా క్షేపము చేయు నతని తుదిమాట యేమనగా ఈ కల్పన స్వయముగా నార్యభట్టునిదనియు, అతఁడు దానియాధారముమీద గణితము చేసియున్నాడనియే కాని, ప్రత్య క్షముగాఁ జూచినమీద నీ విషయముకూడ సిద్ధించుచున్నట్లు తోచదు. సూర్యసిద్ధాంతానుసారముగా గలియుగారంభము ఫాల్గున కృష్ణపక్షామా వాస్య బృహస్పతివారమున మధ్యరాత్రి సమయమందు నగుచున్నది. దీని యాధారముమీద క్రీ। పూ. 3101 వత్సరమున 17 ఫిబ్రవరి బృహస్పతి వారము యొక్క మధ్యరాత్రి సమయమున గలియుగారంభమయ్యెనని నిశ్చితమగుచున్నది. అప్పటి గ్రహస్థితి ప్రొఫెసరు హ్విట్నీ నిశ్చయించి యున్నాడు మరియు దీక్షితుఁడు సయితము మధ్యమ, స్పష్టగ్రహస్థితిని నిశ్చయము చేసియున్నాఁడు. దీనియొక్క యుల్లేఖమును దనపుస్తకము యొక్క 142వ పృష్ఠమునందు జేసియున్నాడు. దానిబట్టి కలియుగారంభ మున మధ్యమములు స్పష్టములునగు గ్రహములన్నియు నొకచోట లేవని తెలియుచున్నది. దీనిని దీక్షితుఁడుగూడ స్వీకరించియున్నాడు. అతఁడు చెప్పునదియేమనఁగా — "నాగ్రంథమునసరించి కలియుగారంభమందు నన్ని గ్రహములు నొకచోటనుండెను, కాని యథార్థస్థితియటువంటిదికాదు. ఒకప్పుడు గ్రహములన్నియు నస్తమించును, కాని మహాభారతాది గ్రంథ ములలో నిట్లును వర్ణనములేకున్నది. కలియుగానంతరము, సూర్య సిద్ధాం తాది గ్రంథములు చేయఁబడునప్పటికి, ఎంతతక్కువగా జూచినను 360 సంవత్సరములు గడచినవి; కాని యా సమయమునందు, కలియుగమీ సమయమున నారంభమయ్యెనను విషయము నిశ్చయమయ్యెనని చెప్పఁ బడజాలదు. దీనిఁబట్టి, యొకప్పుడు కలియుగారంభకాలము వెనుకటినుండి గణితముద్వారా నిర్ణయింపఁబడియుండునని సందేహించుటకు నవకాశ మున్నది." కాని, దీక్షితునికి, ఆ సమయమున రాజులయొక్క వంశావళి ప్రచలితమైయుండెననుసంగతి తెలియునేని లేక జ్ఞప్తియుండునేని, అపు డతనికి నిట్టిసందేహము కలుగకయుండును. ఈ సంగతి మేగస్థనీజుచేత నీయఁబడిన తరములయు సంవత్సరములయు సంఖ్యఁబట్టి సిద్ధమగుచున్నది. మేగస్థనీజు యొక్క ప్రమాణమత్యంత ప్రాచీనము అనగా క్రీస్తునకు దాదాపు 312 సంవత్సరములు పూర్వపుదియైయున్నది. అనగా అది యెపుడార్య జ్యోతిష్కులకు గ్రహగణితముచేయు జ్ఞానము లేకుండెనో అప్పటిదియై యున్నది. దీనిఁబట్టి, యిట్టి వంశావళులు పూర్వకాలమున

నుండెడివని నిశ్చయముగా సిద్ధమగుచున్నది. పూర్వకాలమున నితిహాసములు కూడ నుండెడివనియు హిందుస్థానమున నైతిహాసిక విషయములును వంశావళులును వ్రాసియుంచబడు చుండెడివనియు నీ సంగతి నిర్వివాదమై యున్నది. చీనాయాత్రికుఁడు హుయేనుసాంగు స్పష్టముగా వ్రాసియున్నాఁడు ఏమనఁగా— "ప్రతిరాజ్యమందు నితివృత్త పుస్తకాలు సావధానతతో వ్రాసియుంచఁబడుచున్నవి." కాశ్మీరమందు నీవిధమైన ప్రస్తుతస్థితియు వంశావళియు వ్రాయఁబడియున్నది; దానియాధారమున కల్హణకవి రాజతరంగిణీనామకమైన కాశ్మీరముయొక్క యితిహాసమును వ్రాసెను. నేటివఱకు భాటలోకులు రాజపుత్రుల వంశావళులను సావధానతతో వ్రాయుచున్నారు. సారాంశము, మేగస్థినీజు వ్రాసిన వంశావళియందు నీఁబడిన వర్ణనముబట్టి పూర్వకాలమందు, వంశావళి యున్నట్లు కనుపట్టుచున్నదనుట నిర్వివాదము. మనమత మేమనఁగా నిట్టివంశావళుల యాధారమున యుధిష్ఠిరుని యనంతరము గడచిపోయిన సంవత్సరములు లోకులకు దెలిసియుండుననియు వాటి యాధారమున గలియుగారంభకాలము నిశ్చయింపఁబడి యుండుననియు నైయున్నది. కలియుగారంభకాలమును నిశ్చయించుటకు నేసాధన మీయఁబడియున్నదో యయ్యది కాల్పనికమనియుఁ గలియుగారంభకాలమున నటువంటి ప్రత్యక్షస్థితియు లేకుండెననియు పైనిఁ జెప్పఁబడియేయున్నది. అట్టిచో నింకఁ గలియుగారంభకాలము తరువాతి నుండి గణితముచేత స్థిరపఱుపఁబడియున్నదని చెప్పఁబడజాలదు.

## వరాహమిహిరునియొక్క భ్రమపూర్ణమైన మతము

కలియుగకాలము విషయమై యెప్పుడు శంక యుపస్థితము కాఁగలదు; కాని మేగాస్థినీజు చెప్పిన సంగతులవిషయమై యేవిధమైన శంకయు చేయఁబడఁజాలదు. ఈ రెండిటి యొక్క సాహాయ్యమున భారతీయ యుద్ధసమయమును నిశ్చయించుటలో గష్టముకలుగదు. ఇపుడు మనమిచ్చట వరాహమిహిరునియొక్క, భారతీయ యుద్ధసమయము కలియుగారంభమున గాలేదను కథనముగూర్చి విచారింపవలయును. వరాహమిహిరుడు ఈ మతమును గర్గునియొక్క మతము నాధారముచేసికొని యిచ్చియున్నాఁడు. గర్గునియొక్క మతము నతఁడిట్లు వ్రాసియున్నాఁడు :—

షడ్ద్వికపంచ ద్వియుతః శకకాలస్తస్య రాజ్ఞశ్చ।

అనఁగా, యుధిష్ఠిర సమయమును జెప్పుటకై శకసంవత్సరమందు షడ్ద్వికపంచద్వి అనగా "అంకానాం వామతో గతిః" యొక్క లెక్కను బట్టి 2526ను గలిపినమీద యుధిష్ఠిరునియొక్క సమయము సిద్ధించుచున్నది. మనము భారతీయ యుద్ధసమయమును క్రీస్తునకు 3101 సంవత్సరమునకు 3179 వత్సరములు మున్పటిదిగా నిశ్చయించియున్నాము. ఈ సమయమునకును వరాహమిహిరుని సమయమునకును 653 వత్సరము లంతరమున్నది. రాజతరంగిణీకారుఁడు కల్హణుఁడు తన కావ్యరూపమైన యితిహాసమందు నీ సమయమునే తీసికొని స్పష్టముగా జెప్పియున్నాఁడు ఏమనఁగా—

శతేషు షట్సు సార్ధేషు త్ర్యధికేషు చ భూతలే।
కలేర్గతేషు వర్షాణా మభూవన్ కురుపాండవాః॥

అచ్చట నతఁడిదియు జెప్పియున్నాడు ఏమనఁగా— "పాండవులు కలియుగారంభమున నుండిరనుసంగతిచేత విమోహితులై కాశ్మీరములోని కొందఱితిహాసకారులు కాశ్మీరమునందలి పూర్వరాజులయొక్క యసత్యమైన పేరులపట్టికను అనగా పేరస్తు నిచ్చుచున్నారు; కాని కలియుగముయొక్క, పైనిఁ జెప్పఁబడిన 653వ యేడున పాండవులుండిరి: ఈ కాలము ననుసరించి నేను రాజులయొక్క పేరస్తును బాగుచేసియున్నాను." దీనిఁబట్టి కల్హణుని సమయమందు పాండవులు కలియుగారంభమున నుండిరను మతము ప్రసిద్ధమైయుండెనని స్పష్టముగా దెలియుచున్నది. దీనిని విడిచి, వరాహమిహిరునియొక్క యాధారమును గైకొని, కల్హణుఁడు కలియుగారంభమునుండి 653వ యేడున భారతీయ యుద్ధమయ్యెనని చెప్పియున్నాడు. కాని యిందుచేత మహాభారత వచనములతో స్పష్టముగా విరోధము కలుగుచున్నది. "ప్రాప్తం కలియుగం విద్ధి" ఈ శ్లోకమునకును, కలియుగానంతరము 653 ఏండ్ల తరువాత భారతీయ యుద్ధమయ్యెనని చెప్పుటకును మైత్రి కుదురఁజాలదు. "కలిద్వాపరయోరంతరే" ఈ వచనము బట్టియు, భారతీయయుద్ధము కలియుగారంభము కాకమునుపు జరగెనని స్పష్టముగానగపడుచున్నది. ఇట్టిదశయందు, కలియుగములో 653 ఏండ్లకు బిమ్మట యుద్ధమయ్యెననుట యసత్యమగును. కొందఱు లోకుల యొక్క

(విశేషించి యార్యసమాజము వారియొక్క) మతానుసారము, ఈ 65కి వర్షములను కలియుగ సంధికాలముగా నూహించి నిజమైన కలియుగము నేటివఱకు గాలేదనియు మహాభారత వచనముతో మైత్రి సరిగా జేయవలయు ననియు నొప్పుకొనవలసియున్నది. కాని యీ పద్ధతిఁబట్టియును మైత్రి సరిగా గాజాలదు; ఎందుచేత ఈరీతిని గలియుగసంధికాలము నొప్పుకొనిన, అపుడు ద్వాపరమునకు నంతరము రాజాలదు. ద్వాపరమునకు గలియుగ మునకును అంతరమున అనగా సరియైన సంధియందు యుద్ధమయినట్లు వర్ణనమున్నది. మహాభారత వర్ణనానుకూలముగా, చైత్రశుక్ల ప్రతిపత్తునకు గలియుగము తగిలెననియు దానికి మునుపు మార్గశీర్ష మాసమునందు భారతీయయుద్ధమయ్యెననియు నీస్థితి నిజముగా దోచుచున్నది.

ఒక గొప్ప యాశ్చర్య విషయమేమనగా— అందఱు జ్యోతిష్కుల మతమునకు విరుద్ధముగా, ప్రత్యక్షమైన మహాభారతముయొక్కయు వచన మునకు విరుద్ధముగా, వరాహమిహిరుఁడు భారతీయ యుద్ధమునకు ఈ సమయము నెట్లు చెప్పెను! మంచిది, అతఁడు గర్గవచనాధారమున నీ మతము నిచ్చియున్నయెడల, అపుడు గర్గుఁడే యీ సమయము నెట్లు చెప్పెనని ప్రశ్న కలుగుచున్నది. గర్గునియొక్క సమయము మనకుఁ దెలియదు. కొందఱులోకులు గర్గునియొక్క సమయము మహాభారతము నకుఁ బిమ్మటను శకసంవత్సరమునకు ముందును అయియుండునని నమ్ము చున్నారు. కాని గర్గుఁడు మహాభారతమునకు బూర్వమైయుండునవి తెలియుచున్నది. మహాభారతములో గర్గుని పేరు వచ్చియున్నది. ఇచ్చ వచ్చినట్లుగా మనము ఏదో సమయము నెప్పుకొందము, కాని గర్గుఁడు శకసంవత్సరమునకు మునుపటివాడని నిశ్చయముగా నగపడుచున్నది. ఇట్టి స్థితియందు గర్గునిద్వారా, శకసంవత్సరమందు నీ సంవత్సరములను గలు పుట వలన యుధిష్ఠిర సమయము నిర్ణయమగుచున్నదను నియమము నిర్మింపబడుట సంభవమే కాకయున్నది. గర్గునియొక్క మూలవచనమేది యైయుండెనో యిది చెప్పుటకై సాధనములేదు. గర్గసంహితానామకమైన యే యొక గ్రంథము ప్రసిద్ధమైయున్నదో, దానియందు ఈ విషయమై యేమియు వర్ణనములేదు. 2026 ఈసంఖ్యామ గర్గుఁడే యిచ్చియున్నాడు, ఇది విశ్వసించి దానిని స్పష్టీకరించుటకై శ్రీ-అయ్యరు ఒక యద్భుతో పాయమును జెప్పియున్నాడు. అది యేమనగా శక కాలము నకర్థము శాక్యముని యొక్క కాలముగా నూహింపవలయునని. బుద్ధునియొక్క

మృత్యుకాలము మొదలుకొని యెక్కడెక్కడ బుద్ధకాలగణన యారంభమై యుండెనని యొప్పుకొనఁబడునేని, అపుడీ సమయము మనమతమున కనుకూలించుచున్నది. (అయ్యరు తాను జెప్పినకాలము నెట్లు సాధించుచున్నాఁడో, యిది తరువాతఁ జెప్పఁబడును) బౌద్ధులయందు ప్రస్తుతకాలమున నే నిర్వాణశకము ప్రచలితమైయున్నదో, దానిని క్రీస్తునకు 543 ఏండ్ల పూర్వపుదిగా నంగీకరించుటఁబట్టియు దానిని 2526తో గలుపుటఁబట్టియు, 2526 + 543 అనఁగా క్రీస్తు సంవత్సరమునకు 3069 వత్సరములు పూర్వ సమయము, శ్రీకృష్ణునికిని గలియుగారంభ సమయమునకును దగ్గఱగా వచ్చుచున్నది. అయినను మనమతమేమనఁగా శకకాల శబ్దమున కర్థము 'శాక్యముని లేక బుద్ధునిసమయము' ఎప్పుడు నూహింపఁబడఁజాలదు. బుద్ధునికి శకనామ మెందును వ్రాయఁబడియుండలేదు. శక, శాక్యశబ్దములను 'శక్తి'యని యేకార్థమును జెప్పువానినిగా నూహించుటవలన నేమియు లాభములేదు. దీని కుపపత్తి వేఱువిధమునఁ జూపియుందును.

గర్గుఁడు మూలసమయము నెట్లు చెప్పియుండెనో, ఇది యిపుడు నిశ్చయింపఁగలుగుట యసంభవమైయున్నది. గర్గుఁడు మహాభారతము కంటె ముందటివాఁడనుసంగతి ప్రాయికముగా నిర్వివాదమువలె నున్నది. అతని యుల్లేఖము శల్యపర్వముయొక్క సరస్వత్యాఖ్యానమందును అనుశాసనపర్వములో ఉపమన్యుపుయొక్క యాఖ్యానమందును నైయున్నది. అందు నతనియొక్క 64 అంగముల గ్రంథమునకుఁగూడ నుల్లేఖముకలదు. ఈ దినములలో "గర్గసంహితా" నామకమైన యే గ్రంథము ప్రచలితమైయున్నదో, దానియందు 40 ఉపాంగములున్నవి. అనఁగా నీ గ్రంథము బహుశః ఆ గ్రంథము మాత్రము కాకయుండును. అయినను ఇది దానియొక్క రెండవ యావృత్తియగును. ఇందు రాసుల యుల్లేఖములేదు. దీనిఁబట్టి యీ గ్రంథముకూడ శకసంవత్సరమునకు మునుపటిదియని తెలియుచున్నది. సారాంశము, గర్గుఁడు శకమునకుఁ జాలముందటివాఁడు. అతని గ్రంథమందు శకకాలముయొక్క యుల్లేఖముండుట సంభవము కాకున్నది. కాబట్టి గర్గుఁడు చెప్పిన వచనము ఎవరో అప్పటిరాజుయొక్క సంబంధమునగావచ్చునని తెలియుచున్నది. అతఁడు యుధిష్ఠిరుని నుండి యీ రాజువఱకు 2566 లేక 2526 వత్సరములైనవి మరియు నా రాజు

గర్గునికి సమకాలీనుఁడై యుండును. గర్గునికిని వరాహమిహిరునికిని మధ్య వేయి సంవత్సరములయంతరము కనుపట్టుచున్నది. ఎందుచేత గర్గుఁడు క్రీస్తుసంవత్సరమునకు 400వత్సరములు పూర్వుఁడును వరాహమిహిరుఁడు క్రీస్తు యొక్క 500పండ్లకన్నను జాలతరువాతివాఁడును అయియున్నారు. ఇట్టి దశయందు దీనికి, గర్గునికి సమకాలికుఁడైన రాజుయొక్క నామము, ఒక వేయియేండ్లలోన ప్రసిద్ధమైపోయిన కారణముచేత, వరాహమిహిరుఁడు ఆ నామమును శకరాజుకొఱకు లేక శకకాలముకొఱకు నుపయోగించి యుండెనని యుపపత్తి చెప్పఁబడఁగలదు. వరాహమిహిరుఁడు గర్గ జ్యోతిషములోని వచనమును విశేషప్రమాణభూతముగా గౌరవించుచుండెను. ఇందుచేత నతఁడు ఇతర జ్యోతిష్కులమతమునకు విరుద్ధముగా భారతీయ యుద్ధమును గలియుగముయొక్క 653వ యేఁడున విశ్వసించియున్నాడు. కల్హణుఁడు తన కాశ్మీరేతిహాసమునకు సంబంధమును దానియాధారమునఁ గలిపెను. కాశ్మీరము నందు, భారతీయ యుద్ధసమయమునఁ గాశ్మీరము యొక్కరోజు మొదటి గోనర్దుఁడై యుండెనని యు కష్ణుఁడు దుర్యోధనునికై దిగ్విజయమును జేసినపుడు, అతఁడు యుద్ధములో జంపఁబడియెననియు నతని కొడుకు గద్దెపై నెక్కెననియు దృఢనిశ్చయముండెను. కల్హణుఁడు, బాల్యావస్థచేత నాపిల్లవాఁడు భారతీయయుద్ధమందుఁ జేరలేదను నొక్కటి పురాణము కాశ్మీరములో ప్రచలితమైయుండెనని వ్రాసియున్నాఁడు. భారతీయయుద్ధము కలియుగారంభమందయ్యెనని యొప్పుకొనఁబడెనేని, అపుడు శకపూర్వము 3179 పండ్లయొక్క వ్యవస్థ గోనర్దుని యనంతరము కలరాజులయొక్కవ్యవధివఱకులగ్నమైయుండవలెను. అటువంటివ్యవస్థయే కల్హణునికి మునుపు లగ్నమైకూడ నుండెను. కాని భారతీయ యుద్ధ సమయము నిష్టమువచ్చినట్లు విశ్వసించుటచేతఁ గల్హణునికి గోనర్దాది రాజులయొక్క భిన్నవ్యవస్థ చేయవలసివచ్చెను. గోనర్దుఁడు పాండవుల సమయమున నుండెననుసంగతి కాశ్మీరముయొక్క యితిహాసములో సహజముగనే వ్రాయఁబడియున్నది. దీనికిఁ గారణము, హిందుస్థానములోని ప్రతిరాజవంశము తనసంబంధమును పాండవసమకాలికులైన యోద్ధులలోఁ గలిపివైచుట యలంకారముగాఁ దలఁచుటయైయున్నది. కల్హణుఁడు రాజులయొక్క ప్రచలితమైన వంశావలియందుఁ దనక్రొత్త యూహా ననుసరించి సమూహమును వృద్ధిచేసి యింకొక క్రొత్త తప్పిదమును జేసివేసెను.

గర్గుఁడిచ్చిన 2526 సంఖ్యఁబట్టి యొక సంగతిమైతేని యవశ్యము సిద్ధమగుచున్నది. అదియేమనగా అతఁడీసంఖ్యను ఏదోయొక యాధారము బట్టి నిశ్చయించియుండును. ఇటువంటిసంఖ్యను నిశ్చయించుటకై పుక్కిటి పురాణము మరియు ముఖ్యముగా వంశావళి సాధనము కావలయును. కల్హణుని గ్రంథముఁబట్టి, ఇటువంటి వంశావళి కాశ్మీరమందు భారతీయ యుద్ధసమయమునుండి ప్రచలితమైయుండెనని తెలియుచున్నది. అనఁగా, ఈ సంఖ్య రాజవంశావళి నాధారముచేసికొని స్థిరపఱచఁబడినదని నిశ్చితమగుచున్నది; మరియు నీ దృష్టిఁబట్టి యీ సంఖ్యకుఁ జాలగొప్ప మహత్త్వమున్నది. శకపూర్వము 3179 ఈ యే సంఖ్య శకకాలారంభమున వంశావళి నాధారముచేసికొని స్థిరము చేయఁబడియుండెనో, అదియు నిట్టి వంశావళి యాధారముమీఁద స్థిరముచేయఁబడి యుండును. గర్గునియొక్క వచనమునందు నెవరో మనసు వచ్చిన రాజుయొక్క పేరు నూహించి వరాహమిహిరుఁడు తప్పిదముచేసెను; కాని క్రీస్తుసంవత్సరమునకు 3101 వర్షముల మునుపటిసమయమే, వరాహమిహిరుని విడిచి కడమజ్యోతిష్కులందఱిచేతను నిశ్చయింపఁబడిన భారతీయ యుద్ధసమయము సర్వమాన్యమై యుండుచున్నది. మనము వెనుక, ఇదిగాక మేగస్థినీజు చంద్రగుప్తుని వఱకు మగధవంశములోని యేతరములను వర్ణించియున్నాఁడో, ఆ వర్ణనముఁబట్టియు నీ నిశ్చితసమయమునకు దృఢమైన యాధారము లభించుచున్నదని చూపియే యున్నారము. సారాంశము, క్రీస్తుయొక్క 3101 వత్సరమునకు మునుపటి సమయమే భారతీయ యుద్ధసమయమని సర్వసమ్మతముగా సిద్ధమగుచున్నది.

ఇచ్చటఁ గొన్ని యాక్షేపములయొక్కయు నుల్లేఖము చేయవలసియున్నది. ఏ విధముగా క్రీ. పూ. 3101 సంవత్సర సమయమును ఆర్యభట్టుఁడు కేవలము కల్పనచేత నిశ్చయించియున్నాఁడో, అదే విధముగా శక సంవత్సరమునకుఁ బూర్వము 2526 వత్సరసమయమును గర్గుఁడు తన కల్పనచేత నిశ్చయించియున్నాఁడని దీక్షితునియొక్క కథనముగాఁ జెప్పఁబడుచున్నది. కాని యీ యాక్షేపమునకును గల్పనగాక మఱియొక యాధారములేకున్నది. దీక్షితుఁడు (పృష్ఠము 118నందు) చెప్పుచున్నాఁడు, "వరాహమిహిరుడు సప్తర్షి చారమందు, సప్తఋషులయందు గమనమున్నదని చెప్పియున్నాఁడు; మరియు వారు ఒక్కొక్క నక్షత్రమందు

100 వత్సరములవఱకు నివసించుచున్నారు; ఈ ప్రథనిశ్చయము సాధారణముచేసి యీ సమయము నిర్ణయింపబడినది." యుధిష్ఠిరసమయమునందు సప్తర్షులు మఘా నక్షత్రమందుండిరి; మరియు ప్రస్తుతకాలమునను వారు మఘయందే యున్నారు. సప్తర్షులు ప్రతినక్షత్రమందు 100 ఏండ్లదాఁక నివసించుచున్నారు. దీనిఁబట్టి యిప్పటివఱకు యుధిష్ఠిరునికి 2700 సంవత్సరములైనవని నిష్పన్నమగుచున్నది. కాని సప్తర్షులఁయుండైతే నేమియు గమనమేలేకున్నది. దీనిఁబట్టి ఉక్తసమయమునకు నేమియు నర్థము కాఁజాలదు. ఇదేవిధముగా గర్గుఁడును వరాహమిహిరుఁడును జెప్పిన సమయమునకుగూడ నేమియు నర్థముకాకున్నది. దీక్షితుడు చెప్పునది యేమనగా నిది "గర్గుఁడు శకకాల మారంభమైనతరువాత నొకటి రెండు శతాబ్దులలో నెప్పుడో యైయుండును; అతనికి సప్తఋషులు మఘా నక్షత్రమునకు దగ్గఱ నగపడిరి. ఇందుచేత నతఁడు శకకాల ప్రారంభమున యుధిష్ఠిరునికి 2526 సంవత్సరములైనవని స్థిరముచేసెను." కాని యీ మతము గౌరవింపఁదగినది కాదు. 2526 ఈ నిశ్చితసంఖ్య కల్పనగా నెట్లు నిశ్చయింపబడఁగలదు? ఇది గణితమునకు విషయమైయున్నది, ఇందుచేత దీనియందు అంచనా సంగతులకు బొత్తిగా సమావేశము కాఁజాలదు; మరియు నే జ్యోతిషగణితకారుఁడును నిరాధారము కాల్పనికమునైన సంఖ్యయొక్క సృష్టిని జేయఁజాలడు. సప్తర్షిమండలము 2700 వత్సరములదగా విశ్వసింపఁబడునేని, అపుడు ప్రశ్నము కలుగుచున్నది ఏమనఁగా వాటియందు 174 వత్సరములు ఎందులకుఁ దగ్గింపఁబడినవి ? దీక్షితుఁడు, ఎప్పుడు సప్తర్షులు గర్గునికి మఘా నక్షత్రమందు గనఁబడిరో, అప్పుడు వారు అతనికి శకవత్సరమునకు బిమ్మట 174వ యేఁడునఁ గనఁబడియుండిరని చెప్పియుండలేదు. ఇంకను, ఈ సమయము శకముయొక్క 174 ఏండ్లకు దరువాత నిశ్చయము చేయఁబడియుండెననియు విశ్వసింపఁబడఁజాలదు. ఇట్లు చెప్పుటకు గారణము, మనకేదో మఱియొకరీతిని గర్గునియొక్క సమయము తెలియునేని, అట్టిస్థితిలో నీకథనమునకు నర్థమేమియు నుండఁజాలకపోవుటయైయున్నది. కానిమనకు గర్గునియొక్క సమయమేదియు డెలియదు, ఇట్టి యవస్థయందు నియ్యది కేవలము కల్పనఁబట్టి విశ్వసింపఁబడజాలదు. గర్గునికిని వరాహమిహిరునికిని సప్తర్షులకు గమనము లేదన్నజ్ఞానము లేకుండెనను సంగతి సంభవముకాదు. అనఁగా నీగతి కల్పనఁబట్టి నమ్మఁబడియున్నదనియు, ప్రత్యక్షము కాదనియు స్పష్టమగుచున్నది.

మంచిది, గర్గవరాహామిహిరులకు సప్తర్షులగతి తెలిసియుండెనని క్షణము నందు విశ్వసింపఁబడుగాక; గర్గుఁడు శకసంవత్సర 174మందు గణితము చేయుటకై కూరుచుండెను, మరియు నతఁడు యుధిష్ఠిరునియొక్క సమయమును గణితముచేత నిశ్చయింప మొదలిడెను. కాని, జ్ఞప్తియుంచుకొన వలసినదేమనగా—

ఆస న్మఘాసు మునయః శాసతి
పృథివీం యుధిష్ఠిరే నృపతౌ।

ఈ సంగతి నాధారస్వరూపముగా విశ్వసించుటకై మహాభారతమందు వచనమేదియు లేకున్నది. మఱి, గర్గుఁడు ఈ వచనము నెచ్చటినుండి తీసికొనెను? మంచిది యీ యాధారస్వరూపమును ఎక్కడినుండియో తెచ్చియుండును, కాని యేసప్తర్షులు ప్రతి నక్షత్రమందు 100వత్సరముల వఱకునున్నారో వారేదియో యొకస్థానమున వసింపకున్నారు. వారు ఒక నక్షత్రమునుండి మఱియొక నక్షత్రమునకు నెగిరివెళ్ళరు. అపుడు గణితము చేయుటకై, యుధిష్ఠిరుని సమయమునసప్తర్షులు మఘానక్షత్రము యొక్క యొకబిందువున నుండిరని తెలిసికొనవలసియుండెను. మరియు, శకసంవత్సర 174 మందు మఘానక్షత్రమున సప్తర్షులను అదే బిందువు మీఁద గర్గుఁడు చూచియుండెననియు విశ్వసింపవలసియుండును. ఇట్లు విశ్వసించినఁగాక, శకసంవత్సరారంభమందు యుధిష్ఠిరునికైనవి 2526 వర్షములు గడచియుండెనని సిద్ధముచేయుట యసంభవమైయున్నది. సారాంశమిది, కాల్పనికములైన సంగతులన్నింటిని విశ్వసింపవలసి వచ్చుచున్నది మరియు వాటిని విశ్వసించుటకై యే యాధారమునులేకున్నది. యుధిష్ఠిరుని రాజ్యారోహణ కాలమందు సప్తర్షులు మఘయొక్క యీ బిందువునందు లేరని యెందును జెప్పఁబడలేదు. ఇది గర్గునియొక్క కల్పితపు సంగతియైయుండునని విశ్వసింపఁబడఁజాలదు. గర్గుఁడు శక సంవత్సర 174 మునందు నయ్యెననుటకును ప్రమాణమెచ్చటను దొరక కున్నది ఇంతియేకాక యతఁడు శకసంవత్సరమునకు మునుపటి వాఁడయి యుండునని నిశ్చయముగా దెలియుచున్నది ఈ సంగతి మనసిద్ధాంతము నకు సరిపడుచున్నది కనుక దీనిఁగూడ గల్పనాధారమున విశ్వసింప వలయును; మరియు యుధిష్ఠిరు నప్పటి బిందువునందే సప్తర్షులు గర్గకాలీన మైన శకసంవత్సర 174 మందు నుండిరనుసంగతి మనమతముతో గలియు

యున్నది, కనుక దీనిఁగూడఁ గల్పనచేత విశ్వసింపవలయును! ఇట్టి స్థితిలో సిద్ధాంతమంతయు నమ్మకముమీఁదనే యుండెను! సూక్ష్మముగా విచారించినమీఁద, గర్గుఁడు యుధిష్ఠిరునియొక్క, శకపూర్వము 2526 వత్సరము వాఁడనియే నిశ్చితముగను చెప్పియున్నాఁడో, దానినతఁడు గణితము చేత నిశ్చయించియున్నాఁడని చెప్పబడజాలదు. అగుఁగాక. దీనిమీఁదను మఘ, పూర్వ, ఉత్తర, హస్త, చిత్త వీటిలో ప్రతియొక నక్షత్రమందును సప్తర్షులు కనుపట్టఁగలరని చెప్పుచున్నాఁడు అపుడు, ప్రశ్నయేమనఁగా గర్గునికిఁదనసమయమందు, సప్తర్షులు మఘయందే యున్నట్లు యెట్లగపడిరి. రెండవసంగతియిది 444 శకసంవత్సరమందు వరాహమిహిరునికి సప్తర్షులు మఘయందే యగపడిరి. దీనిబట్టియైతే గర్గునిసమయమున అనగా శక సంవత్సర 174మందు వారు మఘకు వెనుకనున్నట్టులు కనబడుచున్నారు. ఇట్టి దశయందుఁ దనసమయమునసప్తర్షులు మఘయందున్నట్లు నమ్మి గణితము చేసెననియనుటయునసత్యము గాదోచుచున్నది సారాంశము గర్గుఁడీసమయమును కల్పనద్వారా తెలిసికొనెనని చెప్పుట బొత్తిగా నసత్యమైయుండును, అనగా, దానికి వంశావళియొక్క లేక యెవరో వాటియొక్క ప్రాచీనగ్రంథకారునియొక్క పూర్వాధారముండియుండును. కనుక, ఇట్టి దశయందు మునుపు మనము చేసినకల్పనయే సంభవముగా నగపడుచున్నది. గర్గుఁడు, అతని సమయమునందు (అనగా శకపూర్వము) ఎవరో ప్రసిద్ధుఁడైన రాజువఱకు యుధిష్ఠిరునికైనవి 2526 వత్సరములు కడచినవని వ్రాసియుండును. మరియు, వేయియేండ్లతరువాత వరాహమిహిరునికి, మఱపువలన, నయ్యది శకకాలమేయని భ్రాంతికలిగెను. అందుచేత దానిని గర్గునియొక్క వచనముగా నూహించి యతఁడు ఈ శకకాలయుక్తమైన యుధిష్ఠిర సమయమును జెప్పియుండును. మనసువచ్చిన కారణమేమో యగుఁగాక, ఇతర జ్యోతిషకాలము మతమునకు విరుద్ధముగా నింకను ప్రత్యక్షమహాభారత వచనమునకు విరుద్ధముగా నొక్క వరాహమిహిరుని వచనమునకు గౌరవమీయఁబడజాలదు.

### పురాణములలో నీయబడిన వంశావళి భ్రమపూర్ణమైయున్నది

ఇపుడు మనము భారతీయ యుద్ధసమయము విషయమై చెప్పిన మూఁడవమతముమీఁద విచారము చేయుదము. మహాభారత వచనానుకూలముగా గలియుగారంభమున భారతీయయుద్ధమైనదని విశ్వసించి, రాజుల వంశావళియొక్క లేక ప్రాచీనప్రచలితమైన పరంపరయొక్క

యాధారముమీఁద, జ్యోతిష్కులందఱు క్రీ. పూ. 3101 సంవత్సరమును భారతీయ యుద్ధసమయముగా చెప్పియున్నారు. ఈ సమయమునకు బుష్టికలిగించుటకై మేగస్థనీజుచేత చెప్పఁబడిన తరములఁబట్టి యింకను నధిక దృఢప్రమాణము లభించుచున్నది. కాని యిప్పటి, చాలమంది విద్వాంసులు, ఆ సమయమునకు విరుద్ధముగా, భారతీయ యుద్ధ సమయము క్రీస్తు వత్సరమునకు దాదాపు 1400 వత్సరము మునుపటిదియని చెప్పియున్నారు. ఇప్పుడు మనము దీనినివిచారింతము. కొందఱుపాశ్చాత్య విద్వాంసులు ఆ సమయమును దీనికంటెను నిటీవలి సమయముపై పునకు లాగుచున్నారు, కాని రెండిటికిని మూలమైన యాధారమొకటియే. ఈ సమయమును నిశ్చయించుటకై ముఖ్యముగా విష్ణు పురాణాధారము మీఁద ప్రయత్నము చేయఁబడియున్నది. ఈ పురాణములో జెప్పఁబడిన దేమనఁగా—"మహానందునికి శూద్రరాజ్ఞివలన బుట్టిన పద్మనంద నామకుఁ డగు పుత్త్రుఁడు పరశురాముడువలె క్షత్రియులందఱను నశింపజేయును. అతనికి సుమాలి మొదలుగా 8గురు కుమారులు కలుగుదురు మఱియు వారు మహాపద్మునికిఁ బిదప రాజ్యముచేయుదురు. మహాపద్ముఁడును అతని యెనుబండ్రు కొడుకులును నూరేండ్లవఱకు రాజ్యము చేయుదురు. ఈ నందులను కౌటిల్య నామకుఁడైన బ్రాహ్మణుఁడు రాజ్యభ్రష్టులఁ జేయును మరియు జంద్రగుప్తుని రాజ్యాభిషిక్తుని జేయును." దీనితరువాత నున్న శ్లోక మిది :—

> యావత్పరీక్షితో జన్మ యావన్నన్దాభిషేచనమ్।
> ఏతద్వర్ష సహస్రంతు జ్ఞేయం పంచదశోత్తరమ్ ॥

ఇటువంటి శ్లోకము భాగవతమందును గలదు. కాని దానియందు "శతం పంచదశోత్తరమ్" అని పాఠమున్నది. ఈ శ్లోకమునందు పరీక్షితుని జన్మము నుండి నందాభిషేకము వఱకు 1015 వత్సరములైనట్లు వర్ణన మున్నది. భాగవతమునందు 1115 సంవత్సరములైనవని చెప్పఁబడి యున్నది. పరీక్షిత్తునియొక్క భారతీయ యుద్ధమునకు బిమ్మట 3-4 మాసములయందేయైయుండెను; అనఁగా పరీక్షిజ్జన్మమునకును భారతీయ యుద్ధమునుండి నందులవఱకు 1015 వత్సరములును నవనందులయొక్క 100 వత్సరములునుగలిసి చంద్రగుప్తునివఱకు 1115 సంవత్సరములగు చున్నవి. చంద్రగుప్త సమయము క్రీస్తుయొక్క 312 వత్సరము మునుపు

నిశ్చయింపఁ బడియున్నది. దీనింబట్టి భారతీయ యుద్ధసమయము క్రీస్తు యొక్క 1115+312=1427 వత్సరపు పూర్వమునకు వచ్చుచున్నది. భాగవతమతానుసారము ఇందు 100 వత్సరములు ఇంకను గలుపవలయును; అనగా భాగవత మతానుసారముగా నీ సమయము క్రీస్తుయొక్క 1527 సంవత్సరము పూర్వమగుచున్నది. మన మతము, విష్ణుపురాణమందు చెప్పబడిన యీసమయము విశ్వసింపఁదగినది కాదని యగుచున్నది. పైనీయఁ బడిన వచనము విష్ణుపురాణమందలి నాల్గవయంశముయొక్క 14వ యధ్యాయములోనిది. కాని యయ్యది 23వ యధ్యాయమందు చెప్పఁబడినసంగతికి విరుద్ధముగానున్నది. మగధలో జరాసంధుఁడు పాండవకాలీనుఁడైన రాజై యుండెను. జరాసంధుని తండ్రి బృహద్రథుఁడు ఈ వంశమును స్థాపించియుండెను; కనుక నతనివంశమునకు "బృహద్రథవంశ" నామము తటస్థించెను. ఈ వంశముయొక్క గణన జరాసంధపుత్రుఁడగు సహదేవుని నుండి యారంభముచేయఁబడుచున్నది. ఇతఁడు భారతీయ యుద్ధములోఁ బాండవుల పక్షముననుండి పోరాడియుండెను. విష్ణుపురాణముయొక్క నాల్గవభాగములో 23వ యధ్యాయమందు, నీ బృహద్రథవంశీయులగు రాజులు మగధయందు నొక వేయిసంవత్సరములవఱకు రాజ్యము చేయుదురని చెప్పఁబడియున్నది. దీనితరువాత, "ప్రద్యోతవంశము" 138 ఏండ్ల వఱకు రాజ్యముచేయునని చెప్పఁబడియున్నది. అనగా, మహాపద్మనందునికి అతని యెనమండ్రు కొడుకులకును మునుపు సహదేవుని సమయము నుండి 1000+138+362=1500 వర్షములగుచున్నది. అట్టిస్థితిలో మఱల 24వ యధ్యాయమందు, భారతీయయుద్ధమునుండి 1015 సంవత్సరములగుచున్నవనియే యిది చెప్పఁబడియున్నదో, దానికి నేమియర్థము ? కావున విష్ణుపురాణములో 24వ యధ్యాయమందు చెప్పఁబడిన వచనము బొత్తిగా గౌరవింపఁదగినదికాదు.

రెండవసంగతి యేమనఁగా, పురాణములయందు భవిష్యరూపమున నేసంగతులు చెప్పఁబడియున్నవో, వాటియందు నొకగొప్పదోషమున్నది. పురాణకారులు విస్తారపూర్వకముగా, ఈ వంశమందలి యీ రోజు ఇన్ని వత్సరములదాక రాజ్యముచేయునని యిట్లుభవిష్యమును వ్రాసియున్నారు. ఈ భవిష్యత్తు ఆవంశము కడచినతరువాత వ్రాయఁబడియుండును. ప్రాయికముగాఁ బురాణములన్నిటియందును ఈ ప్రకారమైన భవిష్యము చెప్పఁ

బడియున్నది. పురాణములు బహుధా పరీక్షిత్తునకు అట్లు జనమేజయునికి వినిపింపఁబడియుండెను. ఇందుచేతఁ బరీక్షిత్తుసమయమునుండి యేసమయము వఱకుఁ బురాణములయొక్క రచనయైయుండునో, ఆ సమయమువఱకు నున్న వంశావళి వాటియందు బహుధా భవిష్యద్రూపముతో చెప్పఁబడి యుండును. ఈ భవిష్యవర్ణనమందు రాజులయొక్క వంశావళులు, వాటి నామములు, వాటి రాజ్యకాలముయొక్క వత్సరసంఖ్య మరియు సమగ్ర వంశముయొక్క వర్షసంఖ్య యీయఁబడియున్నది. దీనిఁబట్టి, తక్కువ కంటెఁదక్కువ, మనము మున్ను చెప్పినట్లుగా ప్రతిదేశమందును రాజ వంశావళి సావధానతతో వ్రాయఁబడుచుండెనని యింతమాత్రము నిశ్చయ పూర్వకముగా సిద్ధమగుచున్నది. పురాణములయొక్క ప్రస్తుత స్వరూప సమయము క్రీ॥ తరువాత మూఁడునాలుగు శతకములనుండి యెనిమిదవ శతకమువఱకునున్నది. ఎందుచేత? కొన్ని పురాణములయందు ఆంధ్ర భృత్యవంశమువఱకు నున్న సంగతులు మఱికొన్నిటియందు కాకతీయ యవనులవఱకు నున్నసంగతులు తఱచు పురాణములన్నింటియందు నేక సమానములై యున్నది. ఏ సమయమందు నీపురాణములు నేఁటిస్వరూప మునకు వచ్చినవో, ఆ సమయమున నీ భవిష్యసంబంధులైన యధ్యాయ ములు జతపఱుపఁబడినవి; కాని, యీ వంశాధ్యాయములను జతపఱచిన వారికి నీ వంశములకు సంబంధించిన సంగతులు చక్కగా దెలిసియుండలేదని స్పష్టముగాఁ జెప్పవలసియున్నది. పురాణకారులకుఁ బ్రద్యోతవంశము నుండి మగధముయొక్క యితిహాసము మంచి విశ్వసనీయరూపముతో దొరకియుండెనని తోచుచున్నది; కాని యంతకుముందటి యితిహాసము మరియు ముందటి వంశావళి విశ్వసనీయ రూపముతో దొరకకుండెను. వారు ప్రద్యోతవంశమునకు మునుపు కేవలమొక బృహద్రథవంశము యొక్క యుల్లేఖమును జేసియున్నారు. మరియు దానియొక్క వత్సర సంఖ్య 1000 సంవత్సరములు ఉంచియున్నారు. దీనిబట్టి స్పష్టముగా, ఉత్తరకాలీనులైన పురాణకారులకు ప్రద్యోతవంశమునకు మునుపటి సంగ తులు తెలియకయుండునని తోచుచున్నది. ఈ కారణముచేత వారలిచ్చిన సంగతులయందును చంద్రగుప్తుని సమయమున మేగోస్థనీజుచేతఁ జెప్పఁ బడిన సంగతులయందును ఆకాశ పాతాళముల యంతరము తటస్థించి యున్నది. ప్రద్యోతవంశముకంటె నుత్తరకాలీనములైన వంశములకు సంబంధించిన సంగతులు బౌద్ధ గ్రంథములయందును గనఁబడుచుండెను.

ఇంతియేకాక, పార్గిటర్ మహాశయుఁడు, ఈ సంగతులు పురాణములకు బౌద్ధగ్రంథములనుండియే తీసికొని వ్రాయఁబడియున్నవని చెప్పుచున్నాఁడు. ఈ సంగతులే కడనుండియో యొక కడనుండి తీసికొనిరాబడుఁగాక, కాని ప్రద్యోతవంశముకంటె మునుపటిసంగతులు విశ్వసనీయములు కాకున్నవి. ఎందు చేత? వాటియొక్క సంవత్సరసంఖ్య అంచనాచేత 1000 ఉంచఁబడి యున్నది. ఈ సమయమునకు సంబంధులగు సంగతులు పురాణకారుల యొక్క సమయమున నశించియుండునని మనము మానించుచున్నాము. మునుపటి రాజులయొక్క వంశావళి, చంద్రగుప్తుని యాస్థానమునమున్న మేగాస్థినీజుయొక్క సమయమందునుండెను. కాని క్రీ॥ 400సంవత్సరమునకు సమీపమున, నెపుడు పురాణకారులు పురాణములను దిరుగరచించుటకు మొదలిడిరో, ఆ సమయమున నీ వంశావళులకు సంబంధించిన సంగతులు నష్టములై యుండెను. ఇట్టులెందులకు జరిగెను? దీనికి ముఖ్యకారణము, చంద్రగుప్తసమయమునకుఁ బిమ్మట శూద్రవంశము రాజ్యము చేయ నారంభించుటయు సనాతనధర్మము క్షీణించి యశోకునిసమయమునుండి బౌద్ధధర్మముసైతము ప్రసరించుటయు మరియు విజయమునొందుటయే యని తోచుచున్నది. ఆంధ్రభృత్యులును శూద్రరాజులై యుండిరి. శూద్ర రాజులయందుఁ బ్రాచీన క్షత్రియరాజులయొక్క వంశావళిని జాగ్రత్తతో రక్షించుటకు నిచ్ఛలేకుండుట స్వాభావికమైయున్నది. బౌద్ధరాజులయొక్క దృష్టియందైతే సనాతనధర్మీయులైన క్షత్రియరాజులకు నేమియు విలువయే లేకయుండును. బౌద్ధ, జైనప్రజలయందు వర్ణవిభాగము లోపించిన కారణముచేతను వర్ణవిభాగమునెడల ద్వేషమున్న కారణముచేతను, క్షత్రియుల యొక్క కథలనునాశనముచేసి, వేఱుప్రాచీనకథలను సృష్టించుటకు వారు దృఢప్రయత్నమును జేసియుండిరి. ఇందుచేత బుద్ధునికి జైనమహావీరునికిని ముందటి రాజవంశములయొక్క వంశావళుల మహిమము నష్టమయ్యెను. మరియు వాటిపైపు దుర్లక్ష్యము చేయఁబడియెను. చివరను వంశావళులు తఱచు నష్టమైపోయినవి మరియు నిదేకారణముచేతఁ బురాణకారులు బృహద్రథ వంశముయొక్క సమయమునకు అనుమితిచేత 1000 వత్సరసంఖ్య నుంచిరి. ఈ పురాణకారులు తఱచు మందబుద్ధులైయుండిరి, ఎందుచేత? విష్ణుపురాణములోఁగూడ జెప్పఁబడినదేమనగా—"పరీక్షిత్తు జన్మకాలమున సప్తర్షులుమఘానక్షత్రం మందున్నపుడు కలియుగారంభమయ్యెను. ఇందు 1200 దివ్యవత్సరములు కలవు." దీనిఁబట్టి పురాణకారులయొక్క, భార

తీయ యుద్ధసమయమునుండియే కలియుగారంభమయ్యెననియు గలియుగ మందు 1200 దివ్యవర్షములున్నవనియే విచారము చేయఁబడుచున్నది. మఱల, కలియుగమారంభించి యెన్నివత్సరములయ్యెనో, యీవిషయమై జ్యోతిష్కులందఱిచేతను నిశ్చయింపఁబడియున్న సమయము వారికి దెలియకుండుటయిది యాశ్చర్యవిషయముగనున్నది. ఈ క్రొత్తపురాణకారులును భారతీయ జ్యోతిష్కులును నొకేసమయమున, అనఁగా క్రీ। పూ। 400 నుండి 600 వఱకు, నయ్యెనను సంగతి సిద్ధమైయున్నది. దీనిఁబట్టి, యొకే సమయముననున్న పురాణకారులకుఁ జాలతక్కువ సంగతులు తెలిసియుండె నని తోఁచుచున్నది. అగుఁగాక, ఈ యన్నిసంగతులను జూచి మనము, విష్ణుపురాణమందును భాగవతపురాణమందును జెప్పఁబడినవంశావళులయు సంవత్సరములయుఁ బ్రమాణము, మేగాస్థినీజుయొక్క ప్రమాణమునెదుట, గౌరవింపఁదగినదికాదనియే చెప్పవలయును.

## మేగాస్థినీజు మరియు పురాణకారులు

మేగాస్థినీజుచేత వ్రాయఁబడిన సంగతులు మిక్కిలి విశ్వసనీయము నైయున్నవను విషయమై యధికముగా విస్తరించి విచారించుట యావశ్యకమై యున్నది ముందు మనము, మేగాస్థినీజు ఏయేసంగతులను వ్రాసియున్నాఁడో వాటిమీఁదనే యేయాక్షేపములు చేయఁబడగలవో యీ సంగతిని విచారింతము. మేగాస్థినీజుయొక్క మహత్త్వపూర్ణమైన గ్రంథము నష్టమైపోయెనని ప్రసిద్ధమైయున్నది. అది యున్నయెడలమనకు రాజుల యొక్క నామములును సంవత్సరములును వివరముగా వ్రాయఁబడినవి దొరకును బేబిలోనునందు బేరోసస్సుచేతను మఱి ఈజిప్టునందు మేనేథో చేతను తయారుచేయఁబడ్డ వంశావళి యిప్పటివఱకుఁ బ్రసిద్ధముగా నున్న కారణముచేత, ఏవిధముగా ఆదేశముల యితిహాసమునకు సాహాయ్యము సమకూడుచున్నదో, అదేవిధముగా మేగాస్థినీజుచేత వ్రాయఁబడినవంశావలి యీ సమయమున మనయెదుర నున్నయెడ మనకునేశంకయు లేకుండును. అతని గ్రంథము నశించిపోవుటఁబట్టి యిద్దఱు ముగ్గురు ఇతిహాసలేఖకులు అతనిగ్రంథమునుండి తీసికొన్న భాషాంతరములను మనమిచ్చుట నుదాహరించుచున్నాము.

## ప్లినీచేతఁ గైకొనఁబడిన యవతరణము

"బక్కసుయొక్క సమయమునుండి అలెగ్జాండరుదాఁక 154 రాజుల

యొక్క గణనయున్నది మరియు వారి రాజ్యకాలముయొక్క యవధి 6451 వత్సరములును 3 మాసములునై యున్నది."

## అరాయనునియొక్క గ్రంథములోని యవతరణము

"హిందుస్థానప్రజలు డాయానిసాను (బకస్) యొక్క సమయము నుండి సేండ్రకోటస్స (చంద్రగుప్త)వఱకు 153 రాజులయొక్క 6042 వత్సరములయొక్కయు అవధియుండుటను విశ్వసించుచున్నారు. కాని యీ యవధియందు మూఁడు పర్యాయములు లోకసత్తాత్మక రాజ్యము స్థాపితమయ్యెను ... రెండవపర్యాయము 300 వత్సరములవఱకు మఱి యొక పర్యాయము 120వత్సరములవఱకు హిందుస్థానప్రజలు డాయాని సాను హీరాక్లీజుకంటె 15 తరములకు మునుపటి వాఁడై యుండెనని చెప్పుచున్నారు;"

పై భాషాంతరములఁబట్టి యీజిప్టు, బైబిలోను దేశములలో గ్రీకు్కలకు లభించిన సంగతులవిధముగనే యీ సంగతులుకూడ రాజుల రాజ్య కాలముయొక్క సంవత్సరసంఖ్యా సహితమగు వివరముతోనుండెనని స్పష్ట ముగా దెలియుచున్నది. పై యవతరణముల రెండిటియందు సంవత్సర సంఖ్యలలోఁ జూడఁగాగొలఁది భేదముకలదు, అయినప్పటికి నయ్యది మహత్త్వముకలదికాదు; మరియు నేలోకసత్తాత్మకరాజ్యము స్థాపితమై యున్నదని సంగతి చెప్పబడియున్నదో, దానిని బహుధా అరాజకకాలమని యూహింపవలయును.

మహాభారతమందు లేక యితర పూర్వకాలీన గ్రంథములయందు ప్రాచీనరాజులయొక్క రాజ్యవత్సర సంఖ్యాసహితమగు నుల్లేఖమెందును లేకున్నది. దీనిఁబట్టి, చంద్రగుప్త సమయమునఁ బ్రాచీనరాజులయొక్క రాజ్యవత్సర సంఖ్యాయుక్తమైన వీటియొక వంశావళి యుండియుండును; మరియు నీసంగతులను మేగాస్థినీజు దానియాధారమున వ్రాసియుండును. మహాభారతమునకు నంతిమ స్వరూపము మేగాస్థినీజుకంటె ననంతరము లభించెనని మనము మున్ను చెప్పియుంటిమి. దీనిఁబట్టి, యీ సంగతు లెంత ప్రాచీనములో యీ సంగతి ధ్యానమునకువచ్చును. ఈ యవతరణ మందు జెప్పఁబడిన హిరాక్లిజు శ్రీకృష్ణుఁడగుట సర్వసమ్మతమని మనము ముందు చెప్పియుంటిమి; కాని డాయానిసాను ఎవరో యిది నిశ్చయ పూర్వకముగాఁ జెప్పఁబడఁజాలదు. అయినను అతనినిదాక్షాయణమనువు

అని నమ్మినమీఁద, అతనిసమయమునుండి మహాభారతమందును హరివంశమందును చెప్పఁబడిన శ్రీకృష్ణుని వఱకు 15 తారములగుచున్నవని చెప్పఁబడఁగలదు (ఆది. అ. 75) ఇందుచేత మేగాస్థినీజు చెప్పినసంగతికై యీ యొక క్రొత్త సహాయక ప్రమాణము దొరకుచున్నదని చెప్పఁబడగలదు.

శ్రీకృష్ణుని యొక్క వంశావళి హరివంశమందైతే నీయఁబడియే యున్నది; కాని, దేనిఁబట్టి దక్షునినుండి శ్రీకృష్ణుఁడు 15వ పురుషుఁడై యున్నాఁడని తెలియుచున్నదో, అటువంటి యొక స్థానము మహాభారతమందును నీయఁబడియున్నది. ఈ వంశావళి అనుశాసనపర్వము యొక్క 147వ యధ్యాయములో నీయఁబడియున్నది అది యిట్లున్నది—1 దక్షకన్య దాక్షాయణి. 2 (వివస్వంతుఁడు) ఆదిత్యుఁడు 3 మనువు 4 ఇళ 5 పురూరవుఁడు 6 ఆయువు 7 నహుషుఁడు 8 యయాతి 9 యదువు 10 క్రోష్ట 11 వృజినీవంతుఁడు 12 ఉషంగువు 13 శూరుఁడు 14 వసుదేవుఁడు 15 శ్రీకృష్ణుఁడు. వీటిలో వృజినీవంతుఁడు మరియు ఉషంగుఁడు నను నీ నామములు హరివంశమందులేకున్నవి. వాటికి మాఱు దేవమీఢుష నామమున్నది. ఆదిపర్వములో 76వ యధ్యాయముయొక్క యారంభమున యయాతి ప్రజాపతినుండి 10వ పురుషుఁడని చెప్పఁబడియున్నాడు. అతనిని స్వయముగావిశ్వసింపవలయును బ్రహ్మదేవునినుండి ప్రచేతసుఁడును అతనినుండి దక్షప్రాచేతసుఁడును గలిగిరి. దక్షునికిఁ బ్రజాపతి నామమున్న కారణమునసిచ్చట నిట్టి సంశయముత్పన్నమగుచున్నది. దీనియాధారము మీఁదగూడ, మేగాస్థినీజునకు మూలసంగతులయొక్క జ్ఞానము మహాభారత కాలీనులైన పండితులద్వారా యయియుండెననుసంగతి నిర్వివాదముగా సిద్ధమగుచున్నది. ఇందుచేత నతఁడుచెప్పిన 153 తరములు, పురాణముల యొక్క యంతిమావృత్తియందు నీయఁబడిన తరములకన్న, జాల విశ్వసనీయములైయున్నవి.

మేగాస్థినీజు చెప్పిన సంగతులకు విరుద్ధముగా తరములయొక్క సంఖ్యాపరిణామమునకంటె వత్సరసంఖ్య మిగుల నధికమైయున్నది యని యీ యాక్షేపముకాఁగలదు. సమస్త ప్రపంచములోని యితిహాసము యొక్క యాధారముమీఁద, రాజుల యొక్క ప్రతితరమునకు 20 వత్సరములు పట్టుచున్నట్లు లెక్కవేయఁబడుచున్నదని మనము ముందు చెప్పియుంటిమి. అపుడు ప్రశ్నమేమనఁగా 153 తరములకు 3060 వత్సర

ములకు మాఱు 6042 వత్సరములెట్లీయఁబడియున్నవి? కాని మనకు నితరదేశములలోని రాజవంశావళులయొక్క యుదాహరణముల యాధారమున, ఆర్య ప్రజలవిషయమై మేగాస్థినీజుయొక్క మాటలు ఎట్లు విశ్వసనీయములో యియ్యది చూడవలయును. ప్రతిదేశమందును మానవీయులైన రాజులు గాక పూర్వము కొంచెమెక్కువగా దేవాంశముగలవారుగా రాజులు విశ్వసింపఁబడుచున్నారని మనకు దెలియుచున్నది; మరియు నిట్టి రాజులయొక్క వత్సరసంఖ్య యధికమగుచుండెడిది. మేనేథోచేత సంశోధితమైన యీజిప్టుదేశముయొక్క వంశావళియందు మానవీయరాజులు మేనిస్సునుండి యారంభమగుచున్నారు అతనికి ముందు దేవాంశ రాజులుండిరి. ఇతనికిఁబిమ్మట నెవరును దేవాంశముగలరాజు కాలేదని యతఁడు వ్రాసియున్నాడు. మనము ఇచ్చటఁగూడ శ్రీకృష్ణుఁడు తన యీశ్వరావతారమును జాలించినమీఁద గలియుగారంభమయ్యెను. అనగా, శ్రీకృష్ణుని తరువాయి యెవరును నీశ్వరీయాంశముగల రాజుకాలేదు. హిరాక్లిజులేక శ్రీకృష్ణునివఱకు 15 తరములను దీసివేసి శేషము 138 తరములను మానవరాజులనుగా నూహింపవలయును మరియు నీ రాజుల యొక్క రాజ్యవత్సరసమయము 20 వత్సరములే తీసికొని మనము వీరి యొక్క సమయమును 2760 సంవత్సరములని నిశ్చయించియున్నాము. 6042 వత్సరములలో నీ సమయమును తగ్గించినమీఁద 3282 వర్షములు మిగులుచున్నవి. ఈ మిగిలినయేండ్లను 15 తరములయొక్క సమయమునుగా విశ్వసించినమీఁద ప్రతితరమునకు 202 సంవత్సరములు పట్టుచున్నవి. ఈ వత్సరములేమియు నధికముకావు. మహాభారతములో నీయఁబడిన వర్ణనముఁబట్టి, వసుదేవుని యొక్క వయసు ఎంతయుండినది యుఁదెలియఁగలదు. ఇతరదేశములయొక్క యితిహాసమును జూచుటఁబట్టియు నీ వర్ష సంఖ్య పెద్దదిగాఁదోఁచదు. ఈజిప్టు, ఖండియాదేశములలోని దేవాంశ సంభూతులైనరాజులు చాల యేండ్లవఱకును రాజ్యముచేసిరని వర్ణనము కనఁబడుచున్నది. జ్యూప్రజలయొక్క వంశావళిని దీసికొందము. ఇది యెక్కువ విశ్వసనీయముగను సావధానతాపూర్వకముగా సురక్షితముగను నున్నది. ఇందును మోజిస్‌నామకుఁడైన మానవరాజుకంటె మున్నటి ప్రజాపతి (పేట్రియార్కు)యొక్క వత్సరమర్యాద చాలనే యెక్కువగా నున్నది. మొదటి భాగమందు అనగా సృష్టియొక్క యుత్పత్తి మొదలు జలప్రళయమువఱకు లేక ఆదమ్ మొదలుకొని నోఅ వఱకు 11 పురుషుల

యొక్క సంవత్సరములు 2262 చెప్పఁబడియున్నవి, అనఁగా ప్రతి తరము నకు దగ్గఱదగ్గఱగా రెండువందలు సంవత్సరములు పట్టుచున్నవి. రెండవ భాగమందు శేముసుఁడి అబ్రాహామువఱకు 11 పురుషులకై 1310 వర్ష ములు విశ్వసింపఁబడుచున్నవి. అనఁగా ప్రతితరమునకొఱకు 110 వర్షము లగుచున్నవి. మఱి మూఁడవభాగమందు మౌజిస్సునుండి సాలోమను దాఁక 12తరములకు 408 వర్షములు చెప్పఁబడియున్నవి. ఇవి మాన వీయ ప్రమాణమునను సరించియున్నవి. సారాంశము, ఇతరదేశముల యొక్క సాదృశ్యమునుబట్టి మేగాస్థినీజు వ్రాసినది యత్యంతము సంభవ మైయున్నదని మనము స్పష్టముగాఁ జెప్పఁగలము. 153 తరములయొక్క యుల్లేఖము నతఁడు తత్కాలీనములైన లేఖములయొక్క ప్రమాణము మీఁద జేసియున్నాఁడు మఱి హిందుస్థానముయొక్క యైతిహాసిక కాలము క్రీ। పూ. 3101 వర్షమని నిశ్చితమగుచున్నది. ఇందు నాశ్చర్యపడవలసిన యవసరమేమియులేదు. ఈజిప్తులో మొదటి మానవీయరాజు క్రీ। పూ. 3370వ వర్షమునందు రాజ్యము చేయమొదలిడియుండెను. ఈజిప్టులోని యన్నింటికంటె పెద్దదగు పిరామిడ్ స్తంభము క్రీ। పూ. 2500వ వర్షము నందు జేయఁబడెను. చీనాలోని మొదటిమానవీయరాజు క్రీ। పూ. 208 వ వర్షమున సింహాసనారూఢుఁడయ్యెను. ఈ ప్రాచీనదేశముల యితిహాసము యొక్క యుదాహరణముఁబట్టి, హిందుస్థానమునందలి భారతీయార్యులకు మొదట నైతిహాసిక రాజులు పాండవులును శ్రీకృష్ణుఁడును క్రీ। పూ. 3101 వర్షమున రాజ్యముచేయుచుండిరియేని, ఇందు నాశ్చర్యకరమైన విషయమేమియు లేదని సిద్ధమగుచున్నది.

మేగాస్థినీజుయొక్క వాక్యములమీద రెండవయాక్షేపము, ఏయ వధిలో శ్రీకృష్ణునివఱకు 15తరములగుచున్నవో, అదే యవధిలో మనువునుండి పాండవులవఱకు మహాభారతమందు 35 తరములీయఁబడి యున్నవని చేయఁబడుచున్నది. కాని యిందును నాశ్చర్యపడఁదగిన సంగతి యేమియులేకున్నది. ఎందుచేత? ఈతరములు కలియుగముకంటె బూర్వపు రాజులవియైయున్నవి. వారి వర్షసంఖ్యయు మిగులఁబెద్దదిగా విశ్వసింపఁబడియున్నది. ఈ రాజులు ద్వాపరముకన్నను మఱి యంత కన్నఁగూడ ముందటివారై యుండిరి; కావున వారియొక్క వేర్వేఱుశాఖ లయందు 15 మఱియు 35తరములుండుట సంభవమగుచున్నది. ఒక్క

భీష్ముని యెదుట విచిత్రవీర్య, పాండు, యుధిష్ఠిరాది పాండవులయొక్క మూఁడుతరము లయిపోయియుండెను. అనఁగా, అధికాయుర్మర్యాదగల శాఖలోఁ గొలఁది యాయువుకల తరములుండుట తటస్థించియున్నది. మానవీయ వంశావళులారంభమైన పిమ్మట మనము ఏ 138 తరములను దీసికొని యున్నామో, వారియొక్క వేర్వేఱు శాఖలలో దీర్ఘాయుష్యము మరియు నల్పాయుష్యముగల రాజులయొక్క సమీకృతమైన వర్ష సంఖ్య యందు సరాసరిపద్ధతినిబట్టి ప్రతియొకనికి 20వర్షములుంచుటయే సరిగా నుండును. ఈ సంగతులన్నింటిని విచారించినమీఁద జంద్రగుప్తసమయమున మేగాస్థినీజునకు హిందూస్థానమందు దెలిసిన సంగతులు చాలపురాతనములు విశ్వసనీయములు నై యున్నవని యే నమ్మవలయును.

పురాణములలో జెప్పఁబడిన తరములయొక్క దశ యింతకంటెను తాఱుమాఱువడియున్నది. ముందు చెప్పఁబడినరీతిని బురాణముల యందలి సంగతులు మిగులవర్వాచీనములు అనఁగా 400 క్రీ వత్సరమునకు దగ్గఱ దగ్గఱవియై యున్నవి. అనఁగా మేగాస్థినీజునకు ఏడెనిమిది వందలు సంవత్సరముల తరువాతివియై యున్నవి. ఈ యవకాశములో శూద్ర బౌద్ధ, యవన రాజులున్న కారణముచేతఁ బ్రాచీనక్షత్రియులయొక్క వంశావళులు నష్టములై యుండును. ఈ లోకులకును వీరియొక్క ధర్మములకును, జాత్యాచారవ్యవహార విరుద్ధమైన దృష్టియుండుటచే క్షత్రియులయొక్క వంశావళులను సురక్షితముచేయు సూతులకుఁ బౌరాణికాదులకు నీయవధిలో నాశము కలిగియుండును. అనఁగా, పురాణములయందుఁ జెప్పఁబడిన తరములయొక్కయు వర్షసంఖ్య యొక్కయు సంగతులన్నియును అంచనాఁబట్టి యీయఁబడియుండును, ఇంతియేకాక బౌద్ధులయు జైనులయు మతముల యాధారముమీఁద వ్రాయఁబడియుండును. కారణ మేమనఁగా బుద్ధుని సమయమునుండి మరియు వీరియొక్క కొలఁది సమయమునకు ముందుగా నేరాజులుండిరో, వారియొక్క నామములు వర్ష సంఖ్యలను బురాణములలో నధికాంశమునందు సంభవించినవి యిట్లు దొరికి యీయఁబడియున్నవి: ఇంకను దీనిఁబట్టి పూర్వకాలపు సంగతులు కేవలము కాల్పనికములని తెలియుచున్నవి. ఈ విషయమై విస్తరించి విచారించుట యావశ్యకము.

పురాణములయందు నీయన్ని వర్ణనములు భవిష్యద్రూపమున నీయఁ బడియున్నవి. ఈ వర్ణనములు ఆరోజులకుఁ దరువాతివనుటలో సందేహము

లేదు. వారి విషయమున వర్షసంఖ్యకూడ నీయఁబడి లభించుచున్నది. దీనిఁబట్టియు నియ్యవిరాజుల తరువాతివియగుట నిర్వివాదము. ఈ రీతిని విచారించి మీఁదఁ బ్రథమాంధ్రాంతమువఱకు స్వకీయ రాజ్య సంఖ్య యీయఁబడియున్నదని తెలియుచున్నది. దానితరువాత యవనాది పర రాజులకు నొకచోట సమయమును జెప్పుటఁబట్టి యంతయు గడబిడయై పోయినది. అయినప్పటికిని మనము బృహద్రథవంశముఁగూర్చి యధి కముగా విచారింతము. ఎందుచేత? దీనితరువాత మగధమునందలి వంశముల యొక్క స్థితి బౌద్ధగ్రంథములఁబట్టియు దొరకఁగలదు. ఈస్థితి వాయు పురాణమందు జాల సవిస్తరముగా నిట్లీయఁబడియున్నది. ప్రద్యోత వంశ ములలో నైదుగురు రాజులుండిరి. విష్ణుపురాణమునందు వారియొక్క వత్సరసంఖ్య 138 ఉన్నది. కాని ప్రతిరాజునకు నిచ్చిన వర్షసంఖ్యల యొక్క కూడిక 148 అగుచున్నది. ఇదేవిధముగా దీనికిముందటిశిశునాగ వంశములోని పదుగురు రాజులు 362 వర్షములవఱకు రాజ్యము చేసిన సంగతిచెప్పఁబడియున్నది. కాని రాజులయొక్క నామములును వేటియొక్క కూడిక 334 అగుచున్నదో, అటువంటి భిన్నభిన్నములైన వర్షసంఖ్యలును ఈయఁబడియున్నవి. ఈవైపు దుర్లక్ష్యముచేసి మనము దీనికి ముందటి బృహద్రథవంశమును విచారింతము. పురాణములయొక్క తఱచు పురాణములన్నింటియొక్క మతము, ఈ వంశము ఒకే వేయి సంవత్సర ములవఱకు రాజ్యముచేయునని యైయున్నది.

ద్వాత్రింశచ్చ నృపా హ్యేతే భవితారో బృహద్రథాత్।
పూర్ణం వర్షసహస్రం చ తేషాం రాజ్యం భవిష్యతి॥

ఈ వర్ణనములో నీయఁబడిన యొక వేయి సంవత్సరముల స్థూల సంఖ్యయే సంశయమును బుట్టించుచున్నది. సత్యమైనస్థితి దెలియకపోఁగా స్థూలసంఖ్య యుంచఁబడియున్నదని యూహ కలుగుచున్నది. రెండవ సంగతి యేమనఁగా నొకేవంశము వేయియేండ్లదాఁక సాగఁజాలదు. ఈ సంగతి యైతిహాసికానుభవమునకు విరుద్ధము. ఈ సంవత్సరములు కలియుగ ములోని మానవీయవంశములవి యనుసంగతినిగూడ ధ్యానములో నుంచు కొనవలయును. బార్హద్రథునికిఁ బిదప నైదువందలు సంవత్సరముల యవధితో రెండు వంశములయిపోయినవి. (రెండువంశములను గలుపుట వలన 138 + 362 500మాత్రమగుచున్నది.) ఇదియును స్థూలసంఖ్యయే.

అంతట 100 వత్సరములయందు నందులైరి. ఈయంకెయు స్థూలమై యున్నది. అగుఁగాక; వివరముగా, బార్హద్రథవంశముయొక్క యేవిస్తృత మైన స్థితి యీయఁబడియున్నదో, అది యెట్టిదో మనము చూడ వలయును. బృహద్రథునినుండి భారతీయయుద్ధకాలీనుఁడైన సహదేవ రాజువఱకు వాయుపురాణమునందు నీపదుగురు రాజులు చెప్పఁబడి యున్నారు: (1) బృహద్రథుఁడు (2) కుశాగ్రుఁడు (3) ఋషభుఁడు (4) పుణ్యవంతుఁడు (5) విక్రాంతుఁడు (6) సుధన్వుఁడు (7) ఊర్జుఁడు (8) నభసుఁడు (9) జరాసంధుఁడు (10) సహదేవుఁడు ఇచ్చట బృహ ద్రథునినుండి జరాసంధుఁడు తొమ్మిదవవాఁడు. కాని "ప్రథమ కబళే మక్షికాపాతః" అనునట్లుగా మహాభారతములో జరాసంధుఁడు బృహద్ర థునికిఁ బ్రత్యక్షము పుత్త్రుఁడని చెప్పఁబడియున్నది. (సభా. 3-17) దీనిఁబట్టి, యీ పురాణములలోని సంగతులు ఎంతయసత్యముతో నిండి యున్నవో యని యీ కల్పనకాఁగలదు. బృహద్రథ, జరాసంధులనడుమ రాజులయొక్క నామములు కాల్పనికములని తోఁచుచున్నవి. వీరియొక్క రాజ్యవత్సర సంఖ్య యీయఁబడలేదు. ఇపుడు మనము వాయు పురాణమునందుఁ జెప్పఁబడిన ముందటి రాజులయొక్క నామముల గుఱించి వర్షసంఖ్య గుఱించియు విచారింతము. అవి యిట్లున్నవి: (11) సోమాపి 48 వర్షములు (12) శ్రుతశ్రవుఁడు 64సం॥ లు (13) అయుతాయువు 26. (14) నిరామిత్రుఁడు 100. (15) సుకృత్తుఁడు 56 (15) బృహత్కర్మ 23. (17) సేనాజితుఁడు 23. (18) శ్రుతంజయుఁడు 40 (19) మహాబాహువు 35. (20) శుచి 48. (21) క్షేముఁడు 28. (22) భువతుఁడు 64. (23) ధర్మనేత్రుఁడు 5. (24) నృపతి 58. (25) సువ్రతుఁడు 38. (26) దృఢసేనుఁడు 58. (27) సుమతి 33. (28) సుచలుఁడు 22 (29) సునేత్రుఁడు 40. (30) సత్యజిత్తు 83. (31) వీరజిత్తు 35. (32) అరింజయుఁడు 50. మొత్తము 997 వర్షములు.

ఈ వివరమైన పేరస్తు తెలిసియుండి యీయఁబడినది. దీనిఁబట్టి భారతీయ యుద్ధమునకుఁ బిమ్మటనే 22 రాజుల సమయముయొక్క కూడిక 997వత్సరములు వచ్చుచున్నదని తెలియును. మఱి 32 రాజుల సమయముయొక్క కూడికయొక వేయివర్షములెట్లు రాఁగలదు? వీరిలో నెక్కువమంది రాజులయొక్క నామములును 100 మొదలుగా రాజ్యవత్సర సంఖ్యలునుఁ గాల్పనికములై యున్నవి "ద్వితీయగ్రాసేపి మక్షికాపాత"

యన్న న్యాయమున, మహాభారతమందు సహదేవునియొక్క కుమారుని పేరు మేఘసంధియని యగపడుచున్నది (అశ్వ। అ. 82) పైనిఁ జెప్పఁబడినట్లు సోమాపియని లేదు. ఈ కథనమునకు (దాత్పర్య మేమనఁగా, అన్నివిధముల విచారింపఁగా బ్రద్యోతవంశము కన్న ముందట బృహద్రథ వంశమునకు సంబంధించిన పురాణసంగతులు కేవలము కాల్పనికములుగాఁ దెలియుచున్నవి.

ఇక్కడ గాగల ప్రశ్న మేమనఁగా, బార్హద్రథవంశ సంబంధమున నీయఁబడిన యప్రామాణిక సంగతులను నిరాధారముగా నెంచుచో అపుడు

యావత్పరీక్షితో జన్మ యావన్నన్దాభిషేచనమ్।
ఏతద్వర్ష సహస్రంతు జ్ఞేయం పంచదశోత్తరమ్॥

ఈ శ్లోకమందు సమష్టిరూపమున నీయఁబడిన సంగతి నెందులకు విశ్వసింపరాదు? కాని పరీక్షింపఁబడిననే కాని మఱి వివరముగా నీయఁబడిన యిట్టి సంఖ్యను విశ్వసించుటకై యాధారమేమియును లేదని మనము చెప్పనదయై యున్నది. వత్సరముల లెక్క వేయుటకుఁ బుక్కిటిపురాణ మేమియుఁ జెప్పఁబడుటలేదు. దీనికి మూలాధారము వంశావళులే కావలయును. వేర్వేరుగా వంశములయొక్క మొత్తము కూడిక 1000 వత్సరములగుచున్నదని పైనిజెప్పఁబడియున్నది. ప్రతి మనుష్యుఁడును 22 బార్హద్రథులు, 5 ప్రద్యోతులు, 10 శిశునాగులు, 9 నందులు కలిసి 46 తరములకు 1115 లేక 006 సంవత్సరములు ఏమియు నెక్కువకావని వచించును. కాని క్రీస్తునకు దగ్గఱదగ్గఱగా 500 వత్సరముల పిమ్మట, ప్రద్యోతవంశమునకు ముందు భారతీయ యుద్ధమువఱకు నొకే బార్హద్రథ వంశముండెనని, భవిష్యరూపముతోఁ జెప్పిన పురాణకారులయొక్క వచనములు సత్యమైనవని విశ్వసింపఁబడునా? లేక క్రీస్తునకు దగ్గఱదగ్గఱగా 300 సంవత్సరములముందు ఇచ్చటికి వచ్చి, అపుడు ప్రచలితమైన వంశావళిని సావధానతతోఁ బరికించివ్రాసిన నిష్పక్షుఁడైన మేగాస్థినీజుయొక్క, భారతీయయుద్ధమునుండి చంద్రగుప్తునిఱకు 183 తరములైనను నీకథనము చాల విశ్వసనీయముగా నూహింపఁబడునా? మనమత మేమనఁగా ఏ యాధారభూతమైన సంగతి లేక ప్రమాణము ఎంత యెక్కువ ప్రాచీనమో లేక పూర్వకాలీనమో, అంతయే యధికవిశ్వసనీయముగా నయ్యెదని యెంచఁబడవలయును. పూర్వ పూర్వసంగతులయొక్క పరంపరఁబట్టి

చూడఁగాఁ బురాణములయొక్క స్థానము చివరిదియైయున్నది. వాటి కన్న ముందు మేగస్థినీజునకును అతనికన్నను ముందు వేదాంగములకును స్థానమీయవలయును. స్వయముగా దీక్షితుఁడు వేదాంగ జ్యోతిషము యొక్క సమయము క్రీస్తునకు దగ్గఱదగ్గఱగా 14 0 వత్సరముల మును పటిదియని నిశ్చయించియున్నాడు. వారియొక్క యీ మాట పురాణ ములకు విరుద్ధముగానున్నది. ఎందుచేత? భారతీయయుద్ధము వేదాంగ జ్యోతిషమునకు జాలయేండ్లు మునుపటిదియని స్పష్టమైయున్నది. కాని యింతకంటెను బూర్వప్రమాణము, అనఁగా సామాన్యముగా సమస్త భరత ఖండమందు మాన్యముగా నూహింపఁబడుచున్న భారతీయ యుద్ధము యొక్క క్రీస్తునకు 3101 వత్సరముల మునుపటి సమయము మనకు నుప లబ్ధమైయున్నది; మఱి యింతకంటెఁగూడ మేగస్థినీజుయొక్క సంగతు లకు విశ్వసనీయత యెక్కువగా సిద్ధమగుచున్నది. కాఁబట్టి యిపుడు ఆ ప్రమాణమువైపు ధ్యానమీయవలసియున్నది.

వైదిక సాహిత్యముయొక్క ప్రమాణము.

మేగస్థినీజుయొక్క మాటలు విశేష నిశ్వసనీయములగుట విషయమై వైదిక సాహిత్యమునుండి యొక యత్యంత మహత్త్వపూర్ణమైన దృఢ ప్రమాణ సాధనము ఎట్లు దరకఁగలదో మనమిచ్చట సవిస్తరముగాఁ జెప్పుదము. ఋగ్వేద మంత్రములను బరీక్షింపఁగా ఋగ్వేదమందు భారతీయ యుద్ధముయొక్క యుల్లేఖ మెచ్చటను లేదని తెలియుచున్నది; కాని భాగ్యవశమున దానియందు భారతీయ యోద్ధల పూర్వులయొక్క యొక మహత్త్వ పూర్ణమైన యుల్లేఖము కనఁబడుచున్నది. భీష్మునికిని విచిత్ర వీర్యునికిని జనకుఁడగు శంతనునికి దేవాపి నామకుఁడైన యొక సోదరుఁడుండెను. ఈ దేవాపి శంతనునకంటెఁ బెద్దయై యుండెను. వైరాగ్యముచేత రాజ్యములోని తనయధికారము (హక్కు)ను విడుచుకొని యతఁడరణ్యమునకు వెడలెను. మహాభారతము యొక్క యాదిపర్వము లోని 75వ యధ్యాయము నందును నిట్యుదిస్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది.

దేవాపిఃఖలు బాలఏవ అరణ్యం వివేశ।
శంతనుస్తు మహీపాలో బభూవ॥

ఋగ్వేదములో "బృహద్దేవతా" గ్రంథమునందు నిదేసంగతి చెప్పఁబడి యున్నది. ఆశ్లోకమిట్లున్నది:-

ఆర్ష్టిషేణశ్చ దేవాపిః కౌరవ్యశ్చైవ శంతనుః।
భ్రాతరౌ రాజపుత్రౌ చ కౌరవేషు బభూవతుః॥

ఆర్ష్టిషేణుఁడైన దేవాపి, కౌరవ్యుఁడైన శంతనువు ఈ యిద్దఱు సోదరులును రాజపుత్రులునై యుండిరి. వారియొక్క జన్మము కౌరవ వంశమునందు నయ్యెను. దేవాపిని, అతఁడు ఋష్టిషేణుఁడను ఋషి యొక్క శిష్యుఁడై యుండుటఁబట్టి 'ఆర్ష్టిషేణుఁడ'ని చెప్పియున్నది. దేవాపి గొప్ప తపస్వియై యుండెను. ఒకమాఱు శంతనుని రాజ్యమందు అనావృష్టియై యుండెను అపుడు శంతనుకొఱకుఁ బర్జన్యునిస్తుతించి దేవాపి వర్షమును గురిపించెనని యిట్టికథ యొకటి యున్నది. ఇట్టి యవసరమున ఆర్ష్టిషేణదేవాపి చేసిన సూక్తము ఋగ్వేదముయొక్క పది యవ మండలములోఁ గూర్పఁబడియున్నది. ఈ పదియవ మండలమందు, అనేక ఋషులయొక్క చిన్నచిన్న వేర్వేఱు సూక్తములున్నట్టు అభిప్రాయము కలదు, మంచిది, దేవాపికథఁబట్టి, భారతీయ యుద్ధము ఋగ్వేదమునకుఁ బిమ్మట 100 వత్సరములలోపల నయ్యెనని యనుమానము జనించుచున్నది. కారణమేమనఁగా దేవాపికిఁ దమ్ముఁడు శంతనువు, శంతనునికిఁ బుత్రుఁడు భీష్ముఁడు విచిత్రవీర్యునికిఁ బుత్రులు ధృతరాష్ట్ర పాండురాజు లయియుండిరి; యుద్ధసమయమునకు భీష్ముఁడు వృద్ధుఁడై యుండెను, కాని జీవించియుండెను, ఈ విధముగా పార్గిటరు మహాశయుఁడు, భారతీయ యుద్ధమునకు సంబంధము ఋగ్వేద సమయముతో నున్నదను సంగతిని అందఱకంటె ముందుఁ బ్రపంచము నెదుటఁ బ్రకటించి యున్నాఁడు. మనకును పార్గిటరు మహాశయునియొక్క యీ సిద్ధాంతము గౌరవింపఁదగియున్నది. ఇంతియేకాదు, ఇకనేమంటేని యీ సంగతిని సమర్థించునట్టి వాటియొక సంగతి మనకు దొరకుచున్నది. మహాభారత మందుఁ బాంచాలురను మాటిమాటికి 'సోమకాః, అని చెప్పి యున్నది. ద్రోణుఁడు అశ్వత్థామకు "పాంచాలురమీఁద దండెత్తుము" అని చెప్పునపుడు చెప్పినదేమనఁగా :—

సోమకాన ప్రయోక్తవ్యా జీవితం పరిరక్షతా।

( నీప్రాణములను రక్షించుకొని సోమకులను విడిచిపెట్టకుము. )

ఒకచోట ద్రుపదరాజునకుఁగూడ సోమక సంజ్ఞ యీయఁబడి యున్నది. చాల దినములవఱకు నీసోమకు లెవరై యుండిరో యీసంగతియొక్క జాడ

దొరకక యుండెను. కాని వైదికాను క్రమణిక యొక్క యాధారమున, ఋగ్వేదములో "సోమకః సాహదేవ్యః" అని సహదేవ పుత్రుండైన సోమకునియొక్క యుల్లేఖ మొక సూక్తమునందుఁ జేయఁబడినది గాఁదెలియుచున్నది. ఐతరేయ బ్రాహ్మణమందును, సహదేవ పుత్రుఁడగు సోమకుఁడు రాజసూయ యజ్ఞమొకటి చేసియుండెనని వర్ణనము చూడఁబడుచున్నది; మరియు తర్వాత, నారద ఋషు లిరువురియొక్క కథనము ననుసరించి, విశిష్టరీతిని, సోమరసమును వెడలించిన కతమున నతనికి విశేష కీర్తియయి యుండెను [ఈ సోమకుఁడు ద్రుపదునికిఁ బూర్వజుఁడై యుండెను. హరివంశము (అ. 32)నందు సహదేవుఁడు, సోమకుఁడు, జంతువు, పృషత్తు మరియు ద్రుపదుఁడు, ఈప్రకారము వంశావళి నుడువఁబడియున్నది. దీనిఁబట్టి. మహాభారతమందు ధృష్టద్యుమ్నునికి పార్షతుఁడని ద్రౌపదికి పార్షతియని యెందుకుఁ జెప్పఁబడి యున్నదో ఆ యుల్లేఖము ఋగ్వేదమందు వచ్చియున్నది. సోమకుఁడు రాజసూయమునుఁ జేయు గొప్పసమ్రాట్టు, కనుక నతని వంశజులకు "సోమకాః"నామము లభించెను; మరియు నీనామము భారతమందుఁ బలుమాఱుఁ గనఁబడుచున్నది. ద్రుపదుఁడు భారతీయ యుద్ధమందుండెను, ఈ సంగతిఁబట్టియు, భారతీయ యుద్ధము ఋగ్వేదమునకుఁ బిమ్మట నాలుగైదు తరములలో అనఁగా 100 150 వత్సరములలో నయ్యోనని విశ్వసించుటకు హాని యేమియు లేదు.

దీనిఁబట్టి యిటువంటి, మనయనుమానమునకు మొదటి సాధక ప్రమేయము సిద్ధమైనది. పార్గిటరు మహాశయుఁడు చెప్పినట్లు భారతీయయుద్ధము ఋగ్వేదమునకుఁ బిమ్మట 100 వర్షములలో నయ్యెను. ఇపుడు మనము ప్రొ॥ మేక్డానలు తనయొక్క సంస్కృతసాహిత్యమునకు సంబంధించిన గ్రంథమందుఁ జెప్పుచున్నాడు. మహాభారతమునకు మూలభూతమైన యైతిహాసిక కథ, కురువులు, పాంచాలురు అనిపేర్లు గలిగి యిరుగు పొరుగులనున్న, యిరువురు రాజులకుమధ్య జరిగినయుద్ధమైయున్నది. ఈయుద్ధకారణముచేత బిమ్మటఆజను లేకభవించిరి. యజుర్వేదములో, నీరెండుజాతులు సమ్మిళితములైనట్లువ్రాసియున్నది. కాఠక బ్రాహ్మణమునందు, విచిత్రవీర్యాత్మజుఁడైన ధృతరాష్ట్ర రాజుయొక్క వర్ణనము అందఱకుఁ దెలిసినట్లుగనే చేయఁబడియున్నది. దీనిఁబట్టి మహాభారతమందు జెప్పఁబడిన యీ యుద్ధము అత్యంత ప్రాచీనకాలమున నాయెనని చెప్పవలసియున్నది. ఈసమయము క్రీస్తునకు బూర్వము, దశమ శతాబ్దికి నిటీవలఁగాఁజాలదు " ఈ యవతరణముఁ

బట్టి, భారతీయ యుద్ధకాలము విషయమై, వైదిక సాహిత్య ప్రసిద్ధులైన పాశ్చాత్య విద్వాంసులయొక్క మత మేమియోవిదితము కాఁగలదు. ఈ విచార ప్రణాళికలోని యొకభాగము మనకు మాననీయము కాకున్నది. కాని రెండవభాగము మాననీయమై యున్నది. ప్రొఫెసరు మేక్డనలు యజుర్వేదముయొక్క సమయము క్రీస్తునకు 1000 వత్సరముల పూర్వ మనుచున్నాఁడు. ఈ భాగమును దిగవిడిచియాతనియొక్క శేషించిన మతమును మాననీయముగాఁ దెలిసికొనవలయును యజుర్వేదమందుఁ గురు, పాంచాలురయొక్క యుల్లేఖ మొకచోట నున్నది మరియుఁ గాఠక బ్రాహ్మణనుందు వైచిత్ర వీర్యుఁడైన ధృతరాష్ట్రునియొక్క యుల్లేఖమున్నది. దీనిఁబట్టి, భారతీయ యుద్ధము యజుర్వేదమునకు ముందు లేక కాఠక బ్రాహ్మణమునకు ముందు జరిగెనని యనుమానము నిశ్చితముగా బయలుదేఱుచున్నది. ఈ యనుమానము ననుసరించి రెండవ సాహాయ్యము ఈ సంగతినుండి లభించుచున్నది.ఏదియనఁగా శుక్ల యజుర్వేదముయొక్క శతపథ బ్రాహ్మణమునందు జనమేజయ పారీక్షితుని యుల్లేఖమున్నది. దీనిఁబట్టి, భారతీయ యుద్ధము యజుర్వేదము కన్నను దానియంతర్గ తములైన బ్రాహ్మణములకన్నను ముందు జరిగెనని సిద్ధమగుచున్నది; నిస్సందేహముగా నది యెన్ని యేండ్ల మునుపటిదో మాత్రము తెలియదు.

ఈ ప్రకారముగా మనయనుమానమునకు మొదటి ప్రమేయము సిద్ధమైనది. మన మొదటి ప్రమేయము, భారతీయ యుద్ధము ఋగ్వేద రచనాకాలమునకుఁ బిమ్మట 100 వత్సరములయందు యజుర్వేద, శతపథ బ్రాహ్మణములకుఁ గొన్నివత్సరములముందు జరిగెననియగుచున్నది. ఇపుడు ఋగ్వేదముయొక్కయు యజుర్వేదముయొక్కయు సమయము నిర్ణయింపఁబడఁగలదు. ఇదే మన రెండవప్రమేయము. దీనివిషయమై పాశ్చాత్య విద్వాంసులకును మనకును తీవ్రమైన మతభేదమున్నది. పార్గిటరు మహాశయుఁడు చెప్పుచున్నది యేమనఁగా, ఋగ్వేదముయొక్క చివరిసూక్తమును దేవాపిదిగను మొదటిసూక్తమును విశ్వామిత్రునిదిగను విశ్వసించినమీఁద, దేవాపికిని విశ్వామిత్రునికిని తరములయొక్క యాధారముమీఁద 700 ఏండ్లయెడము కనఁబడుచున్నది; మఱియు భారతీయ యుద్ధసమయమును క్రీస్తుకంటె 1000 ఏండ్ల మునుపటిదిగా విశ్వసించిన మీఁద ఋగ్వేదముయొక్క సమయము క్రీ. పూ. 1000-1700 ఏండ్లవఱకు

వెనుకకుఁ బోవుచున్నది. ఇందు ప్రొఫెసరు మేక్డానలుయొక్క మతమే యాధారముగాఁ దీసికొనఁబడియున్నదని తెలియుచున్నది; దీనిఁబట్టి యితఁడు యజుర్వేదరచన సమయము క్రీస్తుకంటె 1000 ఏండ్లు పూర్వముగా దలంచియున్నాఁడు. పాశ్చాత్యపండితులు వైదికసాహిత్యమును జాల యిటీవలి సమయమునకై లాగుటకుఁ బ్రయత్నించుచున్నారు మరియు నీ విధముగా వారు భరతఖండమునందలి ప్రాచీనేతిహాసములోని యన్నిసంగతులను అర్వాచీనకాలమువైపునకు లాగుచుండుట యనెడు తప్పిదమును జేసియున్నారు. పార్గిటరుయొక్కయు మేక్డానలుయొక్కయు ఒక మతమును గౌరవించి మన మొదటిప్రమేయము సిద్ధమయ్యెను. అది యేదియనఁగా—భారతీయయుద్ధము ఋగ్వేదమునకు పరము యజుర్వేదమునకుఁ బూర్వము, విశేషించి శతపథ బ్రాహ్మణమునకుఁ బూర్వము, జరిగెను. ఇపుడు మనము నిశ్చయముగా, ఋగ్వేదముయొక్క, యజుర్వేదముయొక్క లేక శతపథ బ్రాహ్మణముయొక్క సమయమేదియో చెప్పఁగలిగితిమేని, అపుడు భారతీయ యుద్ధముయొక్క సమయము నిశ్చయపూర్వకముగా జెప్పఁబడఁగలదు. ఋగ్వేదముయొక్క యజుర్వేదముయొక్కయు సమయమును నిశ్చయించుటలో గొంచెమాటంకమున్నది. ఇది యొకటి ప్రసిద్ధమైన సంగతి, ఏదియనఁగా ఋగ్వేదములోని వేర్వేఱు సూక్తములు వేర్వేఱు సమయమునందు జేయఁబడియున్నవి. ఇదేవిధముగా యజుర్వేదముయొక్కయు రచన యనేక శతాబ్దములదాఁక జరిగియున్నది, ఎందుచేతననఁగా ఋగ్వేదములోని పురుషసూక్తమునందు యజుర్వేదముయొక్క యుల్లేఖమున్నది. మంచిది శతపథబ్రాహ్మణమునకుఁ బూర్వము ఋగ్వేదసూక్తములరచన పూర్ణమై యుండెననియు ఋగ్వేదములోని యొక నిశ్చితమైన పూర్వాపర సంబద్ధమైన గ్రంథము నిర్మితమైయుండెననియు నిర్వివాదముగాఁ దెలియుచున్నది. ప్రొఫెసరు మేక్డానలు తన పూర్వోక్తగ్రంథముయొక్క 49వ పేజీలో, బ్రాహ్మణగ్రంథములలోని ఋగ్వేదవిషయకమైన వేర్వేఱుచర్చలనుబట్టి ఆ సమయమున ఋగ్వేదసంహితయొక విశిష్టరీతిని స్థిరతాపూర్వకముగ నిశ్చితమై యుండినట్లు తెలియుచున్నదని చెప్పుచున్నాఁడు; యజుర్వేదములోని గద్యవచనములఁబోలె దానివిషయమై యనిశ్చయము లేకుండెను. శతపథ బ్రాహ్మణమందొకచోట స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది ఏమనఁగా "యజుర్వేదములోని గద్యవచనములయొక్క పాఠము మాఱుటసంభవమైయున్నది, కాని

ఋగ్వేదములోని ఋక్కులయొక్క పాఠము మాఱుట యసంభవము."
ఇంతియేకాదు ఇఁకనేమంటే బ్రాహ్మణగ్రంథములలో ఋగ్వేదము లోని యీ మాత్రమందు ఇన్ని ఋక్కులున్నవనియు ఇప్పుడును ఋగ్వేదములో నన్నియే ఋక్కులు లభించుచున్నవనియుఁగూడ నుల్లేఖము కనఁబడుచున్నది. చెప్పినదానికిఁ దాత్పర్యమేమనఁగా బ్రాహ్మణగ్రంథములనాఁడు సమగ్రమైన ఋగ్వేదగ్రంథము సుబద్ధము, నిశ్చితముమరియు సర్వపూజ్యమైన శ్రుతిగ్రంథముగా నాహింపఁబడుచుండెను. ఋగ్వేదమునకు వ్యవస్థాకారణ రూపమైన కార్యమును వ్యాసఋషి చేసెననియు నీవ్యాసమహర్షి భారతీయయుద్ధకాలమున నుండెననియుఁ బ్రసిద్ధమైయున్న యీ దృఢనిశ్చయము ఉక్తవిధానమున కనుకూలమైయున్నది. అనఁగా ఋగ్వేదమునకుఁ బిదప భారతీయయుద్ధము 100 సంవత్సరముల లోపల నయ్యెననియు భారతీయ యుద్ధమునకుఁ బిదప బ్రాహ్మణగ్రంథములు నిర్మితమయ్యెను. మహాభారతము నుండియు, శతపథ బ్రాహ్మణము యొక్క రచన భారతీయయుద్ధమునకుఁ బిదప నయ్యెననియే తెలియు చున్నది. శాంతి। అ. 318లో జెప్పినదానిననుసరించి శతపథబ్రాహ్మణము యొక్కయు శుక్లయజుర్వేదముయొక్కయు రచనను యాజ్ఞవల్క్యుఁడు ఎవుడు ఎట్లుచేసెనో యీ సంగతియొక్క యుల్లేఖము ముందు చేయనే చేయఁబడును. దానిఁబట్టి మహాభారతకాలమందును, శతపథబ్రాహ్మణము మహాభారత కాలమునకుఁ బిమ్మట దయారయ్యెననియే విచారము లోకుల యందుఁ బ్రచలితమైయున్నట్లు కనఁబడుచున్నది కనుక, ఇపుడిచ్చట నత్యంతము మహత్త్వపూర్వమైన ప్రశ్నము ఉపస్థిత మగుచున్నది ఏమియనఁగా, శతపథబ్రాహ్మణముయొక్క సమయము నిశ్చయింపఁబడఁ గలదా?

## కృత్తిక సరిగాఁ దూర్పున నుదయించుట

ప్రొఫెసరు మేక్డానలు బ్రాహ్మణ గ్రంథములయొక్క సమయమును క్రీ। పూ. 800-600 దనుకఁ జెప్పియున్నాఁడు. కాని యీ సమయము కడునధైర్యముతో నర్వాచీనకాలము ప్రక్కకు నీడ్చినదియైయున్నది. ప్రొఫెసరు మేక్డానలు ఋగ్వేదమును క్రీ। పూ. 1500-1000 వర్షము దాఁకనైన దానిగాఁ జెప్పుచున్నాడు; కాని ప్రొ॥ జేకోబీ క్రీ। పూ. 4000 వత్సరములదాఁక బూర్వమునకు బోవుచున్నాడు. ఇచ్చవచ్చినట్లు

గానేదో యగుఁగాక, శతపథబ్రాహ్మణముయొక్క సమయమును మిగుల నిశ్చితమైన విధముగా స్థిరముచేయుటకై యొక్క ప్రమాణము దొరకి యున్నది. దాని యాధారమునుబట్టి యీ గ్రంథముయొక్క సమయము క్రీస్తువత్సరముకంటె బూర్వము 3000 వత్సరములు నిశ్చితమగుచున్నది. ఈ యన్వేషణము మనము చేసినదికాదు. ఈ యన్వేషణము యొక్క శ్రేయము శంకరబాలకృష్ణ దీక్షితునిదైయెయున్నది. దానినతఁడు భారతీయ జ్యోతిషశాస్త్ర సంబంధియగు తన యితిహాస గ్రంథమందు నిచ్చియున్నాడు. అతఁడు ఇంగ్లీషు తెలిసిన చదువరులయొక్క యెదుటఁ గూడఁ దనయొక్క యీ యన్వేషణమును "ఇండియన్ ఏంటిక్వేరీ" నామమైన మాసికపత్రముద్వారా యుపస్థితముచేసియున్నాడు, కాని దానికి నుత్తరము నిప్పటివఱకు నెవరునిచ్చియుండలేదు. తనయన్వేషము విషయమై దీక్షితుఁడు చెప్పుచున్నాఁడు: — "శతపథ బ్రాహ్మణము యొక్కయే భాగములోనుండి క్రింద వ్రాయఁబడిన వాక్యము పైకొనఁబడియున్నదో, ఆ భాగముయొక్క సమయము ఎంతకుక్కువఁగాజూచినను క్రీస్తునకు చాదాపు 3000 ఏండ్లు పూర్వమై యున్నదను సంగతి నిశ్చయముగా సిద్ధముచేయఁబడగలదు. ఆ వాక్యమిట్లున్నది :

కృత్తికా స్వాదధీత। ఏతా హవై ప్రాచ్యా దిశో
న చ్యవన్తే సర్వాణి హ వా అన్యాని నక్షత్రాణి.
ప్రాచ్యా దిశ శ్చ్యవన్తే।

( అర్థము —— కృత్తికా నక్షత్రమునందు అగ్న్యాధానము చేయవలయును. నిశ్చితమైన సంగతియేమనఁగా కృత్తిక పూర్వదిక్కునుండి జాఱునదికాదు. మిగిలిన నక్షత్రములన్నియు జాఱిపోవుచున్నవి. ) ఈ వాక్యముఁబట్టి, ఆ సమయమందు, కృత్తిక సరిగాఁదూర్పున నుదయించుట. కనఁబడుచున్నది. సాధారణముగా లోకులయొక్క దృఢనిశ్చయము ననుసరించి నక్షత్రములన్నియుఁ దూర్పున నుదయమగుచున్నవి; కాని పై వాక్యమునందు కృత్తిక యుదయమగుటలోను ఇతర నక్షత్రము లుదయమగుటలోను భేదము చెప్పఁబడియున్నది. దీనిఁబట్టియును చ్య, ధాతువును బట్టియు, ఈ వాక్యమునకు, ఉదయమగునపుడు కృత్తిక సరిగా దూర్పు బిందువునందును అన్యనక్షత్రములు ఈ బిందువునకు కుడివైపున లేక యెడమవైపునను గనుపట్టుచుండెనని యర్థమగుచున్నది.

జ్యోతిశ్శాస్త్రానుసారముగా దానికి ఎపుడీ వాక్యము వ్రాయఁబడినదో అపుడు కృత్తికసరిగా విషువవృత్తమందుండెనని యర్థమగుచున్నది. ఈ వాక్యమును బట్టి, వైదికఋషులు పూర్వబిందువును నిశ్చయించి యుండిరనియు వారు నక్షత్రములయొక్క యుదయమును జూచుచుండి రనియును దెలియుచున్నది. సంపాతబిందువు వెనుకకుఁ దొలఁగిపోయిన కారణమునఁ, బ్రస్తుతము కృత్తిక పూర్వదిక్కున నుదయించుటలేదు. కృత్తికయొక్క యిప్పటిస్థితినిబట్టి, ఎప్పుడది విషువవృత్తమందుండెనో, ఆ సమయముయొక్క కాలము నిశ్చయముచేయఁబడఁగలదు. ఆ కాలము క్రీస్తునకు 2990 వత్సరములు పూర్వము వచ్చుచున్నది: దీనిని స్థూలమైన రీతిని 3000 వత్సరములు పూర్వముగా విశ్వసించునెడల నపుడేమియు నాపత్తిలేదు. "గణితముచేసి నేను (దీక్షితుఁడు) ఆ సమయమున నిరువది యేడు నక్షత్రములలోను రెండవ నక్షత్రమేదియు విషువవృత్తమునందు లేకుండెనని అనఁగా దూర్పున నుదయముకాకుండెననియు నగపడుచున్నది. కృత్తికపూర్వ దిక్కునుండి జాఱునదికాదు ఇది వర్తమానకాలముయొక్క ప్రయోగము — భూతకాలపుదికాదు. అనఁగా, ఈ వాక్యమునందుఁ బూర్వపు సంగతి చెప్పఁబడలేదు. నా మతమున, ఈ విధానముఁబట్టి, యీ వాక్యము క్రీస్తుకంటె బూర్వము 3000 వత్సరలకు నిటీవల వ్రాయ బడలేదని నిశ్చయముగా సిద్ధమగుచున్నది." (ఇండియన్ ఏంటిక్వెరీ, భాగము 24, పేజీ 245)

దీక్షితుఁడు పైనిఁ జెప్పిన కథనముయొక్క ఖండనమును నేఁటివఱకు నెవరును జేయరైరి ఈ కథనము చదువరులకు స్పష్టముగా దెలుపవలసి నంత మహత్త్వముకలదియైయున్నది. కృత్తికానక్షత్రమునకు నుత్తరము స్థిరముఁ గూడనై యున్నది; అనఁగా దానియొక్క శిరస్సు ఎపుడును తక్కువ, యెక్కువగాదు ఏవిధముగాఁ బ్రస్తుతమునందు గృత్తికయొక్క యుదయము పూర్వబిందువునుండి తొలఁగి యుత్తరముననగుచున్నదో, ఆ విధముగాఁ బూర్వకాలమున సంపాతబిందువు ఏదో మఱియొక స్థాన మున నున్నపుడు కాదయ్యెను. ఎన్నితారలు విషువవృత్తమందున్నవో కేవలము అన్నియే సరిగాఁ దూర్పుననుదయించుచున్నవి; సంపాతబిందువు వెనుకకుఁ దొలఁగిపోయిన కారణముచేతఁ దారాగణము విషువవృత్తము నుండి విడిపోవుచున్నవి. క్రింద నీయఁబడిన యాకృతిఁబట్టి, ఇట్టి స్థితి యెందుకు నగుచున్నదో చదువరుల ధ్యానమునకు రాఁగలదు:—

ఇపుడు కృత్తిక విషువవృత్తమునకుఁ బైగా నుత్తరమునయున్నది. పూర్వమొకప్పుడయ్యది విషువవృత్తమునందుండెను. క్రాంతివృత్త, విషువవృత్తములయొక్క కోణములు 23 అంశలవియై యున్నవి మరియుఁ గృత్తికయొక్క శరీరముగూడ నిశ్చితము స్థిరమునై యున్నది. దీనిఁబట్టి, సంపాతబిందువు అప్పుడు ఎంత వెనుకనుండెనో యీ పరిమాణము నిశ్చయింపఁబడఁగలదు. దీక్షితుఁడు సం. 1900 యొక్క స్థితికి 680 అంశముల వెనుకనుండుటను నిశ్చయించియున్నాడు. అనఁగా, 1900కు ముందు, 68 × 72 (ప్రతి 72 వత్సరములందు సంపాతబిందువు ఒకే యంశము వెనుకకుఁ దొలఁగిపోవుచున్నది; ఈ లెక్కనుబట్టి) = 4896 వర్షములు వచ్చుచున్నవి. ఇందులో 1900 తగ్గించుటవలన, క్రీస్తువత్సరమునకు దాదాపు 2996వత్సరములముందు, శతపథ బ్రాహ్మణములో జెప్పఁబడిన వాక్యము వ్రాయఁబడి యుండును. శతపథ బ్రాహ్మణముకంటె జాల శతాబ్దులకు ముందు ఋగ్వేదముయొక్క చివరికాలము క్రీస్తునకు 3200 వర్షముల పూర్వమని విశ్వసింపవలయును. భారతీయ యుద్ధము ఋగ్వేదమునకుఁ బిమ్మట 100 వర్షములలోనయ్యెను, కనుక దీక్షితునిచేఁ జెప్పఁబడిన కాలముమీఁద మనము మనయనుమానమునకు, క్రీ॥ పూ. 3101 సంవత్సరమే భారతీయ యుద్ధసేవాయమని నిశ్చయముగా సిద్ధించుచున్నదని పునాదివేసితిమి.

మనము మన కథనముయొక్క సారాంశమును జదువరులయెదుట సంక్షేపముగా దిరుగనుంచుచున్నారము. ఋగ్వేదమునందు చిట్టచివరను, దేవాపియొక్క సూక్తమున్నది. దేవాపి. భీష్ముని తండ్రియగు శంతనునికి సోదరుఁడై యుండెను దీనికర్థము; ఋగ్వేదమునకు బిదపఁ గొలఁది సంవత్సరముల లోపల భారతీయ యుద్ధము జరిగెనని ఋజువగుచున్నది. శతపథ బ్రాహ్మణమునందు సంపూర్ణమైన ఋగ్వేదముయొక్కయు, పరీక్షిత్తునకుఁ బుత్రుఁడు పాండవులకు మునిమనుమఁడు నగు జనమేజయుని యొక్కయు నుల్లేఖమున్నది. కాఁబట్టిభారతీయయుద్ధము శదపథబ్రాహ్మణమునకు ముందు జరగెను. దీక్షితుఁడు, శతపథ బ్రాహ్మణాంతర్గతమగు కృత్తికయొక్క యుదయము సరిగాఁ దూర్పుననగుచున్నది ఈ వాక్యము నాధారముచేసికొని, ఆ గ్రంథముయొక్క సమయమును క్రీస్తునకు దాదాపు 3000ఏండ్లపూర్వమని నిశ్చయించియున్నాడు. కనుక భారతీయ

యుద్ధముయొక్క యే సమయము క్రీస్తునకు 3101 ఏండ్ల పూర్వమని విశ్వసింపఁబడియున్నదో, అది యుచితమైయున్నది; మరియు ఋగ్వేద రచనయొక్క యంతిమ సమయము క్రీస్తునకు 3200 వర్షముల పూర్వ ముగా నిలుచుచున్నది. చాలును, ఇదే మనయొక్క యనుమానసరిణియై యున్నది. మనము, ఈ యనుమాన పరంపరయందు విమర్శించుటకై యవకాశములేదని యూహించుచున్నాము. భారతీయయుద్ధము ఋగ్వేద మునకుఁ దరువాతను శతపథ బ్రాహ్మణమునకు ముందును అయియున్న దనుసంగతి మేక్డానలు మొదలుగాఁ బాశ్చాత్యపండితులకు మాన్యమై యున్నది. వారు ఋగ్వేదము యొక్కయు శతపథ బ్రాహ్మణము యొక్కయు సమయమునే యిటీవలకుఁ జాలలాగుచున్నారు. కాని యిది వారియొక్క ప్రమాదమైయున్నది. దానికై యేమియు దృఢమైన యాధారములేకున్నది. దీక్షితుఁడు చెప్పిన సమయము జ్యోతిష విషయక మైన యుల్లేఖముయొక్క యాధారమున గణితముచేసి నిశ్చయింపఁబడి యున్నది. అది యెప్పుడును ఖండింపఁబడఁజాలదు. ఇటువంటి దశయందు మనము కొంచెముగా, దీక్షితునిచేతఁ జూపఁబడిన ప్రమాణమునకు నేమి యుత్తరమీయఁబడఁగలదో యీ విషయమై విచారింతము.

### స్మరణముయొక్క కల్పన యసంభవము

దీక్షితునియొక్క కథనమునకు నుత్తరమిప్పటివఱకు నెవరును ఇచ్చి యుండలేదు. కనుక మనయొక్క కల్పనాద్వారా మనము దానికేమి యుత్తరమీయఁబడఁగలదో యయ్యది చెప్పెదము. అప్పుడు ఇటువంటి యుత్తరము అప్రత్యక్షముగా సమ్ముఖమునకు వచ్చుచున్నది. కావున మనము దానిఁగూడ విచారింపవలసియున్నది కొందఱు లోకులు, ఇటు వంటి విధానములు స్మరణము నాధారముచేసికొని చేయఁబడుచున్నవని చెప్పుచున్నారు. కృత్తిక తూర్పున నుదయమగుటను ప్రాచీనకాలమున ఋషులు చూచియుందురు మరియు నీ సంగతి, యద్భుతమైన కారణము చేత లోకులయొక్క స్మరణమునందు వందలకొలఁది యేండ్లవఱకు నుండి యుండును. ఇందుచేత, చూడఁగా శతపథ బ్రాహ్మణము అర్వాచీన కాలమందు వ్రాయఁబడియుండును అయినప్పటికి దానియందు నీసంగతి యొక్క యుల్లేఖము చేయఁబడియుండును. ఈ విధముగా, స్మరణ మూలకమైన యీ కల్పనను విశ్వసించి శతపథ బ్రాహ్మణములోని వచనము యొక్క ప్రామాణ్యము ఖండింపఁబడఁగలదు.

కాని యీ స్మరణసంబంధియగు కల్పన నిలువఁజాలదని మా యభిప్రాయము. శతపథ బ్రాహ్మణములోని వాక్యమునందు వర్తమాన కాల ప్రయోగము చేయఁబడియున్నది, భూతకాల ప్రయోగములేదు. ఎవరైనను అతనికీసమయమునందు ధూమకేతువగపడెనని చెప్పవచ్చును; కాని ధూమకేతు వగపడనియప్పుడు, ధూమకేతు వగపడియుండెనని యిట్లు ఎవరును జెప్పరు. కృత్తికయొక్క యుదయము సరిగాఁ దూర్పుదిక్కున నగుచుండెను. మరియు నది దగ్గఱదగ్గఱగా 100-150 వత్సరములదాఁక దూర్పననే యగుచుండెను; కాని సంపాతబిందువు వెనుకకుఁ బోయియున్న కారణముచేతఁ గొంతకాలము తరువాత గృత్తికయొక్క యుదయము పూర్వబిందున నగుట యాగిపోయెను ; మరియు నయ్యది యిపుడును బూర్వమునఁగాకున్నది. ఋషులకు క్రీస్తువర్షమునకు దగ్గఱగా 3000 ఏండ్లకు మునుపు కృత్తికయొక్క యుదయము పూర్వమున నగపడెను. 200 వర్షములలో నదిపూర్వమున నుదయించుట కట్టుపడిపోయియుండెను: వెనుకకుఁబోయినకరణముచేత ఫాల్గుణచైత్రములనువసంతను దాని విషయమై శతపథములో, దానియొక్క యుదయము పూర్వమున నగుచున్నదని, యీ వాక్యమెట్లు వ్రాయఁబడఁగలిగియుండెను? ఈ స్మరణముకూడ లోకులయందు నేఁటివఱకు నెట్లుండఁగలదు? కృత్తిక సరిగాఁ బూర్వబిందువున నుదయమగుటను మహర్షు క్రీస్తునకు నించుమించుగా 3000 ఏండ్లపూర్వము సూక్ష్మతతో జూచి యుండిరి. అపుడు వారికి అంత జ్ఞానమున్నయెడల, ఆర్యులయొక్క జ్ఞానము ఇదేవిధముగాఁ దరువాతఁ గూడ స్థిరమైయుండుట సంభవమగుచున్నది; మరియు యజ్ఞయాగదులు చేయువారు, భవిష్యమందును ఆకసమువైపునకు జూచుచుండి యుందురు. అపుడు వారియొక్క ధ్యానమునకు, గృత్తికయొక్క యుదయము పూర్వదిక్కునఁ గాదనియు వచ్చియుండును. కనుక స్మరణమునకు సంబంధించిన కల్పన యిచ్చుట సరియైనదని తోచదు.

లోకులు, ప్రస్తుతకాలమున మనము చైత్రవైశాఖములను ఏవసంతఋతువునుగాఁ జెప్పుచున్నామో, అది స్మరణముయొక్క యాధారము మీఁదఁ జెప్పుచున్నామని యాక్షేపింపఁగలరు. ప్రత్యక్షమైన స్థితి చూడఁబడునేని, సంపాతము వెనుకకుఁబోయిన కారణముచేత ఫాల్గుణ చైత్రములను వసంతముగాఁ జెప్పవలసియున్నది. పూర్వమొకప్పుడు వసంతముయొక్క మొదటి మాసము చైత్రమైయుండెను అప్పటినుండియుఁ చైత్రవైశాఖములను వసంతర్తువునుగాఁ జెప్పు పరిపాటి యారంభ

మయ్యెను. ఇప్పటిస్థితి మాఱియున్నది; కాని మనము ముందటివిధముగాఁ జైత్రవైశాఖములనే వసంతఋతువునుగాఁ జెప్పుచున్నారము ఇంకను బుస్తకములయందును వ్రాయుచున్నాము. ధార్మిక విషయములయందును ఇదే ప్రకారము మునుపటి నియమమును స్థిరముగా నుంచుచున్నారము మాఱియున్న క్రొత్త స్థితియనిన దుర్లక్ష్యము చేయఁబడుచున్నది. ఈ యాక్షేపము మొదటనైతే సంభావనీయముగను సరియైనదిగను జూపట్టుచున్నది, కాని యిచ్చట నటువంటి యాక్షేపముకాఁజాలదు; ఎందుచేత ననఁగా కృత్తిక సరిగాఁ దూర్పున నుదయమగు నన్నసంగతి స్వాభావిక రీతిని జెప్పఁబడియున్నది. ఈసంగతి నిత్యపాఠమునకు లేక ధార్మిక విధికిఁ గాదయ్యెను. రెండవసంగతి యేమనఁగా ఎపుడు ప్రత్యక్షస్థితికిని మునుపటి స్థితికిని జాలభేదము తటస్థించుచున్నదో, అపుడు నిత్యపాఠమునైతము పల్మఱు మాఱిపోవుచున్నది చైత్రవైశాఖములను వసంతఋతువునుగాఁ జెప్పుపాఠము, ఋతువులోని యొక నెల వెనుకకుఁబోయినకారణమున, మార్పుకూడఁ జేయఁబడియున్నది అనఁగా పూర్వమెప్పుడు 15 దినముల యెడము ధ్యానమునకు వచ్చెనో, అపుడు మాసములు పౌర్ణమాసినుండి లెక్కపెట్టఁబడ నారంభమైనవి 15దినములు వెనుకకుఁ ద్రోసివేయఁబడినవి. ఎపుడు ఇంతకంటెను మిక్కుటమైన యెడము కానిపించెనో, అపుడు జ్యోతిషికులు మీనమేషయోర్వసన్త యని పాఠము నారంభముచేసిరి. మొదట వైదికకాలములో గృత్తిక, రోహిణి యిట్లు నక్షత్రపాఠము ప్రచలితమై యుండెను; అది యిపుడు అశ్విని, భరణియని యైయున్నది. సారాంశము, మనయభిప్రాయమేమనఁగా ఏకూర్పు రెండువేల యేండ్లనుండి కట్టుపడియుండెనో అనఁగా బందయిపోయెనో చాల మార్పుకూడనై యుండెనో అది శతపథములో, అది యీ కాలపుదియని యనుకొనునట్లుగా, నిల్లెప్పుడును వ్రాయబడఁజాలదు. ఈ సంగతి స్పష్టమైయున్నది ఏదియనఁగా ప్రస్తుతకవులెవరును వైశాఖముయొక్క వర్ణనమును వసంతముతో సమానముగ జేయరు — గ్రీష్మముతోడనే సమానముగాఁ జేయుదురు.

ఈ ప్రకారము స్మరణమునకు సంబంధించిన కల్పనచేత, శతపథ బ్రాహ్మణములోని వాక్యముయొక్క ఖండనము చేయఁబడఁజాలదు. ఈ వాక్యమునుబట్టి, కృత్తిక సరిగా దూర్పున నుదయించుటకు సంబంధించిన, క్రీస్తువర్షమునకు 3000వత్సరమునకు మునుపటికూర్పును వైదికఋషులు

ఆకాలమునఁ జూచియుండిరని సిద్ధమగుచున్నది. దీనిఁబట్టి, ఆ సమయమున ఆర్యులయొక్క యౌన్నత్యమెంత యధికమైయుండెనో తెలియుచున్నది. వారు నలుదెసలలోని బిందువులయొక్క స్థానములను నిశ్చయముచేసి యుండిరి మరియు వారు తారలయొక్క యుదయాస్తమయములను దృక్సిద్ధాంతముఁబట్టి చూచుచుండిరి. కాని యిందు ఆశ్చర్యపడఁదగిన సంగతి యేమియునులేదు. ఈజిప్టు, బైబిలోను వీటియందలి ప్రాచీన జనులు ఎక్కువ యున్నతిగలిగియుండిరని యందఱు నెఱుఁగుదురు. వారు క్రీస్తునకు నించుమించుగా 4000 ఏండ్లమునుపు దిక్కులయొక్క బిందువులను స్థిరపఱిచియుండిరి. ఈజిప్తులోని పిరామిడులయొక్క భుజములును బైబిలోను నందలి జిగురోతమ్‌లయొక్క లేక దేవాలయముల యొక్క కోణములు సరిగా నలుదిక్కుల బిందువులకు ననుకూలములై యున్నవి. ఇట్టిస్థితిలో, హిందుస్థానమునందు క్రీ॥ పూ॥ 3000 వత్సరమునకు ముందటి యార్యులకు దిక్కులయొక్క జ్ఞానముండెననుట స్వాభావికమైయున్నది. హిందుస్థానమందు ఆర్యులు పిరామిడులను నిర్మించలేదు; అయినప్పటికిని వారు యజ్ఞయాగములను జేయుచుండిరి. యజ్ఞముల యందుఁ బ్రాగ్దిశయొక్క సాధనమావశ్యకమైయున్నది మరియు వర్షసత్రము చేయునపుడు విషువదివసమునకు నెక్కువమహత్వము విశ్వసింపఁబడియున్నది. ఆ దినమున సూర్యుఁడు సరిగాఁదూర్పున నుదయించుచున్నాఁడు. కనుకఁ బ్రాగ్దిశను సాధించుట యెక్కువ కఠినము కాకుండెను. ఆర్యులకు నీ జ్ఞానములో నౌన్నత్యము తరువాతఁగూడ స్థిరమైయుండెను మరియు యజ్ఞయాగాదిక్రియలు వ్యాపకముగానుండెను. శతపథ బ్రాహ్మణమును క్రీస్తునకు 800 వత్సరముకంటె మునుపటిదియని విశ్వసించునెడల మరియు మధ్యను 2000 ఏండ్లవఱకుఁ దారాగణము ప్రత్యక్షముగాఁ జూడఁబడుట కట్టుపడకుండెననియుఁ గృత్తిక యొక్క యుదయము పూర్వదిక్కునఁ గాకుండెననియుఁ జెప్పునెడల, దానియందు, కృత్తికయొక్క యుదయము సరిగాఁ బూర్వదిక్కున నగుచున్నదని యీ వాక్యము ఎప్పుడు వ్రాయఁబడఁజాలకయుండెను. క్రీస్తునకు 3000 ఏండ్ల మునుపటి కాలమున వారియొక్క జ్ఞానము, దృగ్‌జ్ఞానముఁబట్టి తారా నక్షత్రముల యొక్క పరీక్ష చేయఁగలిగెడు నంత వృద్ధికెక్కియుండిన యెడల, అపుడు వారియందు శతపథ బ్రాహ్మణమును వ్రాయఁగల యోగ్యతయు నదేసమయమునందు నవశ్యమైయుండెనని నమ్మఁబడఁ

గలదు. సారాంశము, ఏ సమయమందు ఇట్టి దృక్ జ్ఞానము కలదో, ఆ సమయముననే శతపథ బ్రాహ్మణము వ్రాయఁబడి యున్నదను సంగతిని సత్యముగా నూహింపవలయును.

## పాశ్చాత్యవిద్వాంసులు బెదరుచు నిశ్చయించిన వైదిక సాహిత్యముయొక్క సమయము

పాశ్చాత్యవిద్వాంసులు శతపథముయొక్క సమయమును క్రీస్తునకు 800 ఏండ్ల మునుపటిదియని చెప్పియున్నారు ఈ కాలముయొక్క నిశ్చయమును జేయునపుడు ఏది యేని యత్యంత దృఢప్రమాణము చేతఁ గార్యము సాధింపఁబడియుండునేని అపుడు మనకుఁ గొంచెము ఎక్కువ కాఠిన్యము విదితమైయుండును. అట్టిదశయందు దృఢములైన యాధారములమీఁద నిర్మింపఁబడిన రెండు భిన్నభిన్నమతములలో నెయ్యది విశ్వసింపఁదగియున్నదోయని సంశయము కలుగును. కాని యిటువంటి సంగతి కాలేదు పాశ్చాత్య విద్వాంసులు వైదికసాహిత్యముయొక్క సమయమును కేవలము అంచనాఁబట్టి నిశ్చయించియున్నారు. ఈ యంచనా సయుతము పిఱికితనముతోను పిసినిగొట్టుతనముతోను జేయఁబడియున్నది. ఉదాహరణార్థము, వారు ఋగ్వేదములోని భిన్నభిన్న సూక్తముల యొక్క రచనాసమయమును దాదాపు 500 ఏండ్లదియని విశ్వసించి, క్రీ॥ పూ. 1500 నుండి 1000 వత్సరములవఱకునైనదిగాఁ జెప్పియున్నారు; మరియు బ్రాహ్మగ్రంథములు 300 ఏండ్లవఱకు రచియింపఁబడుటను విశ్వసించి, వాటికై క్రీ॥ పూ 800 నుండి 500 వఱకునైన సమయమును జెప్పియున్నారు. గ్రీకులోకులయొక్క యున్నతి సమయముకంటె భారతీయార్యులయొక్క సంస్కారమును మిగులఁ బ్రాచీనముగా జెప్పెడు సాహసము పాశ్చాత్యులయందు గానేకాలేదు. ఎపుడు హోమరు క్రీస్తునకు నొక వేయియేండ్లమునుపటికంటె నెక్కువ ప్రాచీనుఁడని సిద్ధింపఁజాలదో, అపుడు వారు భారతవర్షములోని వ్యాసునిఁగూడ దానికంటె ముందునకు లాగుటకై యిచ్ఛగింపరు. కాని మేనిథోద్వారా లభించిన యీజిప్టు దేశములోని రాజవంశావళియు బెరోసస్సుచే వ్రాయఁబడిన బైబిలోనులోని రాజవంశావళియు క్రీస్తునకు 400వత్సరము కంటె పూర్వము వఱకుఁబోయి చేరుచున్నవి. మొదట వాటిని అసత్యములుగను అవిశ్వసనీయములుగను దలఁచుచుండిరి; కాని యిప్పుడు ఈజిప్టుదేశములో దొరకిన శిలాలేఖములఁబట్టి

ఖాల్డియా దేశములో దొరకిన ఇష్టకాలేఖములం బట్టియు నీ వంశావళులు సత్యములనియు సిద్ధించుచున్నవి. మరియు క్రీ. పూ. 4000 ఏండ్లకంటెను ముందటివిగాఁ దెలియుచున్నవి. క్రైస్తవులయొక్క ధార్మికమైన దృఢ నిశ్చయమెటువంటిదనఁగా దానిననుసరించి మనుష్యుని యుత్పత్తియొక్క సమయము క్రీ. పూ. 4004 విశ్వసింపఁబడియున్నది. కాని యిప్పటి పాశ్చాత్యవిద్వాంసులు ఈ దృఢనిశ్చయమును విడువనారంభించియున్నారు. మరియు నిపుడు ప్రాచీనేతిహాసవిభాగములు శతవర్షసంఖ్యతో జేయఁబడుట లేదు. ఇఁకనేమంటే సహస్రవర్షసంఖ్యతో జేయఁబడుచున్నవి. ఒక యితిహాసకారుఁడు చెప్పుచున్నాఁడు "మనుష్యునికిని భూమికిని సంబంధించిన మనజ్ఞానము శీఘ్రముగావృద్ధినొందియున్నది. క్రీ. పూ. 4004 వత్సరమును మనుష్యునియొక్క యుత్పత్తిసమయముగా విశ్వసించుట నట్లుంచి యీజిప్టులోని యితిహాసకారులు, కొందఱు పిరామిడులయొక్క సమయమును అంతకంటెను మునుపటిదిగా విశ్వసింప నారంభించియున్నారు"

ఇదేవిధముగా నిపుడు హిందుస్థానములోని ప్రాచీనేతిహాసమును శతసంఖ్య చేతఁగాదు, ఇకనేమంటే సహస్రసంఖ్యచేతనే విభజింపవలసియున్నది. ఈయితిహాసము, బైబిలోనులోని యితిహాసమువలె, క్రీ. పూ. 4000కంటెఁగూడ దూరముగాఁ బోవుచున్నది. ప్రొఫెసరు జేకోబీ జ్యోతిషప్రమాణముల యాధారమున ఋగ్వేదములోని కొన్ని సూక్తములయొక్క సమయమును క్రీ. పూ. 4000 దాఁక సిద్ధింపఁజేసియున్నాఁడు హిందుస్థానమందు పిరామిడులు, శిలాలేఖములులేక ఇష్టకా (ఇటికలయందలి) లేఖములు బుద్ధునికి మునుపటి యితిహాసమును దెలుపునట్టివి దొరకకుండుట సత్యమైయున్నది. కాని, మన ఋగ్వేదములోనగు వైదికగ్రంథములు పిరామిడులకన్న నధికముగా భవ్యములును అభేద్యములునునైయున్నవి. ఈ గ్రంథములయందు జ్యోతిషవిషయమై కనఁబడుచున్నయుల్లేఖములు, సమయమును నిశ్చయించుటకై, శిలాలేఖముల కంటెఁగూడ నధికవిశ్వసనీయములు నిశ్చయాత్మకములు నైయున్నవి. కనుక హిందుస్థానములోని ప్రాచీనేతిహాసము వేలసంఖ్యయందుఁ జెప్పఁబడఁగలదు. అది యీ పద్ధతిమీఁద—ఋగ్వేదముయొక్క సమయము, క్రీ. పూ. నాల్గవవేయి, అనఁగా 4000 నుండి 3000వఱకు; అయుర్వేదముయొక్కయు బ్రాహ్మణగ్రంథములయొక్కయు సమయము, మూఁడవ వేయి, అనఁగా 3000 నుండి 2000వఱకు; వేదాంగములయొక్క సమ

యము, మొదటివేయి, అనఁగా 1000 నుండి క్రీస్తువత్సరారంభమువఱకు నై యున్నది. శంకరబాలకృష్ణ దీక్షితుఁడు శతపథ బ్రాహ్మణముయొక్క యేసమయమును, తదంతర్గతమైన జ్యోతిష విషయకవచనము నాధారము చేసికొని నిర్ణయించియున్నాఁడో, అది యేవిధముగను అమాననీయము అని యూహించుటకు యోగ్యము కానేరదు.

## వేదాంగ జ్యోతిషప్రమాణము

శతపథ బ్రాహ్మణము, క్రీ। పూ. 800 వత్సరపుదిగా, పాశ్చాత్య విద్వాంసులచేత నిశ్చయింపఁబడిన సమయము అసత్యమైయున్నదను సంగతి యితర ప్రమాణములఁబట్టియు నిశ్చితముగాఁ దెలియుచున్నది. వేదాంగ జ్యోతిషముయొక్క సమయమును దీక్షితుఁడు, అందలి జ్యోతిషసంబంధి యగు నొకవచనము నాధారముచేసికొని, నిశ్చయించియున్నాఁడు. అందు ఉత్తరాయణము ధనిష్ఠయందుఅగుచున్నదని చెప్పఁబడియున్నది. దీనిఁ బట్టి దీక్షితుఁడు వేదాంగసమయమును గణితముచేత క్రీస్తునకు 1400వత్సర పూర్వమని స్థిరపఱిచి యున్నాఁడు. ఈ సమయము విషయమైశంకకలుగుట చేత ప్రొఫెసరు మాక్సుమూలరు ఆర్చడీకన్ప్రైటును, ఉత్తరాయణము ధనిష్ఠానక్షత్రమందెప్పుడుండునో, ఈ విషయమై గణితముచేయుటకుఁ జెప్పియున్నాఁడు. ఇతఁడును జాల ముందువెనుకలకు లాగినమీఁద నీ సమయమును క్రీ। పూ. 1186కుఁ బిమ్మటఁ జెప్పఁజాలకపోయెను. సారాంశమిది, ఎపుడు వేదాంగజ్యోతిషముయొక్క సమయమును క్రీ। పూ: 1200 లేక 1400 వర్షమని విశ్వసింపవలయునో, అపుడు శతపథ బ్రాహ్మణముయొక్క సమయము దానికంటెను ముందుకావలసియున్నది. అనఁగా, అది క్రీ। పూ. 800 వత్సరము కానేరాఁజాలదు. ఇచ్చటఁగూడ పాశ్చాత్య విద్వాంసులు, ధనిష్ఠయందు ఉదగయనముయొక్క స్మరణము ఉండియుండుననియు వేదాంగజ్యోతిషము బొత్తిగా అర్వాచీన కాలమున క్రీ. పూ. 300లకు దాదాపునఁ జేయబడియుండుననియే తర్కము చేయు చున్నారు. వారు, ఎపుడు ధనిష్ఠారంభమున ఉదగయనముండెనో, ఆ సమ యమున వేదాంగజ్యోతిషముయొక్క గణితపద్ధతి స్థిరము చేయఁబడి యుండునని చెప్పుచున్నారు; కాని యెప్పుడు ఆగ్రంథము చేయఁ బడియెనో అపుడు వెనుకటి పరిస్థితియొక్క యుల్లేఖము వర్తమాన పద్ధతి మీఁదఁజేయఁబడెను. కాని వేదాంగ జ్యోతిష పద్ధతి అపుడు స్థిరమై

యుండుట సత్యమైనచో, అపుడు అదేసమయమునందు గ్రంథము నిర్మింపఁబడిన దానివిశ్వసించుటకు నేమియాటంకమున్నది? రెండవసంగతి, ఆసమయమున ధనిష్ఠయందు నే యుదగయనము అగుచుండెనో, అది 1000 వత్సరములకు, గ్రంథము వ్రాయఁబడునప్పటికి, అవశ్యమే మాఱియుండును. అనఁగా, ధనిష్ఠయందు నుదగయనము క్రీస్తునకు 1400 లేక 1200 వత్సరపూర్వమైయుండెను, గ్రంథము వ్రాయఁబడినది 300 యందు. మధ్య 1000 ఏండ్ల యవధియందు అది వెనుకకు నవశ్యముగ తొలగియుండును ఈ సంగతి గ్రంథకారునికిఁ దెలియకుండనుండదు. అట్టిచో మఱి యితఁడు ఉదగయనము ధనిష్ఠయందు నుండెనని యెట్లుచెప్పును? మరియు నెవఁడు దానియాధారము మీఁద రచించియుండునో అతఁడు ఆగణితపద్ధతి నెట్లు స్వీకరించును? వరాహమిహిరుఁడును దానిసమయముయొక్క స్థితిని జూచి, ధనిష్ఠయందు నుదగయనముకాదని స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు ఇదేవిధముగా వేదాంగజ్యోతిషకారుఁడును జెప్పియుండును. సారాంశమిది, జ్యోతిష విషయకములైన వచనములను గ్రంథములను అసత్యములుగాఁ జేయుటయైతే సంభవముకాదు మాన్యమును గాదు. తాత్పర్యమిది. వేదాంగ జ్యోతిషముయొక్క సమయము క్రీ॥ పూ॥ 1400 నుండి 1200 నాటికే నిశ్చితముగాఁ దెలియుచున్నది శతపథ బ్రాహ్మణము దీనికంటెను మునుపటిదియగును, పిమ్మటిది కాఁజాలదు.

శతపథ బ్రాహ్మణముయొక్క నిశ్చితమైన సమయము, తుట్టతుదకు దేనినుండి పైవాక్యము గైకొనఁబడి యున్నదో, ఆభాగముయొక్క సమయము, క్రీ॥ పూ॥ 3000 వత్సరమైయున్నది. ఋగ్వేద గ్రంథము, సమగ్రశతపథ బ్రాహ్మణమునకు ముందు, సంపూర్ణమైయుండెనను సంగతి నిర్వివాదమైయున్నది. అనఁగా, ఋగ్వేదము, శతపథ బ్రాహ్మణముయొక్క ప్రతియొక భాగముకన్నను ముందు పూర్తిగా దయారైయుండెను. దీనిఁబట్టి ఋగ్వేదసమయము క్రీ॥ పూ॥ 3200 వత్సరమని నమ్ముటకు నేయాటంకమునులేదు. మూలమానమునబట్టి భారతీయయుద్ధము ఋగ్వేదమునకుఁ బిమ్మట 100 వర్షములలో నయ్యెను. కనుక ఆయుద్ధమునకు, క్రీ॥ పూ॥ 3101 వత్సరమని, సర్వమాన్యమైన సమయము వైదిక సాహిత్యాధారమున దృఢప్రమాణములఁబట్టి సిద్ధమగుచున్నది.

## జరాసంధుని యొక్క యజ్ఞము

ఇవిగాక భిన్నభిన్నములైన యంతర్గత ప్రమాణములంబట్టి భారతీయ యుద్ధముయొక్క సమయము కీ॥ పూ॥ 3101 వత్సరమే నిశ్చయమగుచున్నది. ఈ సమయము మేగాస్థనీజుయొక్క యాధారముమీంద, కలియుగారంభము విషయమై జ్యోతిషికుల ప్రమాణము మీంద మరియు వైదిక సాహిత్యముచేత ఈ మూండు దృఢప్రమాణములం బట్టియు నిశ్చితమగుచున్నది. ఇంతవఱకు మనము ఈసంగతిని బరీక్షించియుంటిమి. భారతీయ పరిస్థితియొక్క స్వరూపాధారము మీందంగూడ నీసమయమే నిశ్చితమగుచున్నది. దీనికి ముఖ్యముగా రెండుస్వరూపములు చెప్పంబడును. మహాభారతమందు, జరాసంధుండొక యజ్ఞముచేసి క్షత్రియుల బలియిచ్చియుండెనని కథకలదు. లోకులు, ఆకథనెంచెమెక్కువ యద్భుతమనియు కాల్పనికమనియు నూహించుచున్నారు. మహాభారతమందు శ్రీకృష్ణునిముఖముచేత, శివునికి బలియిచ్చుటకై నీవుక్షత్రియులం చెఱలో నుంచితివని చెప్పబడియున్నది. ఈకథకు మూల స్వరూపమేదైయున్నది? ఏమి యిది బొత్తిగాం గాల్పనికమా? ఈ విషయమై విచారించినమీంద, ఇందునైతిహాసికము సత్యమైయున్నదని తెలియుచున్నది దీనికి మొదటం బురుషమేధముయొక్క సంగతి యగపడుచున్నది శతపథబ్రాహ్మణములో నొకచోటనున్న వర్ణనముబట్టి, పురుషమేధము కాల్పనికము కాదని విదితమగుచున్నది--భారత వర్షమునందు నొకసమయమున నయ్యది ప్రత్యక్షముగాం జేయంబడుచునుండెను. ఒకప్పుడు దానియొక్క ప్రచారము ఇచ్చటం గొలందిగనే యుండియుండును, కాని శతపథములోం జేయంబడిన, దానియొక్క సూక్ష్మవర్ణనముంబట్టి, అదిఒకసమయమునం బ్రత్యక్షముగాం జేయం బడుచుండెడిదని తెలియుచున్నది. దీనియొక్క ఘనత యశ్వమేధముకంటెంగూడ నెక్కువయైయుండెను, కాబట్టిదీనియొక్క ఫలము, ఈయజ్ఞముం జేయువానికి అపరిశమైన రాజసత్తలభించునని చెప్పంబడియున్నది. ఇందలి భిన్న భిన్నములైన విధులు మరియు బలియీయంబడు పురుషులయొక్క వర్ణనములు సంఖ్యయును నేడు భయంకరములుగాం దోంచుచున్నవి; కాని శతపథ బ్రాహ్మణముయొక్క సమయమున నీయజ్ఞము ప్రచలితమైయుండెనని ధైర్యము వచ్చుచున్నది. ముందుమనకుం బోయి యయ్యది శీఘ్రముగానే కట్టుపడియుండును ఇంకను అశ్వమేధముయొక్కయుం బ్రవృత్తి తగ్గిపోయియుండును. భారతీయ యుద్ధసమ

యమున జరాసంధుఁడు ఇటువంటి పురుషమేధమును జేయువాఁడై యుండె ననియు, శ్రీకృష్ణుఁడు తన యత్యుదాత్తమైన మతముననుసరించి, జరాసంధుని ఇదేకారణముచేతఁ జంపుట యుక్తమని చెప్పియుండెననియుఁ దెలియుచున్నది ఈ పురుషమేధముయొక్క సంగతినిబట్టి, భారతీయ యుద్ధము హిందుస్థానమున నత్యంతప్రాచీన కాలమందు జరిగియుండునని యనుమానము జనించుచున్నది. అనఁగా, ఇది శతపథ బ్రాహ్మణముకంటె బూర్వము జరిగియుండును. ఇప్పటి యే గ్రంథమందునులేక కథయందుఁ బురుషమేధము యొక్క సంగతి ప్రత్యక్షముగాఁ గానఁబడుచున్నది. తాత్పర్యము, మనము స్థిరముచేసిన, క్రీ॥ పూ॥ 3.01 వత్సరము నిశ్చయాత్మకముగాఁ దెలియుచున్నది.

## చాంద్ర సంవత్సరగణన

మఱియొక యత్యంతమహత్త్వ పూర్ణమైన సంగతియేమనఁగా, భారతీయయుద్ధము బహుప్రాచీనకాలమున నయ్యెననుటకు, ప్రమాణము భారతీయ యుద్ధకథయందే దొరకుచున్నది. కౌరవులును బాండవులును జూదమాడి యంతమున నెవరు పరాజితులగుదురో, వారు పదిరెండేండ్ల వనవాసము ఒకయేఁడు అజ్ఞాతవాసము అనుభవింపవలసి యుందురని నియమము చేసికొనియుండిరి; అజ్ఞాతవాస సమయములోపల వెల్లడియైనచో దిరుగనన్ని యేండ్లు వనవాసమనుభవింపవలయును. ఈ నిశ్చయము ననుసరించి ద్యూతమునఁ బరాజితులైన కారణముచేతఁ బాండవులు తమ రాజ్యమునంతను దుర్యోధనుని కధీనముచేసివైచి వనవాసమునకు వెడలిరి. వనవాసమును అజ్ఞాతవాసమును బూర్తి చేసినమీఁద నెపుడు వారు వెల్లడియైరో, అపుడు దుర్యోధనునినుండి తమరాజ్యము నడుగనారంభించిరి. దుర్యోధనుఁడు చెప్ప మొదలిడెను ఏమనఁగా—పాండవులు వనవాసమును అజ్ఞాతవాసమును బూర్తిచేయరైరి" మరిపాండవులు చెప్పనారంభించిరి ఏమనఁగా—"పూర్తిచేసితిమి"అని. కనుక నీవిధముగా భారతీయ యుద్ధము ఉపస్థితమయ్యెను. కొందఱు ఆక్షేపకులు ఈ విషయమై యొక మిక్కిలి గొప్ప యాక్షేపములను ఉపస్థితముచేసి యున్నారు. అది యిది-చూడఁగాఁ బాండవులు పదమూఁడేండ్లకుఁ బూర్వమే వెల్లడియైరి అయినను యుద్ధారంభముచేయు పాపమునిచ్చుట వ్యాసుఁడు దుర్యోధనునియొక్క నెత్తి మీఁదనే మోపెను. కనుక, ఇచ్చట, బాండవులు తాము ప్రతిజ్ఞనుబూర్తి

చేసిరో? లేదా? అని ప్రశ్న యుపస్థితమగుచున్నది. ఇదే ప్రశ్నము ఎపుడు పితామహులగు భీష్మునిచేతఁ జేయఁబడెనో, అపుడు వారిచ్చిన యుత్తరము మననముచేయఁ దగియున్నది వారియొక్క సమాధానమేమనఁగా "కాలగతినిబట్టి సూర్యచంద్రులకు నక్షత్ర లంఘనకాలముతో భేదము కలుగుచున్నది, కాఁబట్టి ప్రతి యయిదు వత్సరములయందును రెండు మాసము లెక్కువగుచున్నవి. ఈ లెక్కఁబట్టి పదమూఁడేండ్లలో నైదునెలలును పది రెండు రాత్రులు నధికమగుచున్నవి". భీష్మునియొక్క కథనమునకు, సౌరమానముచేతఁ బదమూఁడు వత్సరములు పూర్తికాకమునుపే పాండవులు వెల్లడియైరి కాని చాంద్రవత్సరముల లెక్కలఁబట్టి త్రయోదశాబ్దములు పూర్ణములైనవి, పాండవులు ప్రతిన నెరవేర్చిరి అని సారాంశము. ఇపుడు దీనిపైని గొందఱులోకులు ఈవిషయమై యింకనిట్లు చెప్పుచున్నారు ఏమన—"భీష్ముఁడిచ్చట నేకపక్షీయమైన న్యాయమును జేసియున్నాఁడు. శబ్దములయర్థము ఎల్లపుడును అభిప్రాయానుసారముగనే చేయఁబడవలయును. నాలుగురూపాయలకు వంటచెఱకుయొక్క బండి యమ్మఁబడునేని, అపుడు నిజముగా బండిమీఁదనున్న మండించుటకును దగిన కట్టెలే యమ్మఁబడుచున్నవి కట్టెలబండి మాత్రము కాదనుసంగతి ప్రకటమైయున్నది. ప్రతిజ్ఞాసమయమందు సౌరవర్షములయొక్క లేక చాంద్రవర్షములయొక్క సంగతి నిర్ణయము చేయఁబడియుండెనా? అపుడు, తమదేశమందుఁ బూర్వకాలము నుండియు మాసములు చాంద్రములును వర్షములు సౌరములును జెప్పఁబడుచున్నవి. కాఁబట్టి పై ప్రశ్నయే యుపస్థితము కాఁజాలదని చెప్పవలసియున్నది. వత్సరములైతే సౌరములేయైయుండెను; కాని భీష్ముఁడు వాటినిఁ జాంద్రములఁగా నంగీకరించి పాండవుల పక్షమునందు న్యాయముచేసెను" ఈ యుక్తి నిజముగా నధిక మహత్త్వముతో నిండియున్నది. భీష్ముఁడు నిజముగా నేకపక్షీయమైన న్యాయమును జేసెనా? వైదికకాలము మొదలుకొని భరతఖండమందు సౌరవర్షములు ప్రచలితమై యుండెనేని, అపుడు కేవలము ప్రతిజ్ఞపూర్తికై చాంద్రవర్షములఁబట్టి గణన చేయుట యన్యాయపూర్ణమై యుండును, ఇట్లుచేయుట పైనిఁ జెప్పఁబడిన కట్టెలబండి యుదాహరణముతో సమానముగా నన్యాయపూర్ణమైయుండును; లేక సరిగా, ఏవిధముగా ముహమ్మదు చేసియుండెనో, ఆ విధముగానే యుండును. మహామూర్ధజన్వీ ఫిరదౌసీకవికి కవిత్వముయొక్క ప్రతిపత్తికొఱకు

నొకనాణెము (సువర్ణముద్ర) నిచ్చుటకై యంగీకరించి, తన ప్రతిజ్ఞను బూర్తిచేయుసమయమువచ్చినపుడు, తెలియుండియు గ్రొత్తగా వెండితో నాణెములను జేయించి యే యన్యాయమును గావించియుండెనో, అట్లే భీష్మునియొక్క పైనిర్ణయముకూడ నన్యాయముతో నిండియుండును. ద్యూతసమయమందుఁ జాంద్రవర్షములు ప్రసిద్ధములు కాకుండెనేని, అపుడు సత్యనిష్ఠులైన పాండవులు అసత్యముగా వ్యవహరించిరనియు, పాండవుల పక్షమున యుద్ధముచేసిన వందలకొలఁదిరోజులు లక్షలకొలఁది క్షత్రియులుఁ గన్నులుమూసికొని యసత్పక్షమును స్వీకరించిరనియే చెప్పవలసివచ్చును. అనఁగా ద్యూతసమయమునందు సౌరములు చాంద్రములును రెండు వర్షములు ప్రచలితములై యుండెననియే విశ్వసింపవలసియున్నది. జూదమాడు నపుడు, ఏవర్షములు గణింపఁబడవలయునో యీవిషయమై నియమము చేయుటమిగిలిపోయి యుండెను తుదని, ప్రతిజ్ఞచేసిన యేండ్లను సౌరములనవలయునో లేక చాంద్రములనవలెనో యిది తేలనందున వాదవివాదము ఉపస్థితమయ్యెను. దుర్యోధనాది కౌరవులు సౌరవర్షమును విశ్వసించి యుండిరనియుఁ బాండవులు చాంద్రవర్షమును విశ్వసించి యుండిరనియు స్వీకరింపవలసి యుండును; ఎందుచేతననఁగా దీనిని స్వీకరింపక భారతీయ యుద్ధమునకు మూలకారణము సరిగా జెప్పఁబడఁజాలదు. మనయభిప్రాయ మేమనఁగా, దుర్యోధనుఁడును కర్ణుఁడును సౌరమానము ననుసరించి, పదమూడేండ్లు పూర్తికాలేదని యేవివాదమును జేయుచుండిరో, అది సరిగా నుండెను. చాంద్రమానానుసారముగాఁ బాండవులు పదమూఁడు వర్షములు పూర్తియయ్యెనని చేయు వివాదమునైతము సరిగానుండెను; భీష్ముఁడు పాండవుల పక్షమునఁ జేసినన్యాయము కూడ యథార్థమయి యుండెను. ప్రస్తుతము హిందుస్థానమందు ప్రభుత్వము (సర్కారు) రోమను సికిల్ వర్షమును విశ్వసించుచున్నది. మహమ్మదీయులు చాంద్ర వర్షమును హిందువులు సౌరవర్షమును విశ్వసించుచున్నారు. ఇట్టిస్థితిలో మీయాదుసంబంధమైన నియమములలో వాడియు, తారీఖు ఇంగ్లీషువారి రీతిని విశ్వసింపబడవలయునని స్పష్టముగా వ్రాసియున్నది. ద్యూతసమయ మందు ద్యూతమాడువారు ఇట్టి వర్షసంబంధమైన నియమమేమియుఁ జేసికొనరైరి. ఒక పక్షము సౌరవర్షమును విశ్వసించినపుడును రెండవది చాంద్రవర్షమును విశ్వసించియుండినపుడును వర్షగణన యేప్రకారము చేయఁబడును ? కౌరవులు పరాజితులగుదురేని వారు పదమూఁడు

సౌరవర్షములు వనవాసమున నుండవలసియుండెనను. భీష్మునియొక్క యీ న్యాయము ఒక దృష్టినిబట్టి యోగ్యమేయైయున్నది. కాని దానిని దుర్యోధనుఁడు మన్నింపడయ్యెను ఈ కారణముచేత భారతీయయుద్ధము తటస్థించెను. అగుఁగాక, సంగతియేమనఁగా ద్యూతసమయమందు హిందు స్థానమున ప్రస్తుతసమయములోవలె చాంద్రవర్షములు బొత్తిగానే ప్రచలితము కాకుండెనేని, అపుడు భీష్మునియొక్క న్యాయము అయోగ్యము పక్షపాతపూర్ణమునని యవశ్యము చెప్పఁబడును. సారాంశము, భారతీయ యుద్ధము యొక్క పుట్టుకను దెలిసికొనుటకై రెండుసంగతులు తప్పక యొప్పుకొనవలసియున్నవి. మొదటి సంగతి యిది యుద్ధసమయమున హిందుస్థానములో చాంద్రవర్షము వ్యాపకమైయుండెను: రెండవ సంగతి యేమనఁగా, పాండవులు చాంద్రవర్షమును మన్నించియుండిరి. ఈ రెండు సంగతులచేతనే భారతీయ యుద్ధకాలము యొక్క నిర్ణయమునకు సాధన ముత్పన్నమగుచున్నది.

విరాటపర్వములోని కథనుబట్టియు, ఈ మహత్త్వ పూర్ణమైన ప్రశ్నము సంశయగ్రస్తమై యుండెనని ప్రకటమగుచున్నది; కాబట్టి దాని నిర్ణయమునుగుఱించి న్యాయాధీశుఁడైన భీష్ముఁడు అడుగఁబడియెను. భీష్మునియొక్క యుత్తరము రాకముందే ద్రోణాచార్యుఁడు వెనుక యధ్యాయ (విరాట అ. 52) మందుఁ జెప్పుచున్నాఁడు "అర్జునుఁడు వెల్లడియగునప్పటికిఁ బాండవుల యజ్ఞాతవాసము తప్పక పూర్తియై యున్నది. కనుక, దుర్యోధనుఁడు పాండవుల యజ్ఞాతవాసము పూర్తి యగుట లేక కాకపోవుట విషయమై చేసిన ప్రశ్నమును విచారించి, ఓ భీష్మా! యథోచితమైన యుత్తరమునిమ్ము. భారతీయయుద్ధకాలము నాటికి భారతవర్షమందు సౌరవర్షమే ప్రచలితమైయున్నచో, ద్రోణా చార్యునియొక్క మనసునందు నిటువంటి శంకయేకలుగదు; ఎందుచేత? అజ్ఞాతవాసము పూర్తియయ్యెనో లేదో యీ సంగతిని గోగ్రహణ సమయమునఁ బ్రతివాఁడు జెప్పఁగలిగియుండెను. అనఁగా ఆ సమయమున చాంద్రవర్షమే ప్రచలితమైయుండెను పాండవులు దానిని మన్నించి యుండిరి. ఇపుడు మనము చారిత్రక దృష్టినిబట్టి, ఇటువంటి పరిస్థితి హిందుస్థానమందు నెపుడుండెనో ఈ సంగతియొక్క విచారమును గావింతము.

## హిందుస్థానములో చాంద్రవర్షము ఎపుడు ప్రచలితమైయుండెను

చాంద్రమాసములు పౌర్ణిమ అమావాస్యలచేత సులభముగనే ధ్యానమునకు వచ్చుచున్నవి. ఋతువులయొక్క తాఱుమాఱుచేత సౌర వర్షము ధ్యానమునకు వచ్చుచున్నది. చూడఁగా చాంద్రమాసములకుఁ బండ్రెండింటికిని ఒక సౌరవర్షమునకును స్థూలరూపమున మైత్రియగు చున్నది. అయినను ఈ మైత్రి పూర్ణరూపమునగాదు; ఇదేకారణముచేతఁ బూర్వకాలమందు గాలగణన విషయమై యెన్నో జగడములు పుట్టి యుండెను. ఈ జగడములచేతనే జ్యూలు, అరబ్బులు చాంద్రవర్షమును స్వీకరించి సౌరవర్షమును విడిచిపెట్టిరి. ఈ దినములలో మహమ్మదీయు లును దీనిని మన్నించుచున్నారు. వారియొక్క వర్షములన్నియు ఋతు వులయందుఁ జుట్టు దారినిబోయి పూర్వస్థానమునకు వచ్చుచున్నవి. రోమనులు ప్రారంభమున మార్చినుండి 10 చాంద్రమాసములను విశ్వసించు చుండిరి మరియు ననేకదివములను ఖాళీగా విడిచి, సూర్యుఁడు సంపాతము మీఁదికి వచ్చునపుడు, తిరుగా చాంద్రమాసములను విశ్వసింప నారంభించిరి. కొంతకాలమునకు బిదప న్యూమయనెడురాజు ప్రతిరెండేండ్లకు నిరువది మూడుదినములను జతపఱచెడు నాచారమును వ్యాపింపఁజేసెను. ధర్మ గురు ప్రజలు ఈ యధికదినములను ఏమో యొకమాసమందుఁ గలుపు చుండిరి. ఇందుచేత జాలకష్టము లుత్పన్నములగుచుండెను. ఈ గడబిడను రూపుమాపుటకై జూలియస్ సీజరు చాంద్రమాసములను జాంద్ర వర్ష ములను విడిచిపెట్టి 365¼ దినముల సౌరవర్షమును న్యూనాధిక దినముల సౌరమాసములను బ్రారంభముచేసెను. గ్రీకుల్కలయందును బ్రచలితములై యుండెను. ఒకనెలను ఇరువదితొమ్మిది దినములదిగను రెండవ దానిని ముప్పది దినములదిగను విశ్వసించి వారు 345 దినములయొక్క చాంద్ర వర్షమును విశ్వసించుచుండిరి. ఎపుడు ఋతుచక్రమునందు తప్పులు కలుగ మొదలిడెనో, అపుడు సోలను అధికమాసపద్ధతి నారంభించెను. ఈజిప్టు వారికి, సౌరవర్షములో 365 దినములగుచున్నవను సంగతి తెలిసియుండెను. వారు 30దినములయొక్క నెలను మన్నించి 360దినములకు నొకవర్షమును బూర్తిచేయుచుండిరి. మఱి యైదుదినముల నెక్కువగా గలుపుచుండిరి. అయినప్పటికిని $\frac{1}{4}$ దినము తప్పిపోవనారంభించెను. కనుకనే $365 \times 4 = 1460$ వర్షములలో వారియొక్క వర్షములన్నియు ఋతువులయందు దిరుగనారంభించెను. పారసీలయందును 360 దినములపిదప 5దినముల

నెక్కువగా గలుపు పద్ధతియున్నది. సారాంశము, వేర్వేఱు ప్రాచీన ప్రజలయెదుట, చాంద్ర, సౌరవర్షములకు మైత్రి చేయు సమయమున ననేక కష్టము లుపస్థితములై యుండెను, మఱియు వేర్వేఱురీతులు ఉపయోగింపఁబడియుండెను. హిందుస్థానమందుఁగూడ నిట్టి కష్టములు తటస్థించిన కారణమునఁ బ్రాచీనకాలమందు వేర్వేఱురీతులు ఉపయోగింప బడియుండెను. కాలక్రమమున వాటికి వేర్వేఱు పరిణామములు కలిగినవి చివరికి వర్తమానపద్ధతి యవలంబింపఁబడెను. ఇపుడు మనము ఈ విషయమై యితిహాసమును విచారింతము.

ఋగ్వేదకాలమున స్థూనమానముచేత 30 దినముల నెలను 12నెలల సంవత్సరమును మన్నించియుందురని తెలియుచున్నది. ఋగ్వేదములో జాలచోటులయందు, పండ్రెండాకులును 360 మేకులుఁ జెప్పఁబడిన చక్రముయొక్క వర్ణనమున్నది. పండ్రెండు చాంద్రమాసములు 360 దినములకు 6 దినములు తక్కువయగుచున్నవి ఋతుచక్రము $5\frac{1}{4}$ దినము లెక్కువయగుచున్నది. ఈ కష్టము ఋగ్వేదకాలమున నుపస్థితమై యుండును; కాని దీనివిషయమై యేమి వ్యవస్థ చేయఁబడియుండెనో యీ సంగతి తెలియదు. తైత్తిరీయ సంహితాసమయముననను బ్రాహ్మణ కాలమందును ఈ సంగతి పూర్ణముగా దెలిసియుండెనని తెలియుచున్నది. ఇందుచేత వర్షమునకు మూఁడుభేదములు—సావనము, చాంద్రము మరియు సౌరము అయియుండెను. సావననామకమైన స్థూనమానము మొదటి నుండియే ప్రచలితమైయుండెను. దానియొక్క విభాగములు ఇవి. ఆరు దినములకు నొక షడహము, అయిదు షడహములకు నొక నెల, పండ్రెండు నెలలకు నొక యేఁడాది. ఈ లెక్కచేతఁ బౌర్ణమియందును అమావాస్య యందును తప్పులు కలుగుచుండెను. అపుడు నడుమ నొకదినము విడిచి వేయఁబడుచుండెను. దీనిఁబట్టి ఉత్సర్గియనియు అనుత్సర్గియనియు పేరులు గల భేదములు పుట్టినవి; ఎందుచేతననఁగా కొందఱు దినమును విడుచు చుండిరి మరికొందఱు విడువకయుండిరి. తైత్తిరీయ సంహితయొక్క "ఉత్సృజ్యా౩ంనోత్సృజ్యా౩మ్ ఇతి మీమాంసన్తే బ్రహ్మవాదినః" ఈయను వాకమునందు ఈ విషయమైన చర్చయున్నది. ఈ సూక్తమును బట్టి, ఆసమయమున సావనములు జాంద్రములునైన మాసములు అట్లు సావన వర్షములుఁ జాంద్రవర్షములును వ్యాపకములై యుండెను. ఈ తైత్తిరీయ సూక్తముయొక్క యవతరణ మిచ్చుట నీయఁదగియున్నది:—

అమావాస్యయాహి మాసాన్సంపాద్య అహరుత్సృజన్తి।
అమావాస్యయాహి మాసాన్ సంపత్స్యన్తి॥

ఇచ్చట భాష్యకారుఁడు చెప్పుచున్నాఁడు — యదిదం పక్షద్వయం సావనమాసాభిప్రాయమ్। అథచాన్ద్రమాసాభిప్రాయేణ పక్షద్వయమాహా॥ పైయనువాకము గవామయనము, యొక్క వార్షిక సత్రవిషయమున నున్నది. దీనిఁబట్టి, వర్షము సావనమాసములచేత జాంద్రమాసములచేతఁ గూడ, బూర్తిచేయఁబడుచుండెనని స్పష్టముగా దెలియుచున్నది. చాంద్ర మాసములు రెండువిధములుగానుండెను; కొన్ని పౌర్ణమికి సమాప్తమగునవి మఱికొన్ని యమావాస్యకు సమాప్తమగునవి. పంద్రెండు చాంద్రమాసములయందు వర్షమును బూర్తిచేయులోకులు తైత్తిరీయ సంహిత యొక్కయు, బ్రాహ్మణ గ్రంథముయొక్కయు సమయమున నుండిరని స్పష్టముగాఁదెలియుచున్నది. శతపథ బ్రాహ్మణము (కాండ. 11,1—10) నందు, ఈవిధమైన 30 చాంద్రవర్షములు గడచినమీఁద వర్షములన్నియు ఋతుచక్రములందు దిరుగుచున్నవని చెప్పఁబడియున్నది. అయినను, అధికమాసముంచెడు నాచారములేకుండెనని తెలియుచున్నది. తైత్తిరీయ సంహితాకాలమందును బ్రాహ్మణకాలమందును చాంద్రవర్షములను విశ్వసించువారు చాలమంది యుండిరనియే తాత్పర్యమగుపడుచున్నది. ఇదే భారతీయ యుద్ధసమయమైయుండెనని మనము ముందు చెప్పియుంటిమి. భారతీయ యుద్ధము ఋగ్వేదమునకుఁ బిమ్మటను బ్రాహ్మణగ్రంథమునకు ముందును జరగెననికూడ ముందు చెప్పఁబడియున్నది.

ఇపుడుమనము, సౌర, చాంద్రవర్షములకు మైత్రిగుదిర్చి యార్యులు సౌరవర్షము యొక్కయే ప్రచారము నెప్పటినుండి చేసిరో యియ్యది విచారింతము వేదాంగ జ్యోతిషమందు అయిదువర్షముల కొకయుగమని యొప్పి ప్రతిరెండున్నఱ వర్షములయందు నొక్కనెల నధికముగాఁ గలుప వలయునని వ్యవస్థచేయఁబడియున్నది. ఈ నియమము బండలెక్కదియై యున్నది, కనుకనే యిందుఁ గొన్నివర్షముల తరువాత దినములు వృద్ధి యగుచున్నవి; దీనికై యొకక్షయమాసముంచెడు నాచారము ప్రారంభము చేయఁబడెను. ఈవేదాంగజ్యోతిషముయొక్క సమయము క్రీ।పూ 1400కు నించుమించుదియైయున్నది. దీనికిఁ దరువాతనెపుడు రాసులు అంశములు మొదలుగా విభాగాత్మకమైన గణితము స్థిరముచేయఁబడెను

మరియు క్రీస్తు శకారంభమునకు దాదాపున గ్రోత్తసిద్ధాంతములు వ్యాపకమయ్యెను. ఆ సమయమున వైదుసంవత్సరములకొక యుగమనెడి వ్యవహారమును విడిచి, ఏ మాసమందు సూర్యసంక్రాంతికాదో, అది యధిక మాసమగును మఱిదేనియందు రెండు సూర్యసంక్రాంతులగునో అది క్షయ మాసముగను జెప్పబడునని నవీనము సూక్ష్మమునగు సిద్ధాంతము స్థిరము చేయఁబడెను. ఈ సిద్ధాంతమే నేఁటివఱకు వ్యాపకమైయున్నది. దీనిఁ బట్టి, చాంద్రవర్షములు, క్రీస్తునకిటీవల, అవశ్యము బొత్తిగా ఆగి (బందయి)పోయెనని ప్రకటమగుచున్నది. ఇదియైతే నిర్వివాదమే; కాని, వేదాంగజ్యోతిషమునకుఁ బిమ్మటఁగూడ చాంద్రవర్ష ప్రచారము లేకుండె ననియు దెలియుచున్నది, ఎందుచేతననఁగా వేదాంగ జ్యోతిషములో చాంద్రవర్షము యొక్క యుల్లేఖము బొత్తిగా లేకున్నది. దీనిఁబట్టి, భార తీయ యుద్ధము వేదాంగ జ్యోతిషమునకు జాలముందు జరగెనని యను మానము బయలుదేఱుచున్నది

భారతీయయుద్ధము వేదాంగజ్యోతిషమునకు జాలముందు జరగెనని యనుమానము సిద్ధించుటకై కొంచెము కాదణమున్నది. దానివిషయమై మనమింకను విచారింపవలయును. దీక్షితుఁడు, వైదికకాలములో నధిక మాసము ఎన్నిమాసములకు నుంచుచుండిరో యిది తెలియుటకై సాధన మేమియు లేదని చెప్పుచున్నాఁడు. వేదాంగజ్యోతిషము, 30 మాసముల కధికమాసము కావలయునని చెప్పియున్నది. వేదాంగకాలమందు నియమ మున్నపుడు, దీనివిషయమై వేదకాలమందును ఒకానొక నియమమవశ్యము ఉండును. భీష్మునిచేత జెప్పఁబడిన వచనమునందు ఈ నియమ మగపడు చున్నదని మనమతము. అయిదు సంవత్సరములయందు నొకమాటు రెండు మాసములధికముగా నుంచెడి యాచారము, భారతీయయుద్ధసమయమున అనఁగా తైత్తిరీయ సంహితయొక్క బ్రాహ్మణ గ్రంథముయొక్కయు సమయమున నుండియుండునని మనమతము. దీనికొక ప్రమాణమున్నది. పంచవర్షములలోని భిన్నభిన్నములు సంవత్సర, పరివత్సర, ఇదావత్సర ప్రభృతికనామములతో గనఁబడుచున్నవి. ఋగ్వేద సంహితా మంత్ర మందును రెండునామములున్నవి. అనఁగాపంచసంవత్సరయుగము వేదాంగ జ్యోతిషముకన్న ముందటిదియైయున్నది. పంచవర్షములయందు రెండు మాసములొక్కమాటు అధికముగా గలిపెడు నాచారము సంహితా కాల ములో ప్రబలితమైయుండును. ఈ వ్యవస్థనుబట్టి ఋతువునందు దిరుగ

న్యూనాధికత కానారంభమయ్యెను. ఇందులకై కొన్ని యేండ్ల తరువాతనొక క్షయమాసనుంచెడుపద్ధతి యారంభమయ్యెను. తాత్పర్యము, బ్రాహ్మణ కాలమందు రెండధికమాసములను నొక క్షయమాసమును నుంచెడుపద్ధతి యుండియుండును. వాజసనేయి సంహితలో బండ్రెండు నెలలకు బండ్రెండు మలిమ్లుచము, అంహస్పతి యునామములుగాక మూడునామములు సన్సర్ప, నీయఁబడియున్నవి. వీటిలో సన్సర్ప, మలిమ్లుచములు అధికమాసములకు పేరులై యున్నవి అంహస్పతిక్షయమాసమునకు పేరై యున్నది. ఇపుడు ప్రశ్న మేమనఁగా అధికమాసమునకు నామములు రెండు ఎందుల కుంచ బడినవి? అనుమానమునుబట్టి, ముప్పది నెలల తరువాత నొక యధిక మాసమగుననెడి వేదాంగ కాలీనమైన నియమము బ్రాహ్మణ కాలమందు లేకుండెనని తెలియుచున్నది. ఆ సమయమందు, పంచవర్షములకు బిమ్మట రెండు నెలల గలుపవలయునని నియమముండియుండును. ఆ రెండింటికి నీభిన్న భిన్నములైన నామములుండియుండును. సారాంశము, భీష్మునివచనమునుబట్టి యైదైదేండ్లయందు రెండధిక మాసములుండుట కనఁబడుచున్నది. ఈ రీతి వేదాంగమునకు మునుపటిదియని సిద్ధమగుచున్నది; అనగా దానిసమయము క్రీ॥ పూ. 3101 వర్షమని మన్నించుటకు నేయాటంకమును కాకున్నది.

ఇచ్చట నీశంకకలుగును ఏమనఁగా మునుపు చాంద్రవర్షమును మన్నించుచుండిరేని, అనఁగా లౌకిక, వైదికవ్యవహారములతో చాంద్ర వర్షముయొక్క యుపయోగమగుచుండినయెడల, అపుడు ఆ నెలలకు నామములేమియుండును? అధికమాసములు జతపఱుపఁబడలేదని, అపుడు, ప్రతిమాసము పౌర్ణిమ యీ నక్షత్రమందే యుండెనని యీ నియమము కూడ నుండఁజాలదు; అనఁగా చైత్ర, వైశాఖాదినామములుకూడ నుండ జాలవు కారణమేమనఁగా ఈనామములు, ఆయా నెలలయొక్క పౌర్ణ మాసులమీఁద నున్న నక్షత్రములఁబట్టి ప్రాప్తములైనవి. దీనికుత్తర మేమనఁగా మొదట చైత్ర, వైశాఖాది నామములయొక్క ప్రచారము నిజముగనే లేకుండెను. సంహితా, బ్రాహ్మణ గ్రంథములయందు చైత్రాదిమాసములయొక్క నామములు ఎచ్చటను గనఁబడవు, దానిఁబట్టి యవి ప్రచారమందు లేకుండుట సిద్ధమగుచున్నది. పౌర్ణిమకు ఫాల్గుని మొదలుగా సంజ్ఞలు ప్రచారములోనికి వచ్చిన తరువాతఁగూడ నెలలకు ఫాల్గునాదినామములు ప్రచారములోనికి వచ్చుటకై చాలకాలముపట్టెను. (దీక్షిత. పేజీ 36) మొదట మాసములకు రెండు విధములైన నామము

లుండెను. మధు, మాధవాది నామములవలె అరుణ, అరుణరజ ఆది నామము రెండవవియుండెను. ఈ నామములు తైత్తిరీయ బ్రాహ్మణములో వచ్చియున్నవి. మధ్వాది నామములైతే ఋతువాచకములైయున్నవి, కాని చాంద్రవర్షము ఋతువులకు ననుకూలమైనది కాదు. ఇందుకై రెండవ నామములు చాంద్ర వర్షముయొక్క మాసములకునై యుండును. ఏ సమయమున సౌరవర్షము మాత్రము ప్రచలితమైయుండెనో, ఆ సమయముననే చైత్ర, వైశాఖాది మాసములయొక్క ప్రచారమయ్యెను. చాంద్రవర్షము అప్రచలితమైయున్నమీఁద జాంద్ర మాసముల యొక్క మునుపటి నామములు కూడ స్వాభావికముగా లుప్తములయ్యెను. ఇంతియేకాదు ఇపుడయ్యవిలోకులకుఁ దెలియనుగూడ దెలియవు. చాంద్రవర్షము అప్రచలితమైనతరువాత చైత్రాదినామముల యొక్క ప్రచారమయ్యెను. దీక్షితుఁడు ఈ నామములయొక్క ప్రచారమెప్పటినుండియయ్యెనో చెప్పియున్నాఁడు. వీటియొక్క ప్రచారము క్రీ. పూ. రమారమిగా 2000యొక్క సమయమున నయ్యెను (దీక్షిత; పేజీ 102), అనఁగా 2000కు బిమ్మట జాంద్రవర్షము ప్రచలితమైయున్నపుడు జరిగెను; కనుక దానియొక్కసమయము క్రీ. పూ. 2000కుముందు కావలయును. వర్తమాన భారతమందు చైత్ర, వైశాఖాదిమాసముల యొక్క నామములు కనబడుచున్నవి; కాని మహాభారతసమయము క్రీస్తునకు దాదాపు 3000 వర్షపూర్వమైయున్నది; అనఁగా ఆ సమయమున చైత్రవైశాఖాది నామములే ప్రచారములో నుండెను మునుపటి నామములన్నియు నప్రచలితములై యున్నకారణముచేత నయ్యవిమహాభారతములో గనఁబడకయున్నవి.

మనము, పాండవులుభారతీయయుద్ధకాలమున లౌకికవ్యవహారమందు చాంద్రవర్షము నుపయోగించుచుండిరని విశ్వసించియే భీష్మునియొక్క వచనము నాదరించియున్నాము. కాని యిపుడు మనము, చతుర్ధర టీకాకారుఁడు రెండవ విధముగా దానికి ఏ యర్థమును జెప్పుటకై ప్రయత్నము చేసియున్నాడో, అది యెంతవఱకు సరిగానున్నదో యిది చూడవలసియున్నది. అతఁడు అనుచున్నాఁడు.

"షష్ఠ్యధిక శతత్రయ దినాత్మా సావనః। స ఏవ ద్వాదశ వార్షికాదిషు గవామయనాదిషు ఉపయుజ్యతే, త్రీణిశతాని పంచ

పంచషష్ఠిదినానిపఞ్చదశ ఘటికా ఇత్యాది సౌరవత్సరమానం స్మార్తే।
వర్ధాపనాదౌ తు చాన్ద్రేణ।"

అర్థము:— "సావనవర్షము 360దినములది యగుచున్నది. అది గవామయనాది సత్రములయందు నుపయోగించుచున్నది. సౌరవర్షముయొక్క మానము 365దినములును 15 గడియలు నగుచున్నది. ఇది స్మార్తకర్మల యందు అనఁగా స్మృతియందుఁ జెప్పఁబడిన కర్మనుల విషయమై పనికి వచ్చుచున్నది వర్ధాపనాదులయందు (వడ్డీ లెక్కచేయుట మొదలైన వాటి యందు) చాంద్రవర్ష ముపయోగించుచున్నది" చతుర్ధరుఁడు ఈ సంగతి దనసమయము విషయమునఁ జెప్పియున్నాఁడు; అది యేమాత్రము భారతీయ యుద్ధసమయపుదికాదు. తైత్తిరీయమందు, గవామయనాది సత్రముల విషయమైకూడ చాంద్రవర్షమును మన్నించుటకు నిషేధము లేదని చెప్పియున్నది. 365¼ దినములయొక్క సౌరవర్షము వేదాంగ జ్యోతిషమునకు బొత్తిగా దెలియనే తెలియదు. కాని చతుర్ధరునియొక్క మతము మీఁద ముఖ్యమైన యాక్షేపమేమనఁగా శ్రౌతధర్మమందు సావనవర్షమును అట్లు వడ్డీ, జూదము, వ్యవహారములు వీటియందు చాంద్రవర్షమును మన్నింపవలయునని నిశ్చితమైన నియమమున్నయెడల, అయ్యది దుర్యోధనునికిఁ దెలియకుండెనా? ద్రోణునికిఁగూడ దెలియకుండెనా? ఇట్టి నియమమున్నచో జగడమెందులకయ్యెను? అని. సారాంశమేమనఁగా, చతుర్ధరుఁడు చేసినయర్థము మన్నింపఁదగినదికాదు; పాండవులు చాంద్రవర్షమును మన్నించుచుండిరనియు దుర్యోధనాది కౌరవులు సౌరవర్షమును మన్నించుచుండిరనియే యొప్పుకొనవలసియున్నది.

పై ప్రమాణముఁబట్టియు భారతీయ యుద్ధము అత్యంత ప్రాచీన కాలమున నయ్యెనని సిద్ధించుచున్నది.

### ఏమి? పాండవులు వనవాసముయొక్క ప్రతిజ్ఞను చాంద్రమానముబట్టి పూర్తిచేసిరా?

ఈ విషయమునకు సంబంధించియున్న యొక ప్రశ్న మిదియై యున్నది. పాండవులు వనవాసమునకై యెప్పుడు వెడలిరి మఱియెప్పుడు వెల్లడియైరి? ఈ ప్రశ్నమును జాలమంది చేసియున్నారు. కొందఱు పాఠకులయొక్క యిచ్ఛ, పాండవులు వనవాసముయొక్కయు నజ్ఞాతవాసము యొక్కయు సమయమును చాంద్రవర్షముచేతఁగూడ బూర్తిచేసిరా లేదా యని తెలిసికొనుటకుఁగూడ నయియుండును. అవఁగా పాండవులయొక్క

ప్రణపాలనము చాంద్రమానముచేత సిద్ధించుచున్నదో లేదో యని చూడవలసియున్నది. మహాభారతమందుఁ జెప్పఁబడిన పరిస్థితి కొంచెము సందిగ్ధమై యున్నది. అయినను మనము ఈ ప్రశ్నమును విప్పుటకై ప్రయత్నింతము. మహాభారతమందు, పాండవులు వనవాసముకై యెప్పుడు వెళ్ళిరో యీ సంగతియొక్క యుల్లేఖము ఎందును లేకున్నది. మహాభారతములో జూదముయొక్క మాసములయు, మితియు లేక ఋతువులయు నుల్లేఖ మెచ్చటను లేదు. చతుర్ధరుఁడు తనటీకలో, పాండవులు ఆశ్వయుజ, కార్తికమాసములయందు జూదమాడి యుందురని యొప్పియున్నాఁడు. ఇట్లు సమ్మతించుట సాధారణ వ్యవహారముకను కూలముగానున్నది, ఎందుచేతననఁగా దసరా మొదలుకొని దీపావళి వఱకు నన్నిచోటులను లోకులు జూదమాడుచున్నారు. అగుఁగాక; గోగ్రహణ సమయమున ముందుగా నర్జునుఁడు వెల్లడియయ్యెననియు దుర్యోధనాదులు వానిని గుర్తించిరనియు వర్ణనము కనఁబడుచున్నది. అతనియొక్క రథముకూడ నచ్చటికి వచ్చి యతనిఁగలిసికొనెను. అతఁడు తన చేతి గాజులఁబగులఁగొట్టెను మరియుఁ జెవులనుండి సువర్ణకుండలములను వెలువరించెను. మహాభారతమందు, ఈ గోగ్రహణము యొక్క గడువు చెప్పఁబడియున్నది; కాని దానియొక్క మాసముచెప్పబడకుండుట యాశ్చర్యవిషము. విరాట పర్వముయొక్క 31వ యధ్యాయమందు, సుశర్మ కృష్ణపక్షసప్తమికి గోగ్రహణముకై దక్షిణమునకు నరిగెనని చెప్పఁబడియున్నది; మరియు నచ్చటనే, ఉత్తరగోగ్రహణము కొఱకుఁ గౌరవులు కృష్ణపక్షాష్టమికి (రెండవదినముకే) వెళ్ళిరనియుఁ జెప్పబడియున్నది; కాని, కృష్ణపక్షముయొక్క సప్తమి కాక అష్టమి యేమాసములోనిదో యిది చెప్పఁబడదయ్యెను. మనము, మార్గశీర్షాది మాసముల యొక్క నామములు భారతీయయుద్ధమునకుఁ బిదపఁ బ్రచలితములయ్యెనని చెప్పియున్నారము. చాంద్రమాసమునకు ఏ అరుణ, అరుణరజ ఆది నామములు ఆ సమయమునఁ బ్రచలితములై యుండెనో, వాటిలో నొక సగము నామము మూలభారతమందు నుండిపోయినయెడల నాశ్చర్యమేమియును లేదు. ఈ నామము తరువాత లుప్తమైయుండును. ఏదియో యొకటి యగుఁగాక, కృష్ణపక్షముయొక్క యీ సప్తమి గ్రీష్మఋతువులోనిదిగాఁ దెలియుచున్నది, ఎందుచేతననఁగా ఆ సమయమున గ్రీష్మఋతువైనట్లు వర్ణనమున్నది (విరాట1 అ.47) దీనిఁబట్టి, యీ అష్టమి,

సౌరజ్యేష్ఠ కృష్ణపక్షాష్టమి యగునని తెలియుచున్నది. జ్యేష్ఠకృష్ణాష్టమికి పదమూఁడేఁడ్లు పూర్తికావని చెప్పఁబడఁజాలదు. ఆ దినమున యుధిష్ఠిరుఁడు విరాటరాజుయొక్క చేతి పాచికయొక్క దెబ్బను సహించెను; కాని దీనికిఁగారణము, ఆ దినమున వారు వెల్లడికాఁజాలకుండుటకాదు — దీనికిగారణము, ఆ సమయమున వెల్లడియగుటమంచిదికాదని తోఁచుటయే యైయుండెను. ఉచితమైన సమయమును జూచికొని పాండవులు ఒక్కమాఱు వెల్లడియైరని తరువాత వర్ణనముచేయఁబడియేయున్నది. ఇదిగాక, ప్రారంభమున 31వ యధ్యాయమందుఁ జెప్పఁబడియున్నది. ఏమనఁగా—"పిదప నా పదమూఁడవయేఁడునకుఁ జివర సుశర్మ విరటునియొక్క గోవులను హరించెను." ఇందు విస్పష్టముగా, కృష్ణపక్షసప్తమికి త్రయోదశవర్షములు పూర్తియై పోయియుండెనని చెప్పఁబడియున్నది. అష్టమినాఁడు అర్జునుఁడు వెల్లడియయ్యెను, కాని యీ నియతసమయమునకు రెన్నాళ్లు ముందుగా వెల్లడికాలేదు. ప్రతిజ్ఞాసమయమునకు రెండుదినములుతప్పియున్న, అప్పుడు దుర్యోధనుఁడుకూడ నింతజగడము చేయకుండుననియు స్పష్టమైయున్నది. సౌరవర్షమానముఁబట్టి, ఆశ్వయుజ కృష్ణపక్షాష్టమినాఁడు లేక దానికి దాదాపున జూదమయ్యెననియు ఆశ్వయుజమునకు ముందే జ్యేష్ఠ కృష్ణాష్టమినాఁడు అర్జునుఁడు గుఱుతింపఁబడియెననియు, దుర్యోధనునియొక్క యభిప్రాయము, అనఁగా నతఁడు నియతసమయమునకు నాల్గునెలలుముందుగానే వెల్లడియయ్యెను; కాఁబట్టి పాండవులు తిరుగ వనవాసము ననుభవింపవలయునను దుర్యోధనుయొక్క భాషణముఁబట్టి, పాండవులెన్నిదినములకు ముందు వెల్లడియైరో యీ సంగతి చూపఁబడఁజాలదు అయినను, రెండే దినములయొక్క వ్యవధి మిగిలియుండెనని మాత్రము చెప్పఁబడఁజాలదు "కృష్ణాష్టమికి దుర్యోధనాది మిత్రమండలి గోగ్రమాణముకొఱకు నేఁగిరి" ఈయుల్లేఖము నందు మాసముయొక్క పేరులేకున్నది. దీనిఁబట్టి, కేవలము తిథికి మహత్త్వ మూహింపఁబడియుండుట సంభవమగుచున్నది. కాని, దశమినాఁడు పాండవులందఱు వెల్లడియై విరాటునిగద్దెపైఁ గూరుచుండిరి; ఈ కథనముఁబట్టి దశమికి అవధి ముగియుచున్నదని చెప్పఁబడఁజాలదు. అన్యప్రమాణములఁబట్టియు, కేవలము రెండే దినములయొక్క యంతరము కాకుండెనని సిద్ధముచేయఁబడఁజాలదు. ఎపుడు గోగ్రహణముయొక్క నిశ్చయము చేయఁబడెనో అప్పటివాదవివాదమును ధ్యానములో నుంచు

కొనవలయును. 25వ యధ్యాయమందు, పాండవులను వెదకుటకై పంపిన దూతలు మఱలివచ్చి చెప్పియున్నారు ఏమనఁగా — "పాండవులయొక్క జాడ దొరకలేదు. విరాటనగరమున గంధర్వులు కీచకుని జంపివైచిరని మాత్రము తెలియుచున్నది." అపుడు దుర్యోధనుఁడు చెప్పమొదలిడెను— "పాండవులను దెలిసికొనుట కవశ్యము ప్రారంభింపవలయును. పాండవుల యజ్ఞాతవాస సమయము చాలమట్టు ముగిసియున్నది; బొత్తిగా గొలఁది సమయము మిగిలియున్నది. వారు తమ ప్రతిజ్ఞను బూర్తిచేసివత్తురేని, అపుడు వారుమనమీఁదికి దండెత్తుదురు." ఈ వాక్యమునుబట్టి, విశేషించి యెంత యవధి మిగిలియున్నదో నిజము తెలియదు; కాని కర్ణునియొక్క భవిష్యద్భాషణముఁబట్టి యిది నిశ్చితమగుచున్నది. కర్ణుఁడు చెప్ప నారంభించెను — "మహారాజా! పాండవులను వెదకుటకై తెలివిగలవాఁడును నేర్పఱియునైన యింకొకదూతను వెంటనే పంపవలయును." దీనిని విని దుర్యోధనుఁడు దుశ్శాసనునికి శీఘ్రమే మఱియొక గూఢచారుని బంపమని యాజ్ఞయిచ్చెను. దీనిఁబట్టి, మఱియొక దూతనుబంపి పాండవులను వెదకించుటకై యవధి మిగిలి యుండెనని ప్రకటమగుచున్నది. రెండు దినములే యవధియున్నచో, మఱియొకదూతను బంపుటచేత నేమియు లాభముండదు. ఎనిమిదినెలల యవధి ముగిసియుండుటయు నాలుగు మాసములది మిగిలియుండుటయు సంభవమయియున్నది. ఇదే సభయందు, కీచకుఁడు పరాభవించిన త్రిగర్తరాజు సుశర్మయు కూర్చుండియుండెను. అతఁడు విరాటునిపై దండెత్తుటకు సలహానిచ్చెను. ఈ యాలోచన సరిగా నున్నదని యూహించి విరాటుపై దండువెడలిరి. ఈ యాక్రమణములో పాండవులను వెల్లచేయుటఁ జేయించుటగుఱించి విచారను బొత్తిగా లేకుండెను. ఈ సంగతి యాకస్మికముగానయ్యెను. అందఱును జెప్పిన సంగతులఁబట్టియు, అప్పటికి నాలుగునెలల యవధి మిగిలియుండెననియే యగపడుచున్నది. చాంద్ర, సౌరమానములలో నాలుగునెలలయంతరము తటస్థించెననియు స్పష్టమగుచున్నది. పాండవులు నాలుగు నెలలకుముందే గుఱుతింపఁబడిరని యూహించి దుర్యోధనుఁడుచెప్పెను — "అజ్ఞాత వాసముయొక్క పదుమూఁడవయేఁడు ఇప్పటివఱకు సమాప్తముకాలేదు. రాజ్యలోభముచేత అంధులైనకారణమున వారికీ సంగతియొక్క జ్ఞప్తి లేకపోయియుండును; లేక కాలగణనవిషయమై మనదృఢనిశ్చయమే భ్రమపూర్ణమై కావలయును. ఇందుఁగల సత్యములను భీష్ముఁడు చెప్పనగును."

దీనిఁబట్టి దుర్యోధనునియొక్కయు మనసునందు శంకయుండుట సిద్ధమగు చున్నది. అతనియొక్క మనస్సునందుఁ, పాండవులు చాంద్రవర్షమును బాటించుచున్నట్లు సందేహముండెనని తెలియుచున్నది. కనుక నొకప్పుడు వారియొక్క పదుమూఁడేండ్లు పూర్తియైపోయియుండును. ఆశ్వయుజ, జ్యేష్ఠాదిమాసములయొక్క క్రమము అప్పటికారంభముకాకుండెను. కాని రెండిటినామము లోకరీతినే లేకుండియుండునని స్పష్టమగుచున్నది. అయిదేండ్లలో మోటులెక్కచేత రెండునెలలధికముగాఁ గలిపెడు నియమముఁబట్టి, భీష్ముఁడు చెప్పినదాని ననుసరించి, పదమూఁడేండ్లయందుఁ బదియేండ్లకు నాలుగుమాసములెక్కువైతే యయ్యనేయయ్యెను, కాని తరువాత నింకను 1 నెలయు 12 రాత్రులును వృద్ధినొందినవి. అనఁగా, భీష్ముఁడు చాంద్రమానముఁబట్టి పాండవులయొక్క పదుమూఁడేఁడులుఁ బూర్తియయ్యెనని నిర్ణయించెను. ఇంతకును సారామిది. ద్యూతము ఆశ్విన కృష్ణాష్టమిని సౌరవర్షమందు నయ్యెను. దానికిఁ దరువాతఁ త్రయోదశవర్షములయందును జాంద్రమాసములను వెనుకకు దొలగించిన జాంద్రమానముయొక్క 13వర్షములు గ్రీష్మమునందే పూర్తియయ్యెను. చాంద్రమానముయొక్క పదుమూఁడు వర్షములు సౌరజ్యేష్ఠకృష్ణ సప్తమికిఁ బూర్తియైనవి. ఆదినముననే దక్షిణమందు గోగ్రహణమును జేసెను. దీనిఁబట్టి, జ్యేష్ఠ కృష్ణాష్టమినాడు అర్జునుఁడు గుర్తింపఁబడియెననియు దశమినాడు పాండవులుయోగ్యరీతిని విరాటునిసభయందు వెల్లడియైరనియే సంబంధము సరిగానున్నది. ప్రస్తుతసమయమున మహాభారతమందుఁ గేవలము సప్త, మ్యష్టములయొక్క యుల్లేఖమున్నది, మాసముయొక్క యుల్లేఖములేదు. ఇందుచేతనే యీ భ్రమముత్పన్నమగుచున్నది.

దీని తరువాతి ఘటనను మితితోఁగూడ గలుపవలయును. దీనికిఁ బిమ్మట విరాటనగరమందు జరగిన యుత్తరాభిమన్యుల వివాహము ఆషాడశుద్ధ 11 వఱకు జరగియుండును. శ్రీకృష్ణుఁడు, అభిమన్యుఁడు లోనగువారు ద్వారకనుండి వచ్చినతరువాత నీ వివాహము జరగెను. అంతట నందఱును బోగయి, ఉపప్లావ్యనామకమైన సీమాస్థానము నొద్ద వసించి యుద్ధసామగ్రిని సంగ్రహింపమొదలిడిరి. కార్తికశుద్ధమందు శ్రీకృష్ణుఁడు రాజదూతయై సంధియొక్క నియమము (షరతు) లను నిర్ణయింపనరిగెను. వాటియొక్క సాఫల్యము కాదయ్యెను. మార్గశీర్ష శుద్ధ త్రయోదశియందు యుద్ధమారంభమై పదునెనిమిది దినములవఱకు

జరగెను. అందు నభిమన్యుఁడు చంపఁబడెను. వివాహసమయమునకు ఉత్తరకు వయస్సువచ్చియుండెను, కనుక నామెకు గర్భముగుట సంభవము తనపతి యుద్ధమునఁ జనిపోవునప్పటికి నామె మూఁడు నాలుగు నెలల గర్భముకలదియైయుండును. పిమ్మట ఫాల్గుణమునందు నామె ప్రసవించెను. అపుడు చనిపోయిన పిల్లవాఁడు పుట్టెను. గర్భధారణ సమయమున భర్తయొక్క మరణ దుఃఖముచేత నిట్లైపోవుట సంభవము. ఆమృత బాలకుని శ్రీకృష్ణుఁడు తన దివ్యప్రభావముచేత బ్రతికించెను. అపుడు పాండవులు హస్తినాపురమునలేరు; వారు ద్రవ్యమును దీసికొనివచ్చుటకై హిమాలయమునకు వెళ్ళియుండిరి. వారు మఱల వచ్చినతరువాత, చైత్రపౌర్ణమినాడు యుధిష్ఠిరుఁడు అశ్వమేధదీక్ష గైకొనెనని చెప్పఁబడియున్నది. దీనికి దగ్గఱదగ్గఱగా నొక నెలకుముందు పరీక్షిత్తుయొక్క జన్మమయియుండెననికూడ జెప్పఁబడియున్నది. అనఁగా అతనియొక్క జననము ఫాల్గునమందయ్యెను. అది యల్పదినములయందు అనఁగా ఉచిత సమయమునకు ముందు (ఆరునెలలయందు) జరగెన; కనుక వాని తల్లిదండ్రుల వివాహము తక్కువలో దక్కువ యాషాఢమందు నైయుండును. ఈ క్రమముబట్టిగోగ్రహణమాసము జ్యేష్ఠమేఅని నిశ్చితమగుచున్నది. చతుర్ధరటీకాకారుఁడు పాండవులు వెల్లడియైన సమయమును చైత్రశుద్ధ దశమియని చెప్పియున్నాఁడు; అది యసత్యమైయున్నది మొదటి సంగతి యేమనఁగా, గ్రీష్మఋతువయ్యెనని స్పష్టముగాఁ జెప్పుటచేత గోగ్రహణము చైత్రమందగుట మన్నింపఁబడఁజాలదు. రెండవసంగతి, చతుర్ధరుఁడు అంచనాబట్టి, జూదము ఆశ్వినమందయ్యెనని యేదివ్రాసియున్నాడో అయ్యది సరిగానున్నది. అపుడు చైత్రమునుండి యారుమాసములే యగుచున్నవి. దుర్యోధనునియొక్క యూహానుసారముగా నజ్ఞాతవాసములో సగమే కడచియుండెను — ఇంతకంటె నేమియు నెక్కువ సమయము కడవఁబడియుండదు. ఇట్టిస్థితిలో చాలమట్టున కెక్కువకాలము దాటిపోయెనని దుర్యోధనుఁడు చెప్పిన యీ కథనముతో విరోధము కలుగుచున్నది. ఇదియుఁగాక, అయిదు మాసములును నధికమాసపువి యగుచున్నవి మరియు భీష్మవచనముతో సంబంధము కుదురదు. అన్ని సంగతులను విచారింపఁగా జూదముయొక్క మితియాశ్వయుజకృష్ణాష్టమి యనియే సరిగా దోఁచుచున్నది. స్త్రీ పర్వముయొక్క 20వ యధ్యాయ

మందు, ఉత్తరయొక్క విలాపములో నిట్లు చెప్పఁబడియున్నది – "నాకును మీకును సమాగమ మారుమాసములదియై యుండెను. ఏడవ మాసమందు మీకు మృత్యువయ్యెను." దీనిఁబట్టి వివాహము వైశాఖ మందగుటసరియైనదిగా నచ్చదు. జ్యేష్ఠబహుళమని సరిగా దోఁచుచున్నది. అనఁగా మార్గశీర్ష కృష్ణపక్షైకాదశికి నారుమాసములు పూర్తి యగుచున్నవి. ఈ యాశ్విన జ్యేష్ఠాదిమాసములు సౌరవర్షపువియేయగుచున్నవి. ఈ నామములు భారతీయ యుద్ధము తరువాతి పద్ధతిననుసరించి చెప్పఁబడి యున్నవని జ్ఞప్తియుంచుకొనవలయును. ఉక్తవివేచనఁబట్టి, పాండవులు తమ నియమము (షరతు)ను జాంద్రమానము చేతఁబూర్తిచేసిరని తెలియు చున్నది. కాబట్టి, పాండవులు చాంద్రమానవర్షములను మన్నించు చుండిరను సిద్ధాంతము దృఢపడుచున్నది. ఈ యీ రీతులఁబట్టి మనము భారతీయ యుద్ధముయొక్క యే సమయమును వైదికకాలీన శతపథ బ్రాహ్మణమునకు ముందని చెప్పియున్నామో, దానియొక్క సమర్థన మగుచున్నది.

## గ్రహస్థితి నాధారముచేసికొని యుద్ధసమయమును నిశ్చయించు ప్రయత్నము

ఇపుడు చివరమనకు, యుద్ధకాల గ్రహస్థితియొక్క యే వర్ణనము మహాభారతమందు, విశేషించి యుద్యోగపర్వము యొక్క తుదిని మరియు భీష్మపర్వముయొక్క మొదట వచ్చియున్నదో, దాని యాధారముమీద బరలోకవాసియగు మోడక్కు భారతీయయుద్ధకాలమును జెప్పుటకై చేసిన ప్రయత్నము ఎంతవఱకు సఫలమయ్యెనో యిది చూచుటమిగిలియున్నది. దీనితోఁగూడ భారతీయయుద్ధముయొక్క పంచాంగము, అనఁగా మితివార ఘటనాదులైన యితర విషయములును విచారింపఁదగియున్నవి. ఇందు కొఱకు, ఏవి యీ విషయమై మహాభారతములో భిన్నభిన్న స్థానముల యందు జెప్పఁబడియున్నవో, వేటియందు నీ సంగతులయొక్క విచార మన్నిదృష్టులఁబట్టియు సరిగాఁ జేయఁబడఁగలదో, ఆయన్నివచనములను నిచ్చటికిఁ దెచ్చి వ్రాగుచేయవలయును. మొదటి సంగతి యేమనఁగా, శ్రీకృష్ణుఁడు దూత్యమును జేయుటకై కౌరవులదగ్గఱకు నేగుటకు బయలుదేఱిన తటి యాతఁడు·

కౌముదే మాసి రేవత్యాం శరద న్తే హిమాగమే ।

అనఁగా కార్తికమాసములో రేవతీనక్షత్రమందు వెడలియుండెను. ఆ దినమున రేవతీనక్షత్రముండెను. దీనిఁబట్టి యీ దినము శుద్ధత్రయోదశి గనే తెలియుచున్నది. ఒకప్పు డొకటి రెండు దినములు ముందు వెనుకలఁ గూడఁ గావచ్చును. ఉపప్లావ్యము నుండి హస్తినాపురమునకు వెళ్లుటకై యతనికి రెండు దినములు పట్టెను. హస్తినాపురమం దతఁడు నాలుగైదు దినములుండుట తటస్థించెను. అచ్చటినుండి వచ్చునపుడు అతఁడు కర్ణునితోఁ గలసికొనెను. ఈ కలయికయందుఁ గర్ణుఁడు సంభాషించెను. ఆ భాషణములోఁ గర్ణుఁ డీప్రకారముగా గ్రహస్థితి వర్ణించియున్నాఁడు— "ఉగ్రగ్రహమైన శని రోహిణీనక్షత్రమందు అంగారకుని బీడించుచున్నాఁడు. జ్యేష్ఠానక్షత్రమందు నంగారకుఁడు వక్రించి యనురాధా నక్షత్రముతోఁ గలియుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు. మహాపాత నామకమైన గ్రహము చిత్తానక్షత్రమును బీడించుచున్నది. చంద్రునియొక్క చిహ్నములు మాఱిపోయినవి మరియు రాహువు సూర్యుని గ్రసింపఁబోవుచున్నాఁడు." (ఉద్యోగ 1 అ 143) దీనికిఁ బిదప శ్రీకృష్ణుఁడు మరలివెళ్లెను దుర్యోధనుఁడును దన సేనలను బ్రోగుచేసికొని పుష్యనక్షత్ర ముహూర్తమందుఁ గురుక్షేత్రమువైపునకుఁ బ్రయాణము చేసెను. ఆ దినము కార్తికబహుళ షష్ఠియై యుండును. కార్తికమందుఁ బుష్యనక్షత్రము తఱచు బహుల షష్ఠికి లేక సప్తమికే వచ్చుచున్నదని పాఠకులు జ్ఞప్తియుంచుకొనవలయును. దీనికి ముందటిదగు 142వ యధ్యాయముయొక్క యంతమున శ్రీకృష్ణుఁడు కర్ణునితోఁ జెప్పియున్నాఁడు— "బురద యెండిపోయినది నీరు బాగుగాఁ దేఱినది. గాలి కూడ మిగుల వెచ్చగను జల్లగను లేదు. ఈ నెల యన్నివిధముల చేతను సుఖదాయకమై యున్నది ఇఁక నేడు దినములలో నమావాస్య కాఁగలదు అమావాస్యకు దేవత యింద్రుఁడై యున్నాఁడు. యుద్ధమారంభించుటకై యిది యనుకూలస్థితియై యున్నది. అమావాస్యయందే యుద్ధారంభము కానిమ్ము" దీనిఁబట్టి, శ్రీకృష్ణుఁడు వెడలిన దినముననే దుర్యోధనుఁడు తన సేనలను గుమికూర్చియుండెనని తెలియుచున్నది. ఈ భాషణమునకును దరువాతి భీష్మభాషణమునకును మైత్రి గుదుర్పఁగా, కార్తిక బహుళామావాస్య 13 దినములలోనై యుండునని తెలియుచున్నది. భీష్మపర్వారంభమున ధృతరాష్ట్రుని గలిసికొని, వ్యాసుఁడు అతనిద్వారా యుద్ధము నరికట్టుటకుఁ బ్రయత్నము చేసెను;

కాని ప్రయోజనము లేకపోయెను. ఈ సమయమందు వ్యాసుఁడు కొంత యనిష్టకారకమైన గ్రహస్థితియొక్క వర్ణనమును జేసియున్నాఁడు; దానిని మనము తరువాతఁ జెప్పుదము. కాని యతఁడు తరువాత నీ వర్ణనము చేసియున్నాఁడు ఏమనఁగా— "14, 15, 16 దినముల పక్షములగుచున్న వని వినియున్నాను. కాని 13 దినముల పక్షము ఈ సమయముననే వచ్చి యున్నది. ఇది యెప్పుడును వినియుండని యోగము. దీనికంటెఁ గూడ నెక్కువ విపరీతమైన సంగతి యిది, ఏదనఁగా ఒకమాసమందుఁ జంద్ర సూర్యగ్రహణములు రెండును గలిగినవి అవియును త్రయోదశికి." దీనికిని శ్రీకృష్ణునియొక్క మునుపటి వచనమునకును మైత్రి గుదుర్పఁగా, ధృతరాష్ట్రుని గలిసికొనుటకై వ్యాసుఁడు మార్గశీర్షమున నేదోదినములో వెళ్ళియుండును. సంభవమునుబట్టి యతఁడు శుక్లపక్షమందే వెళ్ళియుండెను. దానికి మునుపటి పక్షము 13 దినములదయి యుండెను మరియు సమావాస్యనాఁడు సూర్యగ్రహణము అయియుండెను. ఒకేనెలలోనే రెండు గ్రహణము లయ్యెనని వర్ణనమున్నది. దీనిఁబట్టి, చంద్రగ్రహణము కార్తికపౌర్ణమినాఁడై యుండునని తెలియుచున్నది, ఈ గ్రహణము, శ్రీకృష్ణుఁడు హస్తినాపురమందున్నపుడు పట్టియుండును. ఇది యచ్చట నుల్లేఖము చేయబడకుండుట యేమియు మహత్త్వముగల సంగతికాదు. ఒకప్పుడిచ్చట, దర్శపౌర్ణిమలను విడిచివచ్చిన గ్రహణము అతిశయోక్తి యనియుఁ జెప్పుట సంభవము. దీనికిఁ దరువాత యుద్ధమారంభమయ్యెను; ఆదినము విషయమై యీ వాక్యము చెప్పఁబడినది.

మఘావిషయః సోమస్తద్దినం ప్రత్యపద్యత। దీనికిఁ దేలికఁగా, ఆ దినమునఁ జంద్రుఁడు మఘానక్షత్రము మీఁదికి వచ్చియుండెనని యే యర్థము తీయఁబడఁగలదు. తరువాత, శల్యపర్వములో నెపుడు యుద్ధాంతమున అనఁగా పదునెనిమిదవ దినమందు బలరాముఁడు వచ్చెనో, అపుడు అతఁడు చెప్పెను ఏమనఁగా—

పుష్యేణ సంప్రయాతోస్మి శ్రవణే పునరాగతః।

"నేను పుష్యనక్షత్రమందు వెళ్ళి శ్రవణమందుఁ దిరుగా వచ్చితిని." దీనిఁబట్టి యుద్ధముయొక్క పదునెనిమిదియవ దినమున శ్రవణానక్షత్రమునకుఁ బూర్వము పదునెనిమిదవ నక్షత్రముండవలయును; అనఁగా ఈ వాక్యమునుబట్టి, యుద్ధారంభమందుఁ జంద్రుఁడు మృగశీర్షమునందుండెనని తెలియుచున్నది. చంద్రుఁడు కొంచెము ముందు వెనుకఁగూడ నుండి

యుండుటయు సంభవించుచున్నది. అనఁగా ఆర్ద్ర పునర్వసు కావచ్చును, కాని మఘ కాఁజాలదు. తాత్పర్యము, వీటిలోఁగూడ నొకవాక్యమును ముఖ్యముగా నూహించి రెండవదానియొక్క యర్థమును మార్చవలయును. మనము ఈ రెండవవాక్యమును ముఖ్యముగా మన్నించి చంద్రుఁడుమృగశీర్షమునందు యుద్ధమునకు మొదటనుండుటను మన్నించుచున్నారము. శ్రీకృష్ణుఁడు, కార్తికామావాస్యనుండి యుద్ధము కానిమ్మని చెప్పియుండెను, కాని యట్లుకాలేదు. మార్గశీర్షమాసములో మృగనక్షత్రమందు యుద్ధమారంభమయ్యెనని తెలియుచున్నది. అనఁగా ఆదినము పౌర్ణిమ లేక శుక్లచతుర్దశిలేక అధికముకంటె నధికముత్రయోదశి యుండియుండును. భీష్మునియొక్క యుద్ధము పదిదినములు జరగెను; అనఁగా భీష్ముఁడు మార్గశీర్ష బహుళదశమిని, నవమిని లేక అష్టమిని బడిపోయెను దీనితరువాత ద్రోణునియొక్క యుద్ధము అయిదు దినములవఱకు నయ్యెను; అనఁగా ద్రోణుఁడు మార్గశీర్ష బహుళామావాస్యను లేక రెండు ఒకటి దినముల పిమ్మటఁ బడియుండును. కాని యిచ్చట, ద్రోణుఁడు బహుళత్రయోదశిని బడియుండెనని నిశ్చయపూర్వకముగాఁ దెలియుచున్నది; ఎందుచేత జయద్రథవధానంతరము రాత్రిగూడ యుద్ధముసాగెననియు ఒక జామురాత్రి మిగిలియుండఁగా చంద్రోదయమయ్యెననియు వర్ణనమున్నది. దీనిఁబట్టి, ఆరాత్రి ద్వాదశిదియైయుండునని తెలియుచున్నది. తరువాత కర్ణునిది రెండుదినములవఱకు అనఁగా మార్గశీర్ష బహుళామావాస్యవఱకు దుర్యోధనునిది. అట్లు శల్యునిది యొక దినము, పుష్యశుద్ధ 1ని యుద్ధము సాఁగియుండెను. దీనితరువాత మహాభారతములో మహత్త్వపూర్ణమైన వచనములు భీష్మునియొక్క మృత్యుసంబంధమునఁగలవు. అతని మృత్యువు మాఘమాసమందయ్యెను. అతనియొక్క యప్పటి తచవములను మృత్యుతిథిని మనము పిమ్మట విచారింతము. ఇంతదాఁక మనము స్థూలమానముచేత యుద్ధమితిసహితమైన పంచాంగమును దయారుచేసితిమి.

ఇపుడు మనము ముందుగా, ఏవి మహాభారతవచనములద్వారా అట్లు అందుఁ జెప్పఁబడిన నక్షత్రములయు గ్రహస్థితులయు ద్వారా యైతి

హాసికానుమానమును సిద్ధింపఁజేయునపుడు, వచ్చి యెదుర్కొనుచున్నవో, ఆ ముఖ్యకష్టములను విచారింతము. మనము మొదట, సౌతి మూల భారతమును విస్తృతముఁజేసెనని చెప్పియుంటిమి. ఇదే మొదటి యాటంకమై యున్నది. ఎందుచేత అని ప్రశ్నము బయలుదేఱుచున్నది ఏమనఁగా మూలభారతములోని వచనము లేవి? సౌతి చేతఁ బెంచఁబడిన వచనము లేవి? మూలభారతములోని వచనమగునేని అందు బహుధా ప్రత్యక్షస్థితి యొక్క వర్ణనమీయఁబడియుండునను సంగతికి నెక్కువ యోగ్యతకలదు. తరువాతివచనములు కాల్పనికములగుటచేత వాటినుండి యైతిహాసికానుమానములు వెడలింపఁబడఁజాలవు. అటువంటి సమయము గణితముఁబట్టి నిర్ణయింపఁబడు నేనియది విశ్వసనీయము కాఁజాలదు రెండవకష్టమిది యేదనఁగా దీనివిషయమై యనేకవచనములు — అవి సౌతివే యగుఁగాక లేక మొదటివే యగుఁగాక — పరస్పరవిరుద్ధములును కూటార్థకములునై యున్నవి, దానిఁబట్టి వాటికిఁగొంచెము భిన్నార్థమును మొలపింపవలసియున్నది. ఇటువంటి కూటశ్లోకములు తఱుచుగా సంఖ్యయందు రచింపబడియున్నవి. అవి సౌతివియైయుండునని మాయొక్క యనుమానము. ఈ సంఖ్యాసంబంధులైన కూటశ్లోకములెట్లున్నవో, యిందుకివిషయమై విరాటపర్వములోని యుదాహరణమీయఁదగియున్నది. అందు, గోగ్రహణమునాఁటికి అర్జునుఁడు గాండీవమును ధరించి 65 ఏండ్లయ్యెనని చెప్పఁబడినది. కాని యీ యఱువదియైదువత్సరములు సరిగా నిలఁబడవు. దీనియొక్క వివరణమును మనము మఱియొకచోట నిచ్చెదము. ఇచ్చట, 65వర్ష శబ్దమునకు నీ సందర్భములో గొంచెము భిన్నార్థమును మొలపింపవలయునని యింతయే చెప్పినఁజాలును. వాటియొక్క సంఖ్య సగము అనఁగా $32\frac{1}{2}$ సంవత్సరములు తీసికొనవలసియున్నది. ఈ విధముగా రెండుకష్టములు తటస్థించినవి. వీటిని విచారింపక పరస్పర విరోధము పుట్టుచున్నది వాక్యములన్నిటికిని మైత్రికూడ గుదుర్పఁబడఁజాలదు. ఎచ్చటనైన నొకానొక వచనము సాధారణమును స్వాభావికమునగురీతిని గేవలమునక్షత్రములేక తిథియొక్క యుల్లేఖవిషయమున వచ్చియున్నచో, దానిని సరలముగా నూహింపవలయునని మనము ముఖ్యముగా నియమము

చేసియుంటిమి; అనఁగా అదేదానికి ప్రధానార్థముగా జేయఁబడవలయును మరియు న్యాయర్థమునే యనుసరించి నడచి యుత్తరవచనములకు నర్థమును జెప్పవలయును, అదిమూలములోనిదియైనను సరే లేక తరువాతిదియైనను సరే. ఇదేవిధముగా నీ ప్రశ్నమును విప్పవలయును. అయినను మనము అన్నివచనములను మూలములోనివిగా నూహించియు వాటియొక్క విచారమును జేయుదము మరియు నిట్లుచేయుటవల్ల నేమి పరిణమించుచున్నదో యేమి యుపపత్తి తటస్థించుచున్నదో దీనికిఁగూడ దిగ్దర్శనము గావింతము.

ఇపుడు మొదటిసంగతి యిది. పై నీయఁబడిన శ్రీకృష్ణుఁడు, కర్ణుఁడు మరియు వ్యాసుఁడు వీరియొక్క వాక్యములఁబట్టి కార్తిక బహులామావాస్యను యుద్ధమునకు బూర్వము సూర్యగ్రహణము పట్టినదని మనము నిశ్చయముగా మన్నించుచున్నారము. కార్తిక శుద్ధ పౌర్ణిమను జంద్రగ్రహణమయియుండును; కాని యిది యంత నిశ్చయముగా జెప్పఁజాలము ఎందుచేత? వ్యాసునివచనముఁబట్టి, రెండు గ్రహణములు నొకేదినమునఁ దటస్థించియుండెనని ధ్వని బయలుదేఱుచున్నది, కాని యిట్లగుటసంభవముకాదు. కొందఱులౌకికులు, శ్రీకృష్ణుఁడు జయద్రథవధ సమయమున సూర్యునిమీఁద నావరణమును వినియోగించెనని కల్పన చేయబడినది కాని మనము ముందే, ఆ దినము అమావాస్య కాకుండెననియు, ద్వాదశియై యుండెననియే చూచియుంటిమి. ఆ దినమున బొత్తిగాఁ బ్రాతఃకాలమునకుఁ జంద్రోదయమగుట వర్ణింపఁబడినది. ఈ తిథి యొకటి రెండుదినములు ముందువెనుకఁగూడ నైయుండునని యొప్పుకొనఁబడునేని, ఆదినము (జయద్రథవధదినము) అమావాస్యయై యుండెననియు విశ్వసింపఁబడునేని, అపుడు ఒకే సంవత్సరమందు విడువక రెండు నెలలయందు అనఁగా కార్తికామావాస్యను మార్గశీర్షామావాస్యను సూర్యగ్రహణమగుట సంభవముకాదు. అపుడు, కార్తికబహులామావాస్యయొక్క గ్రహణమును సత్యముగా నూహింపవలయునా? అని ప్రశ్నము కలుగుచున్నది. కార్తికమాసముయొక్క గ్రహణము స్పష్టముగా శబ్దములయందు జెప్పఁబడియున్నది, కనుక దానిని సత్యముగా విశ్వసించుట సరియైనది. మార్గశీర్షములోని గ్రహణము కల్పలోజన్యమైయున్నది.

ఇదిగాక, జయద్రథవధ ప్రసంగమందు గ్రహణముచేత సూర్యునియొక్క లోపమయిపోయిన యెడల, అపుడు శ్రీకృష్ణునిమాయకు మహత్త్వము మాత్రమేమియుండెను? గ్రహణము ఖ(ఆకాశ)గ్రాసముకూడఁ గావలయును; అట్లుకాదేని యంధకారము కాఁజాలదు. మూఁడవదియిది, గ్రహణము కాఁబోవుచున్నదని ముందే తెలిసియుండవలయును. ఒకప్పుడు, పూర్వకాలమున నిట్టి జ్ఞానముండెనని చెప్పఁబడును; కాని యిట్లగునేని రెండు పక్షములును వ్యాకులపడుట స్పష్టము; మరియు నర్జునియొక్క ప్రతిజ్ఞ వ్యర్థమయ్యెనని యర్జునునికిని శ్రీకృష్ణునికిఁగూడ భ్రాంతికావలసియుండెను. జయద్రథవధసమయమున సూర్యగ్రహణమగుటసరియైనదిగా దోఁపదని తాత్పర్యమగుచున్నది; కాని యీ కల్పన కేతకరనామకుఁడైన ప్రసిద్ధజ్యోతిషికునిచేతఁ జేయఁబడి యుండెను, కనుక దానియొక్క యుల్లేఖ మిచ్చుటఁ గావించుట యావశ్యకముగా దోఁచెను దీక్షితకృత భారతీయ జ్యోతిషశాస్త్రము, పృష్ఠము 124. తాత్పర్యము, భారతీయ యుద్ధసంవత్సరమందు గార్తిక బహులామావాస్యనాఁడు సూర్యగ్రహణమయియుండెనను సంగతిని నిశ్చయాత్మకముగను సంశయరహితముగను విశ్వసించుటలో యుపయోగము కాలనిర్ణయకార్యమందు నెట్లగుచున్నదో యిది విచారింతము.

మనయెదుట భారతీయయుద్ధమునకు ముఖ్యముగా మూఁడు సమయములు ఉపస్థితములగుచున్నవి :

(1) క్రీ. పూ. 3101 వర్షము; యుద్ధమున కీసమయము లోకమతానుకూలమైయున్నది. (2) గర్గ, వరాహమిహిర, తరంగిణీకారుల ద్వారా మన్నింపబడిన క్రీ. పూ. 31 అక్టోబరు 1194 మనము ఇందు విషయమై గణితముచేసి, ఈ మూఁడుసమయముల వత్సరములయందుఁ గార్తిక బహులామావాస్యను గ్రహస్థితి యెట్లుండెనో మరియు సూర్య గ్రహణమయ్యెనో లేదో చూచియుంటిమి. విక్టోరియా కాలేజీ గ్వాలియర్ ప్రొఫెసరు ఆప్టే దీనికి నంకెలఁగూడ నిచ్చియున్నాఁడు. అవి యిట్లున్నవి :—

కార్తిక బహుళ 30 శుక్రవారము శకము 3180

| గ్రహము | | అంశము | | నక్షత్రము |
|---|---|---|---|---|
| సూర్యుఁడు | 234 | 56 | 2 | జ్యేష్ఠ |
| బుధుఁడు | 225 | 32 | 42 | అనురాధలేక జ్యేష్ఠ |
| శుక్రుఁడు | 218 | 26 | 34 | అనురాధ |
| అంగారకుఁడు | 258 | 39 | 43 | పూర్వాషాఢ లేక ఉత్తరాషాఢ |
| గురుఁడు | 350 | 22 | 22 | రేవతి |
| శని | 314 | 55 | 8 | శతతారక |
| రాహువు | 235 | 18 | 29 | జ్యేష్ఠ |

(సూర్యగ్రహణము అవశ్యముగానయ్యెను. మునుపటి పున్నమనాఁడు చంద్రగ్రహణము కాలేదు.)

| | కార్తిక బహుళామావాస్య శుక్రవారము శకము 2527 | | | | కార్తిక బహుళామావాస్య ఆదివారము శకము 1271 | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| గ్రహము | అంశము | | | నక్షత్రము | అంశము | | | నక్షత్రము |
| సూర్యుఁడు | 212° | 4′ | 58″ | విశాఖ | 231° | 13′ | 37″ | జ్యేష్ఠ |
| బుధుఁడు | 214° | 27′ | 57″ | అనురాధ | 245° | 41′ | 49″ | మూల |
| శుక్రుఁడు | 255° | 48′ | 26″ | పూ. ఆ. ఉ, ఆ. | 233 | 18′ | 57″ | జ్యేష్ఠ |
| అంగారకుఁడు | 298° | 26′ | 9″ | ధనిష్ఠ. అ. శతభా. | 251° | 35′ | 24″ | మూల |
| గురుఁడు | 13° | 42′ | 10″ | భరణి | 322° | 52′ | 12″ | పూర్వాభా |
| శని | 24° | 15′ | 3″ | భరణి | 253° | 54′ | 27″ | పూర్వాషా |
| రాహువు | 162° | 48′ | 58″ | హస్త | 88° | 5′ | 25″ | పునర్వసు |

(ఈ రెండు సంవత్సరముల యందును సూర్యగ్రహణము లేక చంద్రగ్రహణము సంభవము కాదు.)

మనము, సూర్యగ్రహణమునకు నీ ప్రమాణము మిక్కిలి ప్రబల మైనదని యూహించుచున్నాము. భారతీయ యుద్ధమునకుఁ బూర్వము సూర్యగ్రహణమైనదను సంగతి మూలభారతములో సిద్ధమై యున్నది. అది యేమాత్రము సౌతిసమయపుది కానేరదు. కనుక నయ్యది యత్యంత ప్రాచీన భారతకాలపుదియై యున్నది. మంచిది. దానినేదో సమయపుది యని విశ్వసింతము, అయినప్పటికి నయ్యది, భారతవాసులు గ్రహగణితము చేయుట యెఱుఁగని నాఁటిది యగుచున్నది. అది పుక్కిటి పురాణము యొక్క పరంపరవల్లఁ బ్రసిద్ధమై సాగివచ్చి యుండును; కావున నది విశ్వస నీయమై యున్నది. ఈ దృష్టిచేత గణితముచేసి చూడఁగా, మొదటిది సర్వ మాననీయమైన సమయముగా సిద్ధమగుచున్నదనియే చెప్పవలసియున్నది; మరియును వరాహుఁడు, గర్గుఁడు లేక బిల్హాణుఁడును జెప్పిన సమయము అట్లు శ్రీయుతుడైన అయ్యరు నిశ్చయించిన సమయము సిద్ధింపదు. పురాణముల యాధారము మీఁదఁ జెప్పఁబడిన నాల్గవ సమయము గణితము చేయుటకై నుపయోగింపదు; ఎందుచేత ? అది స్థూలమైయున్నది. అందు నిశ్చితమైన వత్సరము కూడఁ జెప్పఁబడలేదు, మనము, ఈ సమ యము క్రీస్తునకు దగ్గఱ దగ్గఱగా 1425 వత్సర పూర్వమని విశ్వసించి యున్నాము; కాని యిది మోటులెక్కయై యున్నది, ఎందుచేత ! పరీక్షిత్తు నుండి నందుని వఱకు 1015 వర్షములు మఱి 1115 వర్షములు కూడఁ జెప్పఁబడినవి నవనందులయొక్క 100 వర్షములు నైతము స్థూల మానపువియై యున్నవి— అవి నిశ్చిత సంఖ్యను జెప్పునవి కావు మరియు, చంద్రగుప్తునియొక్క క్రీస్తుకంటెఁ బూర్వ 312 సమయము కూడ గణితము చేత నిశ్చయింపఁబడినది కాదు. కాఁబట్టి మనము ఈ వర్షములయొక్క గణితమును గావింపము ఇందుచేత మనము, ఈ వర్షములయందు సూర్య గ్రహణమయ్యెనో లేదో నిశ్చయపూర్వకముగాఁ జెప్పఁజాలము.

భారతయుద్ధము కాకపూర్వము ఏ సూర్యగ్రహణము యొక్క ఘటన చెప్పఁబడియున్నదో, అది నిశ్చయాత్మకము కాదని యాక్షేపము కాఁగలదు; అది, ఏ విధముగా సౌతిచేత ననేక ప్రసంగములయందు నరిష్ట సూచకములైన యశుభ చిహ్నముల పద్ధతిమీఁదఁ జెప్పఁబడియున్నదో యా విధమగు సంగతియే యగుచున్నది. ఈ యాక్షేపమును నిరసించుట కఠినమైయున్నది, ఎందుచేత? మనకు, ఆ సమయమందుఁ గర్గుఁడు మరియు విశేషించి వ్యాసుఁడు కొన్ని యరిష్టసూచములైన చిహ్నములఁ గల్పన

చేతఁ జెప్పియున్నారని స్వీకరింపవలసియున్నది. ఇటువంటి ధారణ యన్ని సమయములందును ప్రచలితమై యున్నది. అది మహాభారత రచన కాలమందును ప్రచలితమై యుండును. జ్యోతిష గ్రంథములయందు, అశుభ సూచకములయి వేఱ్వేఱు జ్యోతిర్విషయమగు వార్తలు ఏవేవి యున్నవో వీటియొక్క యుల్లేఖము కలుగుచుండెను. సూర్యగ్రహణము కూడ వాటిలో నొకటి యగుట సత్యము. కాని యిట్టి విచార శైలిచేత నెచ్చటను నడుగు పెట్టుటకై కూడ అదేశము లభింపకుండుటయు స్పష్టము.

ఇపుడు మరయు మహాభారతమందుఁ జెప్పఁబడిన గ్రహస్థితిని విచారింతము. పై గణితముతో మనము గ్రహగణితము ద్వారా తెలియునట్టి స్థితియొక్క యుల్లేఖమును బుద్ధిపూర్వకముగాఁ జేసితిమి. మహాభారతమందీయఁబడిన స్థితితో దానిని సరిపోల్చవలయును. యుద్ధారంభకాలమునఁ జంద్రుఁడు మఘానక్షత్రమందుండెనని ముందు చెప్పఁబడియున్నది. కాని బలరామునియొక్క వాక్యముఁబట్టి, అది మృగనక్షత్రమందు లేక దానికిఁ బూర్వాపర నక్షత్రములలో నేదియో యొక నక్షత్రమందు నుండెనని తెలియుచున్నది. కర్ణుఁడు, అంగారకుఁడు జ్యేష్ఠనుండి వక్రించి యనురాధ వైపునకుఁ బోవుచుండెనని చెప్పియున్నాఁడు. భీష్మపర్వప్రారంభమున వ్యాసవచనముఁబట్టి, మంగళుఁడు వక్రించి మఘానక్షత్రమునకు వచ్చెనని తెలియుచున్నది. గురుఁడు శ్రవణమునకు వచ్చియున్నాఁడు మరియు శనైశ్చరుఁడు పూర్వాఫాల్గునిని బీడించుచున్నాఁడు. ఇక్కడ వ్యాసుఁడు, శుక్రుఁడు పూర్వాభాద్రపదమునకు వచ్చెననియుఁ జెప్పెను. కాని యుద్యోగపర్వమందుఁ గర్ణుఁడు, ఉగ్రగ్రహమైన శని రోహిణీనక్షత్రమును బీడించుచున్నాఁడని చెప్పియున్నాఁడు. ఇదేవిధముగా భీష్మపర్వమందు వ్యాసులు మఱల, శని, గురులు విశాఖదగ్గఱ నున్నారని మంగళుఁడు వక్రానువక్రములను జేసి శ్రవణమునొద్ద నిలఁబడి యున్నాఁడనియుఁ జెప్పెను. ఇదిగాక, యింకను గొన్ని సంగతులు రాహు, కేతు, శ్వేత గ్రహముల విషయమై నుడువఁబడియున్నది. కాని మనము విశేషించి శని, గురు, మంగళ, శుక్రులయొక్క విచారమును గావింతము. ఈ గ్రహములయొక్క వేర్వేరు నక్షత్రములు ఈ విధముగాఁ బుట్టినవి. శని-పూర్వాఫాల్గుని (భీష్మపర్వము) మరియు రోహిణి (ఉద్యోగపర్వము); గురుఁడు—శ్రవణము విశాఖయు (భీష్మపర్వము); మంగళుఁడు—అనురాధ

(ఉద్యోగపర్వము) మరియు వక్రానువక్రముచేత శ్రవణము (భీష్మ పర్వము, మరియు మఘ: శుక్రుడు- పూర్వాభాద్రపద (భీష్మపర్వము); ఇత్యాది. పూర్వకథనానుసారము చంద్రుడు మఘా- మృగ నక్షత్రములయందు జెప్పబడియున్నాడు. ఇందులో సత్యమేది? ఏమి? రెండును సత్యములో లేక రెండును నసత్యములో? మరియు మనము పై గ్రహస్థితిని విచారించుచు వీటిలోనొకానొక దానిని అసత్యమని చెప్పుద మేని, అపుడు, సౌతి ఇటువంటి యసత్యసంగతుల నెందుకు వ్రాసియుంచెనని ప్రశ్నను కలుగుచున్నది.

క్రీస్తునకు 3101 వర్ష పూర్వపుదిలేక శక పూర్వ2526పుదియైన ప్రత్యక్ష గ్రహస్థితిని మనము ముందిచ్చియుంటిమి. ఏది యీ సమయమందు గణితముచేత నిశ్చయింపబడినదో, అది చెప్పబడిన సమయమునకు ముందటి వత్సరములోని కార్తీకమాసము యొక్క బహుళామావాస్య నాటి గ్రహస్థితియై యున్నది దానికిని ఈ గ్రహస్థితికిని బోలికచేయగా నీ గ్రహములయొక్క స్థానము కాల్పనికమని స్పష్టముగా నగపడుచున్నది. యుద్ధము మార్గశిర బహుళమందు నయ్యెననియు, భీష్మపర్వమందు జెప్పబడినస్థితి యుద్ధమునకు బూర్వము అనగా మార్గశీర్ష ప్రారంభపుది యనియు, కర్ణునిచేత జెప్పబడినస్థితి కార్తీక బహుళపక్షపుది యనియు నీ సంగతులను ధ్యానములో నుంచుకొన్నయెడల, అపుడును మంగళ, గురు, శనుల స్థితిలోనెక్కువ యంతరముండదని స్పష్టముగా దెలిసిపోవుచున్నది. కాని యిచ్చటనైతే చాలగొప్ప యంతరము కనుపట్టుచున్నది. ఈ సంగతి స్పష్టముగా నూహాలులోనికి వచ్చుటకై క్రిందనొక కోష్టకము ఈయబడినది.

| | కర్ణుడు- చెప్పినది (ఉద్యోగపర్వము) | వ్యాసులు- చెప్పినది (భీష్మపర్వము) | శకను 3180లో ప్రత్యక్షస్థితి (గణితముబట్టి) | శకము2527లో ప్రత్యక్షస్థితి (గణితముబట్టి) |
|---|---|---|---|---|
| మంగళుడు | అనురాధవక్రి | మఘ, వక్రానువక్ర | శ్రణము | పూర్వాషాడ ధనష్ఠ |
| గురుడు | శ్రవణము | విశాఖ | రేవతి | భరణి |
| శని | రోహిణి | పూర్వాఫాల్గుని | శతతారక | భరణి,కృత్తిక |

సారాంశమేమనగా, ఒక గ్రహముయొక్క స్థితికైనను మైత్రికుదరదు. ముఖ్యముగా నీ సంగతిని ధ్యానములో నుంచుకొన్నయెడల, ఈ

సంగతులు కల్పనఁబట్టియే చెప్పబడియున్నవని యగపడును. భారతీయ యుద్ధము బ్రాహ్మణకాలమునకు ప్రారంభము ననగుట నిజమగునేని, ఆ సమయమున సప్తగ్రహములయొక్క జ్ఞానము ఉన్నప్పటికిని, వాటివైపు ఋషులకు విశేషధ్యానము లేకుండెననియు వాటియొక్క నిశ్చయాత్మకమైన గమనముకూడ వారికిఁదెలియకుండెననియుఁ జెప్పవలసివచ్చును ఆర్యులకు, ఆ గ్రహము లేనక్షత్రమందున్నవో. ఇది చూచెడు జ్ఞానము కొంత కాలమునకుఁ బిదప నెమ్మది నెమ్మదిగా గలిగెను. వేదాంగజ్యోతిష కాలమందుఁగూడ నీజ్ఞానములేక పోయియుండెను. అందుఁగేవలము సూర్యచంద్ర సంబంధియగు గణితమున్నది గ్రహముల విషయమై గణితము లేకున్నది. అయినను, తరువాత గర్గుని సమయమందు నధికజ్ఞానమయియుండెను. గర్గుఁడు భిన్నభిన్న గ్రహములయొక్క చారములనిచ్చియున్నాఁడు. గర్గునియొక్క మూల గ్రంథములో నేమియుండెనో, యిది మహాభారతములోని సరస్వత్యాఖ్యానమందు జెప్పఁబడియున్నది అందు జెప్పఁబడినదియేమనఁగా "అతఁడు కాలజ్ఞాన గతులను, తారలయొక్క (గ్రహములయొక్క) సృష్టిసంహారములను, దారుణములును శుభకారకములునగు నుత్పాత, యోగములను దెలిసియుండెను. అతని పేరునఁ ప్రస్తుతము ఏ గర్గసంహితా నామకమైన గ్రంథము ప్రసిద్ధమై యున్నదో అందుఁగూడ నిదేసంగతి యీయబడియున్నది. దీనిఁబట్టి సౌతిగర్గుని యొక్క తత్కాలీనమైన గ్రంథమునుబట్టి, ఏవి భయంకరములుగాను (2) ప్రసంగసూచకములుగాను నూహింపబడుచుండెనో, ఆ దారుణోత్పాతములనన్నింటిని భారతీయయుద్ధ సంబంధమున వ్రాసియున్నాఁడని యనుమానము జనించుచున్నది. అతఁడు క్షత్రియాభిమానులైన భిన్నభిన్న నక్షత్రముల మీదికి దుష్టగ్రహములు వచ్చుచున్నవి, లేక వాటిమీదను వాటి దృష్టి పడియున్నదియని వర్ణనముచేసియున్నాఁడు. దీనితోడిపాటుగానే యతఁడనేకములైన యుత్పాతములనుగూడ వర్ణించియున్నాఁడు. వంధ్యలైనస్త్రీలకుఁగూడ భయంకరములైన సంతానములు కలుగుచున్నవి. రెండుకన్నులు, అయిదుకాళ్లుఁగల భయంకరపశులు జన్మించుచున్నవి. గోడిగల (ఆఁడుగుఱ్ఱముల) నుండి గేదెదూడల, సరమ (ఆఁడుకుక్కల) నుండినక్కలు, ఉష్ట్రికలు(ఆఁడుఒంటెల)నుండికుక్కలుబుట్టుచున్నవి. మాటిమాటికి భూకంపము కలుగుచున్నది. రాహుకేతువులిద్దఱును ఒకే చోటికి వచ్చియున్నారు. ఆవులనుండి నెత్తురువంటి పాలువెడలుచున్నవి నీరు

నిప్పువలె సెట్టినాటించుచున్నది క్షత్రియులకు బ్రతికూలములైన మూఁడు నక్షత్రముల యొక్క శీర్షస్థానమునందును పాపగ్రహములు కూరుచుండి యున్నవి ఇటువంటి అనేక వర్ణనములు భీష్మపర్వారంభమున వ్యాసుని ముఖమునుండి యయియున్నవి. అవిప్రాయికముగాఁ గల్పితములై యుండును మఱియును ఉత్పాత గ్రంథములనుండి తీసుకొనఁబడియుండును. వాటియందుఁ జెప్పఁబడి గ్రహస్థితియుఁ గాల్పనికమై యున్నది అనఁగ క్షత్రియులకు నిష్టానిష్టములైన నక్షత్రముల యాధారమున గ్రహస్థితి కల్పితమై యున్నది. తాత్పర్యమిది, వాటియాధారముమీఁద గణితముఁ బట్టి నైతిహాసికానుమానము వెడలింపఁబడఁ జాలదు. ఇట్లు విశ్వసించిన మీఁదఁగూడ సౌతియే యీ గ్రహస్థితిని జెప్పియున్నాఁడో, దాని నతఁడు రెండురెండు నక్షత్రములమీఁద నెట్లుచెప్పియున్నాఁడు? అని ప్రశ్నము మిగులుచునే యున్నది. అతఁడు కాల్పనికమైన గ్రహస్థితి వర్ణించియుండునేని, దానిఁగూడ వివేకముతోడనేచేసి యుండుననుట స్పష్టమైన సంగతియై యున్నది. వ్యాసుని యొక్కయుఁ గృష్ణుని యొక్కయు భాషణములలోనైతే విరోధమున్నమాట నిజము. కాని వ్యాసునియొక్క పూర్వాపరవచనముల యందును వివాదము కనబడు చున్నది, మొదట మంగళుఁడు మఘయందు వక్రుఁడై చెప్పబడి యున్నాడు; మఱలఁ దరువాత, నతఁడు మాటిమాటికిని వక్రుడై శ్రవణమును-దీనిపైని బృహస్పతియొక్క యీ శ్రవణమాయ్యెనో - పూర్ణముగా వేధించుచున్నాఁడని జెప్పఁబడినది. ఆరంభమున బృహస్పతి శ్రవణమందుఁ జెప్పఁబడియున్నాఁడు మరియు నంతమున విశాఖదగ్గఱఁ జెప్పఁబడి యున్నాఁడు ఈ విధముగా రెండురెండు నక్షత్రముల మీద గ్రహములయొక్కస్థితి యెందులకుఁ జెప్పఁబడియున్నది? ఇందుపైని మోడర్కు రెండు నక్షత్రములను సరియైనదిగా విశ్వసించి యొకదానిని సాయనముగను రెండవదానిని నిరయణముగను నూహింప వలయునని యనుమానము చేసియున్నాఁడు. ఇచ్చట సాయనమును నిరయణమునైన నక్షత్రములు ఎట్లగుచున్నవో మరియు వాటియొక్క కల్పనయెట్లుచేయబడు చున్నదో యీ సంగతి చెప్పవలసి యున్నది ప్రత్యక్షముగా ఆకాశమందు గన్పట్టుచున్న నక్షత్రములు గతిరహితములై యున్నవి, వాటిని నిరయణములుగా జెప్పుచున్నారు ప్రస్తుతసమయమందు వీటికినారంభస్థానము అశ్వినియై యున్నది, ఈ నిరయణములైన అశ్విని, భరణి మొదలైన నక్ష

త్రములు ఆకాశమందుఁ బత్యక్షముగా నగపడుచునే యున్నవి; కాని సంపాత బిందువుయొక్క గమనము వెనుకవైపుగా నున్నది. అనఁగా చూడఁగా నక్షత్రములకు నేమియు నడక లేదు అయినను ఆరంభస్థానము నకు నడక యున్నది ఆరంభస్థానములు ఎల్లెట్లు వెనకకుఁదొలగినవో అట్లట్లే ఆరంభనక్షత్రమును సాయనముగాఁ గల్పితమైన వెనుక ప్రక్కకు దీసికొని పోవలయును. ఉదాహరణార్థము:- ఎప్పుడు రేవతియందు సంపాత మున్నదో అపుడు రేవతిని సాయనమైన యశ్వినిగా చెప్పవలయును, చెప్పు చున్నారుకూడ. రాసులు సాయనములు నిరయణములని రెండురీతు లుగా నున్నవి నిరయణములైన రాసులు ఆకాశస్థితి సంబంధమును రక్షించు చున్నవి. కాని సాయనమైన మేషము వెనుకకు పోయినకారణము చేత ఆక సమునకు మేషముతో సంబంధము కుదురదు. కల్పితమైన సాయనక్షత్ర ములు మరియు బ్రత్యక్షమైన నిరయణ నక్షత్రములు రెండును బ్రసిద్ధ ములై యుండునని నమ్మవలయును. కాబట్టి నక్షత్రముల యాధారమున ఈ రెట్టింపు గ్రహస్థితి చెప్పబడియున్నది దీని బట్టి భారత యుద్ధకాలమున సంపాతబిందువు పునర్వసునందు నుండియుండునని కల్పన చేయబడ కలదు. దీనికి రెండవ కల్పితమైన సాయననునునది యశ్వినికాగలదు ఆ సమయ మున చంద్రుఁడు మృగశీర్షమునందు మఘయందుఁగూడఁ జెప్పబడి యున్నాడు వీటిలో మఘ సత్యమైన నిరయణ నక్షత్రము, మృగశీర్షము కల్పితమైనసాయనమునై యుండును. సంపాతము పునర్వసునందుండుట చేత, దానిని అశ్విని యనిచెప్పుదమేని, అపుడుపునర్వసు, పుష్యము, ఆశ్లేష, మఘ) మఘ నాల్గవది యు (అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశీర్షము) మృగశీర్షమై దవదియు నగుచున్నది అంగారకుఁ డొకసారి మఘ యందు రెండవమారు జేష్ఠయందును జెప్పబడియున్నాడు. జేష్ఠను సత్య మైన నిరయణముగాను మఘనుసాయనముగను మన్నింపవలయును ఇందుఁ గూడ నొకనక్షత్రముయొక్క మరుపుకలుగుచున్నది. ఎందుచేత? పునర్వ సును అశ్వినిగా జెప్పినమీఁద, అనురాధను మఘగా జెప్ప వలసియున్నది. అంగారకుఁడు జేష్ఠవక్రుఁడై యనురాధవైపు పోవుచున్నాఁడు శ్రవ ణముయందు జెప్పఁబడిన గురుఁడు నిరయణుడగు చున్నాఁడు విశాఖ దగ్గఱనె వఁడు చెప్పబడెనో, అతడు సాయనుఁడు. సారాంశము, ఇచు మించుగా నేడు నక్షత్రములను నొక్కమారు విడిచిపెట్టి వెనకటిరెండవ నామము చెప్పఁబడియున్నది. దీనిఁబట్టి మూడవసంపాతము పునర్వసు

యందునుండుటను విశ్వసించి గణితముచేసి, ఈ సమయము క్రీస్తునకు దాదాపు 5000 వర్ష పూర్వమగు చున్నదని చెప్పియున్నాఁడు.

కాని యీ కల్పనయన్ని నక్షత్రముల విషయమునతులతూగదు; ఇంతియేకాదు ఇంకనేమంటేనియుద యైతిహాసికదృష్టిబట్టియు అసత్యమై యున్నది ఇందునేకముల్లైన యైతిహాసికాసత్యములున్నవి. మొదటి యసత్యము, పూర్వకాలమందు నక్షత్రములు అశ్వినితో నారంభముకాక యుండెను- కృత్తికతో నారంభమైయుండెడివి. వేదములయందును వేదాంగజ్యోతిషమందును అవి కృత్తికతోడనే యారంభమగుచున్నవి. సౌతియొక్క మహాభారతకాలమందును. నక్షత్రములు కృత్తిక మొదటి దిగా గలవియై యుండెడివి, అనఁగా కృత్తిక మొదటినక్షత్రమై యుండె డిది. అశ్వినికాదు, రెండవయసత్యము, అయన బిందువుయొక్క గతివెనుక వైపునకుఁ గలదనుసంగతియే మొదటికాలమునఁ దెలియకుండెను మహా భారతకాలమందునైతేని తెలియనేలేదు కానిపిమ్మట దాదాపు 800ఏడ్లు గడచిన తరువాత వరాహమిహిరునికిఁగూడ నీ సంగతి తెలియకుండెను. సాయన నిరయణ భేదము అర్వాచీనకాలపుది యైయున్నది. క్రీస్తునకు దాదాపు 150 వర్ష పూర్వము హిపార్కస్సు అయన గతికిమొట్టమొదట ద్రోవఁదొక్కెను. తరువాత నీ సంగతి హిందూస్థానమందలి యార్యజ్యోతిషి కులకుఁ దెలిసెను మరియువారు దానిని దమజ్యోతిష గణితమందుఁ గలిపి వేసిరి మూఁడవ యసత్యము- ఈ సంగతి ప్రతిమనుష్యుఁడును, ఒకే సమ యమందు సాయనములు నిరయణములగు రెండువిధముల నక్షత్రములు నొకే నామముతోఁ బ్రచలితమై యుండెనేని వాటికై యేమియుఁ బ్రత్యేక చిహ్నము లేక నామము లేకుండునేని, అపుడుమిక్కిలి యెక్కువ గడబిడయయిపోయి యుండునని విశ్వసించియుండును. ఎపుడు కేవలము నక్షత్రమే చెప్పబడియున్నదో, అపుడు అది సాయనము లేక నిరయణమనియెట్లు నిశ్చయింపఁబడును? ప్రతిమనుష్యుడును దానిని తన కల్పనచేత నిశ్చయముచేసి యుండునాయేమి? ఇటువంటి గడబిడ యెన్నఁడును క్షమింపఁదగియుండదు. వ్యాస, సౌతులవంటి గ్రంథకారులు నక్షత్రములను జెప్పుచు పాఠకులను మాటిమాటికిని భ్రమమునందుఁ బడవేయరనుట సాధారణమైన సంగతియై యున్నది. సారాంశము ఎపుడు మహాభారతకాలమందు సాయనములు నిరయణములు అగు నక్షత్రములు

సంభవముకావో, మరియు ఒకవేళసంభవించునేని యానమయమును. వాటి యొక్క యారంభము అశ్వినితోడఁ గాకుండెనో, అపుడు పైనీయఁబడ్డ యుక్తిమాత్రము బొత్తిగా అసత్యమగుచున్నదనియే స్పష్టమగుచున్నది. ఇదిగాక, అన్ని నక్షత్రములయొక్క స్థితియు నిట్లుసరిగానచ్చుదు విశేషించి శనైశ్చరునియొక్క స్థితి రోహిణి, పూర్వఫాల్గుని, విశాఖ, ఈ మూడు నక్షత్రములయందుఁ జెప్పబడియున్నది ఇదు సాయన నిరయణభేదము బొత్తిగాఁ జెప్పఁబడనే చాలదు రోహిణిని సాయనముగఁగూడ విశ్వసించెదమేని, అపుడు అదియశ్వినినుండి నాల్గవదియే యగును. ఇదే విధముగా, ఏ మూడవ నక్షత్రము మంగలుఁడు వక్రానువక్రుఁడై శ్రవణమునందు వక్రుడయ్యెనని చెప్పబడియున్నదో, దానికి నుపపత్తి తెలియదు. ఈకల్పనమీఁద అనఁగా సాయననిరయణనక్షత్రకల్పన మీఁద నిట్టి యాక్షేపము కలుగుచున్నది, కాబట్టి యీకల్పన మాన్యము కాఁజాలదని చెప్పవలసివచ్చుచున్నది. గ్వాలియరు యొక్క విస్రాజీ కృష్ణలేలే సహితము ఇదేవిధమగు ప్రయత్నమును జేసియుండెను. కాని యిదిసిద్ధము కాదయ్యెను. శ్రీయుత శంకర బాలకృష్ణ దీక్షితునియొక్క గ్రంథమునుండి పాండవులయొక్క సమయమందలి సత్యమైనగ్రహస్థితి కర్ణుఁడు వ్యాసుఁడు వీరిద్దరియొక్క భాషణములలో నున్నదని యతనిమతముగాఁ దెలియు నున్నది; కాని యతడు భాషణముల యాధారమున సమయమును నిశ్చయించుటకుఁ బయత్నమును జేయులేదు. ఎదుచేత? అతడు ఆ గ్రహస్థితి యొక్క మైత్రిసరిగాఁ గుదుటఁబడఁ జాలదని తనయొక్క స్పష్టమైన మతమును వ్రాసియున్నాడు (భారతీయ జ్యోతిషముపృష్టము 124)

## వేధములమార్గమున భిన్నగ్రహస్థితి యొక్క యుపపత్తి.

ఈప్రశ్న మింకను నిప్పటివఱకు మిగిలియున్నది. గ్రహస్థితిని గాల్పనికముగా నమ్మిన యెడల, అపుడుకాల్పనిక గ్రహస్థితిని జెప్పుచున్నయే విజ్ఞుఁడును రెండు రెండు మూఁడు మూఁడు నక్షత్రములమీఁద గ్రహములయొక్క స్థితినెట్లు చెప్పును? ఈ ప్రశ్నమునకు సృష్టి కారణముకానే కాఁజాలదని విశ్వసింపఁబడఁజాలదు టీకాకారుడు ఈ స్థితిని వేధముయొక్క కల్పనతోకలిపి చూపుటకై ప్రయత్నముచేసి యున్నాఁడు. మరియు నీ ప్రయత్నము అనేకాంశములలో సఫలమయ్యెనని మన యభిప్రాయము. మన మిచ్చుట దానియొక్క వర్ణనమును చేయుటకు సాహసించుచున్నా

రము. ఈ విషయము మనోరంజకము ను జాతకులయొక్క సమ్ముఖమున నుపస్థితము చేయుటకు యోగ్యమును నై యున్నది. టీకాకారుఁడు ఈవిష యమును దెల్పుటకై "నరపతి విజయ, నామకమైన జ్యోతిషగ్రంథము నుండి" "సర్వతో భద్రచక్రము"ను గైకొని యున్నాడు. అది పురాతన గ్రంథము మరియును దానియొక్క ఉపయోగము, యుద్ధములో జయ మగునో పరాజయమగునో యిది చూచుటకుఁ జేయఁబడియున్నది. ఈ చక్రమందు నాలుగు భుజములున్నవి. ప్రతిభుజమందును గృత్తిక మొదలు కొని యేడేడు నక్షత్రములుంచఁబడి యున్నవి మరియు రెండు రేఖ లధిక ముగాఁ కల్పించి నాలుగు కోణములయందు అ, ఆ, ఇ, ఈ యక్షరము లుంచబడినవి. మనము, ఈ సర్వతో భద్రచక్రమందు, మహాభారతము లోని వర్ణమును అనుసరించి, సప్తగ్రహములు ఆయా నక్షత్రములయందు నుంచిన మీఁద కడమనక్షత్రముల విషయమై చెప్పఁబడిన వేధము ఎట్లు సరిగాఁ గుదురుచున్నదో యిదిచూడవలయును. మహా భారతములో వేధ శబ్దము లేకున్నది; కాని ఆక్రమ్య ఆవృత్య, పీడయన్ మొదలైన శబ్ద ములనుండి వేధశబ్దముయొక్క యర్ధమును దీయుట సంభవమగుచున్నది.

(కార్తిక బహుల 30 దినములలో మహా భారతములోఁ జెప్పఁ బడిన గ్రహస్థితి సహితము)

ఒకానొక గ్రహము ఈ నక్షత్రమును బీడించుచున్నది, దీనికర్ధము అది ఆ నక్షత్రము మీఁదనున్నది లేక ఆ నక్షత్రమును సంపూర్ణ దృష్టితో, త్రిపాద దృష్టితోఁ జూచుచున్నది. యనియే యగుచున్నది 28 నక్షత్ర ములను విశ్వసించిన యెడల నీ దృష్టులయొక్క కొలతకు నెక్కువ సరళత కలుగును 14 నక్షత్రముల మీఁదఁ బూర్ణమైన దృష్టి యున్నదనియు 27/3 $9\frac{1}{3}$ నక్షత్రముల మీఁదఁ త్రిపాదము మరియు (27/4) 7 నక్షత్రములమీఁ $\frac{1}{3}$ దృష్టి ఉన్నదని యును జదువరులకు సులభము గనే తెలియఁగలదు ఈ రీతిగా విచారింపఁబడునేని సూర్య చంద్రులు ఏసమయమున జేష్ఠయందుండిరో ఆ సమయమున రోహిణిమీఁద వారియొక్క దృష్టినుండెనని తెలియును. అనఁగా వారు రోహిణిని వేధించుచుండి రనుట స్పష్టమై ఉన్నది.

"మఘా స్వంగారకో వక్రః శ్రవణే చ బృహస్పతిః"

ఈ వాక్యముయొక్క అర్థమిట్లేమగుచున్నది. అనురాధ మీఁద అంగారకుఁడు వక్రగతితో నున్నాఁడని కర్ణుఁడు చెప్పుచున్నాఁడు. అనఁగా అతని దృష్టి తొల్లిటియేడవ నక్షత్రము (మఘ) మీఁదికిఁ బోవుచున్నది. కుజునియొక్క యీ దృష్టి పూర్ణముగా నూహింపఁబడుచున్నది. బృహస్పతి విశాఖయందున్నాఁడు మరియును అతనిదృష్టి వెనకటి యేడవ నక్షత్రము (శ్రవణము) మీఁదికిఁ బోవుచున్నది సారాంశము, వ్యాసమహర్షి చెప్పినవాక్యము యథార్థముగా నగుపడుచున్నది. మరల పిమ్మట వ్యాసుఁడు కుజుని వక్రానువక్రుని గావించి శ్రవణముయందుఁ జెప్పినాఁడు. అనఁగా అనురాధ నుండి విశాఖవఱకు వక్రగతితోఁబోయి కుజుఁడచట దిన్నగా బోయెను, కాబట్టి యతని నాల్గవ (కుజునిపూర్ణమైన) దృష్టిసప్తమ నక్షత్రము (శ్రవణము) పైకిఁబోయెను ఈ విధముగా మంగళునియొక్క మూఁడు గ్రహములయు స్పష్టీకరణమై నున్నది ఇపుడు మనము శని విషయమై విచారింతము వ్యాసమహర్షి శనిని విశాఖ దగ్గఱఁ జెప్పుచున్నాఁడు. సమీపస్థః, ఈశబ్దముఁబట్టి యతఁడితఁడేయని యూహింపవలెను. శని రోహిణిఁ బీడించుచున్నాఁడు మఱి యయ్యది విశాఖనుండి పదునాఱవది అగుచున్నది ఈ దృష్టి 16/28 అనఁగా 4/7వది అగుచున్నది.అదే విధముగా శని పుబ్బ నక్షత్రమును బీడించుచున్నది ఆ నక్షత్రము 24వది యగుచున్నది. అచ్చటిదృష్టి 24/28 లేః 6/7 అగుచున్నది. పుబ్బనక్షత్రమును శ్రుతిమతమును అనుసరించి "ఉత్తర" అని ఒప్పుకొనవలెను. టీకాకారుఁడును నిట్లే అనుచున్నాఁడు. (భీష్మ అ 3 1 14, ఈదృష్టి యిప్పటి జ్యోతిషమందు మన్నింపఁబడక యున్నది. కాని కర్ణుని సమయమందు మన్నింపఁబడియుండును. వ్యాసుని వాక్యమున నేమాటచెప్పబడి నున్నదో, దానికర్థము వేధద్వారముననే చేయవలెను. కుజుఁడు వక్రించి మఘమీఁదికి వచ్చినాఁడు, బృహస్పతి శ్రవణముమీఁదికి వచ్చినాఁడు. మఱియునుశనైశ్చరుఁడు భగ ఉత్తర) నక్షత్రమును బీడించుచున్నాఁడు." అనఁగా, మూఁడు గ్రహములు వేధచేత మూఁడు నక్షత్రములను బీడించుచున్నవనియే తెలియుచున్నది ఇంకమనము శుక్రుని విషయమున విచారింతము ఇచ్చట "శుక్రుఁడు పూర్వాభాద్రమీఁదికివచ్చి మెఱయుచున్నాడని. చెప్పఁబడినున్నది. శుక్రుఁడు సూర్యునికి ముందుగాని వెనకఁగాని దగ్గఱనే

ఉండును. ఎపుడు సూర్యుఁడు జ్యేష్ఠమీఁదికి వచ్చునో అపుడు శుక్రుడు పూర్వాభాద్ర మీఁదఉండజాలఁడు. అతఁడు ఉత్తరమీఁద నున్నపుడు యచటినుండి వానియొక్క వేధపూర్ణదృష్టితోఁ పూర్వాషాఢ మీఁదికి జేరుచున్నాడు. ఈ వేర్వేరు దృష్టులచేత వేధింపఁబడుచున్న నక్షత్రములు ప్రాణములకు లేక జీవితములకు నభిమానులై యున్నవి; ఆ నక్షత్రముల మీఁదఁ జెడుదృష్టి పడిన కారణముచేతఁ బ్రాణులకు నాశము సంభవించును. ఇది యప్పటి జ్యోతిషగ్రంథముల యందుఁ జెప్పఁబడి ఉన్నది. ఆసంగతిని టీకాకారుఁడును ఎత్తుకొని ఉన్నాఁడు ఉదాహరణార్థము, రోహిణీనక్షత్రము ప్రజాపతిదియై ఉన్నది. దానియందు సూర్యుఁడు (చంద్రుఁడు, అమావాస్యనాఁటి,) రాహువు, శని వీరియొక్క దృష్టి పడినది అనఁగా ప్రజానాశము కలుగును. టీకారుఁడిటువంటి వచనములను చాల గ్రంథములనుండి యిచ్చినాఁడు. మన మతమును బట్టి యీ గ్రహస్థితి కల్పితమైనది. వెంటనే ధ్యానింపఁదగిన రెండవ విషయము ఇది కూడనైనది. ఏది అనఁగా అది గణితము చేయుటకై ఉపయోగింపదని, ఎందుచేత? అందు నిశ్చితాంశము లేకున్నది.

ఈ రీతిని (శనైశ్చరునిదక్క) సమస్తమైన గ్రహస్థితి వేర్వేఱు నక్షత్రముల మీఁద వేధదృష్టినిబట్టి సరిగా నూహింపఁబడజాలదు. అయినను యుద్ధకాలమందీ గ్రహస్థితి ప్రత్యక్షముగాఁ జూచి యుద్ధసమయము ననే యది మహాభారతమందు వ్రాయబడివున్నదని మనము చెప్పము. అది, గణితరీతినిబట్టి దానిద్వారా సమయమును నిశ్చితమైనది. ఈ సంగతిని దీక్షితుఁడు గూడ నొప్పుకొన్నాఁడు. సారాంశమిది, మోడక్కు చెప్పిన సమయమైతే మన్నింపఁదగినదిగా నూహింపఁబడనేపడదు; కాని గ్రహస్థితి యుద్ధసమయమును నిశ్చయించుటకు మఱియొక విధముగా నిరుపయోగమైయున్నది. దానియొక్క కల్పనఎట్లుచేయబడినదో, మనము ముందేచెప్పియుంటిమి.

ఈ ప్రకారము, భిన్నభిన్నమతములను అనుసరించి చెప్పబడిన భారతీయ యుద్ధముయొక్క సమయముగుఱించి విచారించిన మీఁదట మన మతం. సామాన్యముగా జ్యోతిషికులచేత మన్నింపఁబడుచున్న యాస్తిక మతముఁబట్టి గ్రహింపఁబడిన క్రీ. పూ. 3101 వర్ష సమయమే గ్రాహ్యమని నిశ్చయించుచున్నది. భారతీయ యుద్ధసంబంధమున వర్ణనము జేసి

నప్పుడు జ్యోతిష విషయకములైన యుల్లేఖాంతరములు పెక్కులు వచ్చినవి. ఈ ప్రకరణ మందు వాటియొక్క విచారము కాఁగలదు. కనుక నిపుడు మనము వాటిని విచారింతము. భారతీయయుద్ధమారంభమైననాఁడు.

మఘావిషయగ స్సోమ స్తద్దినం ప్రత్యపద్యత।
దీప్యమానాశ్చ సమ్పేతుర్దివి సప్తమహాగ్రహాః॥

ఈ శ్లోకం చెప్పఁబడినది. దీనిని మొదలు విచారింపవలెను కార్తీక బహుళామావాస్యకు సూర్యగ్రహణము పట్టెను కనుకనే సూర్యుఁడు, చంద్రుఁడు జ్యేష్ఠా నక్షత్రము మీఁదనుండిరి దీని యనంతరమున మార్గశీర్ష శుద్ధ త్రయోదశి లేక పౌర్ణమకు యుద్ధమారంభమయ్యెనని విశ్వసించినయెడల, 13-14 దినములయందుఁ చంద్రుఁడు మఘమీఁదికిఁ బోఁజాలఁడు. పదమూఁడు పదునాలుగు దినములయందు రోహిణి మృగ నక్షత్రము వచ్చుచున్నది. అక్కడినుండి మఘ యయిదు నక్షత్రములకు వెనుకనున్నది. యుద్ధముయొక్క యంత్యదినమున బలరాముఁడు తానచ్చటికి శ్రవణ నక్షత్రమందుఁ జేరితినని చెప్పుచున్నాఁడు. అనఁగా శ్రవణమునకుఁ బూర్వము అంచనాఁబట్టి 18 నక్షత్రములఁ దీసివైచిన తరువాతఁగూడ మృగనక్షత్రమే వచ్చుచున్నది-మఘ రానేరదు మఘనుండి శ్రవణము 12 నక్షత్రములయొక్కయే దూరమున నున్నది. దీనిఁబట్టి ముందటి వెనుకటి వాక్యములవలన, యుద్ధారంభమునందుఁ జంద్రుడు మృగశీర్ష నక్షత్ర మందే యుండెనని తేలుచున్నది. తిరిగి పై వాక్యమునందు మఘ, యెట్లు చెప్పబడియున్నదో యి యొకటిమాత్రము గూఢమైనసంగతిగా నున్నది పగలు సూర్యుఁ డుదయించిన పిమ్మట సప్తగ్రహములు దీప్యమానములై యాకాశమునఁ గనబడ నారంభించిన వనుటయు నాశ్చర్యవిషయమై యున్నది సూర్య తేజము చేత మనుష్యుఁ డెందును గ్రహములను జూడఁజాలడు. అట్టి స్థితిలోఁ దిరిగి యీ శ్లోకమున కూటశ్లోకముగా నెంచవలయును లేక. యందు నద్భుతకరములైన సంగతులు, అసంభవములై నప్పటికిని, నిండింపఁ బడియున్నవని చెప్పవలయును. టీకాకారుఁడీ శ్లోకమును కూటముగా నెంచియున్నాడు, అతడు "మఘావిషయగః" అను దానికర్థమును, మఘకు దేవతపిత వానికి విషయము పితృలోకము, యమలోకము లేక చంద్రలోకము; చంద్రుఁడుమృగశీర్షమునకు దేవత; కాబట్టి చంద్రుడు మృగశిర నక్షత్రమందుండెనని చేసియున్నాడు కాని

యిది కేవలము దాక్షిణాత్య ప్రాయామమై యున్నది. ఈరీతిని శ్లోకము నకు సరియైన యర్థము లభించదు యుద్ధారంభమందుఁ గృత్తికానక్షత్రము కాఁగలదు. జ్యేష్ఠా నక్షత్రము యొక్క సూర్యగ్రహణమునకుఁ బిదపఁ బదుమూఁడు దినములకు యుద్ధమగుట విశ్వసింపఁ బడునేని, యిపుడు జ్యేష్ఠనుండి కృత్తికా నక్షత్రము 16వది యగుచున్నది. శ్రవణమునుండి కృత్తికయొక్క స్థానము ముందటివైపు 20వది యగుచున్నది. కాఁబట్టి 16 దినములయందు 20 నక్షత్రములగుట సంభవమని చెప్పఁగలము. ఇంక కృత్తికనుండి మఘమీఁదఁ జంద్రునియొక్క 1/4 దృష్టి యేడు నక్షత్రము లది యగుచున్నది. పిత్రుదేవత మఘమైయున్నది. దానియందు యుద్ధా రంభమున 1/4 దృష్టి యుండుట చెడ్డదియని తాత్పర్యము కాఁగలదు. మన మతము ననుసరించి యిచ్చట ఈ దృష్టిచే మఘయందు నూహింప వలయును. ఏడు దేదీప్యమానములైన గ్రహములు కనఁబడుట సంభవిం చుటకై సూర్యునిమీఁద నల్లని యావరణము పడియుండెనని విశ్వసింతు మేని, అపుడు ఈయేడు గ్రహములను నుదయభాగమునఁ గావలసి యుం డెను ఏడింటిలోనుండి ముందు సూర్యునికే న్యూనత యగపడుచున్నది. శుద్ధ త్రయోదశినాఁడు చంద్రుడు సూర్యోదయమునఁ బైనఁబడుట సంభ వము కాక యున్నది. చంద్రుఁడు సంధ్యాసమయమునఁ గొంచెముగా నగ పడ నారంభించును. ప్రాతఃకాలమందు నగపడఁడు. మిగిలిన యైదు గ్రహములును నుదయభాగమునఁ గాఁగలవు. కుజుఁడు రాధయందు, గురుఁడు శనియు విశాఖదగ్గఱ శుక్రుఁడు ఉత్తరయందు బుధుఁడు నడు మను నడువఁబడియుండెను. కాని యేడు గ్రహములు దీప్యమానములై యుండెనని యింత మాత్రమే చెప్పుట సరియైనది కాఁజాలదు. గుఱ్ఱము నుండి కుక్కలు పొడమ నారంభించెను. రాహుకేతువు లొకచోటికివచ్చిరి, ఇత్యాది విషయములకు, అసంభవ విషయముల యుత్పాతమయ్యెనని యే యర్థ మూహింపవలయును. లేక యితరములైన యనేకములగు ధూమ కేత్వాది సప్త మహాగ్రహములు ఇచ్చట నభిప్రేతములని తలంప వలయును.

కర్ణ వధానంతరము ఇటువంటి వచనమొకటి యున్నది:-

బృహస్పతిః సంపరివార్య రోహిణీం
బభూవ చన్ద్రార్క సమో విశాంపతే॥

బృహస్పతి విశాఖదగ్గఱ నున్నాడు. అతడొక నెలలో నెంత యెక్కువగాఁ జూచినను రెండు రెండున్నర యంశములు పోవుచున్నాఁడు అనగాఁ బూర్తిగా నొక నక్షత్రముకూడఁ గడవఁబోడు. ఎపుడతఁడు విశాఖయందే యుండెనో యపుడు రోహిణిని బరివారముఁ జేసికొని యెట్లుండును? అతఁడు చంద్రసదృశుఁడై యుండుననుట సంభవము; కాని యతఁడు సూర్య సదృశుఁడై యెట్లుండును? ఇది కూడ గొప్ప సమస్యయై యున్నది. గురుఁడు దృష్టిద్వారా విశాఖనుండి రోహిణి యొక్క వేధగాంచెనచుట సంభవము; కాబట్టి. యతఁడుకూడా సూర్యా చంద్రమస తుల్యుఁడైన యపకారి యయ్యెనని చెప్పుటకుఁ దాత్పర్యమిది యైయుండును. శల్యపర్వముయొక్క పదునొకండగు నధ్యాయమున నొక వాక్యమిట్టిదికలదు:—

భృగు సూను ధరాపుత్రౌ శశిజేన సమన్వితౌ॥

ఇందుఁ జెప్పఁబడినసంగతి సంభవమైయున్నది. శుక్రుడును బుధుఁడును సూర్యసమీపమున నున్నారు. సూర్యుఁడొక మాసములో జ్యేష్ఠను విడిచి పూర్వాషాఢకుఁ బోయియుండును. భౌముడును సరళుఁడై యను రాధనుండి జ్యేష్ఠకు వచ్చియుండును. మరల నచ్చట మూఁడింటికిని సమ్మేళనమైయుండుట సంభవమై యున్నది. కాని భౌముఁడు జ్యేష్ఠమీఁద నున్నాడని మాత్రము నమ్మవలసియున్నది. అతనియొక్క ముఖ్యస్థితి, యనురాధయందు వక్రించి యుండుటయేయని యూహింపవలయును. ఈయోగ మనిష్టకారముగా నూహింపబడుచుండును.

అంతిమమైన మహత్త్వముగల వాక్యము భీష్మునిదై యున్నది. (అనుశాసన. అ. 167) ఎపుడు భీష్ముని శరీర త్యాగసమయము వచ్చెనో మరియు నుత్తరాయణమారంభమయ్యెనో, యపుడుయుధిష్ఠిరుఁడు వాని సమీపమునకుఁ బోవఁగా భీష్ముడు వాక్రుచ్చెను ఏమని:—

మాఘోయం సమనుప్రాప్తో మాసః సౌమ్యో యుధిష్ఠిర
త్రిభాగ శేషః పక్షోయం శుక్లో భవితు మర్హతి॥
అష్ట పఞ్చాశతం రాత్ర్యః శయాన స్యోద్యమే గతాః॥

నేను శరతల్పముమీద పడియుండగా నేటికి 58 రాత్రులు గడిచి పోయినవి. మాఘమాసము వచ్చియున్నది మఱియు నిపుడు శుక్లపక్ష

మయియున్నది. ఈ పక్షములో నాల్గవ వంతు ముగిసిపోయినది. ఈ కథనమునకు సారాంశమును టీకాకారుడు. నేడు మాఘ శుక్లాష్టమి యని తెల్పియున్నాఁడు. భారతీయ యుద్ధము మార్గశీర్ష శుక్ల త్రయోదశి నాఁడారంభమయ్యెనని విశ్వసింతుమేని అపుడు భీష్ముడు మార్గశీర్ష బహుళాష్టమికి బాణవిద్ధుఁడై పడియుండెను మఱి యప్పటినుండి యేఁబది యెనిమిది రాత్రులను లెక్కింపఁగా మాఘ బహుళాష్టమి వచ్చుచున్నది మాఘశుక్లము రాదు. ప్రస్తుత సమయమున మాఘశుద్ధాష్టమినే భీష్మాష్టమి యని యొప్పుకొనుచున్నారు. ఆ యష్టమిలో 15 దినములను దీసివేయఁగా 43 రాత్రులు మిగులుచున్నవి. 16 తీసివేసినయెడల 42 మిగులును. టీకాకారుఁడిచ్చటి పదమును "అష్టపంచ అశతం" అని విఱిచి, నూటికి యేబది యెనిమిది తక్కువ యని యర్థముచేసి, 42 రాత్రులుండుట చెప్పియున్నాఁడు. కాని యనుశాసన పర్వములో నదే యధ్యాయమందు దీనికి విరుద్ధముగా నొక స్పష్టమైన వచనము దీనికిఁ బూర్వమునఁ గలదు. అది యిది భీష్మునివలన నాజ్ఞఁబడసియుధిష్ఠిరుఁడు హాస్తినాపురమునకు వెళ్ళెను మఱియు నచ్చట నతఁడేబది రాత్రులు గడపెను; సూర్యుని నుత్తరముల వైపు మారుచుండఁగాఁ జూచి అనగా నుత్తరాయణ మారంభమగుటఁ దెలిసికొని యతఁడు భీష్మునియొద్దకుఁ బోవుటకై బయలుదేఱెను. ఇచ్చట, భీష్ముని చెంతనుండి యతఁడు యుద్ధము సమాప్తమైనతర్వాత మరలి వెళ్ళియుండెనని చెప్పఁబడియున్నది ఎప్పుడితడు 50-రాత్రులను గడిపివైచెనో, అప్పుడు బాణశయ్యయందు భీష్మునికి 58 రాత్రులే కడచియుండవలయును. 42 కాజాలవు అట్టిస్థితిలోఁ దిరిగి యిది యెటువంటి విరోధము? దీనికి పరిహారముండుట విశేషించి యసంభవమే యైయున్నది. యుద్ధమును మార్గశిరమందే యారంభమయ్యెనని నమ్మక, శ్రీకృష్ణునియొక్క కథనము ననుసరించి కార్తికామావాస్యను నమ్మినయెడల నంతయు గడబిడయై పోవుచున్నది. భీష్మునియొక్క దినములకు మిక్కిలి నిశ్చితమైన జాడమాత్రము దొరకుటయే లేదు, ఎందుచేతననఁగా ఈ లెక్కనుబట్టి 64 దినములు వచ్చుచున్నవి యిదిగాక జయద్రథవధయొక్క రాత్రిని జంద్రుఁడు ప్రాతఃకాలమున నుదయింపజాలఁడు. ఆ దినము ప్రాయికముగా శుక్లత్రయోదశి లేక పౌర్ణిమయగుచున్నది. అనఁగాఁ బ్రాతఃకాలమునఁ జంద్రుఁడస్తమించి యంధకారముండెడి సమయమై యుండెను! మార్గశిరశుక్లాష్టమిని యుద్ధారంభదినముగా విశ్వసిం

చుటవల్ల 58 దినములైతేవచ్చుచున్నవి, కాని ఆ దినముయొక్క నక్షత్రము నుండి 18వ దినమునకు బలరాముఁడు చెప్పినట్లుగా శ్రవణనక్షత్రమురానేరదు సూర్యగ్రహణము జ్యేష్ఠానక్షత్రమందును అమావాస్యనాఁడు పట్టెను. ఆ కార్తిక బహుళ 30 మొదలుకొని పదునెనిమిదవ దినమున యుద్ధమారంభమగుటను విశ్వసింతుమేని, అపుడు పూర్వాభాద్ర నక్షత్రము వచ్చుచున్నది మఱియునచ్చటి నుండి యుద్ధాంతమున 18వ నక్షత్రము విశాఖ యగును. ఈ గడబిడనంతను అనుశాసన పర్వములోని, 58 రాత్రులకును మఱియు 50 రాత్రులకును సంబంధించిన వచనములు చేరియున్నవి. మాఘ బహుళమందు శుక్లపక్షమును పంచమివరకు విశ్వసింపగలరు. కాని త్రిభాగపక్షముగాఁ జెప్పఁబడఁజాలదు మోటులెక్కను బట్టి యేఁబదియెన్మిది రాత్రులకు రెండుమాసము లగుచున్నవి. కాబట్టి మాఘబహుళాష్టమియే రాగలదు. ఏదో ఒకదానిని అసత్యముగా విశ్వసింపవలసియుండును. లేనిచో యుద్ధమునకు ముందటి వచనములు యనుశాసన పర్వపువికావు కానియసత్యములనియే నమ్మవలయును ఇచ్చటి విరోధ మపరిహార్యమై యున్నది.

మహాభారతమందు వేర్వేఱుచోటుల నేయంకసంఖ్య యీయఁబడి లభించుచున్నదో, దానిగుఱించి, అందుగొంచెమో గొప్పయో గూఢము లేక గుహ్యమైన అర్థమున్నదనియే బహుధా చెప్పవలసి వచ్చుచున్నది. ఇచటనేవిధముగా 50 మరియు 58 యనెడు అర్థము సిద్ధింపదో, యా విధముగా, అర్జునుఁడు గాండీవ చాపముయొక్క ధారణముచేయు సందర్భమునఁ జెప్పఁబడియున్న 65సంఖ్యకు నుపపత్తి దొరకదని మనము జెప్పియే యుంటిమి. వర్షమునకర్థము వర్షకాలముగా విశ్వసించి, ఒక సంవత్సరమునకు రెండు మాఱులుకురిసి పంట సంవత్సరమగుటగా (ఒకటి పెద్దది మరి రెండవది చిన్నది హేమంతమున) విశ్వసించి టీకారుడిచ్చటి 65లోసగముచేసి యున్నాఁడు. ఇదే విధముగా అధికమాసముయొక్క లెక్క కలుపునపుడు, ప్రతియైదువర్షములందు రెండు మాసములు కలుపురీతినిబట్టి పదుమూఁడు వర్షములయందు, భీష్ముని వచనమును అనుసరించి, అయిదు మాసములయు 12 రాత్రులసంఖ్య యథార్థముగా నచ్చెదు అయిదు సంవత్సరములయందు 2నెలలగునపుడు. పదుమూఁడు సంవత్సరములయందు $\frac{13X2}{5}$ = 5 1/5 అనఁగా 5 నెలలును 6దినములును అగుచుచున్నవి. కాని ఇచ్చట భీష్ముఁడు చెప్పుచున్నాఁడు ఏమనఁగా:-

త్రయోదశానాం వర్షాణాం పఞ్చచ ద్వాదశ క్షపాః॥

ఇదియేమిమాట? పదురెండు రాత్రులకర్థము 6దినములను గైకొనుట సంభవమైయున్నది కానియిందులో సారము కొంచెమైనను లేకున్నది. ఆది. అ. 61-42లో అర్జునునియొక్క మొదటి వనవాస సందర్భమునందీశ్లోకమున్నది:-

స వై సంవత్సరం పూర్ణ మాసం చైకం వనే వసన్॥

అర్జునుడు ద్వారకకువచ్చి సుభద్రనువివాహమాడెను: కాని పిమ్మట నీ వనవాసము పండ్రెండు వర్షములది అని వచింపఁబడి యున్నది. అట్టి స్థితిలో మఱి పై వాక్యమందు నొకవర్షము మరియు నొకమాసమును నెట్లు చెప్పబడియెను? ఈ విషయమై కాఠిన్యము టీకాకారునికిఁ గూడఁదటస్థించెను. అతఁడుపూర్ణ శబ్దముచేత 10 అర్థమును దీసియున్నాఁడు మఱియు 10వర్షమును బదునొకండు మాసముల సమయముగాఁ జెప్పుటకై ప్రయత్నము చేసియున్నాఁడు, కాని యయ్యది సిద్ధింపదు

త్రయస్త్రింశత్ సమాహూయ ఖాండవేఽ గ్నిమతర్పయత్।
(ఉద్యోగ.52 10)

ఈ వాక్యమును బట్టి టీకాకారుఁడు, ఉద్యోగ సమయమునకు ఖాండవ దాహము జరిగి 33 వర్షములు గడచి పోయినవని చెప్పుచున్నాఁడు. ముందటి విరాటపర్వములో అర్జునుఁడుత్తరతో జెప్పుచున్నాఁడు- ఈ గాఁడీవ ధనుస్సును నేను 65 వర్షములదాఁక ధరించియున్నాను, గాండీవశరాసనము ఖాండవదాహ సమయమందు లభించియుండెను ఇచట 33 వర్షములు చెప్పఁబడిన 65ను సగం చేయఁగా 32 వచ్చుచున్నది అనఁగా దగ్గఱ దగ్గఱగా 33 వచ్చుచున్నది కాని వనవాసముయొక్క 13 వర్షములను తీసివేసినను దట ఖాండవదాహానంతరము అతఁడు 20 వర్షములవఱకు నింద్ర ప్రస్థమందుండెను. సుభద్రా వివాహము ఖాండవ దాహము గాకమునుపు జరిగియుండెను. కాని అభిమన్యుని యుద్ధసమయము 6వర్షములదియైయుండెను (ఆ.అ 67 అస్య షోడశ వర్షస్య స సంగ్రామో భవిష్యతి. అనఁగా వివాహమునకు 17 ఏండ్లతరువాత సుభద్రకుఁ బుత్రుడు పుట్టెను. ఆ పర్వమునందు ఖాండవదహనమునకుఁ పూర్వమే అభిమన్యుని ఉత్పత్తి చెప్పఁబడియున్నది. మయాసురుఁడు రాజసభచేసెను; తరువాత రాజసూయ యాగము జరిగెను

దీని పిదప హాస్తినాపురమున జూదమాడఁబడెను. ఈ సంగతులు 20 వత్సరములయందు నయ్యెనని తెలియుచున్నది. రాజసూయ సమయమందు అభిమన్యువు పెద్దవాఁడై యుండెననియు నతఁడు రాజసమూహమును జేర్చుటకై వెడలియుండెననియును వర్ణనమున్నది. ఈ భిన్నభిన్న కాలములు మిగుల సరిగాఁ గలియుటలేదనియే సంక్షేపముగా చెప్పవలసియున్నది.

అది అట్లుండుఁగాక, ఈ భిన్నభిన్నములైన జ్యోతిర్విషయకములుల్లేఖములఁబట్టి సౌతియొక్క మనుస్సులో, ప్రజాపతి లేక సృష్టికర్తకు రోహిణియందు మరియు శ్రవణనక్షత్రమందుఁగాక పితృదైవత మఘానక్షత్రమందు నింకను భగదైవతమైన యుత్తరనక్షత్రమందును గ్రహములయొక్క, దేనిచేతఁ బ్రజకు మిగులహానియు సంహారమును గాఁగలవియై యుండునో, అట్టి చెడుదృష్టి పడియుండెనని చూపుటకై యిచ్చియుండెనని సారాంశము. కాఁబట్టి సౌతి యీ యరిష్టసూచకములైన వచనములఁ గాల్పనిక రీతినిచ్చి యున్నాఁడని మనయభిప్రాయము. క్రి.సం.పూ. 3101వ వత్సరమందు. లేక యేదో నుఱియొక వత్సరమందు నిట్టి గ్రహస్థితియగుటకనఁబడదు. మనము గ్రహములయొక్క యేస్థితిని మీఁది వచనములచేతనిచ్చియుంటిమో, దానియాధారముమీఁద గణితముద్వారా యేనిశ్చిత సమయముయొక్క నిర్ణయము మీదఁ జేయఁబడఁ జాలదు. అన్ని ప్రమాణములను విచారింపఁగా, భారతీయయుద్ధముయొక్క యేసమయము మేగాస్థినీజుయొక్క ప్రమాణముఁబట్టియు శతపథ బ్రాహ్మణ ప్రమాణముఁబట్టియు నిశ్చితమగుచున్నదో, దానినిఅనఁగా క్రి.పూ. 3101 వత్సరమునే మాన్యముగా నూహింపవలయును.